చరిత్రకారులు సూచించియుండిరి. ఈ విషయమును గూర్చి ఇ.జె. రాంప్సను మహాశయుడు తన కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా వాల్యూము I Ancient India 378వ పేజీలో నిట్లువ్రాసియున్నాడు. "The Europeans (i e. Greeks) in this region had more implacable enemies than the native princes. The power behind the throne was the Brahman Community, and here for the first time we come upon an opposition inspired by the conception of a national religion, the only germ to be found in ancient times of the idea of Indian Nationality. It was the Philosophers (i.e.) the Brahmans who denounced the Princes, if they submitted to the foreigner, and goaded the free tribes into revolt." (Vide Plutarch Alexandar 59). "A city of Brahmans had to be stormed (Diod XVII 103.1) whilst the operations against Sabus going on " (Arr V11 6, 5)"; The Europens knew, however who were their worst enemies, and their hand fell heavily upon the Brahmans. They were put to death wholesale; their bodies too were hung up for the kites and vultures by the roads to the unspeakable horror, we may belive, of the people of the land (Rampson's Ancient India P. 378) ఇవి డియోడోరసు, అరయన్ అను యవన చరిత్రకారులు వ్రాసిన విషయములు. యవనులు మహమ్మదీయులు కారు. అలెగ్జాండరు దండయాత్ర సమయమున తూర్పు భారతదేశమున మగధాధిపతి చంద్రశ్రీయను ఆంధ్రబ్రాహ్మణరాజుండెననియు నతనికి 20,000 అశ్వికసైన్యమును, రెండు లక్షల కాల్బలమును, రెండువేల రథములును, నాల్గువేల ఏనుగులును ఎల్లప్పుడును యుద్ధమునకు సిద్ధముగా నుండు ననియు నాతడు తన్నెదుర్కొనుటకు బయలుదేరు చున్నాడనియు తెలిసి వెనుకకు తిరిగిపోయెను. చంద్రశ్రీని 'జాంద్రేమ్సు లేక అగ్రేమ్సు' అని గ్రీకు చరిత్రకారులు వ్రాసిరి. కనుక అలెగ్జాండరు దండయాత్రలో జరిగిన ఘాతుక కృత్యములలో కూడ కొన్ని ప్రాచీన తాళపత్ర సంస్కృత గ్రంథములు తప్పక నశించియుండును.

శ్రీసెవకాగ్ర "50, 60 వేల పురాతన సంస్కృత గ్రంథములవ్రాత ప్రతులుద్ధరింపబడినవి. కొన్ని దొరుకనే లేదు. కాని వాని యనువాదములు

టిబెట్ భాషలోనను చైనాభాషలోనను, బౌద్ధ మతములకు సంబంధించిన గ్రంథాలయములను, ఇతర గ్రంథాలయములను, కొందఱు వ్యక్తుల సొంత గ్రంథాలయములను వెదకినచో గొప్ప గ్రంథములు దొరకవచ్చును. వాని వ్రాతప్రతులను పరిశీలించి యోగ్యమైనచో వానిని తర్జుమా చేయించి ప్రకటింపవలెను. భారత దేశమునకు స్వాతంత్ర్యము కలిగి, మనము స్వేచ్ఛగా వ్యవహరించుటకు అవకాశము కలిగినప్పుడు ఇటు గమనింపవలసిన యనేక ముఖ్యకార్యములలో నిదియొకటి" (భారత దర్శనము) అనిరి. శైవాగమములు దేశములో కొన్ని నష్టమయిపోయినవనుట స్పష్టము. " The French institute of Indology has succeded in collecting 22 out of 28 Principal Saiva Agama Sastras. According to Prof. Jean Fiuiozat, the director of the institute, all but a few of these were recovered in South India and the Far East. A few were found in West Bengal. The institute was founded in 1955 and maintained directly by the French Government." (Behind the News. I. E. 7-5-69).

## సంస్కృతము : వైదేశికుల దృక్పథము

పృథ్వీరాజు సోదరుడు నాటకకర్త యయెను. " Chronicles demonstrate the prevalance of Sanskrit as a spoken language during Priohivirara's life time. His brother was a dramatist of distinction and one of his dramas in Sanskrit is preserved in stone tablets in Ajmer" (Dr. C. P. Ramaswami Iyer, 29-8-65, Bhavans Journal.) ముస్లిమ్ పరిపాలనము చివరిదశలో హిందూరాజ్యములవారు బలముగనే యుండిరి. వారు కొంత సంస్కృత భాషాపోషణము చేసియుండవచ్చును. ఈ దేశము ముస్లిములు బలహీనులగుటచేత సరాసరి వైదేశికుల చేతిలో పడలేదు. తెల్లవారే రాకపోయినచో మరల హిందూ ప్రభువులే రాజ్యమును హస్తగతము చేసికొని భారతీయ విద్యను పోషించి యుండెడివారు. "The popular notion that India fell an easy prey to the Mussalmans is opposed to historical facts. At no time was Islam triumphant throughout the whole of India. Hindu dynasties always ruled over large areas. At the height of the Muhammaden power, the Hindu princes paid tribute and sent agents to the Imperial Court. But even this modified supremacy of Delhi did not

last for 150 years (1560–1707). Before the end of that brief period, the Hindus had begun the work of re-conquest. The Hindu chivalry of Rajaputana was closing in upon Delhi from the South, the religious Confederation of the Sikhs was growing into a military power on the North-West. The Maharattas had combined the fighting powers of the low-castes with the statesmanship of the Brahmins, and were subjecting the Muhammaden Kingdoms through-out all India to tribute. As far as can now be estimated, the advance of the English Power at the begining of the present century alone saved the Moghul empire from passing to the Hindus(Dr.W.W. Hunter's Indian Empire - 3rd Edition - Page323). కనుక భారతదేశమంతటను ముస్లిముల సరాసరి పరిపాలనములేదు. అందుచేత కొన్నిచోట్ల సంస్కృతము పోషింపబడు అవకాశములు మిగిలియున్నవి. కనుక సంస్కృత భాషాధార పూర్తిగ నశింపలేదు. "The British won India, not from the Mogals but from the Hindus. Before we appeared as Conquerors, the Mogal empire had broken up our final and most perilous wars were neither with the Delhi King, nor with his revolted governors, but with the two Hindu Confederations, the Maharattas and the Sikhs. Muhammadan princes fought with us in Bengal, in the Karnatic, and in Mysore; but the longest opposition to the British conquest of India came from the Hindus. Our last Maharatta war dates as late as 1818 and the Sikh Confederation was over come only in 1848" (A brief History of the Indian People by W. W. Hunter - Page 140). కనుక మహమ్మదీయులకు గాని, బ్రిటిషులకు గాని దేశమంతయు ఒక్కమారే చిక్కము కాలేదు. బ్రిటిషువారి సామ్రాజ్యములోనను సంస్థానము లున్నవిగదా! విక్టోరియా మహారాణి మాగ్నాకార్టా యున్నదిగదా! కనుక మనవి భాషలను సంస్కృతము ఎంతయో యంత బ్రదుకుచునేయున్నది. వారు ప్రభువులైన పిదప బ్రిటిషువారు భారతీయుల భాషలనుగూర్చి యోచింప మొదలిడిరి. వారి క్రీస్తుశకపు చరిత్ర సృష్టికాలమును నిరూపించు చరిత్రలో ఇముడదని వారికి తెలియును. మన చరిత్ర ప్రాచీనమైనదని మనకు తెలియును. కనుక వారి చరిత్రను, వారి పరాక్రమములను, వారి భాషను మనపై

రుద్దబడెను. దానికొక విధాన మాలోచింపబడెను. విద్యార్థి దశ నుండి భారతీయులకు వారు వ్రాసిన చరిత్రమును చెప్పినచో వారు మన చరిత్రలో పుక్కిటిపురాణములు తప్ప ఏమియు నుండదనియు బ్రిటిషువారు చెప్పిన చరిత్రయే సత్యమైనదనియు భావించు ఒక క్రొత్త తరము మానసిక బానిసత్వముతో సృష్టింపబడును. ఇట్టి భాషా విషయ కముగను నొక విధ్వంస పద్ధతిని నడుపపెట్టినట్లును. "No Hindu who has recieved English education ever remains sincerely attached to his religion. Some continue to profess it as a matter of policy, but others profess themselves pureilistic and some embrace Christianity. We desire to form a class who may be interpretters between us and the millions we govern, a class of persons, Indian in blood and colour but English in taste, in opinion in morals and intellect" అని మెకాలే దొరగారు తమ తండ్రికి వ్రాసిన జాబులో వ్రాసిరి. "సర్, జాన్ ఉడ్ రాఫ్"గారు తత్ప్రయత్నములనుగూర్చి తమ "Seed of race" అను గ్రంథములో 'విద్య' యను శీర్షిక క్రింద నిట్లు వ్రాసిరి : "...Such have regarded Indian religion as a false supersition, Indian Philosophy as antiquated guesswork without present value. He has been told that he had no glorious past, that the history of this country is lacking in great personalities, that the progressive west superior to the 'immobile' East. If day in and day out, suggestions of his innate inferiority are made to a boy. and the superiority of a foreign civilization is affirmed, he will according to every possibility, come to depreciate his own People and Culture. In India, for instance, in the past at any rate, attention has been given to the history of the English and Mogul occupation, the student being left in ignorance of the happenings of the specifically *Hindu Period.*' సుమారు 1200 సంవత్సరముల మన చరిత్ర మాయమగుటకు హేతువు స్పష్టమేగదా! తిలక్, గాంధి ప్రభృతులు జన్మించకపోయినచో భారతదేశ మెంత చైతన్యరహితమై యుండెడిదో యూహించుకొనవచ్చును. పాశ్చాత్యులు సంస్కృత మెందులకు చదువు చున్నారో శ్రీ సి. కున్హాన్ రాజాగారు వివరించుచున్నారు. 'It is true that there was intense activity in the field of Sanskritic

studies in the west...and various other achievements that stand to their credit are among the great wonders of the modern world. But such studies were undertaken *as a part of the historical investigations* into the activity of man, into the primitive stages in the evolution of man's civilization... Sanskrit study was put up into that category......Similiarly the study of Sanskrit by the west brought out wonderful results in the field of pholology and history and at the same time it *demoralised Indian People.* In the west, the study of Sanskrit had no cultural value; Greek and Latin supplied the material for the foundation of culture in the West. Sanskrit has become a subject of study in the West, but it is not a subject for the cultural study of man, in any acedemic centre in the West. But if a man is civilized it is due to the influence which Indian culture exerted on the peoples in the foreign countries (Sanskrit in foreign countries – 26–8–56, Bhavan's journal).

శ్రీ కె. యమ్. మున్షీ గారు "Professor W. Norman Brown. the present director of the department of South Asia regi–onal studies in the graduate school of arts and science at the University of 'Pensylvania' told me in 1950, that students preparing to go to South-East Asia fouud that a study of Sans-krit was indispensable o understand the Psyscl o!ogical back ground of that region" అని చెప్పుటలో సంస్కృతము నభ్యసించుటలో వైదేశికుల దృక్పథము వెల్లడియగుచున్నది. (14–2–65 Bhavan's journal)

మఱికొందరు సంస్కృతము నభ్యసించుటలోని యభిప్రాయమేమనగా, మన వాఙ్మయమునందుండు అస్త్రశస్త్రాదుల విషయము తెలిసికొనుట, దానినిగూర్చి పరిశోధించుట, వానిని యుద్ధములలో వినియోగించుట, ఋగ్వేదమునందు (1–716–4) పక్షి యాకారము గలిగిన యాన ప్రశంసము కలదు. తొలుతనే పాశ్చాత్యులట్టి విమానమును నిర్మింపలేదుగదా! క్రమ క్రమముగ నాలోచించి యట్టి నిర్మాణము చేయుటలోని సాధ్యత్వమును పరిశీలించి తుదకు నిర్మించిరి. వారికి క్రొత్త యూహలు కలుగుటకు పాత గ్రంథములు సాధనము లగుచున్నవి. మన పురాణేతిహాసములం దనేక యుద్ధ వృత్తాంతములు కలవు. ఆగ్నేయాస్త్రములు ప్రయోగించినట్లు

గలదు. అలెగ్జాండరు సింధుయాత్రా కాలము పాశ్చాత్యుల చరిత్రము ప్రకారం పుట్టియునను మన చరిత్ర ప్రకారము క్రీస్తునకుపూర్వము 327 వ సంవత్సరము. బ్రాహ్మణులు ఆగ్నేయ వారుణాస్త్రములచే నలెగ్జాండరు సైన్యములను చెల్లాచెదరు చేసిరని అలెగ్జాండరుతో వచ్చిన చరిత్రకారుడు "తెమిస్టస్" చెప్పెను. అలగ్జాండరు భారత దేశమునుండి వెడలిపోయిన పిమ్మట "అరిస్టాటిలు"నకు జాబు వ్రాయుచు నీ విషయము వ్రాసెను : "The terrific flashes of flame which he beheld showered on his army in India" (Dante's inferno XIV 31-7). అలెగ్జాండరు ఋష్యాశ్రమములను నాశనముచేసి స్త్రీ బాలవృద్ధులను వధించిన పిమ్మట వారు శాంతమును వీడినట్లు "ఫిలోస్ట్రేటసు" వ్రాసెను. "Should an enemy make war upon them, they drive him off by means of tempests and thunders as if sent down from heaven. The sages remained unconcerned spectators until the assault was made, when it was repulsed by fiery whirl-winds and thunders which being hurled from above dealt destuction on invaders" (Philostrati Vit. Appolon. Lib. II C. 33). కనుక పైన చెప్పబడినవి యాగ్నేయాస్త్రములు కావచ్చునుగదా! ఆ శక్తి పోయినదినవ వానిని నమ్ముటయు కష్టమే! మా ముత్తాతగారు పైడిపాటి శివయ్యగారు పదునైదు లంఘనములు చేసి చందులూరున కయిదు మైళ్ళ దూరములోనున్న పలుకూరునకు నడచిపోయి, మామిడి కొన్నాలు కొని యింటికి వచ్చుచుండగా వాని నపహరించుటకు ఇద్దరు దొంగలు చెట్టుపై కావుండి కత్తినెత్తగా, ఎండలో కత్తినీడను చూచి దాని నుంకించి పట్టుకొని యొకని తరిమి, మరి యొకనిని చంపి, రక్త వస్త్రముతో నింటికి పోయినచో భార్య బెదరునని మరియొక యింటికిపోయి పండుకొని పథ్యము తినెను విషయమును నేను చెప్పినచో నెవ్వరైన నమ్మగలరా? ఆంధ్రగంధర్వ శ్రీ కొన్నవిట్టల శేషగిరిరావు మైసూరు సంస్థానమున మూడురోజులు ఒక్క 'తోడి' రాగమునే యాలపించెననిన నమ్మగలరా ?

## సంస్కృతము - విద్యాబోధనము :

సంస్కృతమును విద్యాలయములలో బోధింపవలెనని యందఱును గట్టిగ చెప్పుచున్నారు : ' Sanskrit was studied all over the world. Several foreign Universities had chairs for proficiency in the

language, which was studied and respected even in China. It thus enjoyed a worldwide significance. It was a hoary language which had lit the history of India for generations. But the fact that it was hoary did not mean that Sanskrit should not be allowed to move along. Its continued study was a paramount necessity. *It is the duty of every Educational institutiou to promote its studies a new*" అని అస్మత్కృతిపతులు రాష్ట్రపతి రాధాకృష్ణ పండితులు బెంగుళూరు విశ్వసంస్కృత పరిషత్సభలలో చెప్పియున్నారు. శ్రీ జనరల్ కరియప్ప ప్రభృతులు అనేకులు సంస్కృతము విద్యా ప్రాథమిక దశ నుండి నిర్బంధముగ నేర్పబడవలెనని యభిప్రాయ పడియున్నారు. కాని కేంద్ర ప్రభుత్వము దాని కనుకూలముగ నున్నట్లు కన్పించదు. "Mr. Bhakt Darshan, minister of state for Education told the Lok Sabha in the question hour to day that the government did not consider it possible to make study of Sanskrit compulsory. He added state Chief-Minsters had declined to include Sanskrit as one of the languages in the three language formula." (30-8-69, Indian Express) కనుక రాష్ట్ర ముఖ్యమంత్రులందఱును సంస్కృతమును తప్పక నేర్పబడవలెనను నిర్ణయమునకు వచ్చి కేంద్ర ప్రభుత్వము దానిని విద్యాప్రణాళికలో చేర్చు మంచి ముహూర్తమునకై వేచి యుండుట మంచిది. ప్రాంతీయ భాషా బోధనములోని భాగముగ సంస్కృతమును చేర్చు అభిప్రాయముగల ఆంధ్రప్రదేశ విద్యామంత్రి ప్రయత్నములను హర్షించుట న్యాయము. సంస్కృతమును విద్యాప్రణాళికలో చేర్పక పోవుట కసంతృప్తిని కొందఱు ప్రకటించుచున్నారు. "The position is that Sanskrit is being virtually abolished in the schools in many states. The three language formula has no place for it. It leads to nothing profitable. ***Thus sanskrit studies are withering at the base.*** Efforts should also be made to make the learning of Sanskrit easier than it is. It will perhaps take time for the importance of Sanskrit to be realised by the masses. (Reviving Sanskrirt- Editorial. Indian Express 1-9-69)

సంస్కృత భాషా బోధనము నేడు దేశములో మూడు విధములుగ జరుగుచున్నది. (1) గురుకుల పద్ధతి. అనగా ఒక గురువు దగ్గఱ విద్యార్థి పోయి వేదాంగములైన శాస్త్రములను అభ్యసించుట. భారతీయ సంప్రదాయములో

సంస్కృత మభ్యసించుట అనగా ఇదియే. దీనికాలేండ్లు పట్టును. అట్టి శాస్త్రములు బోధింపగల ప్రజ్ఞగలవారు దేశములో అరుదుగానుందురు. ఇదియే గట్టిచదువు. వీరి పాండిత్యము రిఫైన్డు పాండిత్యముకాదు. శాస్త్రము వాటోవిధేయముగ నుండును. వేదార్థ నిర్ణయము చేయుపట్ల వీరి పాండిత్యము నిశితముగ నుండును. ఒక్కొక్క శాస్త్రమును విద్యార్థికి పాఠప్రవచనముచేసి యుత్తీర్ణముగావించి నందులకు గురువులకు పారి తోషికము ప్రభుత్వమియవలెననియు, ఆ శిష్యుడు తన శాస్త్ర పాండిత్య మాధారముగ ధార్మిక విషయములను బోధించు పురాణములను ప్రవచింప వలయుననియు, నొక్కొక్క తాలూకా కొక్కొక్కరినియట్టివారిని దేవా లయాధికారు లట్టివనికై నియోగించి, వారికి విద్యాలయోపన్యాసకులతో తుల్యమైన వేతనము తీయవలెననియు, నాతడు పల్లెపల్లెకు సంచారము చేసి రిపోర్టులను పంపవలెననియు నేను శ్రీబూర్గుల రామకృష్ణరావు కమిటీ వారియొద్ద సాక్ష్యమిచ్చి యుంటిని. కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 18–10–62న విజ్ఞాన సమితి, విజయవాడ వారేర్పరచిన సభలో మాట్లాడుచు, "ఆత్మోన్నత్యము సంస్కృతము వలన కలుగునని భావించి ఋషులు దానినవలంబించినట్లు కన్పించును. సంస్కృతములో మొదటి యక్షరము "ఓం" బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు – అకార ఉకారమకారములు– అనగా సంస్కృతము దేవతాస్థానీయ మైనదన్నమాట. అసలు శాస్త్రములేల పుట్టినవనగా వేదార్థము కొఱకు. శ్రీకు సంపాదనమే వేదలక్ష్యము. ఆవేదమే యజ్ఞమునకు కాకపోయినప్పుడు, శాస్త్రములకు వేరు ప్రయోజనము కలుగుటలో నాశ్చర్యమే మున్నది? (16–10–62, ఆంధ్ర పత్రిక).

రెండవది పాఠశాలాపద్ధతి. సంస్కృత కళాశాలలు ఈ పద్ధతికే వచ్చును. దీనిలోకూడ శాస్త్రములు ప్రవచింపబడును. దేశభాషా విషయములు నుండును. వీనిని వృద్ధిచేసి ఆంగ్లకళాశాలలో వారికివలె వేతన నిర్ణయము చేయనగును. పాఠప్రవచన పద్ధతి ప్రాచీనపద్ధతిలోనే యుండును. ప్రస్తుతము కళాశాలలలోను, సెకండరీ స్కూళ్లలోను పండితులుగ నుండు వారిలో కొందరీపద్ధతిని చదువుకొనిన వారే. దీనిని ప్రభుత్వమే పోషింపవలెను. "There are only three ways of preven-

ting this catastrophe. First to give the Pathasala system an honoured place in our educational system set-up; Secondly to combine its best elements with the morden system of education; and lastly to set up a Central Council of Sanskrit studies. Unless the Pathasala-system is given the status it deserves, it will die out. It is therefore necessary that the system be recognised as an accepted from of education in this country and the higher education in Pathasalas should be integrated into a single system enjoying the same prestige and status as University Education enjoys in this country" అని శ్రీ సి. పి. యన్. సింగ్ గారు 1957లో సంస్కృత విశ్వపరిషత్తులో చెప్పియున్నారు.

ఇక మూడవ పద్ధతి వాచకములను చదువు పద్ధతి. సరళసంస్కృతము బోధింపబడవలెనను పెద్దల ఆశయము ఈపద్ధతి క్రిందనే వచ్చును. దీనిలో భాషాభ్యాసనమునకే అధిక ప్రాధాన్యము. దీనివలన సంభాషణా కౌశలమే కాక కావ్యపురాణముల నర్థము చేసికొను శక్తిగలుగును. ఈ నవీన పద్ధతిలో యుత్తీర్ణులైనవారు సాధారణముగ నన్యభాషల నభ్యసించు విధానములోనే యభ్యసించు చుండిరని చెప్పవచ్చును. ఇట్టి విధముగ నభినివేశము కలిగిన వారు, తదితరక పాఠశాలా పద్ధతిని కూడ చదువుకొనుట కలదు.

పరీక్షాసామాన్యమున కందు బాటులోనికి సంస్కృతము రావలెనన్న యీపద్ధతి యొకటే శరణ్యము. ప్రాథమిక పాఠశాలల నుండి సెకండరీ పాఠశాలల వఱకు సంస్కృతము నీ విధానముననే నిర్బంధము చేయవలెనని నేను 'సంస్కృత కమిషన్' వారిదగ్గఱ సాక్ష్యమిచ్చితిని. మఱికొందఱు కాలేజీ క్లాసులకును నిర్బంధము చేయవలెనని యభిప్రాయపడినారు. నేడాకాశవాణిలో వినిపించు సంస్కృత పాఠములు సరళపద్ధతిలోనే యున్నవి. శ్రీ కాశీకృష్ణాచార్యులువారి బాలబోధినులు సరళ పద్ధతిలోనివే. ఆంగ్లభాషలో వ్రాయబడు రీడర్సును బోలిన సంస్కృత వాచకములున్నవి. విద్యాసాగర్ శ్రీ కె. యల్. వి. శాస్త్రిగారు చక్కని వాచకములు వ్రాసియున్నారు. వీనిని, ఆర్. యస్. వాధ్యార్ అండ్ సన్స్, కలపాతి. పాల్‌ఘాట్-3, వారు ప్రకటించియున్నారు. 'సంస్కృత పాఠమాల' యను పేరుతో

మహాపండిత శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ గారు వాచకములను రచించి యున్నారు. వీనిని, "చౌఖాంబా విద్యాభవన్, వారణాసి" వారు ప్రకటించియున్నారు. "సరళ సంస్కృత శిక్షక్" అను పేరుతో సంస్కృత విశ్వపరిషత్తువారి ప్రేరణముచే శ్రీయుతులు జయంత కృష్ణహరిదేవ్, వేంకటేశ్వర దీక్షితార్, మహేశ చంద్ర శాస్త్రిగారలు వాచకములను రచించి యున్నారు. వీనిని భారతీయవిద్యాభవన్ వారు ప్రకటించియున్నారు. చిత్తూరు, సంస్కృతభాషా ప్రచారిణీ సభవారు శ్రీమాన్ టి. కం. తిరువేంకటాచార్యులవారు రచించిన 'సంస్కృతభాషా బోధిని' నయిదు వాచకములుగా ప్రకటించియున్నారు.

గీతా ప్రచారక పరిషత్, సంస్కృత పాఠశాల, మహబూబాబాద్ వరంగల్ జిల్లావారు 'సంస్కృత పాఠమాల' యను వాచకముల ప్రకటించిరి. దీనిని రచించినది సాహిత్య వాచస్పతి స్వర్గీయ దామోదర సాత్వలేకర్ గారు. శ్రీయుతులు గద్దమణుగు మోహనరావు, తోగిటి వేంకట్రామశంభు గారలు తెలుగు చేసిరి. పరిష్కర్త శ్రీ పుల్ల పూర్ణప్రజ్ఞాచార్యులుగారు. ఆంగ్లభాషను నేర్పు విద్యాలయములలో కొన్ని వచన భాగములు, ప్రాచీన కవుల కవితనుండి కొన్ని భాగములు ఎన్నికచేసి యీ సంపుటమును పాఠ్య గ్రంథముగ చేయుదురు. విశ్వవిద్యాలయము టంతస్థునకు పోయినచో మరి కొన్ని విమర్శా భాగములుకూడ పాఠ్యము చేయబడును. కనుక సరళ సంస్కృత విధానము వేదనుసరింపబడుచునే యున్నది. ఇంకను మార్గము లాలోచించి విధానముల మార్చుకొనవచ్చును. శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారి బాలబోధినులవల్ల సంభాషించు క్రమము చక్కగా తెలియగలదు.

## సంస్కృతము : అనుసంధాన భాష :

మన దేశములోనిసుమారు పదునాల్గుభాషలను జాతీయ భాషలనుగా రాజ్యాంగ శాసనము గుర్తించినది. అందులో సంస్కృత మొకటి. అనుసంధాన భాషగా 'హిందీ'ని గుర్తించినది. కొంతకాలమువఱకును ఆంగ్లభాషకు స్థితిని కల్పించినది. చాలకాలము గడచినపిదప కొందఱాంగ్లభాషయే యనుసంధానభాషగా నుండవలె ననుచున్నారు. వారి కారణములను పేర్కొనుటకంటె యీ సందర్భమున 4-2-1916 న శ్రీ మోహన

దాస్ కరంచంద్ గాంధీగారు వారణాసి హిందూ విశ్వవిద్యాలయమున చేసిన ఉపన్యాస భాగమును పేర్కొనుట మంచిదని తోచినది.

"Our language is the reflection of ourselves, and if you tell me that our languages are too poor to express the best thought, then I say that the sooner we are wiped out of existance the better for us. Is there a man who dreams that English can ever become the National language of India? (Cries-" Never "). Why this handicap on the Nation.? Just consider for one moment what an unequal race our lads to run with every English lad......I am hoping that this University will see to it that the youths who come to it will receive their instruction through the medium of their vernaculars. (Speeches and writings of Mahatma Gandhi – page 372.)

ఆంగ్లము జాతీయభాషగా గాంధీగా రెప్పుడును అంగీకరింపరనుట స్పష్టము. మిగిలిన దేశభాషలలో అనుసంధాన భాషగా అర్హమైనది ఆంధ్రమే. ప్రొఫెసర్ జి.బి.యస్. హాల్డేన్ గారు 27-4-1958 'హిందూ'లో తెలుగుభాషనుగూర్చి యిట్లు వ్రాసిరి :

"You cannot keep out foreign manufactured goods. Perhaps Telugu accepts them more easily than any other Indian language and this will certainly help to make it a revival to Hindi in teaching science, medicine, and engineering." దీనిని సమర్థించుచు, డాక్టర్. టి. హాంఫ్రీస్ మెక్లాడ్, పి. హెచ్. డి. (Isleworte, Middle Sex U. K.) గారు 16-7-1958 హిందూలో "Telugu can be looked upon as the northern most member of the southern languages, or the southern most member of the northern languages and it has the advantages of both groups with few any of the defects. It is adoptable, dynamic, absorptive, grammatically simple and euphonically exceptionally beautiful even when using foreign words. It has never suffered from narrow provincialism. If the authorities of Andhra Pradesh set about it they have the opportunity of proving that India has a great language easily capable of being a powerful vehicle for Indian science, engineering and medicine. Much of the present petty linguistic argue-

ment would be made obsolete by the accomplished fact of the giant strides forward of the Telugu language which undoubtedly can compete with any scientific language in the West. The Andhras must not be slow in giving India the great treasure they possess.'' అని వ్రాసిరి. కనుక ఆంధ్రమునే అనుసంధానభాషగా రాజ్యాంగ పరిషత్తువారు చేయవలసి యుండెను. సాహిత్యమును చూచినను ఆంధ్రమున సమృద్ధముగ కలదు.

కాని హిందీయే అనుసంధానభాష యైనది. ఇది సాత్త్వికముగా చేసిన నిర్ణయముకాదు. జాతీయభాష యనుదానికి (1) ఉద్యోగులు సులభముగ నేర్చుకొనుట కవకాశముండుట (2) వ్యాపార, రాజకీయాది విషయములకు సంబంధించిన కార్యక్రమము లాభాషలో భారతదేశమందంతట జరుగుటకు యోగ్యమైయుండుట (3) భారతమున నధిక సంఖ్యాకులచే మాట్లాడబడుట (4) జనబాహుళ్యము నేర్చుకొనుటకు సులభమైనదిగా నుండుట యను లక్షణము లుండవలెననియు, తాత్కాలిక పరిస్థితులనుబట్టి యట్టి నిర్ణయము చేయరాదనియు గాంధీగారు చెప్పిరి....

"The English language does not fulfil any of the conditions above named, and every one will admit that for them English is more difficult to be learnt than any Indian language." (Hindi – The National language for India – presidential address to the Second Guzarati Educational Conference 20–10–1917).

స్వరాజ్య సమర సందర్భములో బ్రిటిష్‌వారితో శాంతియుతముగ పోరాడుట యొకవంక, నిర్మాణ కార్యక్రమ మొకవంక జరిగినది. అట్లు జరుగుటలో హిందీ ప్రచార మొకభాగమైనది. కనుక అనుసంధాన భాషగా మఱియొక దేశభాష నిర్ణయింపబడవలెనను అభిప్రాయ మానాటి దేశ మాతృభక్తులకు కలుగలేదు. కాని కొందఱు సంస్కృతమునకు హిందీకిని మధ్య పోటీరాగా హిందీ నెగ్గెనని చెప్పుచున్నారు. మఱికొంతమంది హిందీకిని హిందూస్థానీకిని పోటీరాగా హిందీయే నెగ్గెనని చెప్పుచున్నారు. హిందీ యనునది సంస్కృతపద బహుళమైనది.

"King Canutes may try to stop the tide of Hindi developing on the lines of constitution. They might attempt

**artificially to desanskritise it. But they are bound to fail. If the element of Sanskrit in Hindi is displaced it will cease to have a National appeal(Sri K.M. Munshi–14–2–65 Bhavan's journal)** ఇటీవల, మిగిలిన దేశ భాషల పదములు కూడ హిందీలో చేర్చుకొనుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఇట్టి స్థితిలో, అనుసంధానభాష ఆంగ్లమే కావలెననువాదము తమిళనాడులో ప్రారంభమైనది. హిందీని (రాష్ట్రభాష) అనుసంధాన భాషగా నిర్ణయించుటను ఆమోదించిన శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులవారు, నేడు వ్యతిరేకించుచున్నారు. త్రిభాషాసూత్ర ప్రణాళిక ప్రకారము దక్షిణ ప్రాంతీయులు మూడుభాషల నభ్యసింపవలసియుండగా హిందీ మాతృభాషగల రాష్ట్రీయులకు రెండుభాషలనే యభ్యసించిన సరిపోవుచున్నదనియు, నిది గొప్ప వ్యత్యాసమనియు వాదించుచున్నారు. దీనికై యాందోళనము చేసినారు. దౌర్జన్యములు జరిగినవి. ఫలితముగా తమిళనాడులో హిందీ తుడిచివేయబడి విద్యాలయములలో అరవము, ఆంగ్లముమాత్రమే బోధింపబడుచున్నవి. అధికారికముగ నిట్లు జరిగినను నిడిగా పెక్కుమంది హిందీ నేర్చుకొనుచునేయున్నారు. దక్షిణభారతహిందీ ప్రచారసభ నిర్వహించు పరీక్షలే దానికి నిదర్శనము. ఈ సందర్భమున మిగిలిన దాక్షిణాత్యరాష్ట్రములవారు వారి ననుసరింపలేదు. హిందీని ద్వేషింపలేదు. త్రిభాషా సూత్రమువలన కలుగు వ్యత్యాసమును మాత్రమే సవరింపవలయుననియు, హిందీ రాష్ట్రీయు లహంకరించుట తగదనియు, ఆంగ్లమును రెండవ అనుసంధానభాషగా త్రోసిపుచ్చు సమయమింకను రాలేదనియు హిందీభాషాప్రచారము సమృద్ధిగా జరుగవలెననియు భావించిరి. త్రిభాషాసూత్రములోని వ్యత్యాసమును సరిచేయవలెనన్న వారొక దక్షిణ ప్రాంతీయభాష నభ్యసించుట అవసరమని యభిప్రాయపడిరి.

ఈ సందర్భమున సంస్కృతమే అనుసంధానభాష యేలకాకూడదను అభిప్రాయము కొందరకు కలిగెను. సంస్కృతమునకు అనుసంధానభాషగా నుండు అర్హతనుగూర్చి చర్చలు జరిగినవి. వాస్తవమునకు అది చర్చనీయమైన విషయమే కాదు. పారసీకభాష దేశములో వచ్చువరకును రాజభాషగా నుండినది సంస్కృతమే కదా! దానికట్టి వ్యాప్తి కలిగినది మహామ్మదీయుల

పరిపాలనాకాలముననేకదా! సంస్కృత భాషాకీర్తి నిగూర్చి శంకింపనవసరమే లేదు. సర్. మోనియర్ విలియమ్స్‌గారియభిప్రాయము నీసందర్భమున గమనించునది. "India, though it has more than five hundred dialects spoken, has only one sacred language, and only one sacred literature, accepted and revered by all adherents of Hinduism alike, however diverse in race (?), dialect, rank and creed. That language is Sanskrit and that literature is Sanskrit literature – the only repository of the Veda or 'Knowledge' in its widest sense; the only vehicle of Hindu theology, Philosophy, law and mythology, the only mirror in which all the creeds, opinions and customs and usages of the Hindus are faithfully reflected; and (if we may be allowed a fourth metaphor) the only quarry whence the requisite materials may be obtained for improving the vernaculars or for expressing important and scientific ideas."

సంస్కృతము రాజభాషగా నుండునాటి ప్రాకృత వికారములైన దేశ భాష లిప్పుడు అభివృద్ధిపొందినంతగా నభివృద్ధిని పొందియుండలేదు. నేడు సంస్కృతమే రాజభాషగా నుండుట తప్పనిసరి యగుచున్నను. దేశమంతయు నొక్కరి పాలనము క్రిందనే యుండియుండలేదు. ఇప్పుడు వివిధప్రాంతములు నున్న మాతృభాషలు వృద్ధియగుచున్నను. ఏ ప్రాంతములోని రాజకీయవ్యవహారములా భాషలోనే జరుగవలెనను దానికి బలముచేకూర్చెను. ఆంధ్రదేశములో నీ భావము బలముగ నున్నవారు స్వర్గీయులు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామిసీతారాం). అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులు. సత్యాగ్రహోద్యమము తొలిరోజులలో ఒకే ఒకరు స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ ప్రబుద్ధాంధ్ర పత్రికాద్వారమున హిందీని ప్రతిఘటించిరి. మాతృభాషాభ్యసనమునకు దానివలన చేటువచ్చునని వారి విశ్వాసము. 'హిందీయైనను బొందియైనను తర్వాతనే' యని వారు వ్రాసిరి. నేడు త్రిభాషాసూత్రప్రణాళికవలన మాతృభాషలకు నష్టములేదని నిశ్చయము. మాతృభాషతప్పక నేర్వదగినదిగా గుర్తింపబడెను. శ్రీ యస్. వి. రాఘవయ్యగారు మాతృభాషలో ప్రాంతీయ ప్రదేశములలో రాజకీయవ్యవహారములు జరుగువట్ల వ్యతిరేకించి తమ పదవికి రాజీనామానిచ్చిరి. ఈ సందర్భమున గాంధీగారి యభిప్రాయమెట్లుండెనో గమనింపదగును.

"If we have lost faith in our vernaculars, it is a sign of want of faith in ourselves, it is the surest sign of decay. And so scheme of Self-Government, however benevolently and generously it may be bestowed upon us, will never make us a Self-Governing Nation if we have no respect for the languages our mothers speak." (Vernacular as media of instruction to Indian Schools and Colleges – Speeches and writings of Mahatma Gandhi – G. A Natesan & Co. Madras)

గాంధీగారు అర్ధ శతాబ్దమునకు పూర్వమీ విషయమును చెప్పిరి. తమ ప్రాంతీయ భాషలలోనే విద్యా విధానము కొనసాగవలె ననునది యీనాటి యభిప్రాయము కాదు. విభిన్న భాషలుండియు నొకభాషను దేశ భాషనుగా చేసికొనిన రష్యావంటి దేశములు మనకు దృష్టాంతములుగ నున్నవి.

"The Soviet Government has formed different states on the basis of language, such as Uzbekistan, for the Uzbeks, Krighistan for the Krighiz, Kazakhstan for the Kazakhs and Turkmenistan for the Turks. These people are being encouraged to develop and to take pride in their own language, literature, culture and civilisation while accepting the primacy of the Russian language which is far more highly developed than their own and better suited for national and international purposes. This Policy has paid handsome dividends. Cynics might say that these Nationalities were being kept under by force. Certainly force was used at times rampant, rebellious, parochilism; but force is not and has never been a permanent solution to any problem. (Sri K. P. S. Menon 23-4-69 Indian Express)

హిందీ భాష ఆంధ్రమున కంటె గాని బంగాళీభాష కంటె గాని యెక్కువ వృద్ధిగా నుండెనని చెప్పుట న్యాయము కాకపోయినను, ప్రాంతీయ భాషలలోని యుద్గ్రంథములు హిందీలోనికి పరివర్తితములగుచున్నవి కనుక నదియుగొప్ప భాషగా రూపొందుటకవకాశమున్నది. కేవల దేశమునగా మాతృ భాషలో విద్యాబోధనము తప్పదనియు, అనుసంధాన భాషగా హిందీయును, విదేశవిజ్ఞానమునకై ఆంగ్లమును నేర్చుకొనవలెనని త్రిభాషా సూత్ర ముద్దేశింపబడినది. ఇట్టి స్థితిలో హిందీ స్థానమునకో సంస్కృతమును ప్రవేశ పెట్టుటెంత వఱకు న్యాయము?

రాజ్యాంగ పరిషత్తు సమావేశమగు సందర్భములో సంస్కృతము అనుసంధాన భాష కావలెనని ప్రకటనము చేసిన వారు శ్రీ కట్జూ, రామలింగారెడ్డి వంటివారు కొలది మంది మాత్రమే. మిగిలినవారు వారిననుసరింప లేదు. హిందీ రాష్ట్రీయుల వారి కవకాశము లెక్కువయుండునను భీతిచేతను, విదేశీయమైన ఆంగ్లభాషను శిరసావహింప లేని జాతీయతా వాదులు నేడు దానినొక పరిష్కార మార్గముగ సూచించుచున్నారు. ఈ సూచన చేయబడు నాటి కిరువది సంవత్సరములు గడచి పోయి హిందరా దేశమునకు హిందీ "రాష్ట్రభాష" యని ప్రపంచ మంతయు నంగీకరించి, విదేశీయులు దాని నభ్యసించుచున్నారు. ఇట్టిస్థితిలో నా నిర్ణయమును మార్చుకొనుట సముచితమైన పని కాదు. సంస్కృత భాషా శక్తి యెంతయు పూర్వమే నిరూపితమై యుండగా నేడు హిందీ పై తిరుగుబాటు వచ్చిన సందర్భమును పురస్కరించుకుని ఉత్తరాది, దక్షిణాది ప్రదేశములకు వచ్చినవనబడెడు లౌకిక విభేదములు కారణముగ, నొకపరిష్కారమార్గముగ సంస్కృతమును సూచించుట సంస్కృతమునకు ప్రతిష్ఠాహేతువు కాదు. ఈ తిరుగుబాటుకూడ ప్రధానముగ తమిళనాడులోనే కలిగినదికాని మిగిలిన ప్రాంతములలో కాదు. ఆంధ్ర ప్రాంతమున వ్యతిరేకత లేదు. లేకపోగా సాముఖ్యమున్నది. "**Andhra Prdesh in the first amoung the Non-Hindi states to declare Hindi as a complsory subject-" (Sri P. V. Narasimharao, Hon. Minister for Education in the Hindi Siksha Samiti - Meeting 4-11-69)** తమిళులు, సోల్జెన్ ప్రభృతులు చెప్పిన ట్రాంధ్ర భాషను కాని, శ్రీయుతులు కట్జూ, రామలింగారెడ్డి, గిరి, కరియప్ప, అనంతశయనం ప్రభృతులు చెప్పినట్లు సంస్కృతమును కాని యనుసంధాన భాషగా నంగీకరించుటకు సిద్ధముగా లేనివారు. వారు సంస్కృతముకన్న కూడ తమిళమే ప్రాచీనమనువారు. వారు వారిభాష యనుసంధాన భాష కావలెనందురు; లేదా ఆంగ్లమును పఠింతురు. హిందీభాష కాకూడదనియు, నింగ్లీషు కావలెననియు వారి వాదము కానే కాదు. కనుక నిర్ణయింపబడిన హిందీని కాదనుట సంస్కృతము కావలెననుట జరుగుపనిగా కన్పింపదు. దానివలన క్రొత్తచిక్కు ఉత్పన్నము కాగలదు. దేవభాషగా సంస్కృతమునకు గొప్ప గౌరవము మన మిచ్చుచుండగా నది రాజభాష యగుటవలన వచ్చు ప్రత్యేక గౌరవము దాని కేమియునులేదు.

త్రిభాషాసూత్ర పథకములో మాతృభాషకు ప్రధానస్థాన ముండుట సముచితమే. హిందీభాష సంస్కృత భాషనుండి సాంకేతిక పదజాలమును సృష్టించుకొని చక్కగా విరాజిల్లగలదు. ఆ పదజాలమునే ప్రాంతీయ భాషలలో యథాతథముగ నుపయోగించుకొనవచ్చును. కొన్ని సాంకేతిక పదములు హిందీలో సృష్టింపబడినను గ్రహింపవచ్చును. అప్పుడు కొంత కాలమున కాంగ్లభాషతో అవసర మీ దేశమునకు తీరిపోవును. అన్ని విదేశ భాషలవలె దానిని యభ్యసించువా రభ్యసింపవచ్చును. త్రిభాషా సూత్రములోని యాంధ్రభాష స్థానమును సంస్కృత మాక్రమించును. అంత వఱకును ప్రాంతీయభాషలో భాగముగ సంస్కృతమును నిర్బంధముగ నేర్పవచ్చును. హిందీభాష సంస్కృతపద బహుళమైనప్పుడు, ఆగ్నేయ ఆసియా మొదలగు దేశములలో దాని ప్రాచుర్యము హెచ్చును. మహాద్వీపీయ దేశములైన యిండొనీషియా ప్రభృతి దేశములలో, కావలసిని సంస్కృత పదములను వాడుకొనుచున్నారుగదా! ఎప్పుడును ఆంగ్లమే అంతర్జాతీయ భాషగా నుండునని ముందే నిర్ణయించుకొనుట న్యాయము కాదు. కాలచక్రము ఎట్లు తిరుగునో ఎవ్వ రెరుగుదురు? సంస్కృత పదబహుళమైన హిందీ అంతర్జాతీయ భాష యేల కాకూడదు?

## స్వదేశము : సంస్కృత ప్రచారము:

వివాహాది శుభకార్యములలో జరుగు సదస్సులలో సంస్కృత పండితుల సన్మానించు ఆచారము మన దేశమున కలదు. అందు వేదపండితుల సన్మానము ప్రథమముగ జరుగును. కృష్ణా, గోదావరి, గుంటూరు మండలములందు వేదప్రవర్థక పరిషత్తులు కలవు. సపరికరాద్వైత మహా సభలు జరుగుచున్నవి. వేద పండితులను పరీక్షించి, పట్టములను, ఉర్లాం జమీందారుగా రేర్పాటుచేసినారు. ప్రస్తుతము కౌతా పూర్ణానందముగారి ట్రస్టు ననుసరించి దేవీ నవరాత్రములలో జరుగు వేదసభలలో నట్టి 'పట్టా' తీయబడుచున్నవి. ఈ పట్టాను నే డాంధ్రమున ప్రమాణభూతముగ భావించుచున్నారు. ఇదివఱలో శ్రీ కడియాల పేరావధానులుగారు పరీక్షాధికారిగా నుండెడివారు. ప్రస్తుతము శ్రీ విశ్వనాథ జగన్నాథ ఘనాపాఠిగారు, శ్రీగంటి సూర్యనారాయణ చయనులుగారు పరీక్షాధికారులుగ నున్నారు. శ్రీ కౌతా సూర్యనారాయణగారును వేదపండితులను సన్మానింతురు. శ్రీయుతులు

మాగంటి రామకృష్ణయ్య, మాగంటి సూర్యనారాయణ, నోరి వేంకటేశ్వర శాస్త్రి, నోరి లక్ష్మీకాంతశాస్త్రి, జొన్నవిత్తుల సీతారామాంజనేయులు, వేమూరి పూర్ణచంద్రరావు, ముష్టి సత్యనారాయణ, లక్కావఝ్ఝల వేంకటేశ్వరశాస్త్రి ప్రభృతు లనేకులు వేదపండితుల సన్మానింతురు. కొందరనే ఎన్నికచేసి యుదారముగ సన్మానించు శ్రీ జంధ్యాల నారాయణశాస్త్రి గారి వంటివారును, ఎందరు పండితులకైనను దేవీ నవరాత్రములలో భోజన మిడు శ్రీ ఆకెళ్ళ రామకృష్ణయ్యవంటి వారును కలరు. దేవీ నవరాత్రములలో విజయవాడ నిజముగ 'వేదవాడ'యే. తొలిగా శృంగేరి శంకర మఠమునందు విజయవాడ ప్రజలనుండి సత్కారము జరుగును. రాజమహేంద్రవరములోని వాలోశా, కాంద్రేగులవారును; శ్రావణ పూర్ణిమ నాడు సత్కారము చేయుదురు. ఏలూరులో ఈదరవారును, గుంటూరులో చిన్నపాముల సీతారామయ్య ప్రభృతులు వేదపండితుల సత్కరింతురు. శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారు 'వేదరక్షణ నిధి' నేర్పఱచిరి. పీఠాధిపతులందరును వేద పండితులను శాస్త్ర పండితులను సత్కరించెడివారే. మచిలీపట్టణములో శ్రీ రాళ్ళభండి సీతారామ శాస్త్రిగారు (విద్యాశంకర భారతీస్వామి) సాంగవేద పాఠశాలను నెలకొల్పిరి. బాపట్లలో వేదపాఠశాల కలదు. విజయనగరము, ఆగిరిపల్లి పాఠశాలలలో వేద శాఖ కలదు. పశ్చిమగోదావరి మండలమున 'నరిపల్లె' పాఠశాల తప్పక చెప్పకొనదగినది. దీనికి హేతుభూతులు ఈమని వేంకటేశ్వర్లుగారు. వీరు కొంతకాలము జమీందారులయొద్ద మానేజరుగా నుండిరట. వారిని 'మానేజరు'గా రన్ననే ఎక్కువమందికి తెలియును. వారా పెద్దసంస్థను నిర్మించిరి. అనేకులు వేదశాస్త్ర పండితులకు సన్మానము చేసిరి. శ్రీ మాళవ్యాగారు హిందూ విశ్వవిద్యాలయమునకు ఎట్లు విరాళములు సంపాదించిరో యట్లే కొద్ది పరిమాణములో వీ రాసంస్థకై సంపాదించిరి. సంపాదించినదంతయు వాసంత నవరాత్రములలోని యుత్సవములకును, విద్యార్థులకు అభ్యంగనము పిండివంటలతో భోజనములకును, వేద శాస్త్ర పండితుల సత్కారములకును వ్యయించివేసిరి. వారిప్పుడు లేరు. సంస్థ శిథిలావస్థలో నున్నది. పెద్దయావరణము, కట్టడములు జాలిగొలుపుచున్నవి. విజయనగరము, గద్వాల, పిఠాపురము మొదలైన సంస్థానములు వేద విద్యా పోషణమున కాకరములై యుండి యుండెడివి. శ్రీమతి కాంచనపల్లి

కనకాంబ, దంటు సుబ్బావధాని, చుండూరి వేంకటరెడ్డిగారలచే వారి గురువు శ్రీ పాలావజ్ఝుల నాగభూషణము (అమృతానందనాథ స్వామి) గారి ప్రేరణమువలన నేర్పడిన త్రిలింగ మహావిద్యాపీఠము (విజయవాడ) శాస్త్ర పండితుల ననేకుల సన్మానించినది. ఏటేట జరిగెడి గురుజయంతిలో నొక పండితుని సత్కరించుట వారి నియమము. ప్రస్తుత మా పీఠములో శ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రిగారు గలరు. 'సర్వతంత్ర స్వతంత్ర కళాశాల' నెలకొల్పవలెనను వారి యాశయ మట్లే మిగిలిపోయినది. ఇది వఱలో స్వర్గీయ వడలి లక్ష్మీనారాయణశాస్త్రి, గుప్పా వేంకటప్పయ్య శాస్త్రి (అనంతవరము – తెనాలితాలూకా) గారలును, చిఱుకుల వేంకట రమణశాస్త్రిగారును (వేమూరు), ఉప్పలూరి గణపతిశాస్త్రిగారును వేదార్థ ప్రవచనము చేసెడివారు. ఇప్పుడు శ్రీ గుప్పా లక్ష్మణావధానులు, రేమళ్ల సూర్యప్రకాశశాస్త్రిగార్లు వేదార్థమును చెప్పుచున్నారు. శ్రీ సన్నిధానము లక్ష్మీనారాయణ శాస్త్రిగారు వేదార్థము చెప్పుచున్నారని వినికిడి. గుంటూరు మండలమున "తిమ్మసముద్రమున" గోరంట్ల వెంకన్న చౌదరి గారు శాస్త్ర విద్యలకు గొప్ప 'ట్రస్టు' నేర్పాటుచేసిరి. నెల్లూరిలో శ్రీ ఇంగువ శ్రీ కృష్ణయ్య, తూములూరి శివరామకృష్ణయ్య ప్రభృతులు సంస్కృత భాషాభివృద్ధికై కృషి చేసినవారు. వారు తర్కవేదాంతా చార్య శ్రీ మండలీక వేంకటశాస్త్రిగారిని నెల్లూరున నిలిపియుండిరి.

శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారిచే తెలిగింపబడిన "వేదము"లను వినయాశ్రమమునుండి (గుంటూరుజిల్లా) సర్దార్ గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు (స్వామీ, సీతారాం) ప్రకటించిరి. "ఋగ్వేద సంహిత"ను శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి పద్యములలో తెలిగించిరి. వీరు జగం పురములోని కళ్లికోట రాజాగారి కళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా నుండి ఈ గ్రంథమును 1929 లో పూర్తిగావించిరి. ఈ వ్రాతప్రతి శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి కృషివలన గౌతమీ గ్రంథాలయ మున (రాజమహేంద్రవరము) భద్రపరుపబడినది. దీనిలో 10,066 పద్య ములు, 150 పేజీల పీఠిక, 150 పుటల పదానుక్రమణిక, 150 పుటల విషయ వివరణమును గలవు. రాయల్ సైజున 1500 పేజీల గ్రంథ మగును. దీని ముద్రణమునకై గ్రంథాలయ గౌరవకార్యదర్శి శ్రీ మహీధర జగన్మోహన రావుగారు యత్నించుచున్నారు. "సూత్ర భాష్యము"ను శ్రీ రాజా

రావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహదూరువారి (పిఠాపురము) సంకల్పముచే శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగా రాంధ్రీకరించి ప్రకటించిరి. తర్కరత్న, న్యాయవేదాంత విద్యాపారీణ, దర్శనాలంకార శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారు (ఘట్నవల్లి, అమలాపురము తాలూకా) "శ్రీ భగవద్గీతా శాంకరభాష్యము"ను తెలిగించిరి. ఈ గ్రంథము ముద్రణమునకై వీరు స్వగ్రామమున 'శారదా ముద్రణాలయము'ను నెలకొల్పి, కుటుంబమునకంతకు, నచ్చులను కూర్చుట, ముద్రించుట, బైండు చేయుట నేర్పి, యా గ్రంథ సంపుటములను శ్రమపడి వెలువరించిరి. వీరు వేదాన్త దేశికులైన శ్రీ దెందుకూరి నృసింహశాస్త్రిగారి (గుంటూరిజిల్లా) శిష్యులు. శ్రీ కురుగంటి వేంకట రమణశాస్త్రిగారు (వేమూరు-గుంటూరుజిల్లా) అనేక శాస్త్ర గ్రంథములను రచించిరి-'సాంఖ్య రమణీయము', 'మీమాంసా రమణీయము', 'జ్యోతిష రమణీయము' ప్రకటింపబడినవి. 'తర్క-రమణీయము', 'వేదాంత రమణీయము' ప్రకటింపబడ నున్నవి. వీరివే, 'దక్షిణామూర్తి విలాస'మను 12 సర్గముల కావ్యము, త్రిపుర విజయమను చంపువును ప్రకటింపబడినవి. 'పార్వతీ కళ్యాణమ'ను కావ్యమింకను ప్రకటింపబడ లేదు. 'స్తోత్ర రమణీయమ'ను స్తోత్ర కావ్యమునూ ప్రకటింపబడవలసి యున్నది. 'వరివశ్యా రహస్యము' 'కామకళా విలాసము' 'సేతు బంధనము' గ్రంథములకు వీరు వ్యాఖ్యరచించిరి. 'కామకళాలాస్య'మను రెండువేల శ్లోకముల స్వతంత్ర గ్రంథమును రచించిరి. ఇవియును ప్రకటింపబడలేదు. శ్రీ శెల్లముకొండ రామారావుగారుద్దండ పండితులు. తిరుపతి వేంకటకవుల గ్రంథములందును వీరి ప్రస్తావనము కలదు. గుంటూరి మండలమునకు చెందినవారు. వీరు పలుగ్రంథములు రచించిరి. భగవద్గీతా భాష్యార్థ ప్రకాశనము, దశోపనిషద్వ్యాఖ్యానము, వేదాంత ముక్తావళి (అద్వైత మత స్థాపన గ్రంథము), భాగవత చంపువు మొదలైనవి ప్రకటితములు. "కౌముదీశరదాగమ"మను గ్రంథము ప్రకటితము కాలేదు. విశాఖ మండలములోని యొకరు "సంస్కృత విజ్ఞాన సర్వస్వ"మను గ్రంథమును రచించిరి. 150 కట్టల ఆ గ్రంథము ప్రస్తుతము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో నున్నదని వినికిడి. ఇది ప్రకటింపబడవలసి యున్నది. శ్రీ మల్లావఝ్ఝల సుబ్బరామశాస్త్రిగారు (వరంగల్) శాబర భాష్యమును తెలుగు చేసిరి. శ్రీయుతులు రాయప్రోలు లింగన

సోమయాజులు, వంగల వేంకటరామశాస్త్రి గారలును వేదాంత గ్రంథముల రచించిరి.

శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రి (రాయుడుశాస్త్రి) గారు 'గురు ప్రసాదమ'ను వ్యాకరణ గ్రంథమును రచించిరి. శ్రీ పేరి వేంకటేశ్వర శాస్త్రిగారు ''గురుప్రసాద శేషము''ను రచించిరి. వీరికి ప్రాత మొదల లగు విషయములందు మాత్రమే శ్రీ కరి శ్రీరామమూర్తి శాస్త్రి (కొవ్వూరు) గారు సహాయము చేసిరి. శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రి గారు న్యాయ కుసుమాంజలి వ్యాఖ్య రచించిరని వినికిడి. శ్రీ శాస్త్రి గారును, దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారును 'ఆంధ్ర న్యాయదర్శనమ'ను చిన్న గ్రంథమును ప్రకటించిరి. శ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారు 'తిజంతవిచార'మను గ్రంథమును రచించిరి (అముద్రితము). శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు 'కౌముదీశరదాగమ'మను ఆంధ్ర గ్రంథమును ప్రకటించిరి. ధ్వన్యాలోకమును తెలిగించిరి. శ్రీ సన్నిధానము సూర్య నారాయణ శాస్త్రిగారు 'కౌముది'లోని విషయములను గ్రహించుటకు వీలుగా 'తత్త్వమచంద్రిక'ను ప్రకటించిరి. శ్రీమాన్ యస్. సి. యస్. వేంకటాచార్యులుగారు 'కాతంత్ర వ్యాకరణము'ను తెలిగించి కొంత భాగము ప్రకటించిరి. శ్రీ గుండేరావు హార్కారే (హైదరాబాదు) గారు అష్టాధ్యాయి ననుసరించి ధాతురూప సిద్ధికై యొక యంత్రమును నిర్మించిరి. శ్రీయుతులు గొడవర్తి యతిరాజ సంపత్కుమారస్వామి, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, గంథంపాటి రామమూర్తిశాస్త్రి, జయంతి భగీరథ శాస్త్రి, చర్ల బ్రహ్మయ్యశాస్త్రి, చర్ల నారాయణశాస్త్రి, లంక నృసింహ శాస్త్రి, తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రి ప్రభృతుల నేకులు వ్యాకరణ పండితు లను తయారు చేసిరి. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి (పిఠాపురము) గారి శిష్యులు శ్రీ కప్పగంతుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఏలూరులో వ్యాకరణ శాస్త్ర పాఠశాలను నడుపుచున్నారు. డాక్టర్ విష్ణుభొట్ల విశ్వనాథ శాస్త్రిగారును (బెంగుళూరు) శాస్త్రిగారి శిష్యులే. వేదుల సూర్యనారాయణ శాస్త్రిగారి యొద్ద శ్రీ దర్భా సర్వేశ్వర శాస్త్రిగారును, వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారును వ్యాకరణము నభ్యసించిరి. చిలు కూరి అచ్చయ్యశాస్త్రి (మార్కొండపాడు, ప.గో.జిల్లా), నోరి సుబ్రహ్మణ్య

శాస్త్రిగారలు (తాళ్లపూడి. ప. గో. జిల్లా) వ్యాకరణ పండితులు. భాగవతుల విశ్వనాథ శాస్త్రిగారు శేఖరమునకు 'వాక్యార్థ చంద్రిక' యను వివరణమును వ్రాసిరి. శ్రీపాద లక్ష్మీనృసింహ శాస్త్రిగారు (గుమ్ములూరు ప. గో. జిల్లా) ధూళిపాళ సూర్యనారాయణ శాస్త్రిగారు (ప. గో. జిల్లా) వారి కుమారులు రామచంద్ర శాస్త్రిగారు తర్కపండితులు. శ్రీపాద రామమూర్తిశాస్త్రి, సంగమేశ్వరశాస్త్రిగారలునూతర్కపండితులు. వేమూరి రామగోవిందశాస్త్రి (నరసాపురము) గారు సాహిత్యవేత్తలు. వేమూరి రామబ్రహ్మ శాస్త్రిగారు వ్యాకరణ పండితులు.

లక్కవరము ఎస్టేటు జమీందారయిన శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు కవులు, కవి పండిత పోషకులు. వారెనిమిది కొమరితల వివాహములు చేసిరి. ఏలూరులోని బ్రాహ్మణులందరును అయిదురోజులును వారి దివాణములో భోజనము చేయవలసినదే. వారా వివాహముల సందర్భమున కవి పండిత సదస్సుల నేర్పాటుచేసి భూరిసత్కారము చేసెడివారు. వారి యాస్థాన విద్వాంసులు శ్రీ క్రొత్తపల్లి సుందరరామయ్యగారు. వారు "అమర నిఘంటువు"ను అమరకోశము ననుసరించి రచించిరి (అముద్రితము). శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు గౌతమధర్మ సూత్రములను వాత్స్యాయన కామసూత్రములను తెలిగించిరి. శ్రీ చర్ల భాష్యకార శాస్త్రిగారు (కాగవల్లు) 'రమేశాధీశ' యను నాలుగక్షరములలో నలంకార శాస్త్రమును రచించిరి. దీనిని శనివారపు పేట (ఏలూరు దగ్గఱ) జమీందారులకు కృతినిచ్చిరి. శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గారును, జమ్ములమడక మాధవరామశర్మ గారును రాయుడు శాస్త్రిగారి శిష్యులు. శ్రీ తిరువేంగళాచార్యులుగారు 'ఆంధ్ర ధ్వన్యాలోకము'ను రచించిరి. అందులో నవీనాంధ్ర కవుల రచనములు కూడ లక్ష్యములుగ నిచ్చిరి. శ్రీ శర్వాణీ వ్యాఖ్యా సహితముగ నాంధ్ర రస గంగాధరమును రచించిరి. వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి నాంధ్రీకరించిరి. శ్రీ మాధవరామశర్మ గారు భరతుని నాట్యశాస్త్రమును 'నాట్యవేదము'ను పేర తెలుగులోనికి తెచ్చిరి. ప్రతాపరుద్రీయమును, రసగంగాధరము నాంధ్రీకరించిరి. (నవరసగంగాధరము). రుయ్యకుని అలంకార సూత్రమును తెలిగించిరి. రసగంగాధరమణిని, ధ్వనిసారమును,

కావ్యప్రకాశమును తెలుగులో నందించిరి. క్షేమేంద్రుని ఔచిత్య విచార చర్చను తెలిగించిరి. ప్రస్తుతము శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి ప్రోత్సాహమున జాయపసేనాని నృత్త రత్నాకరము ననువదించుచున్నారు. ఆంధ్ర భాషలో వీరు వ్రాసినన్ని యలంకార గ్రంథము లెవరును వ్రాయలేదు. శ్రీ ధరణికోట వేంకట సుబ్బయ్యగారు రసగంగాధరమును తెలిగించిరి. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు సాహిత్య దర్పణమును తెలిగించిరి. భానుసూరి రసమంజరికి తెలుగు టీక వ్రాసిరి. అలంకార సారసంగ్రహ మను స్వతంత్ర పద్య గ్రంథమును తెలుగులో రచించిరి. రాజశేఖర కవి కావ్య మీమాంసను శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు తెలిగించిరి. 'రూపక పరిశుద్ధి' యను పేర శ్రీ డి. టి. తాతాచార్య M. O L గారు సంస్కృతములో రూపక ఉపమాలంకారముల చర్చను రచించిరి. దానిని శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్స్టిట్యూటు వారు ప్రకటించిరి. శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి గుణప్రశంసా లక్ష్యముగ శ్రీ చర్ల వేంకటశాస్త్రి గారు సంస్కృతమున నలంకార శాస్త్రమును రచించిరి. దేవేశ్వర మహాకవి ప్రణీతమైన కవికల్పలతకు శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగా రాంధ్ర వివరణము నందించిరి. శ్రీమాన్ చెలమచర్ల రంగాచార్యులు గారు ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణమును రచించిరి. శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు 'కువలయానందసార'మను పద్య గ్రంథమును తెలుగులో రచించి తెలుగు కవుల పద్యములనే యుదాహరణముగ నిచ్చిరి. ఆంధ్రాలంకార వాఙ్మయ చరిత్రమును రచించి యందు ప్రాచీనాలంకారికుల మార్గమును సువ్యక్తము చేసిరి. డాక్టరు దివాకర్ల వేంకటావధాని గారు 'సాహిత్య సోపానము'ను రచించిరి. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు నరస భూపాలీయ వ్యాఖ్యను రచించుచు ప్రాచీనాలంకారికుల మతములు సువ్యక్తము చేసిరి. శ్రీ భాగవతుల కుటుంబరావు గారు ధ్వన్యాలోకమును కొంత ప్రకటించిరి. ఈ విధముగ వేద, వేదాంత, వ్యాకరణాలంకార శాస్త్రవిషయము లెన్నియో సంస్కృత వాఙ్మయము నుండి పెక్కులు గ్రంథరూపమున ప్రజల కందించు కార్యక్రమమును చేపట్టి యున్నారు.

శ్రీమాన్ గరణి వేంకటకృష్ణమాచార్యులుగారు శబ్దరత్నావళిని, ధాతురత్నావళిని రూపొందించిరి. సంస్కృతమును ప్రాథమిక దశలో, శబ్ద

సించువారికివి మహోపయుక్తముగ నుండెడివి. ప్రస్తుతము శబ్దమంజరినే చదువుచున్నారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు కుమార వ్యాకరణమును రచించిరి. శ్రీ భండార్కరుగారి వ్యాకరణము మొదటి భాగమును శ్రీమాన్ కె. వి. నరసింహాచార్యులుగారు 'మార్గోప దేశిక'యను పేర తెలిగించిరి. శ్రీ వి. వి. రాజుగారి సోదరులు శ్రీవల్లూరి వేంకటేశ్వరులుగారు 'సంస్కృతధాతుప్రక్రియ' (కర్తృ కర్మభావార్థకోశము) ప్రథమభాగమును ప్రకటించిరి. మైసూరులో తెలుగు లిపిలో ప్రకటింపబడిన సంస్కృత గ్రంథము లనేకముగలవు. 'ధాతురూపప్రకాశికా' యను గ్రంథము శ్రీ చామరాజనగర శ్రీకంఠశాస్త్రిచే రచింపబడి ధర్మాధికారి చక్రవర్తి అయ్యంగారిచే పరిశోధింపబడి మైసూరు విద్యాతరంగిణీ ముద్రాక్షరశాలయందు 1888వ సంవత్సరమున ముద్రింపబడినది.

ఆధునికాంధ్రులలో సంస్కృత కావ్యరచనమునకును లోపములేదు. కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారి జీవితమును కావ్యముగ రచించిరి. శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు వివేకానంద చరిత్రమును కావ్యముగ రచించిరి. శ్రీగంటిజోగి సోమయాజులుగారు రాధాకృష్ణపండితుని జీవితమును కావ్యముగ రచించిరి. శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు (చందవోలు-గుంటూరుజిల్లా) శ్రీశైలమాహాత్మ్యమును రచించిరి. కావ్యకంఠ గణపతిముని శివసహస్రమును రచించిరి. కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "అమృత శర్మిష్ఠ"మను నాటకమును దేవీత్రిశతిని రచించిరి (అముద్రితములు). శ్రీ శ్రీపాదవారు మయూరభంజి సంస్థానమున (ఒరిస్సా) సంస్కృతములో శతావధానము చేసినవారు. తిరుపతి వేంకటకవులును అవధానమున సంస్కృత శ్లోకములు చెప్పుచుండెడివారే. శ్రీయుతులు అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, బూర్గులరామకృష్ణారావు, ముళ్ళపూడి నారాయణశాస్త్రి లక్కావఝ్ఝల వేంకటకృష్ణశాస్త్రి, రాణీప్రసాదచయనులు ప్రభృతులనేకులు సంస్కృత రచనములను చేసిరి. శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు కామకోటిస్వామివారిని గూర్చి 'గురు కృపాలహరి'ని ప్రకటించిరి. శ్రీ లంక సీతారామశాస్త్రి గారు సీతారామాయణమునురచించిరి. శ్రీ మహీధర వేంకటరామశాస్త్రిగారు

వకుళాభరణ, సరోజినీ సౌరభ, కల్యాణమైత్రి కావ్యములను, శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు చిత్ర శతకమును, శ్రీ జయంతి పట్టాభిరామశాస్త్రిగారు 'దూతాచ్యుతమను' నాటకమును (దానవాయిపేట, రాజమహేంద్రవరము-3) ప్రకటించిరి. శ్రీ పుల్లెల రామచంద్రుడుగారు రవీంద్రుని గీతాంజలిని సంస్కృతీకరించి శ్రీ నెహ్రూగారికి కృతినిచ్చిరి. శ్రీ కోలాచల యజ్ఞనారాయణ దీక్షితులు (గుంటూరు) వరూధిని నాటికను ప్రకటించి ప్రదర్శింపజేసి డాక్టర్ గోపాలరెడ్డిగారికి కృతినిచ్చిరి. 'కవితోదయచంద్రిక' యనుపేర కళాప్రపూర్ణ డాక్టర్ గిడుగు సీతాపతిగారు ఆంధ్రప్రబంధములలోని పద్యములను, చాటువులను, శతక పద్యములను, క్షేత్రయ్య పదములను సంస్కృతీకరించి ప్రకటించిరి. క్షేత్రయ్య పదముల సంస్కృతీకరణము 'స్రవంతి'లో ప్రకటింపబడినది. శ్రీ నేతి సుబ్బరాయశాస్త్రిగారు వివిధ పండితుల వ్యాసములను సంకలనము చేయగా 'వ్యాస మంజరి' యను పేర చిత్తూరు సంస్కృతభాషా ప్రచారిణీ సభవారు ప్రకటించిరి. శ్రీ ఎరసూరి మల్లికార్జునరావు కళాపూర్ణోదయమును వచనములో రచించిరి. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు త్యాగరాజ రచితమైన నౌకా చరిత్రమును సంస్కృతీకరించిరి, శతకోప చరితమును ప్రకటించిరి. శ్రీ ద్వివేది సత్యకవి గాంధీ చరిత్రమును వచనమున ప్రకటించిరి. శ్రీ పి. శరభాచారి మేఘ సందేశమునకు పూర్వవృత్తాంతమును కావ్యముగ రచించిరి. తర్కాచార్య శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి పరిష్కర్తృకమున భాసుని నాటకములు తెలుగులిపిలో వెలువడినవి. వేదమువారును, వావిళ్లవారెన్నియో సంస్కృత గ్రంథములను తెలుగు లిపిలో సార్థతాత్పర్యముగ వెలువరించిరి. మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారి యాశయము సంస్కృతములోనే యందఱును సంభాషింపవలెనని. అందులకై వారు బాల బోధినులు మూడు ప్రకటించిరి. అవి జర్మనీ భాషలోనికికూడ పరివర్తితములైనవి. శ్రీ కృష్ణాచార్యులు, జటావల్లభుల పురుషోత్తము, జమ్మలమడక మాధవరామ శర్మగారలు సంస్కృతభాషా ప్రచారము నొక "ఉద్యమముగ" తెలుగునాట నడిపిరి. తపాలా పాఠములద్వారమున నుచితముగ సంస్కృతమును బోధించు నొక ప్రణాళికను ఆంధ్రప్రదేశ్ విశ్వ హిందూ పరిషత్తు శాఖ స్వీకరించి కీ. శే. శ్రీ పాద దామోదర సాత్వలేకర్ గారు ప్రతిపాదించిన విధానము నాధారముగ రూపొందించి, భారత ప్రభుత్వ సంస్కృత

పిఖాగశాఖవారి యామోదమును బడసినారు. శ్రీ జటావల్లభుల పురుషో త్తము, యం. కె. గుప్త. తూములూరి లక్ష్మీనారాయణగారలతో దానికై యొక యుపసంఘ మేర్పడినది. శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారు, శ్రీ తోట్యేటి భానుమూర్తి, నుదురుమాటి వేంకటరమణ శర్మగార్ల చే 'నాంధ్ర పత్రిక'లో సంస్కృత పాఠముల వ్రాయించిరి. 'జాగృతి'పత్రిక శ్రీ కర్ణ రాజ శేషగిరిరావుగారిచే సంస్కృత పాఠములను హిందీతో కలిపి వ్రాయించి ప్రకటించినది. శ్రీ నీలంరాజు వేంకట శేషయ్యగారు సంస్కృత మనుసంధానభాష కావలెనని పండితుల యభిప్రాయములు సేకరించి, 'ఆంధ్ర ప్రభ'లో ప్రకటించి యనేక సంపాదకీయ వ్యాసముల వ్రాసిరి.

స్వామి కరపాత్రజీ, పండిత రాజేశ్వరశాస్త్రి, అనంతకృష్ణ శాస్త్రి ప్రభృతు లనేకులు సంస్కృతములో ధారాళముగ నుపన్యసింపగలరు. మహా రాష్ట్ర దేశమునకుచెందిన 'ప్రభావతీ రాజే' యను నామె ధారాళముగను చక్కగను సంస్కృతోపన్యాసముల చేయుచున్నారు. ఆంధ్రప్రదేశమున సంస్కృతోపన్యాసములకు శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మ, కప్పగం తుల లక్ష్మణశాస్త్రిగారలు ప్రసిద్ధివహించి యున్నారు. చిత్తూరు సంస్కృత భాషా ప్రచారిణీ సభవారు, పరిచయ–అభిజ్ఞ–విచక్షణ–సమర్థ–కోవిద–పరీక్ష లను నడుపుచున్నారు. భారతీయ విద్యా భవన్ వారును పరీక్షా కేంద్రముల నెలకొల్పి ప్రారంభిక, ప్రవేశ, పరిచయ, కోవిద పరీక్షలను, సాహిత్య ప్రవే శిక, సాహిత్యశాస్త్రి, సాహిత్య ఆచార్య పరీక్షలను నడుపుచున్నారు.

సంస్కృతము ననేక సంస్థలు ప్రచారమునకు తెచ్చుచున్నవి. 'భండా ర్కరు ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్' (పూనా) ఒక గుర్తింపబడిన పరి శోధనా కేంద్రము. దీని కంతర్జాతీయ ప్రశస్తి కలదు. ఒక పత్రికను కూడ నిర్వహించుచున్నది, భారతమును 1250 పాఠములు 734 ప్రాంత ములనుండి సంతరించి పరిచూచుచు ప్రకటింప పూనుకొనినారు. 1919 ఏప్రిల్ లో నీ కార్యక్రమమును మొదలిడినారు. తొట్టతొలిగా ఔధ్ మహా రాజావారు దీనికి 12 లక్ష లిచ్చిరట. 13000 పేజీలతో 19 సంపుటము లుగా వెలువడు నీ గ్రంథమునకు డాక్టర్ వి. యస్. సుఖ్తాంకర్, కె. ఎస్. బెల్వాల్కర్, డాక్టర్ పి. యల్. వైద్య, ఆర్. యస్. దండేకర్ గార్లు పూనుకొనినారు. వారికి సహాయకులుగా డాక్టర్ ఫ్రాంక్‌లిన్ ఎడ్గార్టన్ (అమెరికా), డాక్టర్ రఘువీర్ (మధ్యప్రదేశ్), యస్. కె. దే (బెంగాల్)

నుండిరి. అలహాబాదులో గంగానాథ్ ఝా రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ కలదు. వారును పత్రికను నడపుచున్నారు. పంజాబ్‌లోని హోషియార్‌పూర్‌లో వేదిక్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ కలదు. దానికిని అంతర్జాతీయ ప్రశస్తి కలదు. మిథిల సంస్కృత పరిశోధనా కేంద్రము, మైసూరు ప్రభుత్వపు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు్స లైబ్రరీ రిసెర్చి ఇన్‌స్టిట్యూటు, తిరువాన్కూర్ శాన్స్క్రిట్ (లైబ్రెరీ) రిసెర్చి ఇన్‌స్టిట్యూటు, మద్రాసు (ఓరియంటల్) గవర్నమెంటు మాన్యుస్క్రిప్టు్స లైబ్రరీ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠపు రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, వేంకటేశ్వర యూనివర్సిటీ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ (తిరుపతి), ఆంధ్ర హిస్టారికల్ రిసెర్చి సొసైటి (రాజమహేంద్రవరము) మున్నగునవి ఎన్నియో పరిశోధనా కేంద్రములు దేశములో పనిచేయుచున్నవి.

ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులలో సంస్కృతమునకు సంబంధించిన అనేక విషయములు చర్చింపబడుచున్నవి. బెంగుళూరు సంస్కృత సభలలో 48 సంస్కృత పత్రికలు ప్రదర్శింపబడినవి. సంస్కృతమునకు సంబంధించిన అనేక విషయములు శ్రీ కె. యమ్. మున్షీగారి యాధ్వర్యమున వెలువడు **Bhavan's Journal** లో వెలుగు చూచుచున్నవి. చౌఖాంబా శాన్స్క్రిట్ సిరీస్, మోతీలాల్ బనారస్‌దాస్ కంపెనీ, గోరక్‌పూర్ గీతా ప్రచురణాలయము మొదలైన ప్రచురణాలయము లెన్నియో సంస్కృత గ్రంథముల ప్రకటించుచున్నవి. దేశమునకు జీవనాడి సంస్కృతము. ప్రజలు, సంస్థలు ఈ భాషయందు విశేషోత్సాహమును చూపుచున్నవి. ఆంధ్రప్రదేశమున శ్రీయుతులు వేలూరి సుబ్బారావు, పి. శ్రీరామమూర్తి, చివుకుల మార్కండేయశాస్త్రి, అంజనేయ శాస్త్రి, వి. ఆర్. శాస్త్రి, పల్లెల శ్రీరామచంద్రుడు సంస్కృత విషయమున డాక్టరేటును తీసికొన్నవారు.

ఈ సందర్భమున సంస్కృత విశ్వపరిషత్తు సేవ గణ్యమైనది. శ్రీ కె. యమ్. మున్షీగారు దీనికి రథసారథి. శ్రీ గోవింద వల్లభపంతుగారి యాధ్వర్యమున వారణాసి యందును, శ్రీ రవిశంకర శుక్లగారి యాధ్వర్యమున నాగపూరు నందును, డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారి యాధ్వర్యమున తిరుపతి యందును, శ్రీ హరేకృష్ణ మెహతాబ్‌గారి యాధ్వర్యమున

పూరి యందును, శ్రీ నిజలింగప్పగారి యాధ్వర్యమున మైసూరు నందును పరిషత్సభలు జరిగినవి. కురుక్షేత్రము, బొంబాయి నగరములందును నట్టి సభలు జరిగెను. ఆంధ్ర రాష్ట్రమున జరిగిన సభలు శ్రీ గోపాలరెడ్డిగారు కర్నూలున ముఖ్యమంత్రిగా నున్నప్పుడు జరిగెను. వారు సంస్కృత భాషాభిమానులు. వారధికారములో నున్నప్పుడే భాషాప్రవీణ టైటిల్ హోల్డరుగా నున్న పండితులు 'విద్యాప్రవీణ' పరీక్షలో నుత్తీర్ణులై యున్నచో మూడు ఎడ్వాన్సు ఇంక్రిమెంటుల నీయనగునని ఉత్తరువుల నిచ్చిరి. వారు ప్రస్తుతము ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా నున్నారు. తమ షష్ట్యబ్దపూర్తి సందర్భమున త్రివేణీ సంగమమున స్నాతులై, వ్యాసుడు పుట్టిన ప్రదేశమని చెప్పబడు 'కాల్పి' (కాన్పూరునకు 12 మైళ్ల దూరము) కి పోయి యా పవిత్ర వాతావరణములో కాలము గడపిరి. అల్లే వాల్మీకి రామాయణము వ్రాసిన చోటుగా గణింపబడు 'లవకుశాశ్రమము'ను దర్శించిరి. వాల్మీకి, వ్యాసులన్నను, వారు వ్రాసిన సంస్కృత కావ్యము లనినను వారికి విశేష గౌరవము.

## సంస్కృతము : కేంద్రప్రభుత్వము :

సంస్కృత భాషా వైశిష్ట్యమును ప్రపంచ మేధావులు గుర్తించిన విషయమును, తద్భాష భారత దేశమునకు చెందియుండుట భారత దేశము నకు గర్వకారణమను విషయమును భారత ప్రభుత్వము గమనింపకపోలేదు. అందుచేతనే నది యేభాషా రాష్ట్రమునకు ప్రత్యేకముగ చెందక పోయినను నన్ని రాష్ట్రములకు చెందిన దానిగా భావించి దానిని జాతీయ భాషగా రాజ్యాంగ పరిషత్తు గుర్తించినది. భారత ప్రభుత్వ మీ భాషా పోషణ మును మూడు దృక్కోణములతో చూచుచున్నది. (1) దేశీయ భాషల యభివృద్ధికి సంస్కృత భాషాభివృద్ధి యవసరము. కారణము-సంస్కృత పదములు లేని దేశీయ భాషయేలేదు. (2) కాశ్మీరము మొదలు కన్యా కుమారి వఱకు మేధావులు మహావిషయము లీభాషలోనే చర్చించెదరు కావున దేశీయైకమత్యమునకీ భాషయొక్క అగత్యమున్నది. (3) జాతి సంస్కృతి దీనియందు నిక్షిప్తమైనది.

"The Union Government is fully aware of the importance of Sanskrit as a potential factor in National intigration"

అని శ్రీ వి.ఆర్.కె.వి. రావుగారు చెప్పుట వలన రాజకీయ దృష్టితో చూచినను - దేశభద్రత దేశ సమైక్యముపై యాధారపడినది కావున - సంస్కృత భాషా పోషణము తప్పనిసరి యగుచున్నది. మూడవ ప్రణాళికలో సంస్కృతమునకు 75 లక్షల రూప్యముల కేటాయింపు జరుగగా నాల్గవ ప్రణాళికలో దానిని 2.55 కోట్లు చేసిరి. వెనుకటి కేటాయింపుకంటె యీ కేటాయింపు సంతోషమును కూర్చునదే యైనను దేశసమైక్యము లేక దేశ భద్రత అను మహాకార్యమునకిది మొత్తము తక్కువనియే యభిప్రాయపడు చున్నారు. "It is futile to think that Sanskrit studies can be adequately fostered by a central expenditure of Rs. 50 lakhs a year for five years (Editorial-Indian Express 1-9-69) ద్రవ్యపు కేటాయింపు ఎంతయైనను భారత ప్రభుత్వము సంస్కృతమునెడ కొంత శ్రద్ధవహించుచున్నదని చెప్పకతప్పదు. "It would not be proper to approach Sanskrit language and literature as merely one of the languages in India. It has to be considered more as a part of Indian culture and as a repository of Indian thought and wisdom since Vedic times, than as one of the languages of India (Sri R.R. Diwakar, Bhawan's journal 24-3-57) అను దివాకర సూక్తిని దృష్టిలో నిడుకొనియే వ్యవహరించుచున్నదనియు, సంస్కృత మన్నిభాషల వంటిదేయని కొందరనుకొనునట్లనుకొనుటలేదనియు నూహింపవచ్చును.

దీనికి దృష్టాంతముగా శ్రీ సునీత్‌కుమార ఛటర్జీ నాయకత్వమున నొక కమీషనును వేసినది. ఆ రిపోర్టు 1956 ప్రాంతమున పార్లమెంటులో చర్చకు వచ్చినది. ఆ రిపోర్టులో దక్షిణ భారతమున నొక సంస్కృత విశ్వవిద్యాలయము స్థాపింపబడవలయునని యున్నట్లు తెలియుచున్నది. ఇది క్రమముగా జరుగగలదని విశ్వసింపవచ్చును. శ్రీ పి. వి. జి. రాజుగారు 180 ఎకరములు 'చింతలవలస'లో విశ్వవిద్యాలయమునకు విరాళమిచ్చిరి. ఉత్తర భారతమున వారణాసిలో నొక విశ్వవిద్యాలయము నెలకొల్పబడి యున్నది (Teaching and affiliated University). 'దర్భాంగ' యందు మఱియొక విశ్వవిద్యాలయము నెలకొల్పబడినది (Teaching University). డాక్టర్ కరణ్‌సింగ్ గారి యధ్యక్షతను సెంట్రల్ బోర్డు ఆఫ్ శాస్క్రిట్‌ను ఏర్పఱచినది, ఇది సలహా సంఘము.

"కేంద్ర సంస్కృత విద్యాపీఠము" వేదములో ముఖ్యమైన భాగములను రికార్డు చేయుటకు తలపెట్టినది. ముఖ్యమైన అని యనగా నపురూపమైన యని యర్థము. డాక్టర్ వి.ఆర్. శర్మగారిని, భారత దేశములో నెచ్చటను కానరాక, విజయనగర సంస్థానాధీశుల పోషణము వలన మాత్రమే, ఆంధ్ర ప్రదేశములో మాత్రమే నిలిచియున్న — సామవేదములోని 'రాణాయన' శాఖలోని తామ్రపర్ణి ఘూర్జర పాఠములను శ్రీ సామవేదము నారాయణశాస్త్రి, గోపాలకృష్ణశాస్త్రి, గోవిందశర్మ గారలచే ఆకాశవాణి విజయవాడ కేంద్రములో రికార్డు చేయించుటకు నియోగించినది. వారాపనిని పూర్తిచేసినారు. అట్లే దేశములో మిగిలిన ప్రాంతములందును ఈ కార్యక్రమము చురుకుగా కొనసాగుచున్నది. ఈ విద్యాపీఠము సెంట్రల్ బోర్డు కంటె భిన్నమైన సంస్థ. ప్రభుత్వాదేశము పైననే యీ పనులు జరుగుచున్నవి.

ఆషాఢ పూర్ణిమ వ్యాస పూర్ణిమయే యైనను, దేశములో పలు తావుల శ్రావణ పూర్ణిమనాడు వేదపండితుల సత్కరించు నాచారమున్నది. కనుక శ్రావణపూర్ణిమను 'సంస్కృతోత్సవ దినము'గ (Sanskrit day) ప్రభుత్వము ప్రకటించినది. సెప్టెంబరు అయిదవ తేదీని 'టీచర్సుడే'గా నిర్ణయించి ప్రభుత్వము ఉపాధ్యాయులకు కొందఱకు పారితోషికముల నిచ్చు నేర్పాటు కావించినది. ఆ కార్యక్రమములో సంస్కృతోపాధ్యాయులను గూడ చేర్చిరి. శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారికి కా అవార్డు వచ్చినది.

అఱువదియైదు వత్సరములు దాటిన విశిష్ట విద్వాంసులకు యావజ్జీవ పారితోషికమును ప్రభుత్వ మందజేయుచున్నది. తొలుత ఈ పారితోషికము సంవత్సరమునకు పదునైదు వందల రూప్యములనియు నిప్పుడు మూడు వేల రూపాయలకు పెంచబడినదనియు తెలియుచున్నది. ఆంధ్ర ప్రదేశమున శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు, పేరి వేంకటేశ్వరశాస్త్రి, కొల్లూరి సోమశేఖరశాస్త్రి, శ్రీమాన్ పార్థసారథి ఆచార్యులు, కొమండూరి శఠకోప రామానుజాచార్యులు గారలీ బహూకృతి నందుకొనిరి.

ప్రభుత్వ 'మాకాశవాణి'ని సంస్కృత భాషా ప్రోత్సాహమున కాదేశించినది. ఇదివరలో 'ఆకాశవాణి'నుండి ఆచార్య పింగళి లక్ష్మీ

కాంతముగా అనేక సంస్కృత నాటకములను ప్రసారము చేయించి యున్నారు. ఉపన్యాసముల ప్రసారము చేయించియున్నారు. ప్రస్తుతము విజయవాడ కేంద్రమునుండి డాక్టరు జి. వి. కృష్ణారావుగారా కార్యక్రమమును నిర్వహించుచున్నారు. ఆదివారము నాడుదయము 'అమరవాణి' కార్యక్రమములను విజయవాడ హైదరాబాదు కేంద్రములు నిర్వహించు చున్నవి. హైదరాబాదులో శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు నిర్వహించినారు. ఆ 'అమరవాణి' ప్రసారములలో ఎన్నిక చేయబడిన ప్రసంగములే ఈ గ్రంథము. ఇవి విజయవాడ స్టేషనునకు సంబంధించినవి. ఇవి ప్రచురింప బడుటకు వ్రాతప్రతులనిచ్చి సహాయబడిన స్టేషన్ డైరెక్టరు, శ్రీ రఘురాం, శ్రీమతి సుభద్రాశ్రీనివాసన్, డాక్టర్ జి. వి. కృష్ణారావు ప్రభృతులకు మా కృతజ్ఞత. సమ్మతి నిచ్చిన ప్రసంగ కర్తలకు మా నమోవాకములు. ప్రస్తుత మాకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి సోమ, గురువార ములందు 'సంస్కృత పాఠము'లను ప్రసారము చేయుచున్నారు. గ్రంథకర్త లకు ధన సహాయము చేయుట, ప్రాచీనమైన పాఠశాలలకు నార్థికపు స్తోమ తును కల్పించుట, లైబ్రెరీలకు ప్రత్యేకమైన గ్రాంట్లు నిచ్చుట, ప్రచురణము నందని వ్రాతప్రతులను ముద్రించుటకు ధనసహాయము చేయుట మొదలైన యుత్తమకార్యము లెన్నిటినో కేంద్రప్రభుత్వము చేయుచున్నది. వాచస్పత్యమువంటి యుద్గ్రంథము లెన్నియో ప్రభుత్వ సహాయము వలన పాఠశాలలకును కళాశాలలకును లభ్యమైనవి.

## సంస్కృతము : ఆంధ్రప్రదేశ ప్రభుత్వము :

ఆంధ్రప్రదేశ ప్రభుత్వము కొంతకాలము సంస్కృత భాషకొరకు 'స్పెషల్ ఆఫీసరు'ను నియమించి సంస్కృత విషయముల విషయమున శ్రద్ధ వహించినది. ఆ పదవిని శ్రీ దప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు నిర్వహించి నారు. అంతటితో తృప్తిపడక ఆ పదవిని రద్దుచేసి "డిప్యూటీ డైరెక్టరు" పదవి నేర్పరచినది. దానిని శ్రీ శాస్త్రిగారే నిర్వహించుచున్నారు.

ప్రతి సంవత్సరము ఆరుగురు పేద పండితులను సత్కరించుటకు పూనుకొన్నది. వారికి వేయినూట పదియార్లును, వస్త్రములను రైలు ఖర్చు లును ఇత్తురు. గడచిన సంవత్సరము శ్రీ కుప్పా లక్ష్మావధానులు (ముదిలి

పట్టణము), శ్రీ విశ్వనాథ జగన్నాథ ఘనాపాఠి (రాజమండ్రి), శ్రీ పాలెపు నరసింహ ఘనాపాఠి (ధర్మపురి), శ్రీ అంకూరి వేంకటాచార్యులు (హైదరాబాదు), శ్రీ రామనాథ ఘనాపాఠి (తిరుపతి), శ్రీ తంగిరాల బాలగంగాధర శాస్త్రి (ఇరగవరం, పశ్చిమ గోదావరి జిల్లా) గారలందుకొనిరి. సంస్కృతాభివృద్ధికై డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారధ్యక్షులుగ, చివుకుల మార్కండేయ శాస్త్రిగారు కార్యదర్శిగ ఒక కమిషన్ వేసినది. అందు శ్రీయుతులు ఆర్యేంద్ర శర్మ, పేరి వేంకటేశ్వరశాస్త్రి, జటావల్లభుల పురుషోత్తము, యస్.టి.పి.వి. కూర్మాచార్యులు, కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి ప్రభృతులు సభ్యులు. వారు పర్యటనము చేసి వివిధ కేంద్రములలో నస్మదాదులను విచారించి యొక రిపోర్టును తయారుచేసిరి. యస్.యస్.యల్.సి. వఱకును తెలుగు రెండవ భాగములో (Part-2 Telugu) సంస్కృతమును నిర్బంధము చేయవలెనని యభిప్రాయ పడినట్లు తెలియుచున్నది. ఇపుడు పార్టు 2-లో స్పెషలు తెలుగు గాని, మఱియొక భాషగాని చేర్పదగియున్నది. ఆ రిపోర్టు ప్రస్తుతము ప్రభుత్వ పరిశీలనములో నున్నది. అది యామోదింపబడినచో సంస్కృత విద్యకు మేలు జఱిగినట్లు భావింపవచ్చును.

## సంస్కృత కళాశాలలు :

ఆంధ్ర రాష్ట్రము సంయుక్త మద్రాసు రాష్ట్రములో భాగముగ నున్నప్పుడు ప్రెసిడెన్సీ కాలేజిలోని సంస్కృతాధ్యాపకులైన యస్. కుప్పుస్వామి శాస్త్రిగారు శాస్త్ర పండితుల విద్యను నిలుపు నిమిత్తము ప్రభుత్వమునకు చేసిన సూచనల ననుసరించి సంస్కృత కళాశాల లేర్పడినవి. దేశభాషాధ్యయనముకూడ నందుండుటచే వానిని ఓరియంటల్ కళాశాలలని పిలువ జొచ్చిరి. ఆంధ్రాయూనివర్శిటి పరియాలో (1) M. R. గవర్నమెంటు శాన్స్క్రిట్ కాలేజి (విజయనగరము) (2) S. V. J. V. సంస్కృత కళాశాల (కొవ్వూరు) (3) K.L.N. సంస్కృత కళాశాల (తెనాలి) (4) శారదా నికేతనము (స్త్రీల కళాశాల, గుంటూరు) (5) నారసింహ సంస్కృత కళాశాల (చిట్టిగూడూరు – మచిలీపట్టణము దగ్గఱ) (6) ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల (స్త్రీల కళాశాల, రాజమహేంద్రవరము) (7) శ్రీ భావనారాయణ స్వామి సంస్కృత కళాశాల (పొన్నూరు – గుంటూరు జిల్లా) (8) శ్రీ మార్కండేయ సంస్కృత

కళాశాల (ఆగిరిపల్లి - కృష్ణా జిల్లా), (9) మ్యునిసిపల్ ఓరియంటల్ కళాశాల (విజయవాడ). (10) చల్లపల్లి రాజేశ్వరి సంస్కృత కళాశాల (మోడేకుఱ్ఱు - తూర్పు గోదావరి జిల్లా), (11) గౌతమీ విద్యాపీఠ సంస్కృత కళాశాల (రాజమహేంద్రవరము), (12) కె.వి.కె. సంస్కృత కళాశాల (గుంటూరు), (13) ఓరియంటల్ సంస్కృత కళాశాల (భీమవరము - పశ్చిమ గోదావరి జిల్లా), (14) ఓరియంటల్ కళాశాల (ముక్కామల - తణుకు వద్ద), (15) లాల్‌బహాదూర్ శాస్త్రి ఓరియంటల్ కళాశాల (చిననింద్రకొలను - తాడేపల్లిగూడెము దగ్గర), (16) S R.K. ఓరియంటల్ కళాశాల (నరసారావుపేట), (17) శ్రీ గోగినేని కనకయ్య ఓరియంటల్ కళాశాల (తాడికొండ - గుంటూరు జిల్లా), (18) శ్రీ బాలసరస్వతీ ఓరియంటల్ కళాశాల (స్త్రీల కళాశాల తణుకు - పశ్చిమ గోదావరి జిల్లా), (19) సంస్కృత కళాశాల (పోడగట్లపల్లి - క్రొత్తపేట తాలూకా - తూర్పు గోదావరి జిల్లా) గుర్తింపబడిన కళాశాలలు. ఇంకను గుర్తింప వలసియున్న కళాశాలలు (1) ఏలూరులోని శ్రీ చింతలపాటి బాపిరాజు సంస్కృత కళాశాల. (2) కాకినాడలోని పైండా వేంకటనారాయణ సంస్కృత కళాశాల, (3) రేపల్లెలోని సెటుకానౌక సంస్కృత కళాశాల.

విజయనగరము, కొవ్వూరు, తెనాలి, చిట్టిగూడూరు, రాజమండ్రి (స్త్రీలు, పురుషుల కళాశాలలు), పొన్నూరు, ఆగిరిపల్లి, మోడేకుఱ్ఱు, గుంటూరు (పురుషులు), భీమవరము, ముక్కామల, చిన నింద్రకొలను, నరసారావుపేట, తాడికొండ, తణుకు (స్త్రీలు) కళాశాలలో అలంకార శాస్త్రము బోధింపబడుచున్నది. విజయనగరము, కొవ్వూరు, చిట్టిగూడూరు, రాజమండ్రి (పురుషులు), భీమవరము కళాశాలలలో వ్యాకరణ శాస్త్రము బోధింపబడుచున్నది. కొవ్వూరు, చిట్టిగూడూరు కళాశాలలలో న్యాయ శాస్త్రము బోధింపబడుచున్నది. కొవ్వూరులో మీమాంసా శాస్త్రము, తెనాలిలో నద్వైత వేదాంత శాస్త్రము బోధింపబడుచున్నది. కొవ్వూరులో పి.ఓ.యల్. పరీక్షకును బోధనము కలదు. శ్రీ గద్దె పూర్ణచంద్రరావు అగ్రాసనతను విజయవాడ పురపాలక సంఘము శాస్త్రబోధనమును విజయవాడ కళాశాలలో నేర్పాటు చేయుటకు తీర్మానించినది.

ఈ కళాశాలలలో ప్రభుత్వమువారు నడుపు కళాశాల విజయనగరములో నున్నది. మ్యునిసిపాలిటీ వారు నడుపు కళాశాల ఒక్క విజయవాడలోనే యున్నది. పురపాలక సంఘములు కళాశాలలను నిర్వహించుటకు చట్ట మొప్పదు. 'హైదరాబాదు హిందీ ప్రచారసభ'వారు తామంతకుముందు విజయవాడలో నడుపుచున్న సంస్కృత కళాశాలను మూసివేయవలెనను అభిప్రాయమునకు రాగా, నప్పటి పురపాలక సంఘాధ్యక్షులైన డాక్టర్ జంధ్యాల దక్షిణామూర్తి గారి కీకళాశాల నిర్వహణ బాధ్యతను స్వీకరింప వలసినదిగా నే నభ్యర్థించితిని. వారు శ్రీ సిరిపురపు కోటేశ్వరరావు గారితో సంప్రదించి యీ నిర్ణయమును తీసికొనిరి. ఈ సందర్భమున నప్పటి విద్యామంత్రి శ్రీ బలుసు ప్రభాకర పట్టాభిరామారావు గారును మ్యునిసిపల్ వ్యవహారాల మంత్రి శ్రీ దామోదరము సంజీవయ్యగారును సహకరించి రొక ప్రత్యేకపు టుత్తరువు మూలమున మ్యునిసిపాలిటీకి 'సభ'నుండి మానేజిమెంటు బదిలీకంగీకరించిరి. ఈ విశ్వవిద్యాలయమున 'విద్యా ప్రవీణ' యనుబడునది శాస్త్ర విషయకమగు పరీక్ష. 'భాషాప్రవీణ' యనబడునది శాస్త్ర విషయములు సంస్కృత భాగములో కొన్ని బోధింపబడినను ప్రధానముగ నాంధ్రభాషను సంబంధించిన పరీక్ష. ఈ పరీక్షలలో 'క్లాసు'లతో పరీక్షలో నుత్తీర్ణులయినవారు కళాశాలలో కూడా ఉపన్యాసకులుగా పనిచేయుట కర్హులు. వీరి వేతనమప్పుడు యమ్. ఏ. పాస్సయిన వారితో తుల్యముగనే యుండును. భాషాప్రవీణను 'ఎడ్మిషన్' పరీక్షను యూనివర్సిటీ వారే నిర్వహించుచున్నారు. విద్యా ప్రవీణకు ప్రవేశ పరీక్షను, 'ఎంట్రెన్సు' అనుపేరుతో గవర్నమెంటువారే నిర్వహించుచున్నారు. ఆ పరీక్షగాని, O.S.S.L.C. గాని పరీక్ష అయినవారు భాషా ప్రవీణ తరగతుల చదువవచ్చును. "ప్రిలిమినరీ" రెండు సంవత్సరములు కాగా నొక పరీక్షయుండును. దానిలో నుత్తీర్ణులయినవారు 'ఫైనలు' రెండు సంవత్సరములు చదివినచో కోర్సు పూర్తియగును. ప్రిలిమినరీలో నొక భాగము పోయినను, ఫైనలు చదువుచు నా భాగమును పూర్తిచేసికొనుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువా రవకాశమును కల్పించినారు. ప్రిలిమినరీ, ఫైనలు పరీక్షలలో నొకభాగమును పూర్తిచేసికొనుట కవకాశముండినట్లుల ఎడ్మిషన్ పరీక్షలో నవకాశము లేదు. దానిని పూర్తిగా పాస్సు

కావలసినదే. ఎడ్మిషన్ పరీక్షకు రెండు ప్రశ్న పత్రములు సంస్కృతములోనను, మూడు పత్రములు తెలుగులోనను ఉండును. ప్రిలిమినరీ పరీక్షకును అట్లే యుండును. ఫైనలులో నాల్గు పత్రములు ఆంధ్రమునను, ఒక్క పత్రము సంస్కృతమునను ఉండును. ఆ పత్రము సంస్కృత వ్యాకరణమునకు సంబంధించినది. ఎడ్మిషన్ పరీక్షలో మాత్రము సంస్కృత ప్రశ్నములకు సమాధానము తెలుగులో వ్రాయవచ్చును. పై పరీక్షలకు వీలులేదు. పి.ఓ.యల్. పరీక్ష, ఒక్క విషయముపై నిష్ణాతృత్వమునకు సంబంధించినది (Proficiency in oriental languages). ప్రిలిమినరీ పరీక్షయైన వారాపరీక్షకు వెళ్లవచ్చును. ఆంగ్లములో నా పరీక్ష నిర్వహింపబడును. దానిని పరీక్షయైన పిదప దానికి సంబంధించిన విషయముపై థీసిస్' ఆంగ్లము చేసిన వారికి M.O.L. డిగ్రీ నచ్చును. 'బి.ఓ.యల్.' పరీక్షలను ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు నిర్వహించుటలేదు.

శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ పరిధిలో, వేదసంస్కృతకళాశాల (మూలపేట, నెల్లూరు), శ్రీ భీమేశ్వర సంస్కృత కళాశాల (వాడాడు), S. M. S. సంస్కృతకళాశాల (ప్రొద్దుటూరు–కడపజిల్లా), శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాల (తిరుపతి) కలవు. ఈ యూనివర్సిటీలో 'ఎ' విద్వాన్, "బి–విద్వాన్," "శిరోమణి" పరీక్షలు జరుపబడుచున్నవి. 'ఎ'–విద్వాన్ పరీక్షకు మూడు ప్రశ్నపత్రములు సంస్కృతమునను, మూడు ఆంధ్రమునను ఉండును. ఎంట్రెన్సు పరీక్ష అయినపిదప ప్రిలిమినరీ రెండు సంవత్సరములు, ఫైనలు రెండు సంవత్సరములు చదువవలసియున్నది. ఈ డిగ్రీ పొందినవారు సంస్కృతమునను ఆంధ్రమునను అధ్యాపకులుగ నుండవచ్చును. బి–విద్వాన్ పరీక్షకు అయిదు ప్రశ్నపత్రము లాంధ్రమునను, ఆరవపత్రము సంస్కృతమునను ఉండును. వీరాంధ్రపండితులుగ పనిచేయుటకర్హులు. దీనికిని ఎంట్రెన్సు పరీక్ష ప్యాసు కావలసియున్నది. 'శిరోమణి' పరీక్ష శాస్త్రములకు సంబంధించినది. మీమాంస, వేదాంత, న్యాయ, వ్యాకరణ, సాహిత్యములలో పరీక్షలు జరుగును. దీనికిని ఎంట్రెన్సు పరీక్ష ప్యాసు కావలసిన అవసరమున్నది. తిరుపతి కళాశాలలో వేద – మెట్రిక్, శాస్త్ర – మెట్రిక్ వేద – పి. యు. సి., శాస్త్ర – బి. ఎ. మొదలైన కోర్సులుకలవు. నెల్లూరు, ప్రొద్దుటూరు, వాడాడు కళాశాలలలో శాస్త్రిగారులు బోధింపబడుచున్నవి.

ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిధిలో S.V.S.A. కళాశాల (వరంగల్), S. V. S కాలేజి (పాలెం, మహబూబునగర్ జిల్లా), ఓరియంటల్ ఈవినింగ్ కాలేజి (కొడంగల్, మహబూబు నగరుజిల్లా), ఓరియంటల్ ఈవినింగ్ కాలేజి (జడ్చెర్ల- Unaided-మహబూబునగర్ జిల్లా), S. L. N. S. తెలుగు కళాశాల (ధర్మపురి కరీంనగరము జిల్లా), గీతా విజ్ఞాన సమితి సంస్కృత కళాశాల (నల్గొండ), S. L. N. S సంస్కృత కళాశాల (యాదగిరిగుట్ట - భువనగిరితాలూకా, నల్గొండజిల్లా Unaided), వేదాంతవర్ధనీ సంస్కృత కళాశాల (హైదరాబాదు), ఆంధ్రా ఓరియంటల్ కాలేజి (నల్లకుంట, హైదరాబాదు) - కలవు. ఈ విశ్వ విద్యాలయ పరిధిలో బి. ఒ. యల్. డిగ్రీ పరీక్షలు నడుపబడుచున్నవి. మిగిలిన విశ్వ విద్యాలయములలో ప్రిలిమినరీవలె, ఇందు డిప్. ఒ. యల్ పరీక్షకలదు. ఈ పరీక్షలకును ఎంట్రెన్సు పరీక్ష పాసు కావలెను. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు నడుపు తెలుగు - విశారద పరీక్షను కూడ ఈ డిగ్రీకి ఎంట్రెన్సు పరీక్షగా యూనివర్సిటీవారు గుర్తించినారు. తెలుగు - బి. ఒ. యల్. కు సంస్కృతముపై ప్రశ్నపత్ర మొకటి యుండును. సాహిత్య, న్యాయ, వ్యాకరణ, అద్వైత వేదాంత శాస్త్రములందు బి. ఒ. యల్. పరీక్షలను నిర్వహించుచున్నారు. వరంగల్, పాలెం, హైదరాబాదు (వేదాంత వర్ధనీ కళాశాల) లలో శాస్త్రి బోధనము జరుగుచున్నది. ఈ యూనివర్సిటీలో యమ్. ఒ. యల్. డిగ్రీ కూడ కలదు. మూడు యూనివర్సిటీల సంస్కృత కళాశాలల పరీక్షలను నొక విధానము ననుసరించి క్రమబద్ధము చేయవలయునని యొక ప్రయత్నము జరుగుచున్నది.

ప్రభుత్వ సహాయమునుపొందు ఓరియంటల్ ఎలిమెంటరీ స్కూళ్లు 22, ఓరియంటల్ అప్పర్ ప్రైమరీ స్కూళ్లు 8, ఓరియంటల్ సెకండరీ స్కూళ్లు 54, సంస్కృత పాఠశాలలు 10, ఓరియంటల్ కళాశాలలు 35 ఉన్నవని తెలియుచున్నది. ఈ సంఖ్యలో సంస్కృతమే కాక దేశీయ భాషలను బోధించునవియును కలవు.

ఇదివఱలో సంస్కృత కళాశాలల అధ్యాపకుల జీతముల కయిన ఖర్చులో మూడింట రెండువంతులు ప్రభుత్వము భరించెడిది. మూడవ వంతు మానేజిమెంటు భరించెడిది. శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారి ప్రభుత్వము

పూర్తి ఖర్చు భరించుటకు తీర్మానించి యమలు జరుపుచున్నది. ఇదివరలో సంస్కృత కళాశాలల అధ్యాపకుల వేతనములు ఆ కళాశాలలో చదివి ప్యాసయిన విద్యార్థులు హైస్కూలులో మొదటిగ్రేడ్ పండితులుగా నియమింపబడినప్పుడు వారికివచ్చు వేతనముకంటె తక్కువగా నుండియుండెడిది. కాని ప్రభుత్వము క్రమక్రమముగ వేతనములు పెంచినది. ప్రస్తుత సంస్కృత కళాశాలాధ్యాపకులకు యు. జి. సి. స్కేళ్లు లభించుచున్నవి. అనగా ఒకప్పుడు 75 రూప్యములు వచ్చిన వారికిప్పుడు 250 రూప్యములు బేసిక్ జీతముగ వచ్చుచున్నది. ఇది సంతోషింపవలసిన విషయమే కాని, ఆక్సిడెంటల్ కళాశాలలలోని ట్యూటరు జీతమునకు గల లెక్చరరు జీతము సమానమైనది. క్రమముగ నాంగ్ల కళాశాలలవారితో సమానముగ వేతనము సరిచేయబడునని యాశింపవచ్చును. యు. జి. సి. వారు ఎనుబది శాతము ఈ ఖర్చును భరింపగా ప్రదేశ ప్రభుత్వములు ఇరువది శాతము భరించుచున్నవి. శ్రీ పట్టాభిరామారావుగారు విద్యామంత్రిగ నున్నప్పుడు బి. ఏ. తెలుగు తీసికొని ప్యాసయిన అధ్యాపకులు, సంస్కృతము కూడ ప్యాసయినచో, మూడు ఎడ్వాన్సు ఇంక్రిమెంట్లు నిచ్చునట్లుత్తరవు లిచ్చిరి. అది కొంతకాల మమలులో నున్నది. ప్రభుత్వ మింకను సంస్కృతభాషాభివృద్ధి చేయవలసిన ఆవశ్యకత కల్పించుచున్నది.

## సంస్కృతము: ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ :

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ తన పరిధిలో తన ధర్మమును సంస్కృతభాషా విషయమున నెరవేర్చుచున్నది. సంస్కృత భాషాభివృద్ధికే యే కృత్యములు చేయవలెనో సూచించుటకొక సలహా సంఘము నేర్పాటు చేసినది. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారిచే సంస్కృతీకరింపబడిన కళాపూర్ణోదయమును ప్రచురించినది. శ్రీ కుంటిమద్ది శేషశర్మగారిచే సంస్కృతములోనికి పరివర్తింపబడిన మనుచరిత్రమును ప్రకటించినది. విజయనగరాధీశ్వరులు శ్రీ కృష్ణదేవరాయ ప్రణీతంబయిన సంస్కృత గ్రంథము జాంబవతీ పరిణయమును ప్రకటించినది. ఈ గ్రంథము వెలువడుటకు హేతుభూతులు డాక్టర్ బి. రామరాజుగారు. శ్రీ వెల్లాల ఉమామహేశ్వర పండితులు రచించిన శృంగారశేఖర భాణమును ప్రకటించినది. సుమతీ శతకము మొదలైన పది శతకములను ఎస్.టి.వి.

వరదాచార్యులు సంస్కృతీకరింపగా వానిని శతక సంపుట మనుపేర ప్రకటించినది. శ్రీ సన్నిధానము సూర్యనారాయణగారు రచించిన "ఆంధ్ర దేశ హాస్యకథ"లను ప్రకటించినది. శ్రీ స్వామి శివశంకరస్వామి, ఆచార్య పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారల సంపాదనమైన కావ్యస్వరూపమును (ఆంధ్ర వివరణ సమేతము) ప్రకటించినది. శ్రీమాన్ తిరువేంగళాచార్యులు, ధరణికోట వెంకటసుబ్బయ్యగారల రసగంగాధరాంధ్రీకృతిని ప్రకటించినది. శ్రీ నేలటూరి రామదాస అయ్యంగార్ గారి "యుత్తర రామ చరిత్ర వ్యాఖ్య"ను ప్రకటించినది. శ్రీ రప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు సంపాదించిన 'స్తోత్రలహరి' (శివానందలహరి, సౌందర్యలహరి మన్నగునవి)ని ప్రకటించినది.

సొంతముగా తమ గ్రంథములను ప్రకటించుకొనువారికి ధన సహాయము అకాడమీ చేయుచున్నది. శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి (తెనాలి) గారు రచించిన మధురావిజయ వ్యాఖ్యకును, శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు నాగరలిపిలో ప్రకటించిన "శ్రీకృష్ణలీలాతరంగిణి"కిని, శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారి "వృత్తివిచారము"నకును. శ్రీకోగంటి సీతారామాచార్యుల పద్మావతీ చరణ చారణచక్రవర్తి సంస్కృతీకరణమునకును, శ్రీ వి. హెచ్. సత్యనారాయణగారి దాశరథీశతక సంస్కృతీకరణమునకును, శ్రీ వి. కృష్ణమూర్తి శాస్త్రిగారి 'ఆదికావ్యావతారము'నకును, డాక్టర్ బొమ్మకంటి రామలింగశాస్త్రిగారి గాంధీచరిత్రమునకును, S. A. P. Y. దీక్షితులుగారి పద్మావతికిని ధనసహాయము చేసినది. సంస్కృతభాషలో చమత్కారకావ్యములు రచించిన శ్రీ బచ్చుసుబ్బరాయగుప్తగారికి ధనసహాయ మందించినది,

శ్రీ మామిడి వేంకటార్యులు సంస్కృతము- తెలుగు నిఘంటు వొకదానిని పెద్దదిగా రచించిరి. శ్రీ పరవస్తు రామానుజస్వామిగారు సంస్కృతము- తెలుగు నిఘంటువును రచించెనందురు. అదియు నుపలబ్ధ మగుట లేదు. తెలుగు-సంస్కృతము నిఘంటువు నొకరెవరో యొకరు రచించిరని తెలియును కాని ప్రాతపుస్తకముల షాపులో నేనుకొనవలెననుకొనులోపుగా నెవ్వరో దూసికొనిపోయిరి. కాగా తెలుగు-సంస్కృతపు నిఘంటువు శ్రీ కాశీ కృష్ణాచార్యులు రచించిన చిన్నపొత్తము తప్ప వేరేదియులేదు. కాగా తెలుగు విద్యార్థు లనువాదసందర్భమున సహాకరించు గ్రంథ మాంధ్ర

ములో లేదనుకొనుచున్నారు. అట్టి నిఘంటువును ప్రకటింపవలెనను నా సూచనకు అకాడమీవారు సమ్మతించిరి. తెలుగు పదములకు సంస్కృతపద ములను సూచించు నిఘంటువును తయారుచేయుపనిని శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారికిని శ్రీ పుల్లెల రామచంద్రుడుగారికిని అప్పగించినారు. ఆ పని సాగియున్నది. శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారి నైషధవ్యాఖ్యా ప్రచురణ కార్యక్రమమును సాగుచున్నది. ఆ రెండుగ్రంథములును వెలు వడనున్నవి. అమూల్యములైన 'అమరవాణీ ప్రసారము'లను గ్రంథస్థము చేయవలసిన అవశ్యకతను నేనుసూచింపగా నంగీకరించి యీపనిని నిర్వర్తించు టకు అకాడమీవారు నాకే యప్పగించిరి. తొలిగా విజయవాడ కేంద్రమున ప్రసారమైన యుపన్యాసవ్యాసముల సంకలనము చేయుటకు అకాడమీ నిశ్చ యించినది. ఆ గ్రంథము వెలుగుచూచుచున్నది. కాగా అకాడమీవారు సంస్కృత భాషయందు నాదరమే చూపుచున్నారనుట స్పష్టము.

## మొదటి వ్యాసము :

ఈ గ్రంథమున 'భారతీయ సంస్కృతి యేకత్వము' అనునది మొదటి వ్యాసము.

ఇందు ఆర్యద్రావిడసంస్కృతులనెడి రెండు సంస్కృతులున్నవనియు, దాని సమ్మేళనమే భారతీయ సంస్కృతి యని చెప్పబడు వాదము నిరాక రింపబడి, భారతీయ సంస్కృతి యొక్కటే యను సంగతి ముద్ఘాటింప బడినది. సమయాభావముచే సూత్రప్రాయముగనే యీ విషయము వ్రాయబడి నది. నేటిచరిత్రకారులయభిప్రాయమునకిది భిన్నమైనది కాన దీని సామంజస్య మును సవిమర్శముగ చర్చింపవలసియున్నది. ఆర్యద్రావిడులీదేశమువారా? బహిర్దేశములవారా? వారి భాషలస్వరూపమేమి? పాశ్చాత్యులచేత చెప్ప బడు ద్రావిడజాతివంటి జాతి కలదా? ఈసందర్భమున మన ప్రాచీనగ్రంథము లేమి చెప్పుచున్నవి ? పాశ్చాత్యపండితు లెల్లిందుల కభిప్రాయపడిరి? మొదలగు ప్రశ్నము లెన్నియో యుదయించును. వీనికి సమాధానము సంగ్రహ ముగను సమగ్రముగను చెప్పినగాని, నేడు మన విద్యాలయములలో తరిఫీదు పొందు విద్యార్థులు సంతృప్తి నొందరు. వారు చదివెడి పుస్తకములలో విషయము వేరువిధముగనుండును. అదియునుగాక నేటి భారతదేశమునకై క్యము (నేషనల్ ఇంటెగ్రిటీ)ను గూర్చి ప్రభుత్వము విశేషప్రద్ధాకర్తలు చెప్ప

ఉచుచున్నందునను, ఈ విషయమందలి చర్చ దానికి మఱింత తోడ్పడునను అభిప్రాయముకూడ విషయవివరణమునకు పోతును.

## ఆర్యులు : పాశ్చాత్యుల అభిప్రాయములు :

ఆర్యులనువారు భారతదేశ బహిర్భాగములనుండి యీ దేశమునకు వచ్చిరని పెక్కురాంగ్ల చరిత్రకారులు, వారి ననుసరించిన కొందఱు మన చరిత్రకారులును వ్రాసియున్నారు. "Tomaschech and others are for Eastern Europe. A few such as Von Lohar etc are for Germany. Frederic Muller, Cuno etc are for Central Europe, Linden, Schimidt and others for Northern Europe; Penka argues that Scandinavia was the cradle of the whole of Aryan race; while Posche maintains that the Aryan race originated in the great Rokitino Swamps" (The paradise or the cradle of the Aryan race at the North pole - by Dr. Warren). ఆర్యుల తొలి నివాసమును పరి పరి విధములుగ పై వారు చెప్పగా డాక్టర్ వారెన్ ఉత్తర ధ్రువమనెను. ఈతనికి పూర్వమే 'సపోర్టా' అను ఫ్రెంచి పండితుడు Origin of the Human race అను గ్రంథమున నా యభిప్రాయము వెలువరించియుండెను. పై రెండు గ్రంథముల ప్రభావము వలన తిలక్ మహాశయులు "ఆర్కిటిక్ హోమ్" అను గ్రంథమును రచించి ఋగ్వేదములోని కొన్ని మంత్రములను కూడ నుదాహరించిరి. "The home of the ancestors of the Vedic people was some-where near the North pole before the glacial Epoch" అని వారభిప్రాయపడిరి. వీరి యభిప్రాయమును మాక్సుముల్లరుగారికి పంపగా వారు దానితో నేకీభవింపలేదు. మాక్సుముల్లరు తొలుత నార్యులు మధ్య ఆసియాకు చెందిన వారని ప్రచారము చేసినను, పిదప దానిని మార్చుకొని యార్యావర్తమునకే చెందిన వారని నిర్ణయము చేసికొనెను. ఆర్యులు మధ్య ఆసియాలోని ఆక్సస్ జాక్సర్టిస్ నదులమధ్య ప్రదేశము వారని తొలుత పలికినది 'లాసెన్' గారు. ప్రొఫెసర్ 'స్పీగల్' తన 'అవెస్థా'లో దానికి బలము చేకూర్చిరి. ప్రొఫె

సర్ మెగల్, జన్సన్ గారలు వీరి వాదముతో నేకీభవించిరి. పై వాదములకు వారి యూహాలే ప్రమాణము. ఎప్పుడో ఆర్యు లుత్తర ధ్రువమున నుద్భవించినట్లును, మంచు తుపానుచే నా స్థావరము పాడయిపోయి జర్మనీ, రష్యా, ఆర్యావర్తము మొదలైన నానాదేశములకు పోయినట్లును, మంచు తుపానుచేత నది పాడుగాక పూర్వమున్న ప్రదేశమునుగూర్చి వారి పూర్వులచే రచింపబడినవి సూక్తములై ఋగ్వేదములై, దీర్ఘ ఉషస్సు, దీర్ఘరాత్రి, దీర్ఘ దివమును వర్ణించిన వనియు, నుత్తర ధ్రువమే స్వర్గమనియు, నదే యార్యుల జన్మభూమి యనియు తిలక్ గారి వాదసారాంశము. ఈ వాదములోని ప్రథమ దోషము వేదములు మానవ నిర్మితములనుట. 'నకశ్చిద్వేద కర్తాచ' అని పరాశరస్మృతి వచనము. రెండవ దోషము ఉత్తర ధ్రువమును స్వర్గమనుకొనుట. మంచు తుపానుచే పోయిన స్వర్గ మేమి స్వర్గము? అచ్చటి రంభాదు లేమయిపోయినట్లు? స్వర్గకాములై యార్యులు యజ్ఞ మాచరించునప్పుడు, స్వర్గములోనుండి యజ్ఞముచేయు టెట్లు పొసగును? శాస్త్రములును పురాణములును సృష్టిని 195 కోట్ల (పై చిల్లర) సంవత్సరములుగా చెప్పుచుండ, వారు ఆలు వేల సంవత్సరములకుపూర్వము మాత్రమేనని వేదముల వయస్సును నిర్ణయించుటమూడవ దోషము. నాల్గవ దోషము ప్రొఫెసర్ 'రాత్' మొదలైన వారిచే తన జాతీయ సంప్రదాయము మార్చుకొనబడిన దనబడిన వెండిదాడ్ (విదేవోదాత) అను గ్రంథమును కొంతవరకైనను ప్రమాణముగా గ్రహింపకపోవుట. సోమయాగమున కాధారభూతమైన సోమలత ఆర్యావర్తమునగాక ఉత్తర ధ్రువమున పెరుగదని గుర్తింపక పోవుట అయిదవ దోషము (చూ- ఆర్యుల ఉత్తరధ్రువ నివాస ఖండనము - శ్రీ కోట వెంకటాచలము). ఈ మధ్య 21-2-69 న ఢిల్లీకి వచ్చిన శ్రీ "బోబోజాన్ గఫురోవ్" ఆర్యులు మధ్య ఆసియానుండి ఇండియాకు వచ్చినారని యొకపత్రికా సమావేశములో చెప్పిరి. Addressing a news conference Dr. Gufurov who led two Soviet delegations to the recentely concluded UNESCO conference on Central Asia and the Ghalib Century celebrations said "as far as we can judge, Aryans were nomadic people travelling in

Central Asia....It is difficult to establish the exact date and time of ihe comming of Aryans to India since a lot of archaelogical data needed for the purpose is not available yet" (Indian Express 22-2-69). తగిన ఆధారములు లభింపకపోయినను సోవియట్ పండితుడు, ఆర్యులు మధ్య ఆసియానుండి వచ్చినారని నిర్ణయించి వైచెను. ఈ విధముగ నిరాధారమైన ఊహాలతో, ఆర్యులు ఆర్యదేశమునకే వైదేశికులని, వైదేశికులు నిరూపింప యత్నించు చున్నారు.

## స్వదేశీయుల అభిప్రాయములు :

### శ్రీ యన్. వి. శేషగిరిరావుగారిట్లభిప్రాయపడుచున్నారు :

"తమ అధిపత్యమును నిలుపుకొనుటకై ఆర్య నాగరకత ప్రాచీనమైనది కాదని పాశ్చాత్యులని రనునది పరమసత్యము. మనల నణచుటకు మన చరిత్రకు మసిపూసి ఉగ్గుపాలతో పట్టించుటకు వారు తాపత్రయపడిరి. ప్రముఖ చరిత్రకారుడుగా పేరు గడించుకొనిన 'వి.ఎ. స్మిత్' ఇండియన్ సివిల్ సర్వీసునకు సంబంధించినవాడు. అహంకారముతో నతడన్న మాటల గమనించినచో చరిత్ర సంతవఱకు నిష్పాక్షికముగ వ్రాసెనో విదిత మగును. "Such was India and such it always has been till the British established as stable order." భారత చరిత్రను వ్రాయుటకు ప్రయత్నించిన రెండవ ముఠా క్రైస్తవ మిషనరీలు. వీరిలోముఖ్యుడుకాల్డ్వెల్. ఇంకను హెన్రీహెరాన్ మొదలగువారున్నారు. దాదాపు 48 ఉద్గ్రంథములను రచించిన 'మాధవ విద్యారణ్యస్వామి'ని అసలు లేనేలేడని శ్రీ హెరాన్ వాదించును." (ఆర్యుల తొలి నివాసము భారత దేశమే - భారతి, ఏప్రియల్ 1961)

### శ్రీ ఐటావల్లభుల - ఇట్లభిప్రాయపడుచున్నారు.

"ఫైలాలజీ యను భాషా శాస్త్రమునకు మూల పురుషుడైన 'అడెలంగ్' పండితుడు 'ఇండోయూరోపియన్' అనునది వైదిక భాషయే కాని మఱొకటి కాదని కంఠోక్తిగా చెప్పినాడు. భారత దేశమే ఆర్యుల ఆదినివాసమనియు, ఆదిలో విశేషముగ కాశ్మీరులోనే యార్యులు చిర కాల

నుండి తరువాత భారత దేశములోని యుత్తర ప్రాంతములకు వ్యాపించి నారని యాతడు భావించినాడు. "మిర" యనగా వైదిక భాషలో సరస్సు. కశ్యపుని పేరనుండిన సరస్సు కాశ్యప సరస్సు. ఆ సమీప ప్రదేశమే కాశ్మీరమని అడెలాంగ్, లక్ష్మీధరకల్లా మున్నగు విద్వాంసు లభిప్రాయపడిరి. భారతీయార్య భాషనుండియే అన్ని ఇండో యూరోపియన్ భాషలు బయలు వెడలినట్లు, భారతదేశము నుండియే యార్యులు ప్రపంచములోని వివిధ ప్రాంతములకు వెడలిరనియు, దీనిని తలక్రిందుచేసి యార్యులు పైనుండి యిటకు వచ్చిరనుట సమర్థింపదగినది కాదనియు నానాటికి జరుగుచున్న గవేషణము వలన తెలియుచున్నది (ఆర్యుల ఆది నివాసము భారత దేశమే - ఆంధ్ర పత్రిక హేమలంబ సంవత్సరాది సంచిక).

*మిసెస్ భారతీమాలో (భువనేశ్వర్) గారిట్లు వ్రాసిరి :*

"I think in the annals of world histroy, there is no event, more mysterious and doubtful than the so-called 'Aryan Invasion of India'. All our text books begin with the statement that Aryans 'invaded' India at a particular time, although, so far as I can see, there is no particular and dependable evidence to sustain the view. I beleve Aryans belonged to this country and they never came from anywhere else and that the malicious divison of our Nation into Aryan and Dravidian is just the result of an attempt of the foreigners to disprove the antiquity of our civilisation and culture and to divide us politically. Since the Bible says that the world was created about 8000 years ago, the Christian scholars have always tried to fit the whole human history into that period and since this country was conquered by Europeans, it hurts the latter's ego to accept that a slave nation could have a culture and civilisation more ancient and glorious than theirs. It is a pity, England herself could not trace her history to a period which could enable her to call hereself more 'ancient' than India and accordingly it has tried to prove that the Greeks, the Romans, and even the Egyptians had a longer history than Indians. No attention is even paid to our indigenous

sources of history - a study of which has also been hampered by the vandalism of some marauders *who burnt libraries* and centres of learning containing priceless literary wealth that cry hoarse that it was the country which saw the first light of human civilisation" (Indian Express, March 1968).

నాగరిక లోకముకూడ ఈ వాదముపట్ల ఎంత కోపగించుకొనుచున్నదో పై వాక్యములవలన తెలియనగును. మన గ్రంథము లనేకములు విధ్వస్తము లగుటవలన మన చరిత్ర కొంత మఱుగునబడిన దనవచ్చును. "సృష్టి కాల నిర్ణయాధారములను మూర్ఖులెంత క్రూరముగ విధ్వంసముచేయ నారంభించినను ఇప్పటికిని చాలినన్ని మిగిలియున్నవి. ఈ విషయమును శ్రీ దయానంద సరస్వతీస్వామి "వేదముల నవతారిక" యను దానిలో విపులముగ చర్చించిరి. బెరల్లీ వాస్తవ్యుడైన రివరెండు స్కాటుతో చాందపురములో ఈ నిర్ణయమును గూర్చి వాదమునుకూడ సలిపియుండిరి. (చూ - ఆర్య దర్పణము–మార్చి, 1880 (క్రీ. శ.) పుటలు 67–68)" అని శ్రీ హారవిలాస శారదా F.R.S.L. గారు 'హిందూ సుపీరియారిటీ' యను గ్రంథమున వ్రాసియున్నారు. దీనిని శ్రీ దాసు దామోదరరావుగా రాంధ్రీకరించిరి. ఆ ప్రతిని శ్రీ వావిలాల సోమయాజులుగారివలన నాకు చూచుటకు వీలయినది. ఎల్ఫిన్‌స్టన్, నర్గన్‌వంటి విదేశీయులు ఆర్యుల కీదేశము వాసేయని యభిప్రాయపడిరి. మన దేశీయులు, కలకత్తా విశ్వవిద్యాలయాచార్యులు శ్రీ అవినాశచంద్రదాసు 1921 లో 'ఋగ్వేదిక్ ఇండియా' అను గ్రంథమునను, 1916 లో మహారాష్ట్ర విద్వాంసులు శ్రీ 'పావగీ' తమ 'ఆర్యావర్తిక్ హోమ్' అను గ్రంథమునను, 1930 లో ఢిల్లీ విశ్వవిద్యాలయాచార్యులు శ్రీ 'లక్ష్మీధరకల్లా' తమ "హోమ్ ఆఫ్ ది ఆర్యాస్" అను గ్రంథమునను, శ్రీ 'శారదా'గారు తమ హిందూ సుపీరియారిటీ యను గ్రంథమునను, శ్రీ కోట వేంకటాచలముగారు. తమ 'మానవ సృష్టి విజ్ఞాన' మను గ్రంథమును ఆర్యుల నివాసము భారతభూమియే యని ఋజువు చేసిరి.

*శ్రీ సి. కున్హన్ రాజాగారి యభిప్రాయ మిట్లున్నది :*

**"God created the world only at a time when India had passed through many quadruple 'Yugas' and when India started on the fourth Yuga of this cycle. God sent the**

first creation of a man and woman to some region within the Roman empire; when God sent his Messaiah to convey his will and his law that Messaiah appeared within the Roman empire, India was outside the area in which he had shed his drops of mercy. The Aryans dispersed from some common home into the eastern and western countries......This is the sum - total of the history of the contact of Europe with India and the discovery of Sanskrit from the west. This is what I call muddy water......They say that Aryans came into India from out-side ...it has not been proved, though strongly advocated by historians. Until it is proved, the Aryans are Indians and the Vedas are much older according to tradition. (26-8-56 Bhavan's journal)

వేదములో గాని [illegible] ఆర్యులు [illegible] ఉండినట్లు [illegible] వాఙ్మ కవి తెలియుపనియు గను సిద్ధ ప్రదేశములోని ఆర్యులు వేరు [illegible] రి దేశమునా తెల్లగుదురని[illegible] [illegible] లేదు. అట్టి వేద ములో చెప్పబడిన ఆర్యులకు ప్రదేశమునట్టి దేశ నిర్ణయము చేయుట [illegible] నను ఒక అభిప్రాయము గలదు. [illegible] మన [illegible] దానినిబట్టియే నిర్ణయము చేయరాదు. ఆ దేశములో [illegible] కదురా! దాని కేమందురు? ఈ సందర్భమున-

## డాక్టర్ వి.యస్. శాస్త్రి,M A..M.Litt, P.hd.గారి యభిప్రాయము:

"The argument from the absence of mentioning something is futile. The Mohenjo - Daro and Harappa remains do not show any trace of that civilization being acquainted with the Lion. Yet the neighbouring Rajasthan had plenty of them. This absence of a lion in those remains cannot make us conclude that they did not know it. Thus if rice is not mentioned in the Vedic texts, it does not mean that the Vedic Aryans did not know rice. Otherwise we will have to argue that the Vedic people never had salt in their food, since salt is not mentioned. In like manner, we would have to exclude many things which they did not mention. After all, the Vedic Aryans, it may be noted did not give us dairies

**(India, original home of the Aryans - Astralogical magazine October 1969).**

భారత దేశములోని మేధావి వర్గమంతయు నార్యులు బహిర్దేశము నుండి వచ్చిన ట్లంగీకరించుటలేదు. వేద పండితులను ఆర్యు లెచ్చటివారని యడిగిన నవ్వుదురు. కారణము, వారు చదివిన చదువులో, ఎచ్చటినుం డియో యిచ్చటికివచ్చి పాడిన పాటలు వేదము లనియెచ్చటనులేదు. శాస్త్ర ములుగాని పురాణములుగాని ఆర్యు లీ దేశమునకు వచ్చినారని చెప్పుటలేదు. ఇక ఆ విధముగా చెప్పునవి పాశ్చాత్యములయిన దేశ చరిత్రలు,

## దేశ చరిత్ర తారుమారయినది :

మన చరిత్ర తారుమారైనదనియు, దానిని తిరిగి వ్రాయుట మంచి దనియు శ్రీ నెహ్రూగారు కూడ అభిప్రాయపడినారు. "ప్రతి దేశము, ప్రతి జాతియును, గతములోని చారిత్రక ఘట్టములను *తమ కనుకూలముగ* మెఱు గులు పెట్టుటకు ప్రయత్నము చేయుచునే వచ్చినది. ఇంగ్లీషువారిచేత వ్రాయబడి మనము గత్యంతరములేక, చదువవలసిన చారిత్రక గ్రంథము లెన్నియో యీ శ్రేణికి చెందినవే. సాధారణముగ బ్రిటిష్ పరిపాలనమును సమర్థించుటయే వాని పని. అంతకుపూర్వము వేలాది యేండ్ల క్రిందట జరి గిన చారిత్రక ఘట్టములను వారు 'టూకీ'గను తప్పుల తడకలుగను వ్రాసిరి. ఇంగ్లీషువారు ఇండియాలో కాలూని నప్పటినుండియు నిజమైన చరిత్ర ప్రారంభమైనదని వారి యభిప్రాయము! అంతకుపూర్వ చరిత్ర మంతయు ఈ దైవ సంఘటనమునకు నాందిమాత్రమే యని వారిలెక్క. బ్రిటిష్‌వారి సుగుణసంపత్తిని, పరిపాలనా దక్షతను, ఆకాశమున కెత్తవలెనను అభిప్రా యముతో వారు బ్రిటిష్‌వారి కాలమునాటి చరిత్రను కూడా తమ యిష్టము వచ్చినట్లు మెలికలు త్రిప్పిరి . . . మన కండ్లముందు జరిగినదానిని, మనము స్వయముగ అనుభవించిన విషయములను మెలికలు త్రిప్పివేయు చున్నప్పుడు పాత పురాణము లొక లెక్కయా ?

చరిత్ర నిర్మాణ పద్ధతినిగూర్చి వారిట్లు చెప్పిరి ;

"ఇప్పుడిప్పుడే ఓర్మిగల పరిశోధక పండితులు భారత చరిత్ర నిర్మాణ మునకు అవసరమయిన మూలములను కనిపెట్టుచున్నారు. క్రీస్తు అనంత రము 12వ శతాబ్దములో కల్హణుడు రచించిన 'రాజ తరంగిణి' అను గ్రంథ

ములో కాశ్మీరు చరిత్ర వ్రాయబడినది. అదొక్కటే చారిత్రక గ్రంథమని చెప్పదగినది. మిగిలిన చరిత్రను సమగ్రము చేయవలెననినచో పురాణాది గ్రంథములలో నుత్ప్రేక్షతోకూడిన చరిత్రమీద నాధారపడక తప్పదు. వానితోపాటు కొన్ని రికార్డులను, శాసనములను, కళాఖండములను, చిత్ర కళలను, నాణెములను సంస్కృత కావ్యములను కొంత ఆధారము చేసికొన వచ్చును. ఆదిలో గ్రీకు చైనా యాత్రికులును తరువాత అరబ్ యాత్రికులును, మన దేశములో సంచారముచేసి వ్రాసిన వ్రాతలు చాల తోడ్పడు చున్నవి. కాని, ఈ చారిత్రకదృష్టి లోపించుటవలన భారత ప్రజాసామాన్యమునకు ఏ విధమైన నష్టము కలుగలేదు. అనుశ్రుతముగ తరతరములుగ వారు వినుచు వచ్చిన కథలవలనను, పురాణగాథలవలనను, గత చరిత్ర యొక్క స్వరూపమును వారూహించుకొన గలుగుచున్నారు". శ్రీ నెహ్రూగారి సూచన పాటింపదగినది. శ్రీ [illegible] చరిత్రమును చారిత్రక కావ్యమే. 'వేపెల రాజవంశావళి' చరిత్ర కుపయోగించునదే. ఇక శాసనముల విషయము. వానినిగూడ తిరిగి శాసనములతో సరిపోల్చి చూచికాని నిర్ణయము చేయరాదు. వానిలో కొన్ని గుణకముల మార్పు వల్ల చరిత్ర మారిపోవుట కలదనుకొందురు. కాకినాడ ఒక గోరగారిసగ్గల విశాఖజిల్లాకు చెందిన ఒక పండితుడుండెడివాడనియు, నాటోరగారు శాసనములకు కాపీలు తీయుటలో భారతీయులకు వైషమ్యము కలుగునట్లుగా పదములను సందిగ్ధసందర్భములందు కూర్చెడివాడనియు, నా పండితు డాతని యొద్ద పనిచేయుచు ఖేదపడి, సరియైన శాసనముల ప్రతులను రెండు మీరు వాలకు సరిపడునని వ్రాసిచెననియు, వానిని సంరక్షించుమని పెద్ద పెద్ద సంస్థానాధీశుల నర్థింప వారు బ్రిటిష్ ప్రభుత్వమువలని భయముచే ఆ సొత్తును తమయొద్ద నుంచుకొనుటకు నిరాకరించిరనియు, ఆ రికార్డు లేమయ్యెనో తెలియదనియు శ్రీ ఆదిరాజు బ్రహ్మదత్తశాస్త్రిగారు శ్రీ వేదుల సూర్యనారాయణశాస్త్రి (పితామహులు) గారికి చెప్పగా వారు తమ ప్రియ శిష్యులైన శ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారికి చెప్పగా వారు నాకు చెప్పిరి. ఇక యాత్రికుల రికార్డులనుగూడ యథాతథముగ ప్రమాణముగ గ్రహించుటవలనగూడ చిక్కులు గలవు. వారు చరిత్ర నిర్మాణమునకొఱకు మన దేశమునకు వచ్చినవారు కారు. అందుచే వారి వ్రాతలందును, మన చరిత్రకును కొంత వ్యత్యాసమప్పుడప్పుడు కన్పించుచున్నది. శ్రీ కృష్ణదేవ

రాయల విషయములోనను మఱికొన్ని విషయములలోను పొత్తు కుదురుట లేదు. అయినను వారికి దురుద్దేశము నాపాదించుటకు వీలులేదు. వారి వ్రాతల తర్జుమాను మనము గ్రహించుటలో పొరపాటు జరుగుటకు కావచ్చును. వారి ఖాతలో వారేమి వ్రాసిరో పరిశీలించిన పిమ్మటనే నిర్ణయము చేయనగును. "Hence it is possible even to suspect that the records of the accounts of the Chinese travellers might have been tampered with and deliberately distorted by interested persons with a view to obtain support for their own theories and hypotheses. The Chinese travellers travelled in Bharat mainly to visit the holy places of their religion and to procure authentic copies of their religious texts. They were not historic scholars nor were they interested in the historic value of their writings. It is very unlikely and very difficult to beleive that they noted many details, conflicting with the accounts in Indian historical treatises and support the wrong, conflicting, confusing and fanciful theories now advanced by European orientalists of modern times who are bent on reducing the antiquity of Indian history. It is more likely, obviously, that such references are all tater imterpolations by interested parties (Age of Buddha, Milinda and king Amtiyoka)" It is a pity, no attempt is made to study the accounts of the foreign travels in the original in the China language but we are satisfied with the translations of them in English by the same European orientalists. Even in the Bhavan's History Vol. III page 38, it is admitted that the writings of Hiuen-Tsang relating to Mihirakula cannot be trustworthy. (the same book)

ఇక నాణెములపై ఆధారపడు విషయము మిగిలియున్నది. వానిని కూడ పరిగణనములోనికి తీసికొనవచ్చునేగాని కేవలము వానిపై యాధార పడుటకు వీలులేదు.

"Coins may migrate from place to place by trade or theft or coquest or loot and so they may be found now in places which had never been under the sway of the prince inscribed on them. Much reliance cannot be placed on historical

writings based on such evidence as Dr. D. C. Sirkar rests his entire arguement on the finds of coins (Vide Bhavan's Publication, History Vol. II pp. 101 to 119).

ఇక త్రవ్వకములపై కాలనిర్ణయము చేయు పద్ధతినిగూర్చి విచారింప వలసియున్నది. భూగర్భశాస్త్రమను ఒక శాస్త్రముపై ఆధారపడి కొన్ని నిర్ణయములను కొందఱు చేయుచున్నారు. ఈ రాళ్ళను రప్పలను పరిశీలించి కాలనిర్ణయము చేయుటలో కూడ వ్యత్యాసములున్నవి. ఇటీవల చంద్ర మండలమునుండి తెచ్చిన రాళ్ళను పరిశీలించి యమెరికనులు చంద్రుని వయస్సును, భూమి వయస్సును 400 కోట్ల వత్సరములుగ నిర్ణయించిరి. మనలెక్క ప్రకారము సృష్టి వయస్సు 195 కోట్ల వత్సరములపై చిల్లరయే కదా! మనకును శాస్త్రపురాణములును, వానికి సరిపడు జ్యోతిశ్శాస్త్రమును ఉన్నదికదా! ఇట్టి శాస్త్రజ్ఞులే ప్రపంచములో నచ్చటచ్చట త్రవ్వకములను జరిపిరి. ఇంకను త్రవ్వకములు కొనసాగుచునే యున్నవి. ఏవియో దొరుకుచునే యున్నవి. అభిప్రాయములు మార్చుకొనుచునే యున్నారు. అమెరికాలోని 'Los Angels Times' పత్రికలో Irving S. Beugelsorf గారు "Our ancestors were not top-dwellers" అను వ్యాసము వ్రాసిరి. దానిలో—

"Contrary to what many books say, man is not the only primate that makes useful tools nor did man evolve from apes or from ancestors who lived in trees-says Dr. Louis S. B. Leaky, world famous scholar in the study of man's origin. The fossil bones, teeth and parts of skull recently unearthed in Kenya and Uganda indicate early man already existed in Africa 20 millions years ago. Dr. Leaky pointed out that the widely accepted decision of man as the tool-making or tool-using primate is no longer valid" అని డాక్టర్ లీకీగారు దక్షిణ కేలిఫోర్నియాలో నొక విశ్వవిద్యాలయములో చెప్పినట్లు వ్రాసిరి. లీకీగారి యభిప్రాయము 'ఆదిమానవుడు' ఆఫ్రికాలో పుట్టి యూరప్ ఆసియాలకు వలసపోయెనని. తదుపరి లక్ష సంవత్సరములకు అమెరికాకు పోయెననియూ ఆఫ్రికాలోనే యాదిమ మానవుడు పుట్టినచో యూరప్‌కును, ఆసియాకును ఎప్పుడు, ఎట్లు వలసపోయెనని కొన్ని సందేహములును కలిగినవి. అందుకై ఆయన ఎథియోపియాలోను,

ఇశ్రాయిల్‌లోనను, భారతదేశములోని శివాలిక్ కొండలలోనను త్రవ్వకము లలో పొల్గొనుచున్నారట (Indian Express 1969).

దీనినిబట్టి యీ పుస్తకాల పరీక్షలో, నంతకుముందు శాస్త్రజ్ఞుల పుస్తకాల లోని భావము లెంతో తలక్రిందైపోయినవో గ్రహింపవచ్చును. ఈ సిద్ధాంతమును కొంతకాలముండును.

ఇది యిట్లుండగా, పశ్చిమ హిమాలయమునకు నైఋతిమూలానున్న శివాలిక్ పర్వతశ్రేణిలో (హారిటూల్గానగర్, హిమాచలప్రదేశ్‌లోని బిలాస్ పూర్ జిల్లాలో) అమెరికా సైన్సు ఫౌండేషన్‌వారిచే ఆర్థిక సహాయము చేయబడు చండీఘర్ యూనివర్శిటీవారును, అమెరికాలో 'యేల్' యూనివర్శిటీవారును కలిసి త్రవ్వకములను సాగించుచున్నారనియు, పంజాబ్ యూనివర్శిటీ తరపున యస్. ఆర్. కె. చోప్రాగారును, యేల్ యూనివర్శిటీ తరపున యి. యల్. సిమ్మన్స్‌గారు, త్రవ్వకపు పరిశోధనములు చేయుచున్నారు. యేల్ యూనివర్శిటీవారు తొలిగా 1932లో శివాలిక పర్వత శ్రేణిలో త్రవ్వకములు జరిపినారు. తోకలేని యొక కోతివంటి జంతువు కన్న (ape) మానవుని పోలిన లక్షణములుగల పుర్రెలు దొరుకగా వానిలో నొకదానికి "Ramapithecus Punzabicus" అని నామకరణము చేసిరట. ఇప్పుడు ఈ పరిశోధనములో దొరికిన దవడ బొమికను ఆఫ్రికా, ఇండోనీషియా, చైనాలోని వానికంటెను, ప్రపంచములోని వాని నన్నిటికంటెను పెద్దదిగా ఋజువు కావచ్చునని చోప్రాగారూహించుచున్నారు. (16-2-69, Indian Express, Sri J. N. Sadhu)

వీనినిబట్టి తెలుసదేమనగా కొంత ప్రత్యక్ష జ్ఞానముతోడను, కొన్ని యనుమేయ లక్షణములతోడను, కొన్ని పరిశోధన లెప్పుడును జరుగుచునే యుండును. అభిప్రాయములను మాటిమాటికి మార్చుకొనుచునేయుందురు. డార్విన్‌గారి సిద్ధాంత మిప్పుడేమైనది? కాని యింతవఱకు ఆదిమ మానవుని నివాస స్థలమును నిర్ణయింపలేక పోయినారనుట పైవానివలన స్పష్టమేకదా! ఆర్యుల విషయములో వీరియూహా లింతవఱకు ప్రమాణబద్ధముగ లేవుకదా! భారతీయులు స్వాయంభువ మనువే యాదిమానవుడనియు సరస్వతీ దృషద్వతీనదీ మధ్యస్థమైన ప్రదేశమే సృష్టిజరిగిన ప్రదేశమనియు, అనగా భారతదేశమే ప్రాచీనమైన మానవుని కనిన ప్రదేశమనియు,

కల్పప్రళయ మయినపిదప సుమారు 12 కోట్ల సంవత్సరములనియు నిశ్చయ జ్ఞానమును కలిగియున్నారు. మన గ్రంథములన్నియు సుష్టీకరించు చున్నవి.

ఛోప్రాంగారి యూహా ప్రకారము ప్రపంచములో దొరికిన వానిలో నీ దవడ బొమిక పెద్దదైయైనచో నాదిమ మానవుని జన్మము భరతఖండ మనియే స్థిరపడును. ఆ బొమిక దొరకక పోయినచో మన గతియేమి? మన గ్రంథములను విశ్వసింపక పోవలసినదే కదా! అయినను ఈ బొమికల అధ్యాయ మింతటితో ముగియలేదు. ఈ బొమిక పెద్దబొమిక యని యొప్పుకొనవలసినవారు పాశ్చాత్యులు గూడ. వారు అంగీకరించినచో చరిత్రయే తారుమారయిపోవును. ఇంతవరకు వ్రాసిన చరిత్రాంశములు తప్పని తేలును. సృష్టి తొలిగా భారత దేశమునందే జరిగినదని యంగీకరించినచో, మన ప్రాచీన గ్రంథములకు ప్రపంచమునందే విశేష ప్రామాణికత్వము వచ్చును. చంద్రమండలమునకు పోయిన వారికంటె భూలోకమునందున్న మన ప్రతిష్ఠ పెరుగవచ్చును. ఈ రిసెర్చి యింతటితో ఆగి పోయినది.

"It is sad that one of the most worth while research projects, which could throw light on the origin of man many millions ago, has come to grief because in-fighting has invaded even the field of research.... So far remains of several types of fossil apes have been found from pliccene and micocene deposits in Europe, Africa, and Asia, but they consist almost entirely of teeth and fragments of jaws-not a complete lower jaw as discovered in India. It is perhaps not surprising that suspicion and mistrust should have developed when the Americans wanted to take the Shivalic find to their embassy in Delhi......It is quite understandable that the Indian team should not like so prized a possession to be taken out of the country......The ill-feeling generated among the research workers has led to the virtual termination of this project. (Early Man-Editorial-Indian Express 28-10-69)

ప్రస్తుత విషయ మేమనగా చరిత్రను నిర్మించుటకు నాణెములు, సంచారుల వ్రాతలు, శాసనములు కూడ కొంత సహాయపడినను కేవలము

వానిపై ననే యథాధారపడుటకు వీలులేదు. పురాణములను పుక్కిటి పురాణములని త్రోసివేయక వానిలోని చారిత్రకాంశములను గ్రహింపవలెనని శ్రీ నెహ్రూ చెప్పుట సముచితముగనున్నది. పాశ్చాత్యులు, చరిత్రకారులకు పురాణములందు ప్రమాణబుద్ధి లేదు. వారి ననుసరించిన మన వారికిని లేదు. శ్రీ రెవరెండు బెనర్జి పురాణములను గూర్చి యిట్లనిరి :

"The Pnranas in general 'contain no authentic history, there is no plot, no finish, no humour, no wit, no poetry, but mere versification and combination of irrelevant and in coherent facts." శ్రీ బెనర్జి క్రైస్తవ మతగురువు. శ్రీ మోనియర్ విలియమ్స్ కూడ పురాణవైరి. "The complete list of 18 Puranas given in all the Puranas is absurd and must therefore be latter interpolations" అని వారనిరి. క్రమముగ పురాణములను గూర్చిన తప్పుటభిప్రాయములు మారుచున్నవి. మహామహోపాధ్యాయ డాక్టర్ హరప్రసాదశాస్త్రిగారిట్లు వ్రాసిరి. "In the eighties my European friends advised me not to touch the Ramayana, Mahabharata and the Puranas for the purpose of getting Indian History from them. They worked hard with coins, inscriptions, notices of foreign travellers, archaeology, sculpture, architecture, for extracting chronology and history from them. In fact they studied everything but the Puranas. But Lo! Mr. Pargiter and Mr. Jayaswal now produce a chronology from the Puranas themselves which agreed in the outline prepared with so much toils on nearly 150 years by orientalists......The Puranas and specially Mahapuranas, are rich mines of information on ancient Indian subjects and the best way for the beginner is to study the Garuda - Purana"

*డాక్టర్ సి. పి. రామస్వామి అయ్యరుగారిట్లు వ్రాసిరి:*

The Indian Puranas who were formally regarded as purely mythological or fantastic figments of the imagination are now being increasingly recognised to be reliable records of race migrations and great events through their chronology may be in exact according to modern standards. (16-8-64, Bhavan's journal)

ఇదివఱలో వేదకాలమనెడి కాలమును 1400 B.C. గా పాశ్చాత్య పండితులు భావించిరి. "బెంట్లె" దొరగారు కలియుగాదిని 18-2-3102 B. C. గా నిర్ణయించిరి. యుగాది ఆదివారము కావలెను. కానిఆనాడు శుక్రవారమైనది. కనుక యుగాది సిద్ధాంతము తప్పని వారు భావించిరి. కాని న్యాయముగ లెక్కవేయగా యుగాది 15-12-3105 B. C. అనియు ఆనాడాదివార మగుననియు ప్రొఫెసర్ కె. శ్రీనివాస రాఘవన్ గారు (22-10-67 - Bhavan's journal) వ్రాసిరి. పురాణముల ననుసరించియే శ్రీ కోట వెంకటాచలముగారు 'కలిరాజ వంశావళి' గ్రంథమును రచించిరి. పురాణములను విశ్వసింపని పాశ్చాత్య పండితులు విక్రమాదిత్యుని శకమునాటికి విక్రమాదిత్యుడు పుట్టనేలేదని వ్రాసిరి. శ్రీ నెహ్రూగారును పాశ్చాత్యుల వ్రాతలను నమ్మిరి. "రెండువేల ఏండ్లక్రితము ప్రారంభమయిన ఈ శకమును, వీరుడైన విక్రమాదిత్యుని: ముడిపెట్టుటకు విద్యావంతులైన పండితులు చరిత్రనెందులకు తారుమారుచేసి తాపత్రయపడినారో నాకు మాత్ర మాశ్చర్యము కలిగించును (భారత దర్శనము)." భవిష్య పురాణము లోని 3-1-7-14-15-16 శ్లోకముల మాచినచో విక్రమార్కుని కాలము క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దమని రుజువగును. "కాళిదాసు (నవరత్నములలోనివాడు) జ్యోతిర్విదాభరణ మనెడి గ్రంథములో కలిశాబ్దము లలో చెప్పబడిన విక్రమార్కుని కాలము క్రీ. పూ. మొదటి శతాబ్దమని రుజువగుచుండగా, నా కాలమున విక్రముడనెడి వ్యక్తియే లేడని వాదించుచు లోకవంచన చేయుటకు పూనుకొనుట ఈ పండితులకు నీతికాదని మనవిచేసియుంటిమి (అగ్నివంశపు రాజులు-శ్రీ కోట వెంకటాచలము).

పండిట్ ప్రేమనాథడోగ్రాగారు కూడ చరిత్ర తారుమారయినదని అంగీకరించిరి. "The situtation has been worsened by the planned effort of European indologists to Compress Indian History within the limits laid down by Biblical chronology for the begining of civilised existance of man."

*జి. వి. తేల్కారుగారిట్లనుచున్నారు :*

Western scholars adjusted Indian chronology of ancient times to the known date of Alexander's invasion viz 326 B.C.

Greek historians who came with Alexander have mentioned three successive Kings of Magadha as "Xan darmes, Sandrocoltus, and Sandrocyptus". The western scholars identified these with Mahapadmananda, Chandragupta (Maurya) and Bindusara. But Pundit Kota Venkatachalam points out that the three names of Magadha Kings mentioned by the Greeks should be properly be identified with 'Chandra Sri' of the Andhra dynasty, Chandragupta of the Andhra Bhrutya dynasty and his son Samudra Gupta. This crucial mistake of the western scholars shifted forward the ancient history of Bharat by twelve centuries. This mistake was made at the very pivot of the calculations of western viz the Alexandrian invasion of 326 B.C. With this basic wrong assumption they had to dismiss without sufficient reason several Indian records and writings as imaginary and fabulous (Mahratta-28-1-55) ఇటీవలి చరిత్రలోనివే 1200 సంవత్సరములు చరిత్ర గుండమున పడిపోవుచుండగా నీ చరిత్రకారులు ఆర్యుల విషయమేమి వ్రాయగలరు? ఇక నలెగ్జాండరు విషయము చరిత్రలో మాచెదమన్న నదియు నధ్యాన్నమే. అతని నొక మహావీరునిగ చరిత్రకారులు చిత్రించిరి. అతడు క్రూరుడు కావచ్చును కాని వీరుడు కాదు. "Alexander's invasion which never impressed itself on Indian history has been mentioned as one of the most important events. Prof. J. B. Bury in his history of Greece (P.P. 244, 265) stated that the Ions-greeks were in the habit of exaggerating their greatness by distorting facts and by concocting events. In spite of all these things our historians are prone to give credence to the accounts of the foreigners as against our own ancient documents. When Alexander was in Kaffirstan, Samudra Gupta who was rallying armies to march against his father Chandra Gupta attacked Alexander with his Mlechcha army. Most of Alexander's army was annihilated and with the surviving army Alexander ran away into the Gedrosia desert and to the hilly tracts. He could not get on the way even water to drink. This retreat told upon his health and he died in Babylonia after an illness of two years (vide the plot in Indian Chronology). The history current among us to-day contains none of these facts. The invasion of Alexander was insignificant in the eye of our ancients that

there is not a trace of it either in tradition or literature of our Country. (Sri K. Venkatachalam)

బుద్ధుని కాలమును తారుమారయినది. ఈ విషయములో చరిత్రకారు లెవ్వరికిని ఏకాభిప్రాయము లేదు. "The present tendency amongst scholars is to accept the 5th century B.C. as the time of Buddha. There is however no agreement even amongst western scholars. Cambridge and Oxford histories of India accept "Provisionally" 483 B.C. as the date of "Buddha Nirvana". Sir William Joanes says mostly from Chinese and Tibetan records that Buddha lived in 17th century B.C. According to Fa-Hien, the Chinese monk, the date of Buddha Nirvana would be 1050 B.C. Such being the difference in the inferences of various scholars drawn from various sources Sri Venkata Chalams's independant thesis is most welcome. He has tried to establish by the aid of very sound evidence that Lord Buddha lived from 1887 B.C. to 1807 B.C. (ie) in the 19th century before Christ. This means practically a revolution in the accepted chronology and must be carefully considered and examined by all scholars and researchers. (Sri G.V. Ketkar - 28-1-55 The Mahratta)

రాజమహేంద్రవరము ఆర్ట్సు కాలేజిలో పనిచేసిన శ్రీమాన్ వి. తిరు వేంకటాచార్యులవారు జ్యోతిశ్శాస్త్రము ననుసరించి గౌతమబుద్ధుడు పరలోకగతుడైన కాలము క్రీస్తుపూర్వము 27-3-1807 అని నిర్ణయించిరి, దీనికి పై కాలము సరిపోవుచున్నది.

ఈ విధముగ మన గ్రంథముల ఆధారమునుబట్టి చూచినచో వ్యాసుని జన్మము 3874 బి.సి. అనియు, పాణినికాలము 1400 బి.సి. అనియు, పతంజలి కాలము 1218 బి.సి. అనియు, విక్రమశకము 57 బి.సి. అనియు, ఆదిశంకరుల జన్మము 509 బి.సి. అనియు, రామానుజుల జన్మము 1017 A. D. అనియు, మాధవాచార్యుల జన్మము 1137 A. D. అనియు తెలును. చరిత్రఅంతయు తారుమారగుటచే వీరి చెప్పటచో యదార్థ చరిత్రకారులు తీసికొనిపోయి పెట్టిరి. కుమారిలభట్టు జన్మకాలము క్రీస్తుపూర్వము 557. భీముడు కీచకుని చంపినకాలము క్రీస్తుపూర్వము 3139. మహాభారత

యుద్ధకాలము క్రీ. పూ. 3138. కృష్ణ నిర్యాణకాలము, కలిప్రవేశ కాలము క్రీ. పూ. 3102. పరీక్షిత్తు మరణకాలము 3041 బి. సి. ఈ కాలములకును నేడు మనము చదువు చరిత్రకును పొంతనములేదు. పాశ్చాత్య చరిత్రకారులు ఆర్యులను 'నోమాడిక్ ట్రైబ్సు' క్రింద లెక్కచేసిరి. ఇట్టి గుంపులు గుంపులుగా నుండుపద్ధతి ఆర్యదేశమైన భరతఖండమున లేదు. మన దేశమున చాతుర్వర్ణ్యము వారినికాని యందులో చేరనివారినికాని గుంపులనరాదు. ఒక సువ్యవస్థితమైన రాజ్యములోనివారు మన ఆర్యులు. యూరపు దేశములలో గుంపులుండుట కనకాశము కలదు. అశోకుని కాలము క్రీస్తునకుపూర్వము 1472–1436 కాగా, నేటి చారిత్రకులు క్రీ.పూ. మూడవ శతాబ్దమని నిర్ణయించినారు. ఈ ప్రకరణమును వ్రాయుటలో శ్రీ కోట వేంకటాచలముగారి గ్రంథము అధికముగ తోడ్పడినవి. నాగార్జునుడు, పతంజలి, కనిష్కుడు మొదలైన వారికాలము లెన్నియో నేటి చరిత్రలలో తారుమారయినవి.

చరిత్ర ప్రధానముగ గందరగోళమైనది ఉత్తరాపథ రాష్ట్ర విషయములో. భారత వర్షములో యవనరాష్ట్రములు కలవు. (1) అభిసార (2) ఉరగ (3) సింహాపుర (4) కటక (5) ఉత్తరజ్యోతిష రాష్ట్రములు యవన రాష్ట్రములు. అభిసార, ఉరగరాష్ట్రములు, కాశ్మీరములో కొంత భాగము, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములో కొంతభాగము ఇటీవల కలిసిపోయినవి. ఉత్తర అక్షాంశము 33 మొదలు 38 వఱకు, తూర్పు; యామ్యోత్తరరేఖ (మెరిడియన్) 68 మొదలు 72 వఱకుగల యవన రాష్ట్రములు ఉత్తరజ్యోతిష, కటక, సింహాపుర – అనెడి మూడు రాష్ట్రములు– ఇప్పటి ఆఫ్గనిస్థాన్‌లో మధ్యభాగమునుండి ఉత్తరముగాకల భాగముగా నేర్పడినవి. పై అయిదు యవనరాష్ట్రములకు తూర్పున కాశ్మీర కాంభోజ త్రిగర్త రాష్ట్రములును (ఇప్పటి కాశ్మీరు) సింధునది కొంతవఱకును, గాంధారదేశము కొంతవఱకును (గాంధారము ఆఫ్గన్ స్థానములో దక్షిణ భాగమును, బెలూచిస్థాన్‌లో ఉత్తరభాగము కలిసి ఏర్పడిన భూఖండము) హద్దుగా నుండినవి. దక్షిణమున గాంధారము, అమర పర్వతము (ఇది బర్బరులను క్షత్రియ జాతివారిది) హద్దుగా గలవు. పశ్చిమమున– పారద, హూణ రాష్ట్రములు (పారదులు, హూణులు) అనెడి దస్యులైన క్షత్రియ రాష్ట్రములు కలవు. ఈ హద్దుల మధ్యగల అయిదు యోనరాష్ట్రములును

ప్రాచీన భారతవర్షములోనివి. అవి ప్రస్తుత పశ్చిమోత్తర పరగణాలలో పశ్చిమోత్తర భాగమును, ఆఫ్ఘనిస్థానమును, పశ్చిమ కాశ్మీరమును చేర్చి కొని మొత్తముగా ఏర్పడిన ప్రదేశమైయున్నది. ఆఫ్ఘనిస్థానమునకు పడమరగాగల-ఇప్పుడు హీరట్ అని పిలువబడు పట్టణము వఱకును ప్రాచీన భారత వర్షము వ్యాపించి యుండెడిది. ఈయవన రాజ్యములలోనే 'హిందూ కుష్' పర్వతము లుండి యున్నవి. ఈయవన జాతులును, వారిచుట్టుపక్కల గల దస్యుక్షత్రియులైన పారసహూణశకాది జాతులును. క్రీ. శ. 11 వ శతాబ్దమున మహమ్మదీయులుగ చేయబడిరి. (అశోకునికాలము-11, 88, పేజీలు.)

మన భారతాది గ్రంథములలో యవనాది జాతులు చెప్పబడియున్నవి. 'యానన కాంభోజ గాంధారాః కిరాతాబర్బరైస్సహా' (శాంతిపర్వము) కాంభోజ, యవన, శక, హూణ, దరద, బాహ్లిక, కిరాత, బర్బరాదిశాఖల రాజులు దుర్యోధనుని పక్షమున భారతయుద్ధములో పోరాడినవారు. అశోకుని రాజ్యభాగముగ యోనరాజుల రాజ్యముండి యుండినది. **"It deserves to be noticed here that they (Yona provinces) formed part of Asoka's empire and had therefore nothing to do with the dominions of his greek neighbours" (Bhandarkar's Asoka)** ఇంత స్పష్టముగ యవనుల విషయమున్నది. అశోకుని శాసనములలో గ్రీకుల ప్రస్తావనము కాని, ప్రాచీన గ్రీకుల చరిత్రలో అశోకుని ప్రసక్తి కాని లేదు. **"Yauna meaning the greeks used for the first time in the records of Darius I and was borrowed by the Indians without any modification."** చరిత్రకారులు యవనులనగా గ్రీకులను అభిప్రాయమును కల్పించిరి. శ్రీకృష్ణునితో యుద్ధముచేసి మడిసిన కాలయవనుడు క్షత్రియుడేగదా! వర్ణాశ్రమ ధర్మ విరహితులైన యవన క్షత్రియజాతులు యోనశబ్దముతో వ్యవహరింపబడినవిగని వారుండెడి ప్రదేశ 'మయోనియా' యయ్యెను కాని గ్రీసులో అయోనియానుండి వచ్చినవారు యవనులని చెప్పుట సత్యేతరము. చాలకాలము మనవారు గ్రీకులు ప్రాచీన చరిత్రము కలవారని నమ్మి యుండిరి. దీనికి కారణము చరిత్రలో నష్టముచెప్పబడుట; యవనుల చరిత్రమును గ్రీకు చరిత్రమేమో యనునంతగా మార్చివేయుట. **Didotus I,**

Didotus II, Euthydemus Demetrius, Milinda, Minander, Eucratidus, Agathocles Helicles - ఇవియన్నియు 14, 13 శతాబ్దముల (క్రీస్తుపూర్వము)కు చెందిన భారతీయ యవనుల నామములు. ప్రాకృతరూపములలో నవి యట్లయునవి. 'హారికులేశ' నామమున్నదను కొనుడు. అది ప్రాకృతోచ్చారణమున 'హెర్క్యులెస్' అగును. కనుక నామములనుబట్టి వారందఱును విదేశీయులై మనకు సంబంధము లేనివారని తలంపరాదు. ఇట్టివారినిచూచి మనపెద్దలుకూడ మనవారు కారేమోయని భ్రాంతిపడిరి "టర్కీ- ముసల్మానులు, తమపూర్వులైన శాకులు యూచీల వలెనే హిందూమతముయొక్క- ఆకర్షణములోబడి క్రమముగ హిందూమతములో చేరిపోయిరి-అని చరిత్రకారుడు 'విన్‌సెంట్‌స్మిత్' వ్రాసెను.... క్రిందశ్రేణిలో క్రొత్తకులములుత్పన్నమైనవి. పైనుండి వచ్చిన విజేతలైన వారు క్షత్రియకులములో కలిసిపోయెడివారు. క్రీస్తుకాలమునకొలది కాలము ముందువెనుక నాణెములను పరిశీలించినచో రెండుమూడు తరములలోననె త్వరితమైన మార్పులు సంభవించెనని నిర్ధారణ యగుచున్నది. మొదటి రాజునకు వైదేశిక సాంప్రదాయమునకు సంబంధించిన నామముండును. ఆయన పుత్రునకో పౌత్రునకో అది సంస్కృతనామముగ మారిపోవును. ఆయన రాజ్యాభిషేకము నాటికి క్షత్రియ ధర్మానుసారమైన కర్మకలాపములే నడచెడివి. . . రసపుత్రక్షత్రియ వంశములు చాల శాక లేక స్థియన్ దాడుల కాలమునాటివారివే. దేశములోని మతములను సంస్థలను నమ్మి పురాణములలోని వీరులతో బంధుత్వమును కలుపుకొనెడివారు." "Mahbharata shows that people of low caste, enemies and foreigners were recieved into the Hindu fold. A passage of Patajali attests that the Sakas and yavana could perform sacrifices and accept food from the Arya, without contaminating it. The fact is that Hinduism is a way of life; a mode of thought, that becomes second nature. It is not so much its practices that are important, for they can be dispensed with, nor is it the church, since it has no priesthood, or at least no sacredotal hierarchy" మొదటివారి యభిప్రాయములు స్మిత్ ప్రభృతుల అభిప్రాయముపై నాధారపడినవి. రెండవ వారిఅభిప్రాయములు Louis Renow గారి Religions of Ancient India అను గ్రంథముపై నాధారపడినవి. మన గ్రంథములలోని పంక్తులీయబడలేదు కనుక వాని యర్థమునుగూర్చి చర్చిం

చుట కిచట నవకాశములేదు. పరశకులు, యవనులు క్షత్రియులే. వారిలో మ్లేచ్ఛులు కాక యుండిన వారి కాలక్రమమున కొన్నిదోషములు సంభవించిన వానికి ప్రాయశ్చిత్తము విధించి మతములో నుంచికొని యుండవచ్చును. వారి నామములను బట్టి వారు భారత వర్షేతరులని నిర్ణయించుటకు వీలు లేదు. కనుక అట్టి సంస్కారమునకు వారర్హులే యగుచున్నారు. ఒకప్పుడుత్తరాపథ రాష్ట్రములలోనుండిన శకయవనులును వర్ణాశ్రమధర్మములను నిలిపికొని యుండినవారును కొందరుండి యుండవచ్చును. ఉదాహరణమునకు, “ప్రాగ్జ్యోతిషామధిపశ్శూరో మ్లేచ్ఛానామధిపో బలీ, యవనైస్సహితో రాజా భగదత్తో మహారథః.” (భారతము-సభాపర్వము-51వ అధ్యాయము) రాజ్యము నందలివారు వర్ణాశ్రమ ధర్మచ్యుతులు. రాజు వర్ణాశ్రమ ధర్మావలంబకుడైన ఆర్యుడు. ఇట్టి సన్నివేశములుండును. పాశ్చాత్యులకు మన గ్రంథము లర్థముకాకయో, లేక వీరిని గుంపుజాతులవారిగా జమకట్టి క్షత్రియాది జాతులుకూడ సంకరములే యను అభిప్రాయము కల్గించుటకో అట్లు వ్రాసి యుందురు. పరిశీలింపనివారు దానిని నిజమనుకొని దానికి సమాధానము చెప్పుటకు, హిందూమతమొక జీవిత విధానమనియు ఎవ్వరైనను ఏకులములోనైనను చేరవచ్చుననియు పూర్వము కొందరట్లు చేరినవారున్నారనియు వానినే మనవారును ఉదాహరించుచున్నారు. ఈయపూర్వసిద్ధాంత మవిచారిత రమణీయము. వారిచ్చిన యుదాహరణములు క్రీస్తునకు పూర్వమునాటివి. ఆనాటికి వర్ణవ్యవస్థ ఇంతకంటెను బలీయము కదా! వారెట్లట్లు చేయుదురని మన మూహింపనైనగలము? సుమారు 150 సంవత్సరములు రాజ్యముచేసిన బ్రిటిష్ వారిని మన జాతులలో నేదో యొక జాతిలో కలిపికొని సంబంధబాంధవ్యములను నెలకొల్పుటకాని, వారిచే యజ్ఞములు చేయించుట కాని జరుగనేలేదు కదా! ఆర్యధర్మములోని వారై మనతో నిత్య వ్యవహారముననున్న హరిజనులకే యాయవకాశములు కన్పట్టకుండగా, వైదేశికుల కా కాలమున నెట్లు యజ్ఞములుచేయునవకాశములు కలుగును?

ఈ విధముగ యవనుల చరిత్రము తారుమారయినది. **“The whole history of ‘Uttarapada’ has become a bundle of inconsistencies, and chronisms owing to wrong identification of Kings and misplacing of dynasties over centuries and millliania of years.”**

బాక్ట్రియన్ రాజులలో నొకడైన 'డెమిట్రియస్' భారతీయ యవన క్షత్రియుడు. యవను లుత్తరాపథమునందే కాక యితర ప్రాంతములలో కూడ నుండియున్నారు. **"There are Yavans to the east of Assam in Pragryotisha, even at the time of Mahabharata war and before".** భగదత్తు డచ్చటివాడే. దక్షిణ భారతమున పాండ్య రాజ్యమున యవనపురి కలదు. "అటవీంచ పురీ రమ్యాం, యవనానాం పురం తథా" (సభాపర్వము). మన దేశములో రాజ్యము లెచ్చటనున్నవో ఒక దేశపట మవసరమని భావించి శ్రీ రాజా వేంకట రంగయ్యప్పారావు బహాదూరు, సీనియర్ జమీందార్ ఆఫ్ కపిలేశ్వరపురము (కృష్ణాజిల్లా) 1930 ప్రాంతములో పండితులను సమావేశపరచి తయారుచేయించి వారు రచించిన **"Ancient history of Bharata Varsha"** యందు చేర్చియున్నారు. అందు వారు ఆర్యులు ఆర్యావర్తమే జన్మభూమిగా యున్న వారని స్పష్టీకరించియుండిరి. వారు శ్రీ మేకా రంగయ్యప్పారావుగారి తండ్రికి జనకపితలు. ఆ దేశ పటమును పెద్ద సైజులో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ నిలిపి తద్ద్వారమున భారతాది గ్రంథములలోని చరిత్ర నర్థము చేసికొనుటకు వీలుకల్పించుటకు అకాడమీవా రంగీకరించియున్నారు. అందు కాశ్మీరమునకు దక్షిణముగ, యవన రాష్ట్రములకు సన్నిహితముగ నున్నట్లు కాంభోజదేశము చూపబడినది. శ్రీ భా. వర్తకర్ గారు కాంబోడియాకు పూర్వనామము కంబుజమనిరి. అది వేరు రాజ్యము కావచ్చును కాని కాంభోజదేశము కాదు. ఇంతకు చెప్పవలసిన దేమనగా యవనులు గ్రీకులు కారు. గ్రీకురాజ్యము దరిమిలా ఏర్పడినది.

**"In the 5th century B.C. all the Ioyonians (the denominations) were abolished by legislative decree and the term Greek alone was compulsorily employed for all......The term Ionian or yona was never used for the Greeks ever since the 5th century B.C. Again in 19th century the European historians of ancient India began to interpret the terms Yavana, Yona - in our puranas to mean Greek and Indo-Greek and so we, in our confusion have follen Yavana to mean Greek. There were no Greeks in Asokas time. Amtiyoka was a Bharatiya Yavana prince, not Indo-Greek or a Greek Prince. He was the contemporary of Asoka." "The Greeks do not mention Asoka"** (Ibid) అమ్టియోకుడు యవన రాష్ట్రములలోని సింహపురికి చెందినవాడు.

పాశ్చాత్యులకు ప్రతి వైదేశిక రాజ్యమువారును వచ్చి భారతదేశము నొక మొట్టికాయ వేసిపోవుచుండెడి వారనియు, భారతీయులు నిస్సహాయులై వారిని తలదాల్చెడివా రనియు చరిత్రలో లిఖించుట ఒక 'మోజు'. 'కుషానులు' మన దేశమున రాజ్యము చేసినట్లే కన్పించదు. అయినను వారిని భారత చరిత్రలోనికి వారు తెచ్చిరి.

"(1) Gondopharanes (2) Pacores (3) Kurulakad pasis (4) Vikmakad pasis – These ruled small Kingdoms in western Asia. The inscriptions pertatning to them, though discovered in Western Asia, were trotted out by the authors as being found in India and they were dumped upon us, Indians, along with their unwanted history. The western writers are guilty of ignoring as fictefitious the two Great Kings Vikramadtiya and Salivahana who are the founders of two aras with their names and have gratuitously foisted the said eras to the foreign Kushan Kings"

పై వారి శకములలోని సంవత్సరములు పశ్చిమ ఆసియాలో నములలో నుండియుండవచ్చును. కాళిదాసుని కాలమును, విక్రమ శకమును 'జ్యోతిర్విదాభరణము' అను గ్రంథమువలన కలిశకము 3068, 3044 సంవత్సరములని తెలుచున్నది.

పాశ్చాత్య పండితులు కొందరు పురాణములను విశ్వసింపనట్లే మన చారిత్రిక గ్రంథమై శ్రీ సె[ప్రభా]గారిచే పిరొ్కనబడిన కల్హణుని 'రాజ తరంగిణి'ని కూడ ప్రమాణముగ స్వీకరించుటలేదు. అందు మూడువందల వత్సరము లొకరాజు పాలనము చేసెనని యుండుటగా భూలోకము చేసి నట్లు గ్రహము చేసికొని యీ కారణముచేత దాని ప్రామాణికత్వమును త్రోసి పుచ్చిరి. ఇటీవల భారతీయ విద్యాభవనము కృషిచే రచింపబడిన మన దేశ చరిత్రముకూడ సాధారణపడదగినదిగా కన్పించుటలేదు.

"Toramana is generally taken as to be a Huna Chief and although there is no conclusive evidence to this effect, *this may be very well true.* His coins testify to his foreign origin and indicate his rule over parts of U.P., Rajasthan, the Punjab and Kashmir."

అని యందు వ్రాయబడినది. రాజ తరంగిణినుండి తెలియవచ్చున దేమనగా ప్రవరసేనునకు పిమ్మట, తోరమాణుని పిల్లలు కొమారులుండిరి.

హిరణ్యుని రాజ్యములో యువరాజయిన తోరమానుడు, కులదేవత యగు "కాలా" విగ్రహముతో, నాణెములను ముద్రించెను. మఱి కొంతకాలమునకు తన పేరుతోనే నాణెములను ముద్రించి వానిని చలామణిలో నుంచెను. హిరణ్యుని కీ విషయము తెలియవచ్చి యాతని జీవితాంతమువఱకు కారాగారముననే యుంచెను. జైలులోనే తోరమానుడు మరణించెను. రాజతరంగిణినుండి యాతడు హిందువు, క్షత్రియుడు ననియు (16 B. C.) నాతడెప్పుడును రాజు కాలేదనియు తెలియుచున్నది. ఆతడు హూణుడని పై చరిత్రలో వ్రాసిరి. 704 B.C. లోనున్న మిహిరగులున కతడు తండ్రి యగుట కవకాశము లేనేలేదు. "Thoramana was succeeded by his **son 'Mihirakula' who probably acended the throne about 515 A.D."** అని విద్యాభవన చరిత్రలో వ్రాయబడియున్నది. నాణెములపై యాధారపడుట ఎంతదోషమో పై చరిత్ర చూచిన తెలియగలదు. అసలు నాణెములను భారతీయులు ముద్రించువారా? అని సందేహము కలిగినవారు, తోరమానుని క్షత్రియత్వమునే మార్చివేసిరి. ఇటీవల చరిత్రమునే తప్పు వ్రాసినవారు రాచార్యుల నివాసచరిత్రమును తప్పుగా చిత్రించుటలో నాశ్చర్యములేదు. అందుచేత చరిత్రలోని దోషము లెన్ని యైనా నుటంకించుట ఆవశ్యకమైనది.

"It is a pity that the effort of the Bharatiya Vidya Bhavan to reconstruct ancient history of Bharat is also proceeding on the wrong lines and indicates no such change in attitude as we should wish" (K. Venketachalam). సిమ్లాలో 60 మంది పండితులను సమావేశపఱచి చరిత్ర వ్రాయింప సంకల్పించిరని యొకవార్త ఆకాశవాణిలో వెలువడినది. ఆ పండితులెవ్వరో ఆ చరిత్ర ఎట్లుండునో వేచి చూచియుండవలెను. పురాణములపై యాధార పడనిదే చక్కని చరిత్ర రాదు. జాతీయ పండితుడను, రాంప్సన్‌గారును పురాణములలో వంశావళిని విశ్వసించినవారు. "**The Puranas are, usually fa'rly in agreement with the evidence of inscriptions and coins, so far as the names of the Kings and the length of their reigns are concerned" (Ancient India-E.g. Rampson, M.A. Cambridge-Page 117)** నేటి విద్యార్థులకు జాతీయ విషయములయం దభిమానము కొఱవడుటకు కారణము మనము మన చరి

యైన చరిత్రమం దీయలేకపోవుటయే. "The Union Education Minister's fervent appeal to historians to re-orient their approach so that the study of history may help to strengthen the forces of national integration is timely in view of the winds of integration blowing fiercely across the land...... Our Universities must attract the best minds for the writing of history so that the fascinating Indian history may provide inspiration for future generations. (Editorial, Indian Express - 15-6-69).

## సింధులోయ నాగరకత :

సింధులోయ నాగరకతను గూర్చి చెప్పనిదే మన సంస్కృతిని గూర్చి పూర్ణముగ తెలిసికొన్నట్లుకాదు. ఆ త్రవ్వకములు ప్రపంచమునకే విభ్రాంతి పఱచినవి. శ్రీ నెహ్రూ దానినిగూర్చి భారత దర్శనములో సుదీర్ఘమైన ప్రకరణమును వ్రాసిరి. "మొహెంజొదారోలోను, హరప్పలోను ఈనాటికిని అమలులోనున్న భారత సంప్రదాయపు టలవాట్లు చాల కన్పించును. కర్మకాండలలోను, కళా కౌశల్యములోను, బట్టు బొట్టు కట్టులలోను, ఆనాటి లక్షణము లిప్పటికిని యట్లే యున్నవి. ఆ నాగరకతయే తన ప్రభావమును చాలవఱకు పశ్చిమాసియా మీదగూడ ప్రసరింపచేసినది. అంతటి పురాతన కాలమునందైనను భారతదేశము శైశవస్థితిలో లేదు. ఎన్నియో విధముల అభివృద్ధిలోనున్నట్లు కన్పట్టును" అని వ్రాసిరి. ఆ నాగరకత ఆర్యమనియు ద్రావిడమనియు రెండునుకానివారిదనియు పలుపలువిధముల పలుకుచున్నారు. ఇటీవల స్వీడిష్‌వారు వచ్చి దానిని 'డిసైఫర్' చేయుచున్నారని వార్తలు వెలువడుచున్నవి. అది వైదిక సంస్కృతియే. లోథల్ వద్ద దిగువ పట్టణములోని యనేక గృహములలో — వర్తులాకారపు దీర్ఘచతురస్రాకారపు టిటుకలతో నిర్మింపబడిన గూళ్లలో, విభూతి, సింధూరము, త్రికోణాకారపు గంధపుచెక్కలును, రంగులతో చిత్రింపబడిన మృణ్మయపాత్రలును కనుగొనబడినవి. ఆ గూళ్లు నలువైపులను మూయబడియుండుటచే ప్రొయ్యిలని భావించుటకు వీలులేదు. ఈ గూళ్లన్నియు యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించుటకు నిర్మింపబడిన యజ్ఞవేదికలను సూచించుచున్నవనియు, యూపరంధ్రములు, చెన్న గరిటెలు, జంతు బలులు నచ్చటి వైదిక యజ్ఞవేదికలను సూచించుచున్నవని ఢిల్లీ పురాతత్త్వశాస్త్ర

విభాగపు డిప్యూటీ డైరెక్టరు జనరల్, యస్. ఆర్. రావుగారు వ్రాసి యున్నారు. వీరు లోథల్ పురావస్తు ఖననాధికారి. "సింధు నాగరకత వైదికమైనదని విశ్వసించుటకు మొహెంజోదారో, హారప్పాలలో వాడబడిన, అనుసరింపబడిన తూనికలు, కొల మానములు, భారత దేశీయమైన దశాంశ సూత్రములు, రెట్టింపు సూత్రములు ప్రాతిపదికపైననే యుండెడివి. త్రవ్వకములలో బయల్పడిన గుండ్రని శిలలు 'శివలింగములు'గా కన్పించును. ***ఆర్యుల జన్మస్థానమును పాశ్చాత్య చరిత్రకారులు కనుగొనుటలో విఫలమగుటయే కాక, యవి పామీర్సునుండి ఇరాక్, కాస్పియన్ తీరములు, ఉత్తర ధృవము మొదలైన ప్రాంతములకు మార్చబడినవి.*** ప్రస్తుతము వారి పై ఖరి దీనిని యూరప్‌లోని ఏదియో యొక ప్రాంతమున కంటకట్టుపలెనని. నార్వే, జర్మనీ, స్విట్జర్లాండ్, యూథియోపియా, రష్యా, స్టెప్పెస్ పర్వతాలలో 'అరియానా' అన్నది, ఆర్యుల జన్మభూమియై 'ఆర్యావర్తము'గా పేరుగాంచిన హిందూ దేశముకాక, మరి యే దేశమయిన కావచ్చునన్నది ప్రస్తుత రచయితలకు 'మోజు'యినది" (డాక్టర్ సిద్ధలింగపోదగి-'ది మదర్'లో) పై వానినిబట్టి భారతీయ విమర్శకులు ఆర్యుల జన్మస్థానము విషయమున ప్రకటించిన అభిప్రాయములును, పాశ్చాత్యుల సంప్రదాయములును వెల్లడియగుచున్నవికదా! ఇటీవల 'అగ్గ్ర నగరిగి' ప్రథమ సంపుటమును ఎ. కల్యాణ రామన్‌గారు ప్రకటించిరి. (Rs. 40/-Asia Publishing house) దానిని గూర్చి విమర్శ వ్రాయుచు శ్రీ గార్గేయ ఇట్లు వ్రాసిరి :

"From the preliminary reports, European scholars were inclined to beleive that the Aryan invaders had probably destroyed the Indus civilisation. The word '**Purandara**' as an appelation of Indra was taken to mean that he was the destroyer of fortified towns. But two basic considerations the theory - First-the Aryans were nomadic in their habits and had not learnt to build houses. If they could not construct a house for themselves, they could far less have the skill of fortified towns.And if a wandering people, find fortified houses, they would live in them rather than destroy them. Secondly-the skeletons found in the excavations are too few to justify such a human calamity. The natural catastrophe of flood is a more likely destroying element. But the other extreme view that the Indus vally civilisation

was itself of Aryan origin is underlined by Kalyanaraman. The spacious baths were for the అవభృథస్నాన after the performance of the sacrifice: the bearded bust of the priest had the sacrificial robe on, the toy - cart was for bringing the Soma - plant and the conical pot with holes, a sleve for the Soma-juice are interpretations of the Aryan-school. It is not easy to refute them as they fiit in nicely with the finds of the Indus Valley civilisation" (Sunday Standard, 16-11-69). దీనినిబట్టి సింధులోయసంస్కృతి ఆర్యసంస్కృతియే యని తేలుచున్నది. పురందరు డనగా ఇంద్రుడు కనుక, ఇంద్రుడు ఆర్యుల దైవము కనుక నంతకు ముందున్న పురములను ఆర్యుల ప్రార్థనముపై ఇంద్రుడు నాశనము చేసెనని పాశ్చాత్యుల ఊహామట! ఎంత విచిత్రముగా నున్నది! పురారి ఈశ్వరుడును అగును కదా! ఆత డెవ్వరి దైవము? ద్రావిడు లనబడువారి దైవమా? పాశ్చాత్యులు నేలమట్టముచేయు పురము లేదేవుని యర్థించి చేయుచున్నారు? ఇంద్రు డనుమాటకు–ఇందతీంద్రః, ఇతి పరమైశ్వర్యే–అని యర్థ మేలచెప్పికొనరాదు. ఇంద్రు డైశ్వర్యదాత కనుక ఆర్యులకా నగరము లిచ్చెనేమో! అసలు వేదములలోని ఇంద్రపదము పరమేశ్వర భావనా రూపముగా కన్పించును కదా! ఆర్యులా పట్టణముల నాశనము చేయుటకు ముందెన్ని పట్టణముల నాశనము చేసిరి? తరువాత ఎన్ని చేసిరి? ఇట్టి ప్రశ్నములకు సమాధానములేదు. మన విద్యలు పాశ్చాత్య చరిత్రకారుల కళ్లే యర్థమగునేమో!

## వేదస్వరూప విచారణము :

ఆర్యులనుగూర్చి విచారించుటకు ముందు ఆర్యులకు తెలియబడిన వేదములనుగూర్చి విచారింపవలయును. ఋగ్వేద సంహితను మాక్సు ముల్లరు ప్రకటించుటతో పాశ్చాత్యలోకమున క్రొత్త అధ్యాయము ప్రారంభమైనది. మాక్సుముల్లరు గారికి ఆ గ్రంథము నచ్చొత్తించుటకు విజయనగర మహాప్రభువులు శ్రీ శ్రీ శ్రీ పూసపాటి ఆనందగజపతి మహారాజులుంగారు ధన సహాయము చేసిరి. ఆనంద గజపతి ఎడిషన్ అని దాని పేరు. వారిని కీర్తించుచు మాక్సుముల్లరుగారు ఆంగ్లములో వారిపై ప్రశంసమును కూడ తొలిగా వ్రాసియుండిరి. మాక్సు ముల్లరు చిత్తశుద్ధి కలవాడు. ఎచ్చటనైన పొరబాటుపడి యుండిన పడవచ్చును గాని భారత దేశము

మొదకాని, సంస్కృతి మొదకాని ద్రోహబుద్ధిగలవాడు కాదు. నమ్మిన విషయమున నిష్కర్షముగ చెప్పగల మహనీయుడు. మానవజాతి కంతకును భారతదేశమే మాతృభూమియని యాతడు విశ్వసించెను. అది చెప్పెను. "India will appear to you the mother or human race, the cradle of all our traditions" (India, what can teach us). "The Veda will occupy its position as the most ancient book in the library of mankind"(Rigveda Samhita.) "Wherever the European mind has arisen into heights of philosophy, it was done so, because the Brahmin was the pioneer" (India, what can teach us). "Much ancient Sanskrit lore will be lost for ever when the race of 'Srotriyas' becomes extinct" (India-what can teach us). "The word Arya was more faithfully preserved by the Zoorastrians, who migrated from India to the north west and whose reli gion has been preserved to us in the 'Zind Avesta' though in fragments only" (Science of languages - Max-Mullhr). పై వాని వలనఆర్యులు భారతీయులే యనియు, సృష్టితొలిగా భారతదేశముననే జరిగెననియు స్పష్టమగుచున్నది. "To the present day India acknowledges no higher authority in matters of religion, ceremonials, customs, and law than the Veda and so long as India is India, nothing will extinguish that ancient of Vedamtism which is breathed by every 'Hindu' from his earliest youth... To fathom ancient India, all knowledge acquired in Europe avails nought; the study must re-commence as the infant learns to read ;You will have been initiated and India wtll appear to you the *mother of human race*, the cradle of all our traditions" అనియు వారు స్పష్టముగవక్కాణించిరి. "It is due almost entirely to the discovery of the Veda that we, in this 19th century of ours have been allowed to watch again these carly phases of thought and religion which has passed away long before the first beginings of other literatures. In the Veda, an encient city has been laid bare before our eyes which in the history of all other religions is filled up with rubbish and built over by new architects" (India, what can teach us). కనుక సంస్కృతమునకంటె పూర్వము మాభాషకలదనువారికి పై వాక్యములు కనువిప్పుగాగలవు. వేదము అనాది యను సిద్ధాంతమును భంగ్యంతరముగ బలపఱచువారును పాశ్చాత్యు

లలో కలరు. The age of this Venerable Hymn (Rigveda) is unknown (History of the Indian people - Sir William Hunter). ప్రపంచములో నెచ్చటను తెలిసికొనుట కవకాశములేని విషయములు వేదములో కలవు. "It (a new world of ancient Vidic literature) possesses one charm, it is real, it is of natural grouth, and like every thing of nature, I beleive it had a hidden purpose, and man intended to teach us some kind of lesson that is worth learning, and that certainly we could learn nowhere else" (MaxMuller). "If every manuscript of the Rig-Veda was lost, we should be able to recover the whole of it from the memory of Srotrias in India" అని యాతడు వేదపండితులను ప్రశంసించెను. "They revere their scriptures, the four Vedas, containing about 100,000 verses... The Vedas are handed down from mouth to mouth not written on paper. There are in every generation some intelligent Brahmins who can recite those 100,000 verses I my self saw such men (Itsing-Chinese traveller). భారతవర్షము భూలోకపు సంతృప్తరూపమనియు, నిందలిప్రతివస్తువును అసామాన్యము, అద్భుతము, గంభీరములనియు ఛేంబర్స్ ఎన్‌సైక్లోపిడియా 337 వ పుటలో వ్రాయబడినది. ఆ వల్కులలో భూలోక స్వరూపము బీజప్రాయముగ భారతమున నున్నదనియు, ప్రథమసృష్టి యను కొనుట కవకాశమున్నదనియు ధ్వనించుచున్నది. స్వర్గలోకము భారతదేశముతో పోల్చుటకయినను పనికిరాదని "అబ్దుల్లా వాసఫ్" అను చరిత్రకారుడువ్రాసెను. మన ప్రాచీన విద్యలను గూర్చియు, మన ప్రాచీనభూఖండమును గూర్చియు పాశ్చాత్యులలో కొందఱు చిత్తశుద్ధితో ప్రశంసించినను కొందఱరవి యాదిమమానవులు పాడుకొన్నపాట అను అభిప్రాయము కలదు. వానిని కాదనువారును కలరు "These alone are sufficient to prove, if necessary, how profoundly sacerdotal this poetry is, and they ought to have suggested reflections to those who have affected to see in it only the woɹk of primitive shepherds celebrating the praises of their gods as they lead their blocks to the pasture" (Barth's Religions of India). కొందఱు ఋగ్వేదము మొదల పుట్టినదందురు. వేదములు మానవులు రచించినవని వారి విశ్వాసము. మొదల ఋగ్వేదమనియు, తదుపరి యజుర్వే

దము వచ్చినదనియు, నది కాలభాగము వచనమనియు, ఋగ్వేదములో సూచింపబడిన దర్శ్నలను తెలిసికొనుట కిది యుపయోగపడినదనియు వారి యభిప్రాయము. తదభిప్రాయానుసారముగ శ్రీ కుముదరంజనరే (M, A P.h.d. M. D.) ప్రభృతులు వ్రాసిరి. మన పండితుల అభిప్రాయ మీ విష యమున నిట్లున్నది : "వేదము, మంత్ర-బ్రాహ్మణ ఉభయాత్మకము (అప స్తంబ సూత్రములు) వేదః కదాచిత్ ఏకరాశిర్భూత్వా అవస్థిత, తదానీం తస్య యజురితి వ్యవహారః యజ్ఞేషు ఉపయుజ్యమానత్వాత్-బ్రాహ్మణము, మంత్ర వ్యాఖ్యానరూపమైనది. బ్రాహ్మణాంతర్గతములే యుపనిషత్తులును. మంత్రములు మూడు విధములు. (1) ఋక్కులు (2) యజుస్సులు (3) సామలు. పాదవ్యవస్థతో కూడిన మంత్రములకు ఋఙ్మంత్రములని పేరు. గానోపయోగి మంత్రములకు సామ మంత్రములని పేరు. పాదవ్యవస్థ లేకుండు మంత్రములకు యజుర్మంత్రములని పేరు. సమస్త వేదములందును కానవచ్చు మంత్రము లీ మూడుజాతులకు చెందినవే. మంత్రములందు మఱొక జాతిలేదు. మంత్ర ప్రాధాన్యముచే వేదములు మూడుగా విభాగము కాబడుటచే 'త్రయీ' యను వ్యవహారము వేదమునకుగల్గెను. అధ్యయన నిష్ఠులగు శిష్యులు కొన్నిమంత్రములను, కొన్ని బ్రాహ్మణములను సంపుటీకరించుకొని యాభాగమున కొక వేదమని పేరిడిరి. ఆ వ్యవహారములో వేదములు నాలుగుగా పర్వడెను. వానిలో ఋఙ్మంత్రములు బహుళముగగల వానికి యజుర్వేదమనియు, సామ మంత్రములు బహుళముగ గల భాగము నకు సామమనియు, అధర్వాంగిరస్సులను మహర్షులచే కనుగొనబడిన మంత్ర బ్రాహ్మణాత్మక విభాగమునకు నధర్వణ వేదమనియు, వ్యవహారము కలిగెను. ఈ వేదములకు పూర్వాపరభావము నిర్ణయింప శక్యము కానిది. వేదములు నిత్యములు, అనాదులు. అనాదులైన వేదములను, కల్పాదియందు బ్రహ్మచే ననుజ్ఞాతులైన మహర్షులు తమ సమాధి ప్రజ్ఞచే నందుకొని శిష్యుల కందింతురు. అవి యట్లు పారంపర్యముగ వచ్చును. కల్పాంతమువఱకు ప్రవర్తించును. కల్పాంతమునందు వర్ష్ప్రభావముచే పునః అంతర్హితము లగుచుండును. పునః కల్పాదియందు మనుష్యులచే గ్రహింపబడుచుండును. కాన నివి యాదివిధురములు. అనగా అనాదులు. "యుగాంతేఽంతర్హితాన్ వేదాన్, సేతిహాసాన్ మహర్షయః, లేభిరే తపసాపూర్వమ్, అనుజ్ఞాతా స్వయంభువా". బ్రహ్మనైనను, వేదములను-కల్పాంతరస్థమైన వానిని, యనంతర కల్పాదియందు, వెనుకటి కల్పము

నందు ఎట్టి యానుపూర్వితో, ఎట్టి స్వరవైశిష్ట్యముతో విలసిల్లెనో, అట్టివానిని తాను స్మరించి, లోకమున కందించును. కాన వేదములు తద్గతానుపూర్వితో, స్వరముతోసహా అనాదులు, నద్వైక రూపములు. "కర్తాపి బ్రహ్మా వేదస్య, నపూర్వక్రమతోఽస్యతః, క్రమం కరోతి (సూత సంహిత-(శ్రీ కుప్పా లక్ష్మావధానులుగారు). వేదాదులను ప్రమాణముగ గ్రహించుటలోనవి కేవలము మతగ్రంథములనియు కనుక పరివర్జ్యములనియు యనుకొనరాదు. పాశ్చాత్యులును వారి యవసరము నిమిత్తము వారు గ్రహింపక తప్పలేదు. మత మనినంతనే యులికిపడుట న్యాయముకాదు. నాగరకతా చిహ్నమే మతము.

"Civilisation needs a religion as a matter of life and death" (George Bernard Shaw-Back to Methuselah). "Men think they can do without religion. They do not know that religion is indestructable" (Dr. Radhakrishan - Ideaistic view of life). Science has outgrown her original materialistic arrogance. "Higher Science has now all the stuff of spiritual thought and is as mystic as the Upanishads themselves." (Rajaji - Convocation address in Agra). "I say that is the Sanatana Dharma, which for us is Nationalism. This Hindu Nation was born with the Sanatana Dharma, with it, it mones and with it, it grows. When the Sanatana Dharma declines, then the Nation declines and if the Sanatana Dharma were capable of perishing, with the Sanathna Dharma it would perish. The Sanatana Dharma, that is Nationalism, that is the message that I have speak to you" (Aurobindo - in Uttarapara Speech). "Russians, at any rate, have never ceased to be a deeply religious people and I would expect them to reinstate God officially at some not too distant date" (John Grigg - Bhavan's journal 4-12-66).

## ఆర్యశబ్ద విచారము :

"ఆ సమంతాత్ వర్తన్తే అత్ర ఇతి ఆర్యాః (నామ లింగానుశాసన సుధా వ్యాఖ్య-భానుజీ దీక్షితులు) ఎచట నంఘటను వ్యాపించియుండువారు 'ఆర్యుల'ని యర్థము. ఎచట ననగా చెప్పబడునని విచారించి చూచినచో—

ఆ సముద్రాత్ వై పూర్వాత్, ఆ సముద్రాచ్చ పశ్చిమాత్
తయోరేవ అంతరంగిర్యోః, ఆర్యావర్తం విదుర్బుధాః

ఇతి మనుః (2-22)

అను దానినిబట్టి ప్రాక్పశ్చిమ సముద్రములకు మధ్యదేశ మంతటను వ్యాపించియున్నవారని యర్థము. 'తయో రేవాంతరంగిర్యోః' అను దానికి ఉదయాచ లాస్తాచలములుగా సమన్వయించుకొనవలెను. కుల్లూకభట్టు వారిట్లు వ్రాసిరి :

ఆ పూర్వసముద్రా దా పశ్చిమ సముద్రాత్ హిమవద్వింధ్యయోశ్చ యన్మధ్యంత మార్యావర్త దేశం పండితా జానంతి మార్యాదాయా మయమాఙ్, నాభి విధౌ, తేన సముద్రమధ్య ద్వీపానా మార్యావర్తతా. ఆర్యా అత్రావర్తన్తే పునః పునః ఉద్భవన్తి త్యార్యావర్తః.

పై శ్లోకమునే అమరకోశ వ్యాఖ్యాత 'మహేశ్వరుడు' నుదాహరించెను. ఈ విషయము కల్పద్రు కోశమున-

పూర్వ పాశ్చాత్య యో రబ్ధ్యోః, నదీ యావచ్ఛరావతీ
ఆర్య పర్యాయతః స్థానం, ఆవర్త మపి వాచ్యవత్.

పూర్వ పశ్చిమసముద్రములకు మధ్య, శరావతీనది యెంతవఱకు కలదో యా మధ్యదేశమునకు ఆర్యావర్తమని పేరు. కల్పద్రుకోశమునందు, సాధు, సభ్య, ఆర్య, సజ్జన, శబ్దములు పర్యాయములుగా నీయబడినవి. అందే ఆర్యశబ్దమునకు విద్వాంసుడనియు, ఖాపుగుడనియు నర్థము చెప్పబడినది.

"అర్తుం యోగ్యః అర్యః"

అనగా శుభకర్మముల ననుసరించువాడును, పాపకర్మములను దూరీకరించువాడునని యర్థము (ఆరాత్ దూర సమీపయోః - అమరకోశము). వశిష్ఠ స్మృతి సుధావ్యాఖ్యలో -

కర్తవ్య మాచరన్ కామం
అకర్తవ్య మనాచరన్
తిష్ఠతి ప్రకృతాచారే
సతు ఆర్య ఇతి స్మృతః

అని చెప్పబడినది. శాస్త్రవిహిత కర్మముల చేయువాడును, శాస్త్రనిషిద్ధ కర్మములను వదలి వేయువాడును ఆర్యుడని తాత్పర్యము.

"ఆర్యుడనగా ఈశ్వరపుత్రుడని వేదమాతయే నిర్దేశించుచున్నది. యాస్కాచార్యులును, సాయనాచార్యులును ఆర్యుడన ఈశ్వరపుత్రుడని నిరుక్తమునందును, వేదభాష్యమునందును వ్రాసియుండిరి." (శ్రీ కోట వేంకటాచలము)

న కశ్చిత్ వేదకర్తా చ, వేదం స్మృత్వా చతుర్ముఖః।
తథైవ ధర్మాన్ స్మరతి, మనుః కల్పాంతరేఽంతరే.

(పరాశరస్మృతి 1-21)

అని కదా వేద స్వరూపము. ఋగ్వేదములోని "అహం భూమి మదదా మార్యాయదాశుషేమర్త్యాయ" (4-26-2-2) "అహం దదామార్యాయాహం వృష్టిమ్" (4-26-2-2) "అపావృణోర్జ్యోతి రార్యాయ" (2-11-18) యనునవి యార్యుని యందు భగవదనుగ్రహమును సూచించుచున్నవి. కనుక శ్రుతులలో, స్మృతులలో, నిఘంటువులలో నార్యశబ్దము మన వాఙ్మయమున కన్పించుచున్నది. వేదములు ప్రపంచములోనే ప్రాచీనములు కదా! ఆర్యుడనగా సజ్జనుడు, మాన్యుడు, అని యర్థములున్నవే కాని యితరుల నాగరకత నాశనముచేయు దుర్మార్గుడని కాని, స్వార్థపరుడని కాని యర్థములు లేవు.

## ఆర్యశబ్దము ద్విజాతులకే పరిమితమా ?

పై నిర్వచనములనుబట్టి ద్విజాతులుమాత్రమే యార్యులనుకొనుట కవకాశములేదు. పై లక్షణములుగల్గిన వారందరు ఆర్యశబ్దవాచ్యులే. "స్థూలముగ నాలోచించినచో ఆ కాలములో నార్యులనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులనబడిన నాలుగుజాతులవారని యర్థము. అస్పృశ్యులావర్గములో చేరరు. ఎవ్వడార్యుడో యెవ్వడనార్యుడో చెప్పుట కష్టము" (శ్రీ నెహ్రూగారి భారతదర్శనము). శ్రీ నెహ్రూగారుచేసిన విభజనతో నేనేకీభవించుటలేదు. ద్విజాతులనే యార్యులుగా మన ప్రాచీన గ్రంథములలో వ్యవహరించిరి. "ఆర్యానార్యయోర్వ్యతిక్షేపే కర్మణస్సామ్యం సామ్యమ్" (2-1-69 గౌతమధర్మ సూత్రములు) అను సూత్రమునకు 'హరదత్త మిశ్రాచారి' 'ఆర్యాస్త్రైవర్ణికః' అనియే వ్యాఖ్యానించిరి. ఈ వ్యాఖ్యానములో త్రైవర్ణికులను సూచించు నార్యశబ్దము బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు

ముగనే గ్రహింపవలెను. లేనిచో పై ప్రమాణములన్నియు వ్యర్థములగును. అట్లగుట సూత్రకారుల తాత్పర్యముకూడ కాదు. నేడు హిందూమతమని వ్యవహరింపబడుదానిని లోగడ ఆర్యధర్మమనియే వ్యవహరించుచుండిరని శ్రీ నెహ్రూగారే 'డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో వ్రాసిరి. ఆర్యధర్మము సర్వులకును వర్తించునదియే కానియాధర్మానుష్ఠాతలలో కొందరిని మినహాయించునది కాదు. "ఆర్యావర్తః పుణ్యభూమిర్మధ్యం విన్ధ్యహిమాలయోః" (ఆర్యా ధార్మికా వర్తన్తే అస్మిన్నిత్యార్యావర్తః వృతువర్తనే—పుణ్యాచ సాభూమిశ్చ పుణ్యభూమి) అని నిర్దేశము చేసినను, మొత్తము భారత ఖండమంతయు నార్యావర్తమయినట్లే, ఆర్యులని త్రైవర్ణికులని యొక ప్రయోజనము కొఱకు నిర్దేశము చేసినను, భరత ఖండములోని యార్యధర్మావలంబకు లంద ఱును ఆర్యులనియే చెప్పవలెను.

## తొలియార్యు లెచ్చట పుట్టెను?

పై పొద్దులను స్థూలముగ ప్రమాణముగ తీసికొనినను ఆర్యులు భారత దేశములోని వారేకాని వెలుపలివారుకారని తేలుచున్నది. ఆర్యులు వైదేశికులను వాదమునకు మన ప్రాచీన గ్రంథములననుసరించి స్థానమే లేదు కదా! ఆర్యావర్తమని యెంత దేశముగ పైన నిర్ణయించినది ఆర్యులు తొలిగా విస్తరించిన స్థలమేకాని తొలియార్యుడైన స్వాయంభువమను వవతరించిన ప్రదేశము కాదు. తొలిగా యేర్పడిన బ్రహ్మర్షి దేశము విశేషముగ వినుతింప బడినది.

> ఏతద్దేశ ప్రసూతస్య, సకాశాదగ్ర జన్మనః
> స్వంస్వం చరిత్రం శిక్షేరన్, పృథివ్యాం సర్వమానవాః
>
> (మనుస్మృతి 2-20)

తొలి సృష్టి జరిగినది సదాచార లక్షితమైన బ్రహ్మావర్తములో. బ్రహ్మావర్తమనగా –

> "సరస్వతీ దృషద్వత్యోః. దేవనద్యోర్యదన్తరమ్
> తం దేవనిర్మితం దేశం, బ్రహ్మావర్తం ప్రచక్షతే"
>
> (మను-2-17)

బ్రహ్మావర్తము సరస్వతీ దృషద్వతుల నడిమిప్రదేశము. అచ్చటనే ప్రజాపతి యైన బ్రహ్మ మానవరూపమును పొందెను. "బ్రహ్మా అత్ర అవర్తతేపునః

పునః ఇతి బ్రహ్మోవర్తః." ప్రళయానంతర సృష్టి యందు ప్రజాపతియిచట మానవరూపము మాటికిమాటికి ధరించును. "మహిక్షేత్రం పురుశ్చంద్రం వివిద్వాదిత్సఖిభ్యశ్చరథం స మైరత్ ఇంద్రోనృభిరజినద్ది ద్యానఃసాకంసూర్యముపసంగాతుసాగ్నిం" (ఋగ్వేదము3-8-31-15) "అవాసృజస్సర్తవే సప్తసింధూన్" (ఋగ్వే-1-350; 4-3-7-1) "దృషద్వత్యాం మానుష అపయాయాం సరస్వత్యాం రేవ దగ్నేదిదీహి" (ఋగ్వే-3-2-24-4) "యోనిం దేవకృతం" (ఋగ్వే 3-33-4). పై శ్రుతులు బ్రహ్మసృష్టిని గూర్చి పై విషయములకు ప్రమాణములుగ నున్నవి. కనుక భారతముననే ప్రథమసృష్టి యైనట్లును, తొలియార్యు డిచ్చటనే జన్మించినట్లును మన గ్రంథముల వలన స్పష్టము. ఆర్యులు భారతీయులే యనుభావము నిశ్చితముగనుండుటచేతనే వివేకానందు



డిట్లనెను: "And what your European pundits say about the Aryans swooping away the land of the aborigines and settling in India by exterminating them, are all pure nonsense foolish talk. Strange, that our Indian scholars too, say amen to them; and all these monstrous lies are being taught to our boys. This is bad indeed."

## ఆర్యదేశము హిందూదేశ మెట్లయ్యెను :

"మన పురాణేతిహాసములలో 'హిందూ' అను పదము కన్పట్టదు. క్రీ. శ. 8వ శతాబ్దములోనిదైన ఒక తాంత్రిక గ్రంథమున 'హిందూ' అను పదము వాడబడినదని వినుచున్నాము. ఏ మతము వారని కాక, యొక దేశము ప్రజలను అభిప్రాయముతో నా పదము ప్రయోగింపబడినది. పార్శీల మత గ్రంథమైన 'అవెస్థా'లోనను, పాతపార్శీ భాషలోనను ఆ పదము ప్రయోగింపబడినది. కనుక చిరకాలము వాడుకలో నున్నది. పశ్చిమ ఆసియాలో ఇరాన్‌లో, టర్కీలో, ఈజిప్టులో, ఇండియన్, హింద్ అనెదరు. మతముతో నిమిత్తములేక భారతీయమైన విషయము లన్నిటికి 'హింద్' అనియే అనెదరు. భారతీయులను అమెరికావారు హిందువు లనెదరు. నిజమునకు వారి ప్రయోగమంత తప్పుకాదు. హిందీ అని వాడినచో మఱియు మంచిది. కాని మనదేశములో హిందీ అనినచో దేవనాగర లిపికి పర్యాయ పదమయినది. ఇండియన్, హిందీ, హిందూస్థానీ యనెడి మాటలలో దేనినయినను మన సంస్కృతికి పర్యాయపదముగ వాడవచ్చును" (శ్రీ వెప్రహా).

సప్తసింధువులను గూర్చిన వేదవచనము పైన నుదాహరింపబడినది. సప్త సింధువులనగా నేడు నదులు. కొందఱు వీనిని (1) గంగ (2) యమున (3) సరస్వతి (4) శతద్రు (సట్లెజ్) (5) పురుష్ణి (రావి) (6) చంద్రభాగ (చీనాబ్) (7) సింధు – అని చెప్పుదురు. ఇవియన్నియు పంజాబు పరిసరముల లోనే యున్నవి. మఱికొందఱు–

గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదా సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు.

అను స్నాన శ్లోకములోనివిగా చెప్పుదురు. రెండవ అభిప్రాయమే, సమీచీనముగ కన్పించును. ఏలయనగా కాశ్మీరము మొదలుకొని కన్యాకుమారి వఱకును ఒక్కటిగా భావించి యందలి పుణ్యనదులను స్మరించు శ్లోక మిది. మాతిదగ్గఱ స్నానము చేసినను, ఈ శ్లోకమునే పఠింతురు. అనగా దేశభావనము, తదంతర్గత పుణ్యనదుల స్మరణమిందు ప్రాధాన్యము వహించుచున్నది. దేశ దక్షిణభాగమునమున్న నదులును ఇందురలవు. ఈదేశము తొలుత 'సప్తసింధు' దేశముగ ప్రశస్తివహించి పర్షియన్ భాషలో "హా ప్తహిందు"గా కొంతకాలమై, హిందు మిగిలి, హిందూదేశమైనది. పైదేశికుల నోళ్ళలో హిందు, ఇండ్ అయి, కొనకు ఇండియా అయినది. సింధుస్థానమే హిందూస్థానమైనది. ఆ వ్యవహారము ఇప్పుడును కలదు. సింధుస్థాన మనుపేరు ఈ దేశమునకు ప్రాచీనమైనదే.

సిన్ధు స్థాన మితి జ్ఞేయం । రాష్ట్ర్ మార్యస్య చోత్తమం
మ్లేచ్ఛ స్థానం పరం సిన్ధోః । కృతం తేన మహాత్మనా

(భవిష్య పురాణము–2 అ.)

సిన్ధు స్థానమనగా హిందూదేశమే. మ్లేచ్ఛ స్థానమనగా నిర్వచన మీ క్రింది విధముగ నీయబడినది.

చాతుర్వర్ణ్య వ్యవస్థానం । యస్మిన్ దేశే నవిద్యతే
మ్లేచ్ఛ దేశ స్సవిజ్ఞేయః । ఆర్యావర్తః తతః పరం

(లింగాభట్టీయోదాహరణము)

భారతదేశము నందంతటను చాతుర్వర్ణ్య వ్యవస్థయున్నది కనుక, దేశమంతయు నార్యావర్తమని వ్యవహరింపబడుచున్నది. ప్రాచీన కాలమునుండియు దీనికి నార్యావర్తమని పేరుండియున్నది. అందుచేతనే దీనిని యార్యదేశ

మను పేరుతో వ్యవహరించెడివారని చైనీయులు వ్రాసినారని శ్రీ సెప్రహే గారు భారత దర్శనములో వ్రాసినారు. దక్షిణాపథముకూడ నార్యావర్త ములోని భాగమేకాని వేఱుకాదు. పై శ్లోకమును శ్రీ ముదిగొండ వేంకట రామశాస్త్రిగారు నాకు వెదకియిచ్చిరి. జీవునే పశువుగా భావించు యజ్ఞ మొకవిధమైనది. ప్రత్యక్షముగ పశువునుపట్టి చేసెడి యజ్ఞ మొకటి. యజ్ఞీ యమైన దేశ లక్షణమునుగూర్చి మను విట్లు చెప్పెను :

కృష్ణ సారస్తు చరతి మృగోయత్ర స్వభావతః
సజ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛ దేశ స్త్వతః పరః

(మను-2-23.)

యజ్ఞము ఆర్య ధర్మమున ప్రముఖస్థానము వహించుచున్నది. యజ్ఞ మొక్కడు చేసినను సామూహికముగ చేసినట్లే. ఆ యజ్ఞములవలన దేవతల కును, మనుష్యులకు సత్సంబంధములేర్పడి వర్షములు కురియుట, పంటలు పండుట, ఉత్పాతములు లేకుండుట జరుగును. యజ్ఞము భారత దేశ ములో జరిగినను విశ్వమున కేమేలు జరుగును. దేశమునకు జరుగుటలో నాశ్చర్యములేదు. యజ్ఞములు వర్ణ వ్యవస్థపై యాధారపడియున్నవి. కృష్ణ సార మెచ్చట తిరుగునో యది యజ్ఞీయ దేశముగ నిర్వచింపబడినది. కనుక సింధుస్థాన మన్నను, హిందుస్థాన మన్నను, ఆర్యావర్తమన్నను ఒక్క టియే యని తేలినది. అది యజ్ఞీయమైన దేశము. బ్రహ్మావర్తము, బ్రహ్మర్షి దేశము, మధ్యదేశము, ఆర్యావర్తము, దక్షిణాపథములోని ప్రాచ్యక, దక్షిణ, పశ్చిమదేశము- ఇవియన్నియు యజ్ఞీయదేశ ప్రాంత ములే. మహాభారత యుద్ధానంతరము ఉత్తరాపథము మ్లేచ్ఛస్థానముగ గణిం పబడినదని కొందరనుచున్నారు. ఇందులో 17 రాజ్యము లుండెడివనియు నవి (1) బాక్ట్రియా, (2) అఫ్గనిస్థాన్, (3) బెలూచిస్థాన్, (4) పశ్చిమో త్తర సరిహద్దురాష్ట్రము, (5) ఉత్తరబాహ్లీకములో (బాక్ట్రియా) కొంత యును, దరదరాష్ట్రము కొంతయును కలిసిన రష్యన్ తుర్కిస్థాన్‌లోని భాగముగా పేరు వహించిన వనియును చెప్పుచున్నారు. మ్లేచ్ఛ స్థానమును ఆర్యులు పరిపాలించుట కలదు. ఆర్యులు పైనుండి వచ్చిన వారయినచో బహిఃప్రదేశమును మ్లేచ్ఛస్థానమని చెప్పికొనరుకదా!

భారతవర్షము : పురాణ వచనములు :

ఆర్యావర్తమంతయు నొక్కటే యను సమ్యక్ దృష్టి మన పూర్వులకు గలదు. దానిని తమ సంతతివారికిని సంక్రమింపజేసిరి. "ఓం తత్సత్ శ్రీ బ్రహ్మణో ద్వితీయప్రహరార్థే, వైవస్వత మన్వంతరే, అష్టావింశతి తమే కలియుగే, కలి ప్రథమచరణే ఆర్యావర్తాన్తర్గతైకదేశే..." ఈవిధముగ శుభాశుభ కర్మముల సందర్భమున సంకల్పము చేయుదురు. "వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే..." ఈ విధముగ మన ప్రాంతములో సంకల్పము చేయుదురు. అచ్చటి యార్యావర్త మను పేరు మొత్తము దేశమున కన్వయము. ఇచ్చట భరతవర్షమనియు భరతఖండ మనియు రెండు విభాగములు కన్పించుచున్నవి. భారతవర్ష మనగా నేమి?

ఇదంతు మధ్యమం చిత్రం, శుభాశుభ ఫలోదయం
ఉత్తరం యత్సముద్రస్య. హిమవద్దక్షిణంచ యత్
భరణాచ్చ ప్రజానాంవై, మను ర్భరత ఉచ్యతే
నిరుక్త వచనాచ్చైవ, వర్షం తద్భారతం స్మృతం.

(వాయుపురాణము 1-45-75, 76)

భారతము దక్షిణ సముద్రమునకు ఉత్తరమునను, హిమాచలమునకు దక్షిణమునను నున్న భాగమనియు, స్వాయంభువ మనువు ప్రజలను భరించుటచే భరతుడైనాడనియు వాతని సంతతి వసించుభూమి కనుక భారతవర్షమైనదనియు సారాంశము. భారతవర్ష సమ్యగ్భావనము మన పూర్వుల కెంతకలదో దీనివలన వెల్లడియగుచున్నది. ఈ హద్దులనుబట్టి చూచినచో దక్షిణభారతము భారతములోని భాగమేకాని వేరుకాదు. (వేరని యనెడి వారుండిరికనుక నిది చెప్పవలసి వచ్చినది). మత్స్య పురాణమునను ఇట్టి యర్థముగల శ్లోకమున్నది. ఇట్టిదే మరి యొకటి-

ఉత్తరం యత్ సముద్రస్య
హిమాద్రేశ్చైవ దక్షిణం
వర్షం తం భారతం నామ
భారతీ యత్ర సంతతిః.

(విష్ణు పురాణము)

ఆర్యులకు భారతులనియు వ్యవహారమున్నది. "ఇమ ఇంద్ర భరతస్య పుత్రాః" (ఋగ్వేదము). భారతవర్షమనగా విస్తృతమైన ప్రదేశమనియు నందు భరతఖండమునుమాత్రమే మీ దేశమువారు స్వయముగా పాలింతురనియు, శేష భాగమును ప్రతినిధులతో పాలింతురనియు కొందరందురు. భరతఖండ మనగా సిన్ధుస్థానమే ననియు, ననగా వర్ణాశ్రమ ధర్మయుతమై ఆర్యావర్త ముగ పరిగణింపబడిన యజ్ఞియదేశ మనియు, ననగా సింధునదికి తూర్పుగా నున్న ఆసేతుహిమాచల పర్యంతమైన ప్రదేశమనియు చెప్పుదురు. భారతవర్ష మునకు పై లక్ష్యములలో ఉత్తర దక్షిణహద్దులు మాత్రమే చూపబడినవి. "భారతవర్ష మనగా ఆఫ్రికాలోని బెల్జియమ్-కాంగోలోని గణాన్య భాగ మున నిరక్షరరేఖ కుత్తరమునగల కొలటి భూభాగము, అబిసీనియా, అరే బియాలోని దక్షిణభాగము, ఇరాన్‌లోని దక్షిణభాగము, ఆఫ్గనుస్థానము, బెలూచిస్థానము, ఇండియా (పాకిస్థానుతోకలిసి), సిలోను, బర్మా, థాయి లాండు, ఇండో-చైనా, కంబోడియా, మలేస్టేట్సు, ఫిలిప్పైన్సు, సుమిత్రా, బోర్నియో మొదలుగాగల భూభాగములు, ఇప్పుడు పసిఫిక్ సముద్రములో కొంత భాగము, బంగాళాఖాతము, సముద్రగామియైన 'గాండ్వానాలాండు' అనెడి భూభాగ ప్రదేశమునగల అరేబియా సముద్రము, పర్షియా సింధుశాఖ మొదలుగాగల జలభాగము (చూ. – శ్రీ కోట వేంకటాచలముగారి బ్రహ్మాండసృష్టి విజ్ఞానము). కిం పురుష వర్షము చైనా ప్రాంతము. ఇంకను ఈ విషయము పరిశీలింపవలసి యున్నది.

## "సర్వబీజం, ద్విజోత్తమ !"

"పూర్వే కిరాతా యస్యాంతే పశ్చిమే యవనాస్స్మృతాః
దక్షిణే మలయోయస్య హిమవానుత్తరేతథా
త దేత ద్భారతం వర్షం, సర్వబీజం, ద్విజోత్తమ !
బ్రహ్మత్వ మమరేశత్వం, దేవత్వ మపి దుర్లభం"

(మార్కండేయ పురాణము)

భారతదేశము సర్వబీజమనుటవలన సృష్టియిచ్చటనే జరిగి, పిదపనే మానవ కోటి ప్రపంచమంతటను వ్యాపించెనని స్పష్టపడు చున్నది. అప్పుడార్యు లిచ్చట కెచ్చటినుండియో వచ్చిరను వాదమున గవకాశముండదు కదా !

కాలమానములుగాని, ఖగోళశాస్త్రములో నక్షత్రములకు నక్షత్రములకు మధ్య నుండెడి వేలు, లక్షల, మైళ్ల దూరములుగాని మనపూర్వుల కేమియు నాశ్చర్యముగ కన్పడవు. కనుకనే డార్విన్ సిద్ధాంతమువంటి సిద్ధాంతము యూరపు ప్రజలలోలాగున భారతప్రజలను కలవరపఱుపవు. యూరపులోని ప్రజాసామాన్యము బుద్ధి కాలమానములో వేయి సంవత్సరములకు మించి పోలేదు" (శ్రీ నెహ్రూగారి భారతదర్శనము). "మానవకోటి శైశవదశ నీ ప్రదేశమునందు గడిపెననియు, జ్ఞానాంకురము లిక్కడ నవ్వెననియు హిందువులు పొందుచున్న అనుమానముతో సర్ వాల్టర్ రాలె (History of the worldలో) సంపూర్ణముగ నేకీభవించుచు వారి వాదమును బల పఱచుచున్నాడు. ప్రప్రథమమున మానవులు క్రుమ్మరిన దేశము భారతమని యాతని దృఢవిశ్వాసము (Hindu Superiority by Sri Harivilasa Sarada). మాక్సు ముల్లర్, పోకాక్ ఇట్టి యభిప్రాయములు కలవారే. "The Indians are innumerable like grains of sand, free from deceipt and violance. They bear neither death nor life" (Max Muller). "ప్రాచీనార్యులు లోకమంతటిలో పెద్ద జాతి" యని యొక గ్రీకు చరిత్రకారుడనెను. "ఇతర ప్రజలందఱు కలిసి యెందరుందురో హిందువులంతమంది కలరు" (హెగియస్). 'ఆర్యావర్తము లోని నగరములన్నియు వెదకియుండుటకుగాని లెక్కించుటకుగాని సాధ్యము కాదు" (Arayan-History of Nations). "క్రీ. శ. 16వ శతాబ్దము వఱకును 'కనోజ్' పట్టణమున 30,000 తాంబూలపు దుకాణములును, 60,000 గాయకమేళములు నున్నట్లు చెప్పబడుచుండెను (Historical researches Vol II). "ప్రాచీనకాలమున భారతవర్షమున దొంగలన నేమో యెఱుగరు (Strabo). "In valour they excelled all other Asiatics; they required no locks to their doors; above all, no Indian was ever known to tell a lie" (The History of Indian people-W. W. Huntur). మన సంస్కృతి లోను, నైతిక ప్రవర్తనములోను, భోగభాగ్యములందును శాస్త్రవిజ్ఞాన మందును జాతి యున్నతస్థితియందున్నది. ఆది యూరోపునకు గురువుగానుండి, గుంపులు

గుంపులుగ తిరిగి, ఒడ దొంగలుగ నున్నజాతికాదు ఆర్యజాతి. మోసము, హింసా దౌర్జన్యముల యందు ప్రవర్తించు జాతికాదు ఆర్యజాతి. ఇతరులట్లున్న వారుండ వచ్చును. "The Europeans became in time many races and tribes and that they, mixing with the barbarians became themeselves savages, have been clearly proved by the researches of the European scholars (Vide-Keller's "The lake dwellings" and Taylor's "The origin of the Aryans").

శనకైస్తు క్రియాలోపాదిమాః క్షత్రియ జాతయః
వృషలత్వం గతాలోకే బ్రాహ్మణాదర్శనేన చ॥
పౌండ్రకాశ్చౌఢ్ర ద్రవిడాః కాంభోజాః యవనాశ్శకాః
పారదా పహ్లవాశ్చీనాః కిరాతా దరదాఖశాః
ముఖ బాహూరుపజ్జానాం యాలోకే జాతయో బహిః
మ్లేచ్ఛవాచ శ్చార్యవాచ స్సర్వేతే దస్యవః స్మృతాః.

(మనుస్మృతి)

వారందఱు వేదోక్త కర్మలను విడుటవలన దస్యులై పోయిరి. వారివంశమున నిట్లున్నది:

శకాః యవన కాంభోజాః పరదాః పహ్లవాస్తథా
కోలిసర్పాః సమాహిషాః దర్వాశ్చోళాః సకేరలాః
సర్వేతే క్షత్రియాస్తథా తేషాం ధర్మో నిరాకృతాః
వశిష్ఠ వచనా ద్రాజన్ సగరేణ మహాత్మనా.

కనుక పరశకులు, యవనులు మొదలైన వారందఱు క్షత్రియులు. కొన్ని దోషములచే వారు ధర్మబాహ్యులైరి. "The severest social penalty which Can be inflicted upon a Hindu is to be put out of his Caste (A brief history of Indian People - W. W. Huntur)." ఈ క్షత్రియాది జాతులు ధర్మనిరతులైన క్షత్రియార్యులపై పోరాడి యోడిపోయి దస్యులైరి. పరశకులు పారసీకదేశము (ఇరాన్) నేర్పఱచుకొనిరి.

"The aryans denounced the people who gave trouble to them as Dasyus and expelled them from the country. These expelled Aryans instead of repenting, styled themselves as 'Videvas' (discarders of the Devas) and composed a holy book for themselves called 'Videvodata'. The modern name of the book is 'Vendidad' held very sacred by Zorastrians. The name means "displacement of the Devas or the opposition to Devas". Here are a few of their aspertions against our ancestral Aryans. "Zorathustra" who was their leader says "I discard the Devas; they are evil, wicked, liars, false, cheats, destructors, and the source of mischief. I open'y discard them with all my heart" They included India, the Vedic god of the Aryans in the list of evil siprits. But they worship 'Vritraha' (a title of Indra) as a great messanger of the Gods. This must look odd. Dr. Hague says in respect of this "It looks strange at the first glance that we find one and the same Vedic god Indra in his Proper name-Indra entered into the list of devils, but by his epithet 'Vritraha' worshipped as a very angel (The genesis of the Human race). "పారసీకులువారి 'వెండిడాడ్ గ్రంథ' 'ఐర్యనవైజో' – (అనగా ఆర్యభూమిదేశము) మొదలుగాగల పదునారు నివాసయోగ్యమైన భూములను దేవుడు సృష్టించినట్లు చెప్పుకొనిరి. అదే బ్రహ్మావర్తము–అనగా ఆర్యావర్త దేశమున పంజాబునకు తూర్పుననున్న ప్రదేశము" (ఆర్యుల ధ్రువనివాస ఖండనము.) ప్రొఫెసర్ రాత్ గారి యభిప్రాయ మిట్లున్నది :
"The Veda and the Avesta flow from one fountain like two streams; the one of which, the Vedic, has continued fuller, purer, and truer to the original character, while the other has become in many ways polluted (Journal of the German Oriental Society for 1848). యజ్ఞధ్వంసనాది కృత్యములు ఆచరించుట, కర్మభ్రష్టులగుట, దోచుకొనుట మొదలైన దుష్కృత్యములను వారు ఆచరించినను, వారికిని చాతుర్వర్ణ్య వ్యవస్థ, ఉపనయనాది సంస్కారములు మఱియొకరూపముగ వారు చాలకాలము వఱకు నిలుపుకొనుచునే వచ్చిరి. వారికిని ఆర్యావర్తమున నుండువారికిని పోలికలు విశేషముగ నున్నవి. "The zorastrians were a colony from Northern India. They had been together for a time with the people (Aryans) whose sacred songs have been preserved to us in

the Veda. A schism took place and the zorastrians migrated to Archosia and persia" (Max Muller-Science of languages). "In the Vedas as well as in the older portions of the Zind-Avesta(See the gadhas) there are sufficient traces to be discovered that the zorastrian religion arose out of a vital struggle against a form which the Brahminical religion assumed at a certain early period ' (Mr Hang's essay on the Parsees.)కనుక శకులు భారతీయార్యులే యని తెలియుచున్నది. వారు పిమ్మట వలసపోయిరి. నేటి ఆఫ్ఘనుస్థానము, అనగా ఆనాటి గాంధారదేశముగూడ హిందూదేశ భూభాగములోననే యుండెడిది. గాంధార అనుపదము ఇపుడు 'కాందహార్' అయినది. కురురాజపట్టమహిషి గాంధారి గాంధారరాజ పుత్రికయే. నేటి నవఢిల్లీ పరిసరములలో నుండిన హస్తినాపురము ఇంద్రప్రస్థము నాటి ముఖ్యపట్టణములు. ఇండియా సరిహద్దు భూములగు కాబూలు, కాందహార్, సెయిస్థానులు అనేకశతాబ్దములు భారత రాజ్యభాగములుగ నుండెడివి.... ఫ్రెంచి తత్త్వవేత్తయగు James Dar Mestaler ఈ ప్రదేశమును గూర్చి "ఇచ్చట హిందూ నాగరకతయే యున్నది. ఈ ప్రాంతమును శ్వేత భారతమని పిలచెడివారు. ముస్లిముల దండయాత్ర వచ్చువరకును ఇవి ఇరానీ ప్రభావము కలవిగా గాక భారతీయ ప్రభావమునే కలిగియుండెడివి" అని వ్రాసెను (భారత దర్శనము). వాస్తవమునకు అఫ్గనుస్థానప్రాంతము యవన క్షత్రియుల రాజ్యములోనిది. ఇటీవలనే యిది మహమ్మదీయరాజ్యమయ్యెను. (క్రీ. శ. 1026లో).

## గ్రీకులు:

యవనక్షత్రియుల విషయము, 'చరిత్ర తారుమారయ్యెను' అను ప్రకరణమున చెప్పబడినది. వారును దస్యులే యనుటకు ముందటి శ్లోకములే దృష్టాంతములు. వారి దేశనిర్ణయము మీ ప్రకరణారంభ శ్లోకములచేయున్నది. గ్రీకులును యవనులును ఒకరుకారు. యవనరాష్ట్రములనుండి యవనక్షత్రియులు భారతీయనాగరకతను తీసికొని పోయి తుదకు క్రీ. పూ. పదియవ శతాబ్దమున గ్రీకులను అనాగరకపు కొండజాతివారిచే ఓడిపోయి కలిసి పోయిరి. అందువలన అయోనియా గ్రీసయ్యెను. గ్రీకులకుపూర్వచరిత్ర లేదు. 'హెరొడోటస్' అనువాతడు (480 B. C) కాకమ్మ కథలతో నొకచరిత్ర రచింపగా, నది నశింపగా, 'హెకటాయస్' యను నాతడు జ్ఞాపకములతో

నొక చరిత్ర రచింపగా నదియునశింపగా, ఈరెంటి పునాదులతో J. B. Bury (1918) గారొక చరిత్రను రచించి దానిని ప్రామాణికముగా గ్రహించునట్లు చేసెను... దానిలో నాతడు గ్రీకులని క్రీస్తుపూర్వము మూడువేల సంవత్సరముల నాటివారనియు, వారిలో అయోనియనులను వారు వలసవచ్చి అయోనియాను మధ్యాసియాలో స్థాపించిరనియు చరిత్రను తలక్రిందులుచేసెను. అయోనియా యను పేరెట్లు వచ్చినదో నిర్ధారింపలేకపోయెను. (దీనిలోని రహస్యమిది.)

"Thus the western people and their historians endevour to establish that their forefathers in the distant past were the origional inhabitants of their lands and that some of them migrated to other lands in later times, established colonies and spread and extended their sway over other lands, distorting and adopting the traditional stories and sources of their hostory to suit the flattering thesis. By confident assertion and regular repetition such false versions come to be accepted as facts of real historical validity in course of time, in one or two centuries more." (Sri K. Venkatachalam). యవనుల చరిత్రమును వారు గ్రీకు చరిత్రముగ మార్చివైచిరి. అలెగ్జాండరునకు పూర్వ మప్పుడప్పుడు యవనులు దేశభాగములపైకి వచ్చుటయు నిచ్చటి రాజులు తరుముటయు గలదు. వారు గ్రీకులు కారు. "It proved beyond doubt that long before the birth of Greek history a wonderful people has lived along the eastern coast of Greece. Perhaps this people had lived there for thousand of years before the Greeks drifted down from the North. But, who were these artists who had built Mycenae and Tiryans? What was their relation to the Greeks?...... The Illiad is a story of pre-historic Greece, and yet the life it describes, the customs, the objects are not those of the early Greeks at all, but those of a civilisation on a much higher level. We know that when the Greeks first emerged into the light of history they were a crude and simple people" (Lost worlds - Adventures in Archaeology - by Anne Tarry White). అని కొందరు పాశ్చాత్యులే గ్రీకు నాగరకత విషయమై సందేహమును వెలిబుచ్చిరి. "It proves beyond doubt that long before the birth of Greek history a wonderful people

had lived along the western coast of Greece" (Ibid). ఈ సందేహమును పోకాక్‌గారు తీర్చుచున్నారు. "The whole of this state of society, civil, military must strike every one as being eminently Asiatic, much of it specially Indian. I shall exhibit dynasties disappearing from western India, appearing in Greece; clans whose martial fame is still recorded in the faithful chronicles of North - western India, as the gallant bands who fought the plains of Troy" (India in Greece). "That the religion of the Greeks eminated from an eastern source, no one can deny. We must therefore suppose the religion as well as the language of Grece to have been derived in great part from the east." (Pritchard's Physical history of man Vol I). పోకాక్‌గారు మరియు నిట్లను చున్నారు. "The early civilization, the early arts, the early literature of India are equally the civilization, the arts, and literature of Egpt, and of Greece-for Geographical evidences conjoined to historical facts and religious practices, now prove beyond doubt all dispute that the later countries are the colonies of the former" (India in Greece). ఇంత స్పష్టముగ పాశ్చాత్యులలో బుద్ధిమంతులు కొందరు భావించు చుండగా గ్రీసునుండి మిగిలిన దేశములకు విజ్ఞానము వచ్చినదని వారి నేమనవలయును ? "With a view presumably to convince the gullible Indian historian the account of these Yavana Kings has been elaborated with the help of coins which have no bearing in history. They also made much of some inscriptions and coins actually found in central and Western Asia and declaring them to have been discovered in the neighbour hood of 'Taxila'. They propounded a theory that the Kings of European and Persian Nationality inscribed on the same, ruled over parts of India, and thus garbled the history of ancient India." (Age of Buddha...)

18 వ శతాబ్దమున కొందరు యవన క్షత్రియులు దేశమును ముట్టడించి యుండవచ్చును. మగధ రాజులు వారిని తరిమి వేసిరి. "These Hindu Yavana invaders were wrongly identified as Greeks by the European orientalists perhaps with a view to glorify their conquests as Greeks were Europeans and their conquests are matters of pride and glory for all Europeans so

that the Hindus might feel their weakness and inferiority to the European races from remote antiquity and cultivate cowerdice and remains for ever in subjection" (Sri K. Venkatachalam). నాటి ప్రభువులు యవనాది క్షత్రియులను తరిమివేయుటకు కారణము కేవలము యజ్ఞ విధ్వంసనము, వారి కర్మలవారు నిర్వహించకపోవుటయేకాదు. దోచుకొనుట, స్త్రీలను బలాత్కరించుట, వధించుట మొదలగు నరాజక పరిస్థితులను సృష్టించుట మొదలైనవి కారణములు. అందుచేతనే వారిని మ్లేచ్ఛులనిరి. అట్టి పరిస్థితులలో నేనాగరక ప్రభుత్వమైనను అట్లే చేయును. కేవలము కర్మములు వదలిన వారును, ఏవియో కొన్ని దోషముల చేసినవారును భారతముననే యుండిపోయిరి. అరాజక పరిస్థితుల సృష్టించినవారు సంఖ్యా బహుళమైనందువలన కేవలము వారినిచ్చటనుంచి శిక్షించుట కవకాశములేక దేశబహిష్కారము చేసినట్లు కన్పించుచున్నది. అట్టి మ్లేచ్ఛులలో క్షత్రియులు బహుళముగ నుండినను బ్రాహ్మణులు కూడ లేకపోలేదు. వారు జ్యోతిషాది విద్యలయందు నిష్ణాతులు.

మ్లేచ్ఛాహి యవనాస్తేషు, సమ్యక్ శాస్త్ర మిదంస్థితం
ఋషివత్ తేపి పూజ్యస్తే, కింపునర్దైవవిత్ ద్విజః

బృహత్సంహిత (వరాహమిహిరుడు)

అట్టి వారిని విద్యావిశయముచే గౌరవించుట కూడ కలదు. పోరాటములు తగ్గిపోయిన పిదప వారికిని వీరికిని రాకపోకలు కలవు. "Brahmins used to visit "Athens" about the time of Socrates (469–339 B.C.). 'Euscbius' quotes a work on platonic philosophy by 'Aristatle' who states therein, on the authority of 'Aristoxenos', a pupil of Aristotle, that an Indian philosopher came to Athens and had a discussion with Socrates. WhenSocrates had told him that his philosophy consisted in enquiries about the life of man, the Indian philosopher is said to have smiled and replied that no one could understand things human who did not first understand things divine" (Max Muller).

మ్లేచ్ఛ యవన బ్రాహ్మణుడు యవనుడుపి 'యవనసిద్ధాంత' మను జ్యోతిష గ్రంథకర్త. దనుట్లైనపిదప వర్ణ మేలయుండునని యనుకొనరాదు. నేడు బ్రాహ్మణ క్రైస్తవులు, రెడ్డి క్రైస్తవులు, కమ్మ క్రైస్తవులు లేరా? క్రైస్తవ మతములో నీరూపమున కులములు లేకపోయిన కొన్ని తరముల వఱకును ప్రాతసంస్కారము పోవదు. శ్రీ దర్శి నిత్యానందశాస్త్రి యను నొక్కరు క్రైస్తవు లయినపిదప తమ వంశము క్రైస్తవులలో వృద్ధికారా దని వివాహమే మానివేసిరి. "వర్ణవ్యవస్థను ఎదిరించిన మతస్థులే చివఱ కొక వర్ణమయినారు. 180 వండ్ల క్రిందట క్రీస్తుమత మీ దేశములో ప్రవేశించి క్రమముగా వేళ్లుపారుచున్నది. దానితోపాటు మరొక వర్ణమును పెంపొందించినది. ఇండియాలోని ముసల్మానుల సాంఘిక వ్యవస్థ వర్గముల భేదముల నెంత ఖండించినను దాని ప్రభావముమాత్రము ఇస్లాముమీదకూడ పడకపోలేదు." (శ్రీ నెహ్రూ-భారత దర్శనము). కాశ్మీర ప్రభువు కలశుని యొద్ద లోష్టకుడను యవనబ్రాహ్మణుడు (క్రీ. శ. 1078–88) సలహాదారుగానున్న జ్యోతిశ్శాస్త్రవేత్త. మతగురులైన యవన పీరసాహిబులు ఆర్యరాజుల కంగరక్షకులుగను, సింహాసనాల పట్టుపాదులుగను నుండిరి. 12వ శతాబ్దమున వారు మహమ్మదీయులుగ చేయబడిన పిమ్మట వారి పూర్వ వర్ణములను వారు విస్మరించిరి. యవనులలో మతభేదము లుండెనని యంగీకరించినంత మాత్రమున వారివర్ణ మిప్పటికి వచ్చినట్లుకాదు. ఇప్పటి విద్యలే యిప్పటికి పోయెను.

"The Brahmins had advanced far in astronomy before the Greeks arrived in India. In medicine the Brahmins learned nothing from the Greeks, but taught them much. Arab medicine was founded on translations from Sanskrit works about 800 A.D. European medicine, down to the 17th century was based upon the Arabic." (W. W. Hunter's History of the Indian people). "The mythology of the Greeks was wholly founded on the Hindu mythology" (Max Mullar). కోలెన్ పండితుడిట్లనెను, "India is the source from which not only the rest of Asia but the whole western world derived its knowledge and religion." ఫ్రాన్సిపండితుడిట్లనెను. "Homer took his ideas from Ramayana" (Introduction to

Ramayana in French). అబుల్ కలామ్ ఆజాదుగారిట్లుఅనియున్నారు, "We find it stated in the accounts of Alexander that his teacher, had requested him to find out the state of knowledge among Indians......They contain accounts of his encounters with Indian philosophers......admit that philosophy had reached in India a higher stage than in Greece." (9-9-55. Bhavan's journal.)

"ఎవ్వరి తత్త్వసిద్ధాంతములు గ్రీసుదేశపు తత్త్వసిద్ధాంతములకు మేలుబంతులయ్యెనో, ఎవ్వరి గ్రంథములను ప్లేటో, తేల్సు, పైథాగోరసులును శుశ్రూషచేసినేర్చిరో, అట్టిహిందూఋషులను పోలినవారు మన కెక్కడ కన్పింపగలరు ?" (Tod's Annals and Antiquities of Rajasthan). చరిత్ర భారతదేశముననే ప్రారంభమైనది కాని, ఎచ్చటినుండియో యిచ్చటికివచ్చి సృష్టించినవా రెవ్వరును లేరు. గ్రీకుల గొప్పదనము చెప్పు చరిత్రకారులును వారిని నమ్మువారును ఉండిరి కనుక పురాణముల నుండియు, పాశ్చాత్యులలో బుద్ధిమంతుల వ్రాతలనుండియు నుదాహరణము తీయవలసి వచ్చినది. శ్రీకృష్ణునితో పోరాడిన కాలయవనుడు భారతీయుడే కదా! ఇచ్చటివారు దుష్టులను శిక్షించునప్పుడుకూడ కొన్ని నియమములు పాటించిరి. కొందఱకు తలలు గొరుగునట్లును, కొందఱకు సగము తలలు గొరుగునట్లును, మఱికొందరకు గడ్డములు పెంచుకొనునట్లు శిక్షలు విధించిరేకాని వారిని సంహరింపలేదు.

"The furions massacres perpetrated by Musalman invaders were more efficacious than ordhodox Hindu persecution, and had a great deal to do with the disappearance of Buddhism in several provinces" (Early History of India - V.A. Smith). భారత దేశము సర్వబీజమని పురాణములు చెప్పుచున్నను, దానిని ఋజువు చేయుటకు ఆధునికులు వ్రాసిన గ్రంథములు అల్పముగ నున్నవి కాని ప్రాచీనుల గ్రంథాగారములు తక్కువ. ఆ గ్రంథము లసలు వ్రాయబడలేదనుటకు వీలులేదు. అవి నష్టమగుట కెక్కువ అవకాశమున్నది. "The Rev. Fathers, Jesuits, Fansiseans, Srangar Missions and other corporations unite with touching harmony in India to accomplish a work Vandalism, which it is right to denounce as well as to the learned world as to orientalists.

Every manuscript, every Sanskrit work] that falls into their hands is immediately condemmed and consigned to flames. Needless to say that the choice of these gentleman always falls from preference upon those of highest antiquity, and whose authenticity may appear incontestable...... Every new arrival recieves a formal order, so to impose of all that may fall into his hands. Happily, the Brahmins do not open to them the secret stores of their literary wealth, philosophic, and religious " (Vide Louise Jaccoliots." Bible Le Indi and vide N. Chidambara Aiyer's Varahamihira Brihat Samhita, English translation-Introduction).

చిత్తశుద్ధిగల పాశ్చాత్య పండితుల వ్రాతలు కొన్ని యథార్థమును కొంతవరకు పూరించుచున్నవి. గణితము, జ్యోతిషము, గ్రీకులనుండి భారతీయులకు విజ్ఞానము వచ్చినదని కొందరు చరిత్రకారులు వ్రాయుటచేతను, యవనులు మొదట్లో నవారు విదేశీయులని వ్రాయుటచేతను, ఆర్యులు ద్రావిడ దేశీయులతో మిశ్రమమైన జాతియని వారు వ్రాయుటచేతను విపర్యయము విస్తరించవలసి వచ్చినది. యవనులు దస్యులగుదురే. భారత దేశమున ఎన్ని దండయాత్రలు వచ్చినను పల్లెసీమలు చెల్లుబడిలేదు. సర్వస్వతంత్ర గణములు సంరక్షింపబడుచునే యున్నవి. "ఒకరొకరి పడగొట్టి చెందిన వారు చిన్న ప్రభావశాలిగా నుండిరి. భారతము లెన్ని దాడులను, పఠానులు, మొగలాయీలు, మహారాష్ట్రులు, సిక్కులు, ఆంగ్లేయులు, ఒకరిపిమ్మట నొకరు ప్రభువు లయినను గ్రామ సంస్థలుమాత్రము చెక్కుచెదరలేదు. (Sir Charles Metkaf-Report of the Select Committe of the House of Commons-1832 Vol III page 33).

"The Smriti works, their commentaries, Grihyasutras, and Puranas, regulated every action, however minute and unimportant, of a Hindu life. The authority of these compilations has, in the absence of political power, saved the Hindus from being absorbed by the conquering races." (History of India Mahamahopadhyaya Haraprasada Sastry) ... The lives of the common people, their social conditions and systems of Local Government were barely effected by such conquests. Indian institutions have therefore a long unbroken history which

makes their study especially valuable...A caste may, therefore be defind as an endogamous group or collection of such groups bearing a common name and having the same traditional occupation, which are so linked together by these and other ties, such as the tradition of a common origion and the possession of the same tutelary deity, and the same social status, ceremonial observances and family priests, that they regard themselves and regarded by others, as forming a single homogenous community...One conqueror follows another, but the administration of each individual state remains unchanged either under the same prince or some other member of his family and the charters of monastries are renewed as a matter of course by each new overlord" (Cambridge history of India – E. J. Rapson).

అందుచేత వైదేశికులును ఆర్యులును మిశ్రమమై పోయిరని చెప్పుట ఆధారరహితమైనది. ఆచార విషయములలో కొన్ని నియమములు సడలి యుండవచ్చును కాని ఆర్యధర్మ మట్లే యవలంబింప బడుచున్నది. బ్రిటిష్ వారి దొరతనములో విక్టోరియా మహారాజ్ఞి మాగ్నాకార్టా దానికి నిదర్శనముకాదా? దేశములో మూడవవంతయిన సంస్థానములలోని ప్రజలలో ఆచార వ్యవహారములు వెనుకటియట్లే యుండి యున్నవికదా! అందుచేత ప్రజా జీవితములోని యార్యధర్మములో నెవ్వరును జోక్యము కలిగించుకొనలేదు. జాతి మిశ్రమము కాలేదు. ఎవ్వరయినను కొందఱు ఏ కారణముచేతనైన మతాంతరగులైనను, ఎవ్వరయిన ఇచ్ఛికముగ వైదేశికుల వివాహము చేసికొనినను, అది వ్యక్తిగతమైన విషయముకాని, మొత్తము జాతికి సంబంధించిన విషయము కాదు. అందుచేత భారతీయార్యజాతిని మిశ్రమజాతి యనగాదు. వైదేశికుల దండయాత్రలు వచ్చినప్పుడు వర్ణవిభేదములు [illegible] "The historical greeks are a mixed race" (Ibid).

"The Egyptians came, according to their records from a mysterious land (now known to lie on the shore of the Indian ocean): the sacred 'punt', the original home of their Gods who followed thence after their people who had abandoned them to the valley of the Nile, led by 'Amon, Hor, Hathor.' This region was the Egyptian' 'land of the Gods' "Brugsch Bey - History of Egypt" వారిదేవతలు అమన్ = బ్రహ్మ, హోర్ = హరి, హాథర్ = రుద్దర్. వారు నివసించిన ఈజిప్టు దేశమనగా దేవభూమి యనియు కలదు. అట్టి పుణ్యభూమి యని పిలవబడు దేశము ఆర్యావర్తము. ఆర్యావర్తః పుణ్యభూమిః. ఈజిప్టు చక్రవర్తులలో చాలమందికి శ్రీరాముని పేరు పెట్టబడినది. మొదటి రాముసీసు, రెండవ రాముసీసు, మూడవ రాముసీసు అను పేర్లు కలవు." (అశోకుని కాలము). వీరు మలబారు తీరమునుండి పోయిన వైశ్యులని ప్రొఫెసర్ హీరెన్‌గారి యభిప్రాయము (Historical Researches). వారు వారి దేశములో నార్యావర్తమును పోలిన 'పంతు' శబ్దము ప్రయోగించుటచే, దక్షిణ భారతమునకును ఆర్యావర్త నామము కలదని ఋజువగుచున్నది. "For many ages the Egyptians traded with the old homes and the reference here made by them to the princes of 'punt' and its fauna and flora, especially the nomanclature of various precious woods to be found in India, leave us scarcely room for the smallest doubt that the old civilization of Egypt is the direct out come of the older India" (Colnel Oolcott, Theosophist for March 1881.) పుర్రెలను పోల్చు శాస్త్రమునకు ఈ విషయము సరిపోయినది. "As to the form of head, I have now before me the skulls of a mummy and a native of Bengal from the collections of M. Blumenbach, and it is impossible to concieve anything more striking than the resemblance between the two, both in respect of the general form and the structure of the firm portions. Indeed the learned professor himself considers them to be the most alike of any in his numerous collections" (Heeren's Asiatic Nations Vol II)

[illegible]

నులు భారతదేశమునుండియే వెళ్ళిరనియు, టూటనులకు 'మనుస్' మూల పురుషుడనియు, వారికి నిద్రలేవగనే స్నానము చేయుట, వదులుగానుండి దిగువవఱకు వేలాడు అంగిలను ధరించుట, జుట్టును పొడుగుగా పెంచుకొని ముడివేయుట మున్నగు బ్రాహ్మణలక్షణము లుండెడివనియు శర్మలే జర్మను లైనారనియు చరిత్రకారులు వ్రాసియున్నారు. దానిని శార్మణ్యదేశ మనుటయు భరతదేశమున కలదు. 'పెరు' వాసులలో ఇంకాలనువారు సూర్యవంశపు రాజులమని చెప్పికొందురు. (Asiatic researches) బట్టలు కట్టుకొను విధము, చెప్పులు తొడిగికొను పద్ధతి, స్త్రీల వస్త్రధారణము భారతీయులను పోలెనని చరిత్రకారులు వ్రాసిరి. మెక్సికోలో, మనుష్యుని మొండెము, ఏనుగు తలగల గణేశుడు కన్పించును. రుద్రాక్షమాలను ధరించిన శివునివంటి చిత్రములును కలవు. ఆ చిత్రములను 'జాగృతి' ప్రకటించినది. అమెరికాలో సూర్య చంద్ర గ్రహణములకు రాహు కేతువుల సంబంధమును నమ్ముట, గణేశ్వర సూర్యారాధనములు, పునర్జన్మయందలి విశ్వాసము, దేవాలయములలో దీపారాధనము చేయుట, బిడ్డలను ఎత్తి యెత్తుకొను విధము, కూర్మావతార గాథను విశ్వసించుట, 7 వత్సరములు వచ్చునరికి పురుష శిశువున కొకవిధమగు సంస్కారము చేయుట మొదలైన లక్షణములు భారతీయులను పోలియున్నవి. "ఉత్తర అమెరికా"ను రమ్యక, హిరణ్యక, కురు, అనెడి మూడు భాగములుచేసి ప్రియవ్రతుడను చక్రవర్తి తన కొమరులకు పంచిపెట్టినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఆ కాలము స్వాయంభువ మన్వంతరములోనిది. ప్రాచీన కాలమున భారత దేశము మొదలు, అమెరికావఱకును కలిసి భూభాగమేకముగ నుండెడిది. సుమా రయిదుకోట్ల వత్సరములక్రిందట నదియంతయు సముద్రముచే నాక్రమింపబడి పసిఫిక్ సముద్ర మేర్పడినది. దక్షిణ అమెరికాలో 'పెరు' అను దేశముండిన భాగమున ఈక్వేటరు లగాయితు దక్షిణముగ నిఱువది డిగ్రీల దూరమువఱకు గోళముచుట్టు పూర్వము అనగా 12 కోట్ల సంవత్సరముల క్రిందట ఉప్పు సముద్రము చుట్టుకొని యుండెడిదని మన పురాణములు, సూర్య సిద్ధాంతాది జ్యోతిష గ్రంథములు చెప్పుచున్నవి (అశోకునికాలము–62వ పుట). అమెరికాకు వలసపోయిన భారతీయులు 'రెడ్ ఇండియనులు.' ఆంధ్ర, ద్రవిడ, నేపాలీ ప్రాంతములనుండి వెళ్ళినవారు. 'సోమము' అను పేరుగల ఒక తీగెను దంచి తీయబడిన రసమును, 5000 సంవత్సరములకు

పూర్వము వెలిగింపబడి ఆరకుండ వచ్చుచున్న దీపపుటగ్నిలో వ్రేల్చి నమస్కరించిన పిమ్మటనే ప్రతిదినమును వారు పనులలోనికి పోయెడివారట ! (Hindu America - Chamanlal).

ఉత్తరాశ్చాపరే మ్లేచ్ఛాః క్రూరా భరతసత్తమ
యవనా శ్చీన కాంభోజా దారుణా మ్లేచ్ఛ జాతయః
సకృద్గ్రాహాః కులత్థాశ్చహూణాః పరశకైస్సహ.

(భీష్మపర్వము)

చీనులు దారుణ కర్మములు చేసెడివారుగా గణింపబడుచున్నారు. "చీన తార్తారముల వంశావళీ పరిజ్ఞాతలు తాము హిందూరాజగు పురూరవుని కుమారుడగు అవరుని సంతతివారమని ప్రకటించుకొందురు" (Annals of Rajasthan-Page 35). జపానులోని 'హోరెంజి గుడి'లోని యర్చకుల గ్రంథములు బంగాళ లిపిలో నున్నవట. (Anecdota oxonensis Vol III)." క్రీ. శ. 1792 లో జపానులో నియమింపబడిన రష్యన్ కమిషనర్ పేరు 'లక్ష్మణ'. భారతవర్ష మంతటను ఆసియా యూరప్‌సహా నిత్యాగ్నిహోత్ర ముండెడిది. ధూప, అగ్ని, శబ్దములకు నేటికిని రష్యన్ భాషలో నర్థము మారలేదు 'బాకూ'లో నేటికిని అగ్ని దేవాలయమున్నది. 'మక్కా' అనబడునది 'మఖ' (అగ్ని) ఆరాధనమునకు సంబంధించినది. చైనా, టిబెట్, మంగోలియా, మంచూరియా మున్నగు ప్రాంతములలో గాయత్రి జపింపబడును. శ్రీ. శే. కేశవదేవశాస్త్రి యను ప్రఖ్యాత పండితుడు స్కాండినేవియా భారత సంబంధముల విషయమై వ్రాసిన వ్రాతప్రతి యొకటి మావద్ద నున్నది. స్కాండినేవియాను మొదట గనుగొన్నది హిందువులని వారు వ్రాసినారు. స్కాండినేవియా యను శబ్దము 'స్కంద నాభి' (వీరుల కేంద్రము) యొక్క వికృతరూపమని 'American Society for Scandinavian and Eastern studies' అధ్యక్షులు 'డాక్టర్ ప్లాగ్. మియర్' నాకు వ్రాసిన లేఖలో వివరించిరి. (శ్రీ పి. సి. ఓక్). కనుక పై విషయములన్నియును భారతీయార్యులు పై దేశముల కేగినట్లు ప్రమాణములుగ నున్నవి. మఱికొన్ని పరిశీలించెదముగాక-

"ఇండో చైనా తూర్పుభాగమున (చంపా) నొక శిలాశాసనమున పరమశివు డారాజ్యపు మహోన్నతదైవమని పేర్కొనబడినది. పాశ్చాత్యు

ఆచార్యులవారి ప్రశంస యొకదానిలోనున్నది- "యేనాధీతాని శాస్త్రాణి, భగవచ్ఛంకరాహ్వయత్, నిశ్శేషసూరి మూర్ధాళి, మాలాలీఢాంఘ్రిపంకజాత్" సర్వశాస్త్రముల నాలోచనముచేసిన భగవచ్ఛంకరులు నాకాచార్యులు, నేను వారి సన్నిధిలో నధ్యయనము చేసితిని-అని కంబోడియాలోని యొక ఆలయప్రతిష్ఠాపకులు వ్రాసికొనిన శిలాశాసనములో నున్నది. ఆచార్యుల వారిని గూర్చి యిచ్చట ప్రస్తావనము వచ్చినను భగవచ్ఛంకరులనియే వ్రాయుదురు (జగద్గురుబోధలు-2వ సంపుటము). ఇంచుమించు 800 సంవత్సరములక్రితము ఒక్క భారతదేశమునందే కాదు దూరప్రాచ్యదేశములు కంబోడియా, జావా, బాలీదేశములలోకూడ సంస్కృతము రాజభాషగా నుండెడిది. ఈ దేశములలో నిప్పటికిని సంస్కృత భాషలో పురాతన శిలాశాసనములు, తామ్రశాసనములుకనబడుచున్నవి(జగద్గురు బోధలు-4వసంపుటము.) దీనినిబట్టి భారతదేశమునకును మిగిలిన దేశములకును రాకపోకలు విరివిగా నుండెడి వనియు, ఆదిశంకరులంతవారియొద్దకువచ్చి కొందరు విద్యాభ్యాసము చేయుచుండెడివారనియు తెలియుచున్నది. దీనివలనభారతవర్షము స్వరూపమునుగూర్చి శ్రీ వేంకటాచలముగారి నిర్ణయము సరి యైనదిగనున్నట్లున్నది.

జావాలోని 'సింగ్సరి'లోని వినాయక విగ్రహమునకు చేతిలో 'మండ్రాయి' బదులు వెలగకాయయున్నది. బలిద్వీపములో నొక శివభక్తుని విగ్రహము చేతిలో గంటయున్నది. గంటపై వజ్రమున్నది. కుడిచేతిలో పుష్పమును, భుజముపై జందెమును, ప్రక్కన భగవద్గీతయు నున్నవి. "శిర్యాలోని వృద్ధపండితుడు వాయూనమంద్రి (మహేంద్ర) తన మధుర స్వరముతో జయద్రథ వధ, కర్ణునిపై యుద్ధమునకు వెళ్ళుచున్న ఘటోత్కచునికి కృష్ణుని యుపదేశము మాకు చదివి విన్పించెను. ఆకావ్యము స్రగ్ధర, శార్దూలము, అశ్వలలిత, గిరిశా, శిఖరిణి, పృథ్వీతల, వసంతతిలక వృత్తములతో రచింపబడినది. దాని భాష సంస్కృత మిశ్రితము. శిర్యాలో నిట్టి తాళపత్రి గ్రంథములు వేలాదిగా నున్నవి." అని బలిద్వీపమును దర్శించిన డాక్టర్ రఘువీరగారు వ్రాసిరి. వారు 'కారాంగాపమ్' వృద్ధరాజును కలిసినప్పుడు "హస్తినాపురి, గంగా, యమున, గోదావరి, కావేరి నేటికున్నవా? మీరు వానిని చూచినారా? నేనుకూడ వానిని దర్శించి నా అన్నగు పరమతృప్తి కలిగించుకొనగలనా? నేటికిని శుద్ధ బ్రాహ్మణులును, శబలబ్రాహ్మణులును, కృష్ణబ్రాహ్మణులును భారతమునమున్నారా?" యని ప్రశ్నలవర్ష

పేరు జీవాశ్రయ, ప్రెస్సుక్లబ్బుపేరు విశ్మవార్త (వేశ్మవార్త), ఒక గ్రంథ నామము 'శబ్దపండిత'; దాని యట్టపై యుధిష్ఠిర. మార్కండేయ చిత్రములుకలవు. పదధ్యాయములుగల దానిని 'సప్తపర్వ'యనిరి. 15,16, శతాబ్దములలో ఇస్లాందాడిని తట్టుకొనలేక 'ధీరవీర' యను నతడు అడవులకు పాఱిపోయెను. ప్రాచీన సంప్రదాయములు రక్షించుకొనదలచిన జావాప్రజలు 90 లక్షలు కలరు. ఆ హిందువులు భగవద్గీతకొఱకై అంగలార్చుచున్నారు." (డాక్టర్ లోకేశచంద్ర-ఆంధ్రపత్రిక 29-6-69, ఇండోనీషియాలో సుందర శివాలయవ్యాసము) ఇండోనీషియనులు వారి విమానమునకు 'గరుడ' యని నామకరణము చేసినట్లు తెలియుచున్నది.

"Java Dweepa is mentioned in the Ramayana as one of the places where 'Sugriva' sent out the monkeys in search of Sita. Ptolemy, geographer of Alexandrica in the 2nd century called the island, "Island of Barley". Inscriptions were written in the South Indian script of about 5th century and the language is Sanskrit. Similar scripts have been found in Borneo which can be of a century earlier......Their records are all Brahminical and Sanskrit continued to be the official language of inscriptions till the middle of 8th century after which it was replaced by ancient Javanese which is a mixture of Sanskrit and the local Polynesian dialects" (Dr. N. P. Chakravarty, Director General of Archeology). 6వ శతాబ్దమున కళింగ వంశము వారును, 8వ శతాబ్దమున శైవులును, 9వ శతాబ్దమున జావా మధ్య భాగమునకు చొచ్చుకొనివచ్చి పాలించినట్లు కన్పించుచున్నది. జావా ప్రాచీనభాష పేరు 'కవి'. ప్రస్తుత మాభాష నాటకముల యందును కవిత్వమునందును మాత్రమే వాడబడుచున్నది. 16వ శతాబ్దములో మాత్రమే ఇస్లామచ్చట ప్రవేశించినది. దానినెదిర్చినవారు నిలువలేక బాలిద్వీపమునకు పాఱిపోయిరి. అది హిందూరాజ్యమే. ఇప్పటికిని అచ్చట హిందూమతమే యున్నది. బౌద్ధవిగ్రహములు, వందలాది హిందూ దేవతల విగ్రహములు నేటికిని యచ్చట కలవు. కనుక ఇండోనీషియా ఆర్య రాజ్యమే యని తేలుచున్నది.

"It cannot be said that the culture enshrined language is irrelevant to modern conditions... Indonesia, Indo-China,

Japan, Korea, Combodia and other countries manifest the influence or Sanskrit culture. A recent survey of old archelogical relics in China and Central Asia has revealed that Sanskrit has been dominent in those regions for centuries. Some Sanskrit scriptures are reported to have been found on the Great Walls of China Sanskrit texts are found also on the scrolls and scaves exchanged between the emperors of China and the dignatories of other parts of Central Asia in the 16th 17th 18th Centuries" (Dr. Radhakrishnan - Sanskrit Viswaparishat Session Bangalore). ఇండోనీసియా ప్రభుత్వము, థాయిలాండు, కాంబోడియా, లావోస్, ఇండియాలు సహకరించి రాబోవు సంవత్సరమున రామాయణ సమావేశములను జావాలో జరుపుదురని ప్రకటించినది. నవమ శతాబ్దపు నాటి కవీశ్వరుడు 'యోగీశ్వరుడు' 'కవి' యను భాషలో వ్రాసిన రామాయణమునకు "International academy of Indian Culuures, New Delhi" వారు క్రిటికల్ ఎడిషను ఆంగ్ల వ్యాఖ్యలతో తీసికొని రానున్నారు. మనము జరుపవలసిన సమావేశములను వారు జరుపుచున్నందులకు వారి నభినందింపవలసి యున్నది.

మార్కండేయ పురాణమున వ్రాసిన "సప్తశతి" యనునది భారత దేశమున ఎంత సమగ్రముగ వర్ణింపబడియున్నదో తెలియుచున్నది. ఆర్యుల జన్మస్థానము భరత ఖండమే. ఇచ్చటినుండియే ప్రపంచమంతయు వారు విస్తరించిరి. అజ్ఞానముతో జన్మించి చీకటిలో తడుములాడుకొనుచు నుండిన వారు. ఆదిమ మానవుడు సాక్షాత్తు దివ్యుడుగాని, ఇల్లు కట్టుకొనుట చేతగాక చెట్లక్రింద పడియుండువాడు కాడు. వంట చేసికొనుట చేతగాక పచ్చిమాంసము తినువాడు కాడు. ప్రపంచమునకు సంస్కృతియు విజ్ఞాన మిచ్చినది భారతదేశము.... ఉదాహరింపబడిన 'ఏతద్దేశ ప్రసూతస్య' అను శ్లోకము ననుసరించి పృథివిలో సర్వ మానవులును భారతదేశము నుండియే జ్ఞానమును గ్రహించుట ఈశ్వరుని నిర్దిష్టము.

శిలలపైనను, నాణెములపైనను ఆధారపడిన చరిత్రకంటె పురాణములపై యాధారపడిన చరిత్ర మెంతో శ్రేష్ఠమైనది. వానికి ఆధారముగ నవి యున్నచో నష్టములేదు. కాని కేవలము వానిపై యాధారపడుట

న్యాయముకాదు. సింధులోయ సంస్కృతిని గూర్చి ఇంకను పరిశోధనములు జరుగుచున్నవి కాని యవి పురాణములు చెప్పిన సత్యమునే చెప్పవలసి వచ్చును.

"Finnish philologists at the Scandinavian institute of Asian studies, Copenhagen, have concluded that the basic alphabet of the Indus Valley script is composed of some 350 signs, according to a special publication of the institute... The study was made with the help of computers" (Indian express–9–10–69). The indus valley civilization is an out-come of Rigvedic period Its character is Aryan. (Professor K.A. Neelakantha Sastry-11th All India Oriental Conference, Hyderabad). మనవా రిదివఱకే యది యార్యమని నిర్ణయించి యున్నారు.

భూగర్భ శాస్త్రజ్ఞులుకూడ మొదటిప్రాణి భారతదేశమునందే పుట్టెనని యభిప్రాయపడియున్నారు. "And the ancient form of life occurs in India, near the eastern ends of the hills (The salt range of Punzab) (Vide Manual of Indian Geology XXIV - Professor Meddlicot, Superintendent of the Archeological Department of India). 'India is the first populated country' అని సర్ వాల్టర్ రాలేగారు వ్రాసిరి. రాష్ట్రపతి గిరిగారు అధ్యక్షత వహించిన సభలో ఆర్. బక్మినిష్టర్ ఫుల్లరుగారు (American, writer, philo-sopher, engineer, mathematacian) 14–11–69 న ఢిల్లీలో శ్రీ నెహ్రూ మెమోరియల్ ఉపన్యాసములో భారత దేశము 5000 సంవత్సరముల నుండి సర్వవిషయములలోను కొల్లగొట్టబడినదని చెప్పుచు నిట్లుచెప్పిరి:

"India has pure and crossbreed strains of all humanity and has the longest sustained known years of cultural con-tinuity. *Greater India is the millennium long homeland and base of world man*. Humans have migrated away from it for untold eons carrying the basic root language to all the world's shores. The wandering conquerors from time to time have come back to prey upon India, stealing her wealth away. They have exploited her long developing skills and have nibbled away her border lands. All the sovereign lands behind the Geography labelled India, were indeed claimed

by the strength of arms. The people of India have no more need to claim the land on which they dwell than need the oceans establish legal pretence to ownership of the spherical earth surface depressions which they fill. India is the one sixth segment of world-man society which had no ambition to conquer and for the moment happens to be confined geographically with in the Indian Peninsula by the world's masters-at-arms. It is the only the metaphysical that can rearrange the physical landscape to human advantage and the metaphysical proclivities are rampant in India. A large proportion of humanity's words were first formulated in India. The first known philosophy of humanity written in words is first found in India. India as a self willed and self-organised people can publicly affirm the ipso facto non-claimance to any sovereign lands. Such an act can catalyse the begining of humanity's realistic metaphysical validation of the a priori worth of human life in the universe. (Indian Express)

ప్రపంచములోని మానవులకు మాతృభూమిగా [illegible] [illegible] పుల్లరుగారంగీకరించుచున్నారు. వారు చెప్పునే భారతదేశమునకు వచ్చి చెప్పుట కనువిప్పు కాదా! కాని మీరు భారతదేశమునకు [illegible] సంకరజాతియు నున్నదని చెప్పుచున్నారు. [illegible] స్వతంత్ర్యమైన [illegible] ఏదేశమును చెప్పకోగలేరు [illegible] భారతీయులు [illegible] టను వారు గమనించుట మేలు గదా. కాని వారు చెప్పిన మిశ్రమునకు ఆంగ్లో ఇండియనులైనచో వాక్యము ఏమి బోధించుచున్నది. కాన నదియు స్వీకార్యమే. కాని వైదేశికుల మిశ్రమమునకు ఇప్పటి వర్ణాశ్రమ ధర్మ ప్రవర్తులున్నవారని వారనుకొనియు యుక్తమైనచో నది పెద్ద అసత్యము కాగ లదు. వైదేశిక చరిత్రకారులు ఇదివరలో నట్టి దుష్టమైన వ్రాతలు వ్రాసి యుండుట గమనింపదగినది. శకయవనాదులు క్షత్రియ జాతులలో కలిసి పోయిరనువాదమున కిదివరకే సమాధాన మియ్యబడినది. పైనుండి వచ్చిన తిరుగుబోతు విదేశులు భారతదేశమును కొల్లగొట్టిరని మీరు చెప్పుచున్నారు. అది కొంతవరకే సత్యము. వారి సానుభూతికి సంతోషమే. కాని చరిత్ర యదికాదు. ఆంగ్లేయుందరు ఈ దేశమున చేసినది కొన్ని హింసాకృత్యములు తప్ప ఏమియు లేదు. బ్రాహ్మణులు [illegible] పూర్తిగా [illegible]. శ్రీ ము

పూర్వము 4 వ శతాబ్దముననే బ్రహ్మక్షత్ర రాజ్యములు స్థాపింపబడెను. అట్లు పురాణములు చెప్పుచున్నవి. పురాణ చరిత్రను కాదనుటకు వీలులేదు.

"Modern European writers have been inclined to disparge unduly the authorities of the Puranic lists, but closer study finds in them much genuine and valuable historical tradition" (V.A. Smith). "These old geneologies with their incidental stories, are not looked upon as basis or substance but contain genuine historical tradition, and may well be considered and dealt with from a common sense point of view" (F. A. Pargitar, retired Judge, Calcutta High Court, Ancient Indian genealogies and Chronology). అందుచేత కొందఱు చరిత్రకారులును పురాణములపై కొంత ఆధారపడక తప్పలేదు. వారు కొన్ని విషయములలో దురభిప్రాయపడుట విషయము వేరు. బ్రహ్మక్షత్ర రాజ్యములున్నట్లు చరిత్రకారులును అంగీకరింపక తప్పలేదు. "Now there is a caste called Brahmakshatri, corresponding to this Brahma Kshatra, the members of which are found all over the Punjab, Rajaputana, Kathiawar, Guzarat, and even in the Deccan" (V.A. Smith - Early History of India). అంతేయేకాదు. బ్రిటిష్ సైన్యమునందును బ్రాహ్మణులు సిపాయిలుగా చేరుట లేకపోలేదు. "The Kanujya Brahmins, who supplied many Sepoys to the old army, used to say, if irritated "Ham Kshatriya Brahmin hain, as a boast." (Wilson's Indian caste & Smith's History - foot note). "బెంగాలులో రాజ్యము చేసిన సేన వంశమునకు చెందిన 'సామంతసేను'డను రాజు "బ్రహ్మక్షత్రియాన్వయుల శిరోదామ" అని విజయసేనుని యొక్క 'డియోపార' శాసనములో వర్ణింపబడియుండెను. (స్మిత్). "These ruling Brahmin dynasties were practically Kshatriyas. And from the most ancient times when Drona fought in the Mahabharata war down to the time of the Peshwas, Brahmin Kings and chiefs fought as bravely as the Kshatriyas" (Mahamahopadhyaya Haraprasadasastry's Indian History).

'Theogony of Hindus' అను గ్రంథమును చూచినచో నెందఱు రాజులు పరిపాలించిరని చెప్పిరో వివరములుకొన్ని తెలియగలవు. కనుక అలెగ్జాండరు పరాక్రమ మెక్కువగా చెప్పుటకు వీలులేదు. "అలెగ్జాండరునకు పూర్వము అస్సీరియా రాణి 'సెమిరమిస్' హిందూదేశముపై దండెత్తివచ్చుటకు మూడేండ్లు

పాటుపడి లక్షలసేన సమకూర్చెను. జుగియస్ అభిప్రాయము ప్రకారము 3 లక్షల పదాతులు, 5 లక్షల అశ్వములు, 2000నావలు, పెక్కు మాయ ఏనుగులు లొట్టె పిట్టలను మోయించుకొనిపోగా ఈ దండంతయు పారదోలబడి మూడవ వంతుమాత్రమే మిగిలి తుదకు ఆమె చనిపోయెను. తమ ఆలయములు బ్రద్దలుకొట్టవచ్చినవారినిమన్నింతురా?" (Murray's History of India). "అపజయము నెరుగని అలెగ్జాండరు సైన్యముతోవచ్చి యొకచిన్న హిందూరాజ్యమును జయింపగలిగెను. అదియును తక్షశిలాధిపతి – సహాయముచే-5000 సైన్యమును తీసికొని అలెగ్జాండరునకు తోడ్పడెను." (Imperial gezzateer of India). రుక్సానాయను గ్రీకుసుందరి పురుషోత్తముని చేతికి శ్రావణపూర్ణిమనాడు రక్షకట్టి చెల్లెలనుటచే అలెగ్జాండరునకు నాతడు ప్రాణభిక్షనిచ్చెనందురు.

"అలెగ్జాండరు శశిగుప్తుని (శశికోట్టస్) దేశద్రోహుల సాయముచే స్వాతలోయలో ప్రవేశించి 'ఉసుఫ్ జయీ' దేశమును జయింపగలిగెను" (Sir William Hunter). మగధాధీశ్వరుడు వచ్చుచున్నాడని విని అలెగ్జాండరునకు బెదురు పుట్టెను. ముందునకు పోయినచో అస్సీరియా రాణిగతి పట్టునని, ముందుగా 'కైనస్' అను సేనాని సలహానిచ్చుటచే సర్వనాశనము కాకుండ తిరోగమించెను. ఇటయే, అలెగ్జాండరు పరాక్రమము. అశోకుని సామ్రాజ్యములో ఆఫ్గనిస్థానము భాగమే కదా! "The empire comprised of the countries now known as Afganistan, as far as the Hindukush, Beluchistan, and Makran, Sind, Cutch, the Swat valley (Swat) with adjoining tribal territories, Kashmir, Nepal and the whole of India proper, excepting Assam, as far south as the northern districts of Mysore. The Tamil states of the extreme South were independant. It is possible, but not clearly proved, or perhaps probable, that the emperor also exercised jurisdiction in Khotan, now in Chinese Turkistan" (V.A. Smith, oxford History). మౌర్యచంద్రగుప్తుడు, గుప్తచంద్రగుప్తుని రాజ్యములును పెద్దవియేకదా! సముద్రగుప్తుడు జైత్ర

సంపన్నుడైన మహారాజుకదా! కనుక అమెరికను వేదాంతిచెప్పినట్లుగా ప్రతి పైదేశిక వీరునికి లొంగినవా రెవరున్నారు! గజనీమహమ్మదు కొంతభాగము మాత్రమే కొల్లగొట్టగలిగెను. దేశమునకు దురదృష్టము జయచంద్ర, పృథ్వీరాజు విభేదములతో మాత్రమేవచ్చెను. ఇది కుటుంబ కలహము. అనంగ భూపాలున కిద్దఱు కొమరితలు. అతనికి పుత్త్రి సంతానము లేదు. బదరికా వనమునకు పోవుచు ఢిల్లీ రాజ్యమును ఒక దౌహిత్రుడగు పృథ్వీరాజున కీయగా రెండవ దౌహిత్రుడగు జయచంద్రునకు కోపమువచ్చెను. నాగోర్ పట్టణమున పృథ్వీరాజునకు ధన నిక్షేపము దొఱకుటయు, చందేల్ రాజ్య మాతనికిలోబడుటయు జయచంద్రునకు కన్ను కుట్టునట్టుచేసెను. ఫలితముగ నతడు 'గోరీమహమ్మదు' నాహ్వానించెను. ఆ మహాబుద్ధిన్ గోరీ పదుమాఱులు పృథ్వీరాజుచేతనోడి,చెఱయందుంచబడి కరుణచేవదలిపెట్టబడి వగలూనినవాడు. స్థానేశ్వరయుద్ధములో క్రీ. శ. 1193లో పృథ్వీరాజును బంధించి కండ్లు పొడి పించిచంపి, పిదప జయచంద్రుని రాజ్యమైన కనోజిని ముట్టడించెను. జయ చంద్రునికి పశ్చాత్తాపము కలిగి నదీజలములో ప్రాణత్యాగము చేసెను, అప్పటి నుండియే భారతదేశమున మహమ్మదీయరాజ్య మారంభమైనది. వారుక్రమముగా మిగిలిన హిందూరాజులపై బడుట ప్రారంభించిరి. కాని దేశ మంతయు వారి కెప్పుడును లొంగలేదు. రాణాప్రతాప్, శివాజీవంటివారు వారిని నిదురపోనీయలేదు. కృష్ణరాయల పరాక్రమము జగద్విదితమే కదా! బ్రిటిష్‌వారు తంత్రముతో దేశ విభేదముల నవకాశముగ తీసికొని వ్యాపా రులుగా కొలదికొలదిగా నాక్రమించిరేకాని వారికిని సర్వమును లోబడ లేదు. మహారాష్ట్రులు, సిక్కులు చివరవఱకు లోబడలేదు. విదేశపాలనము తుదముట్టించుట కెప్పటికప్పుడు ప్రయత్నములు జఱుగుచునే యుండెను. 'సిపాయిల కలహ' మనుబడునది దేశ స్వాతంత్ర్య సమరమేకదా! మహమ్మ దీయులకును దేశము తేలికగా స్వాధీనము కాలేదు. **"The popular notion that India fell on easy prey to the Mussalamans is upposed to historical facts (W. W. Hunter).** పెద్ద విస్తీ ర్ణమును హిందూరాజులే పాలించుచుండిరి. బ్రిటిష్ ప్రభుత్వమునను 567 సంస్థానములు కలవుకదా! బ్రిటిష్‌వారిని దాదాభాయి నౌరోజీ, తిలక్, గాంధీ ప్రభృతులు తమ జాతీయాభిమానముతో దేశమునుండి పంపుటకు కృత నిశ్చయులై కార్యోన్ముఖులైరి. 'హిట్లరు' తలపెట్టిన ద్వితీయ ప్రపంచ

సంగ్రామము, ఆ యుద్ధములో నాంగ్లేయులు దుర్బలులై పోవుట, భారతదేశ
ములో నావికులలో కూడా తిరుగుబాటు వచ్చుట, దేశప్రజల దీక్షానిరతి-
ఇవన్నియు నేడు భారత దేశమునకు స్వరాజ్యము నిచ్చినది. ఆ వచ్చుటలో
దేశము ముక్కముక్కలైనది. 'పాకిస్థాను'ను చీల్పుటకు ముందు నా శరీ
రము చీల్చవలెనని గాంధీగారు చెప్పినారు. సంస్థాన రాజ్యములు సువ్యవస్థాన
ములో విడిపోయినచో తిరిగి సామ్రాజ్యము వలె యగునను ఆశతో దేశ
విభజన నంగీకరించిరి. అదృష్టవశమున దేశములోని 567 సంస్థానములు విలీనమై
పోయినవి. భారతీయులలో నిట్టి సంఘీభావముండునని ప్రపంచ మూహించలేదు.
"You Indians" Mr Khrushchev told me once "are an amazing People. How did you manage to liquidate princely rule without liquidating the princes?" (Sri K. P. S. Menon-Indian Express 23-4-69). ఇతర దేశములోనైన
రక్తపాతమై యుండెడిది. అట్లగుననియే పై దేశీయు లూహించిరి. దురదృష్ట
వశమున గాంధీగా రూహించినట్లు జరుగలేదు. పాకిస్థాన్ మిత్రతరపై భరి
నవలంబించుచున్నది. మనవారు మనపైననే దండెత్తినారు. అమెరికనీలు
'పట్టన్ టాంకులను' వారి కందించిరి. ప్రస్తుతము వారికి రష్యా ఆయుధ
సరఫరా చేయుచున్నది. అందుచేతనే శ్రీమతి ఇందిరాగాంధీగారు "మనల
నెవ్వరైనను ఒక చెంపమీద కొట్టినచో రెండవ చెంప చూపించుదురు. అట్లైన
పెరుగుట కిష్టపడరు" అని ఒక దక్షిణమువంటి మాట మాటాడినారు. అమె
రికను వేదాంతి ఫుల్లరుగారు చెప్పినట్లు సరిహద్దు భూములు సంకీర్ణమైన
మాట నిజమే. దానికి కాలము కలిసిరావలెను. దేశ విభజన కారణముగను,
హిందీ చీనీ భాయి భాయి యని టిక్కెట్లు తగిలించుకొను రోజులు పోయిన
కారణముగను, కొన్ని వేలమైళ్ళ సరిహద్దును రక్షించుకొనవలసిన యవసరము
దేశమునకు కలిగినది. పాకిస్థానము మన రాజ్యభాగమైన ఆజాద్ కాశ్మీర
మనబడు భాగములోని ముక్కను చైనాకు దత్తముచేసి క్రొత్త చిక్కును
తెచ్చిపెట్టినది. మనదేశ ప్రజలలోని వారికి కొందరకు ఆశ్రయమిచ్చి గొరిల్లా
యుద్ధ పద్ధతుల నేర్పుచున్నది. తాష్కెంటు ఒప్పందమునకు విరుద్ధముగ
ప్రవర్తించుచున్నది. ఆ దేశములోని యల్పసంఖ్యాకులను తఱుముచున్నది.
చైనా వైరముకంటె ఇస్లామీ వైరమే ఎక్కుడు ప్రమాదముగ కన్పించుచు
న్నది. ఈ పరిస్థితిలో దేశములోనివారు ఒకే త్రాటిపై నడువవలసిన యవస

సరమున్నది. హిందువులు కాని మహమ్మదీయులు కాని, క్రైస్తవులు కాని సోదరులవలె ఈ గడ్డపై బ్రదుకవలసినవారు. రాజ్యాంగ శాసన మందఱకును సమానావకాశముల కల్పించినది. ఇట్టి పరిస్థితులలో పైవా రెవరో మన దేశమునకు ప్రమాదమును తెచ్చిపెట్టుదు రనుదానికంటె, దేశమునందే విచ్ఛిన్నకరములగు ధోరణులు ప్రబలుచున్నవి. మతముకంటెను, భాషకంటెను, విచ్ఛిన్నలక్షణము కల్పించునది ఆర్య ద్రావిడులుగా మనుష్యులు భావించుకొనుట. భారతదేశమును క్రీస్తుపూర్వము పరిపాలించిన ఏ ప్రభువు తాను ద్రావిడుడనని చెప్పికొనలేదు. ఇటీవల పరిపాలించిన రాజులును చెప్పి కొనలేదు. వేంగీ చాళుక్యులుగాని సాహితీసమరాంగణసార్వభౌము డన బడు శ్రీకృష్ణదేవరాయలుగాని చెప్పికొనలేదు. అరవములోనున్న వానిని ద్రవిడ ప్రబంధములనుట మాత్రమే కలదు. ఈ ఆర్య ద్రావిడ విభేదము దేశారిష్ట దాయకము. చరిత్రలో నా విభేదమును విద్యార్థులు చదివిన పిదప వారికి దేశ సమైక్య దృష్టికాని, తాము స్వచ్ఛమైన జాతియను ఆత్మ గౌరవముకాని యెట్లు వచ్చును? దీనినిగూర్చి ఖేదనపడు పండితులు కలరు. వారిమాట లెవరువిందురు? కాని వారు చెప్పుట మానలేదు. "Indian Scholars placed in unfavourable circumstances and anxious to get recognition at university portals under social compulsion thought it more expedient to accept what men in authority had say rather than risk new or original interpretations. But all along the spirit of revolt against the interpretation continued" (Dr. G. N. Kaul M.Ed., P. Hd.). "ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు మదరాసు వచ్చినపుడును, మైసూరు ముఖ్యమంత్రి హనుమంతయ్యగారు వచ్చినపుడును గౌరవము చేయుచు మేయరు శ్రీ చిదంబరముగారు దక్షిణ భారతమునకు ప్రత్యేక సంస్కృతి కలదనియు, మైసూరు, తిరువాన్కూరు, మదరాసులతో దక్షిణ ప్రదేశ మేర్పడుట మంచిదనియు సెలవిచ్చిరి. ఆంధ్రను విడచినందులకు వారి నభినందించవలసి యున్నది. అయిన దక్షిణ దేశమునకు ఉత్తరదేశ మునకన్న భిన్నమగు నొక సంస్కృతి యున్నదా? హిందువులందఱు నవియే భారత రామాయణముల పఠింతురు. వేదమొక్కటే. అరవలకుగల తేవా

రము, వాలాయిరములు వారివే ప్రత్యేకములు. అవి యటనట నొక కాలమున పెంపొందిన- శైవ వైష్ణవ మతానుసారము- నాటి మాతృభాషలోని వ్రాతలనియే కాని వేదమునకు వెలియైన క్రొత్తభావము లందేమియులేవు. శుభాశుభములందు వారి వారి యనర్గ్రోత కర్మకాండ యంతయు నొక్కటే. దక్షిణ రాష్ట్రములో నన్నిట జుట్టు బొట్టు కట్టు యొక్క తరహాగా నున్నదా? అరవలు, మలయాళీలు పిరుదుముట్టులే ధరింతురు. కాని మళయాళీలు ఒంటిపోగ; అరవలు రెండుపోగలు. కన్నడిగుల జుట్టు బొట్టు కట్టులే వేరు. అసలు భిన్న రాష్ట్రముల వారు తమతమ ఆచార వ్యవహారములలో నందివుచ్చుకొనుచు, ఒకే వేదము ఒకే పురాణము, ఒకే స్మృతులు, ఒకే ఇతిహాసములు, ఒకే సంగీతము, శిల్పకళలు, ఇంకనుగల భేదములతో అవలంబించి అభ్యసించి, పెంపొందించుకొనుచు, భారత జాతీయతయందు భిన్నత్వమున ఏకత్వము సాధించుచున్నారు. ఆ వైనమును గుర్తించి ప్రత్యేక భావముల విడచి ఏకత్వ సంరక్షణకు పెద్దలు కృషిచేయదగును" (వ్యాఖ్యలు - 12-9-55 త్రిలిఙ్గ). ద్రవిడస్థాన వాదమొకటి యప్పుడప్పుడు వినబడుచుండుట విచారకరము. ఇది తమిళనాడులో తప్ప మిగిలిన దక్షిణ భారతమున నెచ్చటను వినబడుటలేదు. ప్రస్తుతము దాని తీవ్రత తగ్గినట్లున్నను ఆ బీజమంతరించను పోలేదు. వేరు రూపమున వెలికి వచ్చుచున్నవి. "Dravida Nadu" addressing a public meeting in the evening Mr Nedunchezhian said" that a Union of Tamila Nadu, Andhra, Karnataka and Kerala to be called 'Dravida Nadu'. was the aim of Dravida Munnetra Kazhagam. Existance of the ministries at the centre which were concerned with the internal affairs of states was unnecessary. The centre should limit itself to defence of the country, communications and other departments which had an all India bearing" (Indian Express, 3-11-69 pertained to the meeting held on 2-11-69 at Vijayavada). ఆంధ్ర రాష్ట్ర మేర్పడిన క్రొత్తరోజులలో రెండేసి రాష్ట్రములొక మండలముగా చేయదగునను కొన్ని సూచనలు బయలుదేరగా కొందరు కర్ణాటాంధ్రము లొక మండలము

కావలెననిరి. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు ఆంధ్ర మహారాష్ట్రములు ఒకే మండలముగ నేర్పడిన బాగుండుననియు సంస్కృతుల సాన్నిహిత్యము కలదనియు నభిప్రాయపడిరి. తమిళులతో నాంధ్రులు కలువవలెనను అభిప్రాయ మెవ్వరును ప్రకటించినట్లు కన్పడదు. కేంద్రము బలముగ నుండవలెనని మనము రాజ్యాంగ శాసనములో వ్రాసికొని తిరిగి దానిని సంకుచితపఱుప ప్రయత్నించుట న్యాయము కాదు. రాష్ట్రపతి గారు వేర్పాటు విధానములను హర్షించువారు కారు.

"We presume that these fissiparous tendencies may not have taken deep roots. But they can become real and pose a serious threat if we fail to take advantage of this underlaying unity and maintain the integrity and soverignity of our Natiion" (16-11-69 న బెంగుళూరులో భారతీయ విద్యాభవన కేంద్ర భవనావిష్కరణ సందర్భమున రాష్ట్రపతి- 19-11-69, Hindu)

కనుక ఆంధ్ర, కర్ణాటక, ద్రవిడ, కేరళ, దేశములను ద్రావిడ శబ్దముతో, లగింపచేసి ద్రావిడనాడు అనవచ్చునా? అసలు ద్రావిడులనగా నెవరు? అని విచారించుట అగత్యమగుచున్నది.

## ద్రావిడులు : చరిత్రకారులు :

ద్రావిడులనబడు వారినిగూర్చి చరిత్రకారులేమి వ్రాసిరో తెలిసికొనుట అవసరము. వాస్తవమున భారతదేశములోని యార్ష ధర్మావలంబులందఱును ఆర్యులేయని ఋజువుచేయబడిన పిమ్మట ద్రావిడుల ప్రసక్తి యవసరములేదు. కాని యార్య ద్రావిడ సంస్కృతులను మాటలు వాడబడుటచేత నీ విషయముకూడ విచారింప దగినదైనది. భారత దేశమున మొదటిజాతి 'నిగ్రిటోస్' అట! వారిని జయించి 'ఆస్ట్రోలాయిడ్సు' వచ్చిరట! వారిని జయించి ద్రావిడులు వచ్చిరట! వారిని జయించి ఆర్యులు వచ్చిరట! ఇవి-పాశ్చాత్యులు వ్రాసిన చరిత్రములును, వారి ననుసరించి మనవారు వ్రాసిన చరిత్రములును, నేడు కళాశాలలలో బోధింపబడు విషయములును. కనుక ఆర్యజాతికిగాని, ద్రావిడులనబడు జాతికిగాని యిది నా తొలిగడ్డ అని చెప్పికొను అధికారము లేకుండ పోయినది. "తాతకు

చేసిన తరోరియే తలక్రింద నున్నదను సామెతగా ఆర్యులును ఒకరిని బయిలుంచి వచ్చినవారే, ద్రావిడు లనబడువారును ఒకరిని బయిలుంచి వచ్చినవారే వైపోయినారు ఈ దేశమునకు. పాశ్చాత్య చరిత్రకారుల 'ట్రైబల్ థియరీ' (గుంపు సిద్ధాంతము) ప్రకారము జాతులు పోవుచుండురు. "The Dravidians are supposed to have entered India from the North-West and the existance of 'Brahui' in Beluchistan is taken as a proof of it. The Dravidians conform to the mediterranean races and scholars are of opinion that they were the builders of the ancient Cretan, Mycenean and Sumarian civilizations. The pre-Hellenic Asiatic people of Crete were known to the Greeks as Termilai while the Lycians of Asia-minor called themselves as Trimilli-two terms still survive in Tamil or Tamilian of South India. Coldwell indicated a connection between Susian and Dravidian languages as regards structure...Some of the Dravidians submitted to the Aryan conqueror while others left their houses in the North and migrated to the South and East in search of security" (Indian History and culture.) తమిళ భారతదేశమున అగ్ర ద్రావిడ భేదమునకు ప్రధాన భూతుడు బిషప్ కాల్డ్వెల్ మహాశయుడు! తమిళ దేశమునుండి యీ భాషను నేర్చుకొని యీ ఘనకార్యము నాతడు నెరవేర్చెను.

## ద్రావిడశబ్ద విచారము :

ద్రావిడ శబ్దమున కాధునిక విమర్శకులు విచిత్రమైన యర్థమును చెప్పిరి. "Dravid or the more ancient term 'Drum-id' means 'One who worships a tree-'id' means 'worship'-Agnium Idey Purositam '- The priests are worshippers of fire, says Rig-veda. Bakr-id and Id-Mubark, refer to *id* as 'worship'. A tribe of tree worshipping people was called by the fire-worshipping Aryans as 'Drumida' (V. C. Mowli). " అశ్వత్థ స్సర్వవృక్షాణాం' అని భారతమున భగవద్గీతలో కృష్ణ భగవానుడు చెప్పినట్లుగ వ్యాస భగవానుడు వ్రాసెను. అందుచేతనే ఆర్యులు అశ్వత్థమును శ్రీకృష్ణునిగ పూజింతురు. తులసీపూజ లక్ష్మీపూజగా నుండనేయున్నది. చెట్లును ద్రావిడులు పూజించుటచే ద్రావిడులై రన్నచో నార్యులును ద్రావి

డుతే కావలసివచ్చును. ఆర్యు లాకారణముచేత ద్రావిడులని యన్నట్లు ఏ గ్రంథమునను ప్రమాణములేదు. కల్పనము చేసినను నమ్మదగి నట్లుండవలెను కదా! మఱి నిఘంటువు ద్రావిడ శబ్దమునుగూర్చి యిట్లు చెప్పుచున్నది.

*ద్రావిడః:* ద్రావిడో దేశో అభిజనోऽస్యేతి. అణ్. దేశ విశేషజాతః (యథామహాభారతే 8-12-14-సాత్యకిః శ్చేదికాశ్చ ద్రావిడైః సైనికైః స్సహ) (రాజా రాధాకాంతదేవుని శబ్దకల్పద్రుమము-760వ పుట). కనుక ద్రవిడ దేశమునకు సంబంధించినవారు ద్రావిడులనుట స్పష్టము.

*ద్రవిడము:* ద్రవిడ దేశము తెలుగు దేశమునకును, మైసూరునకును దక్షిణముగ నుండునట్టియు, కొచ్చిన్ రాజ్యమునకును మలయాళ దేశము నకును తూర్పుగా నుండునట్టియు దేశమునకు పేరు (ఆంధ్ర వాచస్పత్యము). ద్రావిడులనగా భాషా పరముగనైనచో నఱవవారని యర్థము. ద్రావిడ శిరోమణి యని యప్పయ్య దీక్షితులవారిని గూర్చి జగన్నాథ పండితుడనెను. మన లెక్క ప్రకారము కుమారిలభట్టు జన్మము క్రీస్తుపూర్వము 557వ సంవత్సరము. అతడు ఆర్యావర్తమును ఆర్యావద మనుపేర వాడెను. ద్రావిడ శబ్దమును భాషాపరముగ వాడెను. కుమారిలభట్టు ఆంధ్రోత్కళ సరిహద్దు గ్రామమున జన్మించెను. జిన విజయమను గ్రంథమున "ఋషిర్వార స్తథా పూర్ణ మర్త్యా క్షివామమేళనాత్, ఏకీకృత్య లభేతాంకం క్రోధీస్యాత్ తత్ర వత్సరః. భట్టాచార్య కుమారస్య కర్మకాండక వాదినః, జ్ఞేయః ప్రాదుర్భవ స్తస్మిన్ వర్షే యౌధిష్ఠిరే శకే" యను ప్రమాణము చొప్పున పై కాల నిర్ణయము జఱిగినది. ఆయన ఆంధ్రుడు.

"ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయ మంగలే గ్రామే తస్మిన్ మహానద్యాం భట్టాచార్య కుమారకః ఆంధ్రజాతి స్త్రైత్తిరీయో మాతా చంద్ర గుణాసతీ యజ్ఞేశ్వరః పితా"....

ద్రావిడపదము దేశ వాచియైనచో తమిళ ప్రదేశమనియే యర్థము. పంచ గౌడులు, పంచద్రావిడులు అని వాడబడుటలో ద్రావిడ శబ్దమున్నది. ఆ విభాగము బ్రాహ్మణులకు సంబంధించినదే కాని మిగిలినవారికి సంబంధించినది కాదు. అది ఆర్య ద్రావిడ భాగము కానేకాదు. పంచ ద్రావిడులనగా-

"మహారాష్ట్రాంధ్ర ద్రవిడాః కర్ణాటాశ్చైవ ఘూర్జరాః
ద్రావిడాః పంచధా ప్రోక్తా వింధ్య దక్షిణ వాసినః"

ఈ శ్లోకమునుబట్టియే మహారాష్ట్ర, ఆంధ్ర, తమిళ, కర్ణాట, ఘూర్జరులందరు ద్రావిడులని చెప్పబడుచున్నారు. బ్రాహ్మణులని కాని పై ప్రాంతముల వారి నందరను ద్రావిడులని చరిత్రకారులు కాని మనసుకాని చెప్పుటలేదు. వీరందఱును ద్రావిడులను వాదమేలేదు. ఇది బ్రాహ్మణులవఱకే పరిమితము. వీరిలో మలయాళీలు లేకపోయినను తమిళులలో వారంతర్భవింతురు. అట్లే ఉత్కల, మైథిల, కనోజ, కాన్యకుబ్జ, సారస్వతు అనువారు పంచగౌడులు. పంచగౌడులని వీరిని వాడిరికాని పంచఆర్యులని వాడలేదను విషయము గమనార్హము. పంచగౌడులలో మిగిలిన బ్రాహ్మణు లంతర్భవించెదరు. పంచగౌడులకును, పంచ ద్రావిడులకును ఇచ్చి పుచ్చుకొను ఆచారము ప్రాచీనకాలమున లేదు. కేరళ బ్రాహ్మణులు తమిళ బ్రాహ్మణులలో నంతర్భవించుటచే ద్రావిడ దేశమనగా తమిళు లున్నచోటేకాక కేరళమును కూడ కలియునని కొందరనుచున్నారు. కాని దేశ విషయమును చెప్పవలసి వచ్చినప్పుడు కేరళమందు కలువదు. "చోలాః స కేరలాః" (హరివంశము) అని కేరళమునకు ప్రత్యేకత కలదు, ద్రావిడ దేశభాష తమిళభాష. దానిదే మన మఱవ మందుము. "కంచి యఱవత లనమాస్త్రి ఖడ్గలతలు" (కాశీ ఖండము). అరవము=ద్రావిడ భాష (శబ్ద రత్నాకరము). ద్రావిడ భాష యనగా అరవము, ద్రావిడదేశ మనగా అఱవదేశము-అందుచేత ప్రాచీన గ్రంథముల ప్రమాణము ననుసరించి వారే ద్రావిడులు- మహారాష్ట్ర ఘూర్జరాదులలో బ్రాహ్మణశబ్దము చేర్చినప్పుడే వారు ద్రావిడులుగ వ్యవహరింపబడుదురుకాని ప్రత్యేకముగ వారు ద్రావిడులుకాదు. వీరుతప్ప ద్రావిడ జాతి యనునది సృష్టిలోలేదు. నేను ద్రావిడులులేరని వ్రాసినప్పు డా యర్థములో ననియే గ్రహింపవలెను.

## మఱి చరిత్రములోని ద్రావిడులెవరు ?

చరిత్రలో ద్రావిడులనబడు వారు చారిత్రకులచే కల్పింపబడిన ఒక జాతి. అందుచేత వారు వారినిగూర్చి స్పష్టముగ నేమియు చెప్పలేరు. కొన్ని యూహలను యథార్థము లనుకొనునట్లు ప్రచారము చేసిరి. "Though conquered and subjugated, the Dravidians continued to be a force to be reckoned. Gradually they were admitted into the Aryan social structure as

the Sudras". ఇట్లు చరిత్రకారులు వ్రాయుటచే వర్ణ వ్యవస్థను గూర్చి యీ ప్రకరణమున కూడ ప్రస్తావించుట తప్పని సరియగుచున్నది. వర్ణము లనునవి సంఘమను చేతికున్న వ్రేళ్ల వంటివి. ఏ వ్రేలు లేకపోయినను గుప్పిలి దుర్భలమయిపోవును. ఇది యేదోవిధముగ మిగిలిన చోటులను కలదు. "ఆర్యుల జాతివారే యైనను ఇరానియనులలో కూడ చాతుర్వర్ణ్య విభజన జరిగినది. ప్లేటో వ్రాసిన రిపబ్లిక్ అను గ్రంథములో ముఖ్యముగ ఈ చాతుర్వర్ణ్య విభజనను పేర్కొనెను." (శ్రీ నెహ్రూ భారత దర్శనము). భారతదేశమున వారి వారి కుల ధర్మముల నెఱవేర్చుకొనుచునే యన్య ధర్మము నాశ్రయించిన వారును కలదు. . . ద్వాపర యుగమున ద్రోణా చార్యులు శస్త్రమును చేపట్టిరి. పరశురాముని విషయము చెప్పనే యక్కఱ లేదు కదా! విదురుడు మంత్రిత్వము నెఱపెను. క్రీస్తునకు పూర్వము 4 వ శతాబ్దమున బ్రహ్మక్షత్ర రాజులు రాజ్యముల స్థాపించిరి. . . వారు బ్రాహ్మణులే. ప్రమర, తోమర, శుక్ల, పరిహారులను వారు ఆ రాజ్యములు పాలించినవారలను మూలపురుషులు. ప్రమరుడు శ్రీశైలమును రాజధానిగ చేసికొని ఆంధ్ర మహారాష్ట్ర దేశముల పాలించెను. తోమర వంశము, చాహుమాన లేక చౌహాన్ అను పేర్లతో కూడ పిలువబడుచుండెను. శుక్ల వంశమునకు చాళుక్య, సోలంకి యను నామములుకూడ నున్నవి . . . సాలంకాయన శాఖ ఇందులోనిదే. చాళుక్య వంశము బ్రహ్మక్షత్ర వంశ మనగా నాశ్చర్యము కలుగవచ్చుచు. "వేంగిని పరిపాలించిన కుబ్జ విష్ణు వర్ధనుని మొదలు విమాలాదిత్యుని వఱకు 26 గురు చాళుక్యరాజులు రాజ్యముచేసిరి.- వీరి శాసనములలో చంద్రవంశ క్షత్రియులమని చెప్పికొన లేదు. పశ్చిమ చాళుక్యుల శాసనములందును చంద్రవంశ క్షత్రియులమని చెప్పికొనలేదు.

క్రీ. శ. 11వ శతాబ్దములో విమలాదిత్యుడను చాళుక్యరాజు సూర్యవంశీయుడనని చెప్పికొనెడి మొదటి "రాజరాజు" అను చోడరాజు కొమరిత 'కుందమాంబాదేవిని' వివాహమాడిన పిమ్మట చాళుక్యరాజులు చంద్రవంశజులమని వ్రాసికొనుట ప్రారంభించిరి. అందు భీమనభట్టుచే వ్రాయ బడిన 'రణస్థిపూడి' శాసనము మొదటిది" (కలిశకవిజ్ఞానము). అప్పటినుం డియు వారికి క్షత్రియులమని చెప్పికొనుట మోజయ్యెను. నేడును రెడ్లు కానివారు రెడ్డియని పేరుపెట్టికొనుట, బ్రాహ్మణులు కానివారు

ధారుసాంప్రదాయికముగ వ్రాసికొనెడి నామములు వ్రాసికొనుట కలదు కదా! కొందఱు వారిగులములకు బ్రాహ్మణశబ్దము చేర్చుకొనుట కలదు కదా! బ్రాహ్మణులుకానివారి కాంక్షితకోటలుగను బ్రాహ్మణశబ్దము తగిలించుటకలదు కదా! ఇదియొక మోజు. క్రీస్తుపూర్వము 392వ సంవత్సరమునందు రాజపుటానాలోని అర్బుద పర్వతముమీద (అబూ) యజ్ఞవేదికను కల్పించి క్షాత్రతేజమును స్వీకరించి యప్పటి శక, యవన, హూణ పహ్లవాదుల నిర్జించుటకు కంకణము కట్టుకొనిరి. అగ్నియందు హోమాదులాకృత్యమునకై చేయుటకై అగ్నివంశపురాజులనియు, క్షాత్ర తేజమును స్వీకరించుటచే బ్రహ్మక్షత్రులనియు వారు పిలువబడిరి. అట్లుచేసిన నలుపురిలో ప్రమరుడు సామవేది. చపహాని (చయహాని) యజుశ్శాఖీయుడు. శుక్లుడు ఋగ్వేది. పరిహారకుడు అధర్వణవేది.

ప్రమరశ్చమహీపాలో దక్షిణాం దిశ మాస్థితః
రాజపుత్రాఖ్య దేశేచ చపహానిర్మహీపతిః
శుక్లోనామ మహీపాలో గత ఆనర్త మండలే
చిత్రకూట గిరేర్దేశే పరిహారో మహీపతిః.

కొందఱు ప్రమరుడు యాంధ్రుడందురు. కొందఱు నలుగురును ఆంధ్రులే యందురు. ఈ అగ్నివంశపు రాజులలో మొదటివాడయిన ప్రమరుని వంశములోననే విక్రమాదిత్యుడు జనించి ఉజ్జయనిని పాలించెను. చపహానివంశములోనివాడు పృథ్వీరాజు. వీరందఱు బ్రాహ్మణులైనను క్షత్రియసంప్రదాయములనుసరించినవారు. గుప్తరాజు లంతరించిన పిదప ప్రమరాదులు ప్రబలులై యీ నాల్గువంశములవారు ఇంచుమించుగా భారతమంతయు పాలించిరి. ప్రమర వంశరాజులు ఆంధ్రదేశమున శ్రీశైలమును రాజధానిగ, ఆంధ్ర మహారాష్ట్రములను పాలించిరి. ఈ వంశములవారు బ్రహ్మక్షత్రులైనందున శర్మయని కాని వర్మయనికాని నామము తుదను నిలిపికొని యుండెడివారు. ఉదాహరణమునకు కదంబవంశప్రభువు మయూరశర్మ బ్రాహ్మణుడు. (విన్సెంట్ స్మిత్). అతని వంశీయులు వర్మశబ్దమునే చేర్చుకొనిరి. ప్రమరాదులకు మూల పురుషులు ఆంధ్రశాతవాహన వంశరాజులు. వారిలో జ్యేష్ఠుడు ప్రభువగుచున్నప్పుడు మిగిలిన పుత్రులు దౌహిత్రులు రాజపుటానాలోని యల్ప రాజ్యములకు ప్రభువులగు చుండిరి. అట్టివి ముప్పదియారుశాఖలుండగా వారిలోనుండి ప్రమరాదులు ప్రముఖులైరి.

"The Sunga, Kanwa, Satavahana dynasties all were Brahmin. So also was the Cheta dynasty of Orissa." (Early History of India - V.A. Smith). "పల్లవ, చేత, సేన, కదంబ, రాష్ట్రకూట, విష్ణుకుండిన, బృహత్ఫలాయన, బాణ, గాంగ, హోసల, రాజపుత్ర, శాలంకాయన, వాకాటక, వల్లభి, సైదుంబ, నోలంబ వంశముల వారందఱు ఆంధ్ర శాతవాహన వంశీయులకు చెందిన రాజబంధువులు, (ఆంధ్రుల పుట్టుపూర్వోత్తరములు) విష్ణుకుండినులు ఏలూరియొద్ద దెందులూరు రాజధానిగా రాజ్యమేలిరి. దానియప్పటిపేరు వెందలూరని శాసనములలో కలదు. చేతవంశమునకు చిత్రవంశమనియు పేరు గలదు. హాతిగుంఫ శాసనకర్త కళింగ రాష్ట్రప్రభువు ఖారవేలుడు. "ఉజ్జయిని రాజులును, మధ్య ఇండియాలోని యుత్తర రాష్ట్రముల రాజులును, ఇంచుమించుగ శ్రీ హర్ష విక్రమునికి లోబడిన రాష్ట్రముల రాజులును బ్రాహ్మణ వంశమునకు చెందిన రాజులు. కామరూప లేక అస్సాము రాష్ట్రప్రభువు బ్రాహ్మణుడు. ఇతని వంశము వేయి పురుషాంతరములనుండి రాజ్యము చేయుచున్నటుల హుయానిత్సాంగ్ వ్రాసెను. (ఆ రాజునకాతడు అతిథిగా కూడ నుండినటుల వ్రాసికొని యుండెను). ఉజ్జయిని, జిఝోటి, మహేశ్వరపుర రాజులనేకులను హుయానిత్సాంగ్ పేర్కొనెను. బంగాళా దేశమును పాలించిన సేనవంశపు (బ్రాహ్మణ) రాజులకు మూలపురుషుడు దక్కనునుండి వెళ్లిన బ్రాహ్మణుడు. కనరా, మైసూరు రాష్ట్రము యుత్తరమండలములను క్రీస్తుశకము మూడవ శతాబ్దమునుండి ఆఱవ శతాబ్దమువఱకు పాలించిన కదంబవంశరాజులు బ్రాహ్మణులు. వీ రాఱవశతాబ్ద మధ్యమున చాళుక్యులచే తొలగింపబడిరి. (చాళుక్యులు బ్రహ్మక్షత్రులు). కనిష్కుని వంశమును సింహాసనము నుండి తొలగించి కాబూలు రాజ్యమును పాలించిన రాజు 'లల్లియా' యను బ్రాహ్మణుడు. ఇతడు క్రీ. శ. 870 వ సంవత్సరము వఱకు పాలించిన 'తురుష్కసాహియా' వంశస్థులను తొలగించి కాబూలులో రాజ్యము చేసెను. ఈ బ్రాహ్మణరాజులు కాబూలు రాష్ట్రమును 1021 వ సంవత్సరము వఱకు పాలించిరి. మహమ్మదీయులీ వంశమును నిర్మూలించిరి. (గజనీ)" (Early History of India- by V. A. Smith). కృష్ణామండలములోని శ్రీకాకుళమునకు చెందిన శ్రీముఖుడు మగధ సామ్రాజ్యమును పాలించిన శాతవాహన వంశమునకు

మూలపురుషుడు. ఈతడు కాణ్వ వంశ ప్రభువు. సుశర్మ యొద్ద మంత్రిగను, ముఖ్య సేనాధిపతిగను నుండి యాతని సంహరించి క్రీస్తు పూర్వము 833 నుండి 810 వరకు రాజ్యము చేసెను, వీరికి సింహము చిహ్నము. ఆంధ్ర దేశము నరసింహ క్షేత్రములకు ప్రసిద్ధి వహించినది. హాలు ఈవంశములో 19వ ప్రభువు. (494-489 B.C.) 32వ రాజయిన మూడవ పులోమ శ్రీ శాతకర్ణి (334-327 B.C.) తో నీవంశమంతమైనది. ఆంధ్ర భృత్యులనబడు గుప్తవంశపు మొదటి రాజు గుప్త చంద్రగుప్తుడు చివరి రాజును మైనరు కుమారుడు చంద్రశ్రీని సంహరించి రాజ్యమునకు వచ్చెను. గుప్త రాజులు క్షత్రియులు. సముద్రగుప్తుడు మహాప్రభువు. విశాల రాజ్యమును పాలించి మ్లేచ్ఛ యవనులను భారతమునకు రాకుండ అరికట్టినవాడు. శాతవాహన వంశము 506 సంవత్సరములు రాజ్యముచేసెను. "బ్రాహ్మణ రాజవంశములుసుమారు 1600 సంవత్సరములు దేశమును ధర్మయుక్తముగ పాలించెను. బ్రాహ్మణ రాజవంశమైన శుంగవంశము లగాయితు బ్రహ్మ క్షత్ర వంశములంతరించిన కాలమునకు మొత్తము 2500 సంవత్సరములు బ్రాహ్మణులు దేశమును పరిపాలించియుండిరి (దక్షిణ విజ్ఞానము-ద్వితీయ భాగము).

బ్రాహ్మణ రాజులనుగూర్చి యిట్లు వ్రాయుట బ్రాహ్మణుల గొప్పతనము చాటుటకు కాదు. వారి ధర్మముల సంవేద్యమనే యీ కులము వారన్యధర్మమును స్వీకరించినారని చెప్పుటకు. అసలు రాజ్యము క్షత్రియులదే కాని క్షత్రియ వంశములో గుప్తవంశమును పేర్కొనుట జరిగినది కాని మిగిలిన వివరము తీయలేదు. ఇక వైశ్యులు కూడ రాజ్యము చేసినవారే ... థానేశ్వరము రాజధానిగా పుష్యభూతి వంశమువాడయిన హర్షవర్ధనుడు రాజ్యము చేసెను. అతడు రాజధానిని థానేశ్వరము నుండి 'కనోజి'కి మార్చుకొనెను. బౌద్ధుడుకూడ నయ్యెను రాజ్య సుస్థిరతకు బ్రాహ్మణ కన్యను పెంచి వల్లభిరాజు ధృవభట్టునకిచ్చి పెండ్లిచేసి పశ్చిమ భారతముతో బాంధవ్యము నెరపుకొనెను. అర్ష ధర్మమున కితడు వ్యతిరేకి కాదు. ఇది ఆశ్చర్యకరము కాదు. మనదేశ లక్షణ మట్టిది. చూడుడు :-

"It is a curious fact that although that Andhra Kings, clearly were officially Brahminical Hindus, most of their recorded donations were made to Buddhist insti-

tutions" (Early History of India-by V. A. Smith). బాణుడు ఈ హర్షుని ఆస్థానములోనివాడే, . . హర్షవర్ధనుడు వైశ్యుడని హుయానిత్సాంగ్ (క్రీ.శ. 630) వ్రాసెను. స్మిత్ దానినంగీకరించెను. ఇక చతుర్థ వర్ణమువారు రాజ్యము చేసిన విషయమందఱికీని స్పష్టము. రెడ్డి రాజులకు గొప్ప చరిత్రము కలదు. అట్లే వెలమ ప్రభువులు మున్నగువారు పాలించిరి. శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రిగారు ధార్మికుడైన గొప్ప ప్రభువు . . . ఈ విధముగ నాలుగు వర్ణములవారును వారి వారి ధర్మముల ననుష్టించుచు దేశమున కవసరమయినప్పుడు ఆర్ష ధర్మ నిర్వహణమునకై క్షత్రియ వృత్తిని కూడ స్వీకరించి యున్నారు. కాగా నేడు చాతుర్వర్ణ్యములో చేరనివారును క్షాత్ర ధర్మము నవలంబించి వైదేశికుల పాలనమును తుద ముట్టించుటయందేమి రాజ్యపాలనమునందేమి పాల్గొనుచున్నారు. ఈవిధ ముగ కలి ప్రవేశించిన పిదపయును, పూర్వమునను అన్యవృత్తులను ఆశ్ర యించుట కన్పించుచున్నది. అప్పుడు స్వీయ ధర్మమును వారు వదలివేసినట్లు భావింపరాదు. రాజ్యాంగ శాసనము జాతి మత వర్ణలింగ విచక్షతలేని సమానావకాశముల కల్పించియున్నది. ఇతర వర్ణముల వలన దేశమునకు లేక సంఘమునకు అరిష్టమను అభిప్రాయమునకు తావులేదు. వెనుక సమ్మ తుల బలగమున్నవారు రాచరికముచేయుదురు. కొన్ని సందర్భములం దన్య వృత్తులను స్వీకరించుటకును మను ధర్మశాస్త్ర మంగీకరించుచున్నది. కలిలో కొంతవట్టు నడలునని శాస్త్రకారులే యంగీకరించినారు. యుగరూపము ననుసరించి బ్రాహ్మణులుందురనియు నందులకు వారిని నిందిపరాదనియు పరాశరులనిరి. అట్లే "యుగేయుగేచయే ధర్మాస్తత్రతత్రచయే ద్విజాః, తేషా నిందా నకర్తవ్యా యుగరూపాహితేద్విజాః" (పరాశరస్మృతి). అట్లే మిగిలిన వర్ణముల విషయమును. కనుక వెనుకటివలె వర్ణవ్యవస్థ లేక యున్నది కాన నది లేనట్లే యనుకొనరాదు. భారతదేశము భారతదేశమై నంతవఱకు ఆర్ష ధర్మమిచ్చట యుండునని పెద్దల అభిప్రాయము. 4 లక్షల 32 వేల సంవత్సరములలో 5000 పై చిల్లరయే కదా గడచినది కలియుగ ములో. వెనుకటికి నిప్పటికి మార్పువచ్చినది. దేశములో కొంత భక్తిలక్ష ణము పెరుగుచున్నది. దానికిని గాంధిగారే మార్గదర్శకులైనారు. "నాకే యధికారమున్నయెడల భగవద్గీతను నిర్బంధముగ విద్యార్థులచే చదివించె దను." అనివారనిరి. నిజమునకుమతమనునది మత్తుమందుకాదు, విత్తుమందు.

విత్తుమందనగా బీజములను నిలుపుటకు సాధనమైనది. ఉత్తమ పౌరులనుగా తయారు చేయుటకు మతబోధనము విత్తు వంటిది. "నేడు హిందూత్వమని పిలువబడుచున్న మనమతము అసలు మానవధర్మము. సుమారు 2000 సంవత్సరములకు పూర్వము ప్రపంచములో కేవలము మన మతమే యుండెడిది. మన ధర్మముయొక్క సరిహద్దులు విశ్వమంతటికి పరివ్యాప్తమయి యున్నవి" (శ్రీ కామకోటి స్వామి సూర్యాపేట ఉపన్యాసము-జాగృతి 29-4-68). మన మతములగూర్చి తెలియవలెనన్నచో ప్రాచీన గ్రంథములు చదువవలెను. "ప్రథమం సర్వశాస్త్రాణాం పురాణం బ్రహ్మణా స్మృతం, అనంతరంచ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిఃసృతాః" (వాయు పురాణము). "Many so-called Educated Persons have banished God and the higher values from their lives...The traditional atmosphere in India, however, is always been religious and religion has always played a very important part in the lives of the people.. It is indeed a pity that religious education has been barred from our educational institutions because the basis of moral conduct is religion. Religion prescribes rewards and punishments for good and bad conduct."(Educating the electorate - Sri Prakasa 31-3 69, Indian Express). హిందూమతమును పునరుజ్జీవింపచేయుటకు ముఖ్యముగ మూడు కార్యములు అవసరమని శ్రీ కరణ్ సింగుగారు చెప్పిరి. "Firstly proper attention to the teaching of Sanskrit, secondly Scientific management to religious institutions and thirdly some kind of training for the Priests" (Inauguration of Second world Hindu conference 30-3-69 I.E.). ఈవిధముగ మనదేశములో అభిప్రాయములు ప్రబలముగనున్నవి. "The intellectual unity of Hindus was provided by a common classical language Sanskrit. Another factor which helped in the growth of National Self-confidence was the revival of Sanskrit and the growth of indological scholarship"(Common sense of India-Panikkar). "Without a spiritual recovery, the science threaten to destroy us. We are living in days of destiny. Either the world will blow up in flames or settle down in peace. (World-Dharmakhestra, S. Radhakrishnan). ఆధ్యాత్మిక విజ్ఞానమునకు మతము మూలభూతముకదా! జాన్ గ్రిగ్ గారు చెప్పినట్లు రహస్యములకును కొన్ని అతిలోక

విషయపుటూహాలిటీవల కలుగుచున్నవి. "A Soviet Philologist V. Zaisser posed this question (was Christ a cosmonant ?) in an article in Izvestia on Friday and answered himself by saying that the star 'Bethlehem' was really a spaceship and Jesus Christ was a visitor from another planet. He said the descent of God to earth is really a cosm'c occurance and it be considered a historical event and that we replace the word God with a new term Cosmonant Jesus Christ. The Biblical description of star of Beihlehem signifying the birth of Christ was historically correct" (22-6-69, Indiann Express).

కనుక ప్రపంచమంతటిలో నేదియో యొకమతమును గంటిపెట్టుకొనుట మానవ సంఘమునకు తప్పనిసరి యగుచున్నది. ఒకప్పుడు దానిని విస్మరించినను చివఱకు దానియందు చూపు తప్పదు. "Oh ! god ! If there is God. He may save me" అన్నాడట దైవస్వరూపమునందు జీవితమంతయు విశ్వసింపని యాతడు ప్రాణోత్క్రమణ సమయమున. మనదేశమున రాక్షసులకుసైతము దేవుడు కలడు. బాణాసురుడు శివు నర్చించి వరముల బడసినవాడు. తామసగుణ ప్రధానులగుటచే వారు నశించిరి కాని దైవభక్తి లేక కాదు. శ్రీ మహావిష్ణువుచేతిలో నశించిన వారికి ఉత్తమ లోకములుకూడ వచ్చినవి. మత మనునది యుండుట దాని ననుసరించుట నాగరక లక్షణము. కొందఱు మతమను మాటను పరిహరించి దానికి బదులుగా సంస్కృతి యని వాడుచున్నారు. సంస్కృతి యనగా గుణాధానము దోషాపనయనమే కదా ! మతము వినా సంస్కృతియుండుట కవకాశములేదు. "ఒకనికి సంస్కృతియున్నదా లేదా యనుట కాతని మనోభావనముల వైశాల్యము మనము గుర్తింపవలెను. దేహమున ఎన్ని ప్రాణములున్నను వైద్యుడు హృదయమును పరీక్షించి అతడు రోగియా కాదా యని నిర్ణయించును. అటులనే ఒక దేశపు సంస్కృతియొక్క ఔన్నత్యమునకు కొలబద్ద ఆ దేశపు మహనీయుల భావనములు, ఉద్దేశములు, ఆచారములు. అవి ఆ దేశపు మహాకవుల వాగ్ధారలో వ్యక్తమగును." (కళ–సంస్కృతి–జగద్గురు బోధలు 2వ సంపుటము). కనుక పాశ్చాత్యులు హిందూమతము గొప్పదనినను సంస్కృతి గొప్పదనినను దానియర్థ మొక్కటే. "నేను కొంతవఱకు పాశ్చాత్యదృష్టితోనే భారతభూమిని పరిశీలించితిని" అనిన శ్రీ నెహ్రూగారు భారత దర్శనములోనే "సంస్కృతి, సంప్రదాయము విచ్ఛేదము లేకుండనుండుట గొప్పమాట.

ఇతరదేశాల ప్రభావముకూడ భారతముపై ప్రసరించినది. కాని భారతదేశ సాంస్కృతికపు పునాదులు చాల గట్టివగుటచేత పై ప్రభావము లెన్ని ప్రసరించినను అవి చలింపలేదు'' అనిరి. మన సంస్కృతి మన ప్రాచీన గ్రంథములలో నిక్షిప్తమైనది. వాని నర్థము చేసికొనవలెనన్న సంస్కృతభాష నేర్వవలయును. అవి సంప్రదాయ సిద్ధముగనే చదువుకొనిననే తెలియును. అందుచేతనే వైదేశిక పండితులు పసిపిల్లలవలె భారతీయులవద్ద విద్య నభ్యసింపవలెనని పలికెను. వేదములోని కొంతభాగము కర్మకాండను బోధించును. కొంతభాగము జ్ఞానకాండను బోధించును. నేను జ్ఞానమునే తెలిసికొందు ననుట నిష్ప్రయోజనము. పూర్వజన్మములో చిత్తశుద్ధి యేర్పడిన ఏ యొక్కడో దాని నందుకొనవచ్చును కాని, యందరికీ నది సాధ్యముకాదు. ఉదాహరణమునకు భగవద్గీతలో ''త్రైగుణ్య విషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున !'' అని సాంఖ్యయోగములో చెప్పిన దానికి వేదములు త్రైగుణ్య విషయములని కృష్ణభగవానుడే చెప్పెను కనుక వేదాభ్యాస మనవసర మనుట 'కొసాకులు మేయుట' వంటిది. భగవద్గీతను గూర్చి ''కడు సుందరమైనది. మానవుడు నేర్చిన ఏ భాషలోనను అట్టి వేదాంతగీతము లేదనియే చెప్పవలెను'' అనిరి. ''భగవద్గీతలోనను, ఉపనిషత్తులలోనను సాక్షాత్తు పరమేశ్వరునకే సాధ్యమైన పరమమైన జ్ఞానవిషయములున్నవి. వారు అట్టి విశ్వాసముతో, ఇది సత్యమని భావించెదు నట్లు ప్రవచింపగలిగినా రనగా వేలాది సంవత్సరముల జీవితమును వారు వెనుకకు చూడగలిగి అందలి సంఘర్షణముల నెన్నిటినో ప్రశాంతముగ నవగాహనము చేసికొనిననేగాని సాధ్యముకాదు. వారి కెఱుకలేని విషయములు లేవు'' అని శ్రీ నెహ్రూగారనిరి. దేశములలో విభిన్నధర్మము లుండునుకదా, ప్రతి దానియందును ఏదియో నొక గుణ ముండునుకదా- అప్పు డే ధర్మమును గ్రహింపవలెనను సందేహ మా భగవద్గీతయం దిట్లు తీర్చబడినది. ''శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః''. ఇతరధర్మ మవలంబించుటకంటె, గుణములేని దైనను స్వధర్మమే శ్రేయము నొసగును. స్వధర్మానుష్ఠానమునందు మరణించుట యైనను మంచిదే. ఇతర ధర్మము భయమును కలుగచేయునని దీని భావము. కాగా మన హిందూధర్మమే మన కనుష్ఠేయము. మన ఆర్ష ధర్మములో వర్ణ వ్యవస్థ చెప్పబడినది. ఈ వ్యవస్థ మానవనిర్మిత మని కొందఱి యభి

ప్రాయము. కాని యావ్యవస్థ చెడ్డదను అభిప్రాయము పైవారికి లేదు. "ఇంతలో గాంధీజీ రంగములోనికి వచ్చి, సూటిగాకాక, భారతీయ పద్ధతిని ఈ సమస్యా పరిష్కారము చేసిరి. వారు అసలు వృత్తులనుబట్టి జఱిగిన చాతుర్వర్ణ్య విభజన కాదనలేదు. అట్లనుచునే వర్ణ విభేదములను వారణగొట్టిరి" (శ్రీ నెహ్రూ). "ఒకే తండ్రియొక్క పలువురు కుమారులలో ఒకరు బ్రాహ్మణుడుగా మరొకరు శూద్రుడుగా పరిగణింపబడవచ్చును" (19-5-69 జాగృతి-బొంబాయి జనసంఘ అధ్యక్షపీఠమునుండి శ్రీ వాజ్‌పాయ్). మీరు వర్ణవ్యవస్థ సంగీకరించినవారే కాని వృత్తుల వలనకాని గుణములవలనకాని యావ్యవస్థ వచ్చినదని యభిప్రాయపడువారుకాదు. మఱికొందరు వర్ణవ్యవస్థ భగవన్నిర్మితమని యభిప్రాయపడువారు. వృత్తులనుబట్టి వర్ణము లేర్పడిన వనువానికి వారి యాక్షేప మేమనగా ఒక్కడే యొక్క ఏడాదిలో నాలుగు వృత్తులను స్వీకరించినయెడల నాలుగు కులముల మార్పును పొందవలసివచ్చును. అట్లు పొందినట్లు ప్రాచీన గ్రంథములలో కాని, పరంపరయావచ్చిన ప్రస్తుత సంఘములోగాని కనుబడుటలేదని, గుణములనుబట్టి వచ్చినచో నట్టి విధముగానే నొక యేడాదిలో నన్నివర్ణములలో నా యా గుణములనుబట్టి చేరి పోవలసివచ్చును. అట్లు జఱిగినట్లు గ్రంథములు చెప్పుటలేదు, అనుభవసిద్ధముకాదు. ఒకజాతి మేమెప్పుడును పాలింతుము, మీరు సేవచేయు డనుటయు సంభవముకాదు- అని. కాని ఉభయులును మనకు తెలియని కాలమునుండియు ఈ వ్యవస్థ యున్నదని యంగీకరించుటలో భేదాభిప్రాయము లేనివారు. ఇవి భగవన్నిర్మితమే యనుటకు- "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" అను వేదవచనమును, స్మృతివచనములను, పురాణ వచనముల నుదాహరింతురు. ఎట్లో వచ్చిన వర్ణవ్యవస్థ మనకున్నది. ఆయావర్ణము లాయావృత్తుల నంటిపెట్టుకొనియున్నవారును కలరు. అట్లులేక ఈ ప్రకరణ ప్రారంభములో నుదహరించిన విధముగ వారివిధి విహిత ధర్మములను మాత్ర మనుష్ఠించుచు భిన్నవృత్తుల నాశ్రయించినవారును కలరు. ప్రస్తుతము మఱియు కలరు. అదియెట్లు వచ్చినను ప్రాచీన గ్రంథములలో వర్ణములున్నట్లు దృష్టాంతములు బహుళముగలవు. ఇట్టి స్థితిలో మొత్తముమీద సంఘము అంతర్వివాహములకు మాత్రము సుముఖముగ లేదనుట ప్రత్యక్షముగా కన్పించుచున్న విషయము. మన ధర్మ గ్రంథములలో వర్ణవ్యవస్థ భాగముగనే కన్పించుచున్నది. వివాహములు చేసికొనుట యనునది సంఘపరముగను, ప్రధానముగ వ్యక్తి పరమైన విషయముగను కన్పించు

చున్నది. వర్ణ విభజన మనదేశములోవలె లేని దేశములలోకూడ వివాహాదులకు సంఘములో కొన్ని నియమములు కన్పించుచున్నవి. అమెరికాలో తెల్లవారును నీగ్రోలును చేసికొనరు. మిగిలిన ప్రదేశములలోకూడ ఎవరికి సన్నిహితమైన వర్గమువారు వారినే వివాహము చేసికొనుచున్నట్లు లెక్కల వల్ల తెలుచున్నది. "Homogomy: another investigation showed that 93% of Jews married Jews, 91% Protestants married Protestants and 78% of Roman Catholics married within their religion. On top of this Mr. Herbert Martin believes people select marriage partners with an intelligence level close to their own-Pyschologists in Britain have recently eompleted a remarkable investigation into a curious fact of mrrried life, why the partners grow to look like each other" (Too much alike - Christopher Blaxall- 18-5-69, Indian Express). వర్ణ విభజన అంతరించిపోయి యెప్పుడో భారతదేశమునుండి వెడలిపోయిన ఆర్యసంతతి వారయిన బ్రిటిష్‌వారు వారిలో నిషేధములు లేకపోయినను వారి జాతియులనే చేసికొనుచున్నట్లు స్పష్టపడుచుండగా స్వచ్ఛమయిన ఆర్య జాతిగా సృష్ట్యాదినుండి నిలబడియున్న భారతీయులు వర్ణాంతర వివాహములకియ్యకొనకపోవుటలో నాశ్చర్యములేదు. ఒక విధముయిన వర్ణ వ్యవస్థ యంతరించిపోయినను, వేరొక విధముగనైనను అట్టి వ్యవస్థ ఏర్పడుట సృష్టి స్వభావమని తెలుచున్నది. వారి వర్ణములలో వారు వివాహమాడుట మానవప్రకృతి సహజ లక్షణమనియు, తద్విరుద్ధముగ జరుగుట మానవ ప్రకృతికే విరుద్ధమనియు స్పష్టపడుచున్నది. పైమనస్తత్వ శాస్త్రజ్ఞుల పరిశోధనమునుబట్టి చూచినచో ఆర్యధర్మముగా చెప్పబడిన వర్ణాశ్రమధర్మము లీదేశమున పోవుట కష్టమని కోట్లాది సంవత్సరముల చరిత్ర ఋజువు చేయుచున్నదనియు, నికముందుకూడ నట్లు జరుగుట కవకాశములు లేవనియు తెలుచున్నది. పురాణములను విశ్వసించువారు కల్క్యవతారము బ్రాహ్మణుడని చెప్పుటచే, నేదియో యొక విధముగ యుగాంతమువరకు నిట్లే- ఏవియో కొన్ని చెదురు సంఘటనములున్నను- యుండుట కవకాశమున్నదేమో యను అభిప్రాయమునకు తావు కలుగుచున్నది. అట్లు ఈ వ్యవస్థ

పోవలెననువారు మానవ స్వభావమునకు విరుద్ధముగ నుపదేశించువారుగా గణింపబడుట కవకాశము కలుగుచున్నది. ఒకవిధమగు వర్ణములు పోయినను మఱియొకవిధమగు వర్ణములు సృజింపబడుట లోకదృష్టాంతముగ నుండగా నీ వర్ణములు పోవుటవలన వచ్చు ప్రయోజనము మృగ్యమగుచున్నది. వర్ణము లుండవలెనా, లేక పోవలెనా? యను వాదము లర్థరహితములనియు; నవి సంఘమునకు, వ్యక్తులకే వదలివేసినచో యుగాధీనముగ, వ్యక్తి ప్రారబ్ధాధీనముగ జఱుగుననియు తోచుచున్నది. అవి మన ముండవలెనన్న యుండునవి, పోవలెనన్న పోవునవియు కావు. అంతర్వివాహములు చేసికొనువారి ననుమతించు శాసనము లుండునుకాని, నిర్బంధముగ చేసికొనవలెనను శాసనము లేర్పడి వ్యక్తిస్వేచ్ఛ నరికట్టజాలవు,

పురాతనకాలపు తపాలా బిళ్లలను భద్రపఱచువారు కలరు. ప్రాచీనకాలపు మృణ్మయ పాత్రలను భద్రపఱచువారు కలరు. 'సాలారుజంగు మ్యూజియమ్'లో ప్రాచీనకాలపు పనితనపు వస్తువు లెన్నియో భద్రపఱుపబడి యున్నవి. ఎప్పుడో చచ్చిపోయినవారి బొమికలను పరిశోధనమునకై భద్రపఱచి సగర్వముగ పరిశోధనాగారములలో నుంచుకొను చున్నారు. శిల్పపు రాళ్లు బ్రద్ధలయినను పదిలము చేసికొనుచున్నారు. వానికే యంత విలువయుండగా, ఒక సజీవమైన వర్ణవ్యవస్థతో చిరకాలమునుండి యనేక దండయాత్రలకు నెదురొడ్డి నిలబడిన ఒక ప్రాచీనమైన జాతియైన మనల, మనదేశము నావిధముగ భద్రపఱచుకొనుట మనకు గౌరవముకాదా? అట్టి స్వరూపములేక మనమును, వారివలె నయినచో మనయందు వారి కాసక్తి యేలయుండును? వారి వోటళ్లవలెనే మన వోటళ్లను నిర్వహింపగా, భారత దేశమునకు వచ్చి మే మార్జింపబడుట కేమున్నదని పాశ్చాత్యులాక్షేపింపగా, ప్రస్తుతము మన వోటళ్లను భారతీయ పద్ధతిలో పరిగరములతో నుంచుటకు మనవారు ప్రయత్నించుచున్నారుగదా! మనుష్యులము కూడ వారివలనయినా మనము మనముగుట యేమున్నది? అదియునుగాక ఒక విశ్వాసమువలన మానవుడు జీవించును. వర్ణవ్యవస్థ యుండవలెనని బహుజనులకు విశ్వాసమున్నది ప్రజాస్వామికముగ నాలోచించినను ఆ విశ్వాసమునకు అఘాతము కల్గించరాదు. దానిని గౌరవించవలెను. "A great ruler of India who lived 2300 years ago. Emperor Asoka has said that he who honours the other man's

faith honours his own, and in doing so he makes other honour his our faith. But if he does not honour the other man's faith, his own faith will also not be honoured" (Sri Nehru).

ఇంతవఱకును చరిత్రలో స్వాతంత్ర్యము నిలిపికొనుటకై సర్వవర్ణములును ప్రయత్నముచేయుట, రాజ్యాధికారములు చేపట్టుట. అందువలన వృత్తులు మారుట, మన సంఘమున మత ప్రాబల్యము, అందులోని వర్ణవ్యవస్థ చెక్కుచెదరకుండుట మున్నగు విషయములు ప్రస్తావించుట యైనది. ఆ వ్యవస్థలోని భాగము శూద్రులు. వారు చారిత్రకులు చెప్పు ద్రావిడులా? వా రెవరితోనైన యుద్ధముచేసి యోడిపోయిరా - అను విషయములు చర్చింపవలసి యున్నది.

మన జాతి ప్రాచీనమైనది. "ఈ ప్రాచీనత్వము ముందు క్రైస్తవుల ప్రాత నిబంధనలలోని సృష్టి వృత్తాంతము నిన్న నెమొన్నటిది. దాని ప్రకారము చూచినచో సృష్టియయి 5000 ఏళ్లయిన దనవలెను. ఈ హిందువుల యుగములలో "మెథూసెలా" జీవితకాలము దాదాపు 900 ఏండ్లును నిమిష మాత్రము" (Halhed).

"బైకసుకాలము నాటినుండియు మాసిడోనియా రాజగు అలెగ్జాండరు కాలమువఱకు హిందూ దేశములో 154 రాజుల పాలనము జరిగినది. వీరి పరిపాలనమంతయు కలిసి 6451 సంవత్సరములు"-'ప్లినీ'.

"రాజ తరంగిణిని అబుల్ ఫజల్ భాషాంతరరించెను. రాజుల పరిపాలనాకాలము 4009 సంవత్సరములు-11 నెలలు-6 రోజులనెను-'శారదా'".

"డయానియస్ (హిందూ రాజు) నాటినుండి 'సంద్రకోత్తస్' (చంద్రగుప్తుడు) నాటికి 6042 సంవత్సములు"-హీరేన్.

"స్పాతెంబాస్ (డయానియస్ నామాంతరమేమో!) నాటినుండి సంద్రకొత్తస్ నాటికి 6042 సంవత్సరములు - (మెగస్థనీస్ - Historical researches Vol. II Page 218).

"స్పాతెంబాస్ రాజ్య పాలనము క్రీస్తుపూర్వము 6717" (Max Dunkur-History of antiquity Volume IV Page 74).

"యుధిష్ఠిరునిశకము విక్రమాదిత్యునిశకమునకు 3044 సంవత్సరములు ముందనియు, క్రీస్తు పూర్వము 3100 సంవత్సర ప్రాంతమున ప్రారంభమయ్యెననియు చెప్పబడినది నిక్కము." (History of antiquity Vol IV page 219). గంగరాజదేశు రాజయిన చంద్రగుప్తో (చంద్రగుప్తుడు) సభలో అలెగ్జాండరు పక్షమున రాయబారిగా నుండిన 'మెగస్తనీసు'కు రాజుగారి నివాసమైన 'పాలి భోత్రము' నందు కాలానుక్రమముగ వ్రాయబడిన వంశ చరిత్రములు లభించినవి. ఇందు 'డయానిసియస్' మొదలుకొని చంద్రగుప్తో వఱకు అధమము 153 రాజులు పేరుపేరు వరుసనుదాహరింపబడిరి. ఒక్కొక్కరాజు ఎంతెంతకాలము పాలించినది వివరములు కలవు. మొత్తము కాలము 9451 సంవత్సరములు. దీనినిబట్టి క్రీస్తు పూర్వము 7000 సంవత్సరములనాడు రాజ్యము చేసెనని తెలియుచున్నది. మెనేథో వ్రాసిన రాజవంశానుక్రమణికలోని మొదటి రాజును క్రీస్తు పూర్వము 5897 సంవత్సరములలో రాజ్యము చేసినవాడునగు 'టినైటు థెబియను' వంశమూల పురుషునికంటె వేయియేండ్ల పూర్వమును, గిజె పిరమిడును కట్టించిన సౌఫీకి 2000 ఏండ్లు పూర్వమును 'డైయానియస్' రాజ్యము చేసినట్లు తెలియగలదు" (Theogony of Hindus, page-45).

ఈపై విషయములు 'శారదా'గారి హిందూసుపీరియారిటీని తెలిగించిన శ్రీ దాసు దామోదరరావుగారి గ్రంథమునుంచి యుద్ధరింపబడినవి. క్రీస్తు పూర్వమునకు 6, 7 వేల ఏండ్ల పూర్వము వఱకు హిందూరాజుల చరిత్రమును వారు లెక్కించిరి. ఇంకను శ్రీ నెహ్రూగారు చెప్పినట్లు లక్షల కోట్ల చరిత్ర కలదు కదా! ఇట్టి స్థితిలో మహమ్మదీయుల పాలనమున సుమారు 600 సంవత్సరములును, బ్రిటిష్‌వారి పాలనమున సుమారు 150 సంవత్సరములును దేశములో కొంతభాగము – పరిమితమైన ప్రదేశము– పాలింపబడు దుర్గతి పట్టినందులకు విచారముండినను ఆ మహాకాల పరిధిలో నీ పరాధీనపు బ్రదుకెంత అల్పమైనది! కనుక ఎప్పుడును బైటవారు వచ్చి కొల్లగొట్టుకొనిపోవుచుండగా గ్రుడ్లప్పగించిచూచు లక్షణ మీజాతికిలేదు. అది ఎట్లుండనిండు. ఈ ద్రావిడులనబడువారే సంవత్సరమున భారత దేశమునకు వచ్చిరో పై కాలమానము ప్రకారము చరిత్రకారులు చెప్ప

గలరా? పై చరిత్ర ఆర్యులే ఈ గడ్డవారని ఋజువు చేయుచున్నదే! ఇక శూద్రులెప్పుడు పుట్టిరో భారతీయులు చెప్పగలరు. వారు వేదములోని మిగిలిన వర్ణములతో సమానముగ నుటంకింపబడినవారేకదా! వారు ద్రావిడు లని వేదములలో నెచ్చటను లేదే! ఆర్యులకు యజ్ఞము ముఖ్యమైన కర్మ కదా! 'యజ్ఞాద్భవతి పర్జన్యః, పర్జన్యా దన్నసంభవః, అన్నాద్భవంతి భూతాని తస్మాదన్నం తతః ప్రజా' అని కదా సూక్తి. ఈ యజ్ఞాంగమైన సోమలత హిమాలయముననే కదా దొరుకునది! హిమాలయ ప్రసక్తి కృష్ణ యజుర్వేదమున 5 వ కాండములో స్పష్టముగ నుండగా నది వేదమంత ప్రాచీనము కాగా హిమాలయాయుస్సును భూగర్భ శాస్త్రజ్ఞు లేవిధముగ నిర్ణయించిరి? "యజ్ఞాంగార్థం మయాసృష్టో హిమవానచలేశ్వరః" అని కదా విష్ణుపురాణము చెప్పుచున్నది! ఆ యజ్ఞము శూద్రుని సహాయము లేనిది జరుగుటకు వీలులేదు కదా! క్రతువులలో పరమోన్నతమైన వాజ పేయములో పశుశేషముచేత పవిత్రీభూతులగు వారు పాదజులే కదా! ఈ విషయము తైత్తిరీయ బ్రాహ్మణములో 3 వ ప్రశ్నములో 3 వ అను వాకములో నుక్తమైనది. అందుచే శూద్రునకు గూడ యజ్ఞాంగత్వము సిద్ధించుచున్నది. 'బ్రాహ్మణో౽స్యముఖమాసీత్" అను వేద వచనములోనే కాక, తైత్తిరీయ సంహిత (కృష్ణ యజుర్వేదము) 7 వ కాండము ప్రథమ ప్రశ్నములో, ప్రథమ అను వాకములో, 4 వ పనసలో 'ప్రజాపతి రకామయ ప్రజాసృజేయేతి' అని సృష్టిక్రమము చెప్పినదానిలో నాలుగు వర్ణములు నున్నవి. కనుక శూద్రులు వేదమంత ప్రాచీనులగుచున్నారు.

ఆర్యుల మొత్తములో నొకరైన శూద్రులను వారిప్రాచీనతను గంగ పాలు చేసి చారిత్రకులు వారిని ద్రావిడులుగా సృష్టించి యా ద్రావిడు లార్యులకంటె ముందీదేశమునకు పరాయి దేశములనుండి వచ్చిరనుచున్నారు. They (Aryans) entered India about 1500 B.C. after a long journey traversing Asia minor, Iran and Afgan-sthan (Indian History and culture). ఆర్యులకంటె కొంత కాలము ముందే ద్రావిడులు వచ్చియుండవలెను. వారు వైదేశికులే కదా! ఆ విధముగ లెక్కకట్టినను వారియూహ ప్రకారము 2000 B.C. కంటె కాదు కదా! పై నుదాహరించిన పాశ్చాత్యులలో బుద్ధిమంతుల వ్రాతల

ప్రకారము ఆర్యుల రాజ్యపాలనము క్రీస్తు పూర్వము 7000 సంవత్సరముల క్రిందటనే యున్నట్లు ఋజువగుచున్నది కదా! ఇక ద్రావిడులెట్లు ప్రాచీను లగుదురు? వారినితరులు జయించుట యనుమాట యేమున్నది? ప్రపంచమున కంతకును ప్రాచీనమని యంగీకరింపబడిన వేదము, శాస్త్రములు ఆర్యుల కున్నవి. ద్రావిడుల చరిత్రమును తెలుపు గ్రంథములే లేవే! అవి ధ్వంసము లైనవను చరిత్ర లేదే! వారును శూద్రులుగా నార్య సంఘములో చేర్చ కొనబడిరని చెప్పునప్పుడును, వారికి యిండ్లు కట్టుకొనుట తెలియుననుకొను నప్పుడు, అంత విస్తృతమైన సంఘమునకు పదియేనొక గ్రంథము భారత దేశములో నెక్కడనో యక్కడ యుండవలెను కదా! "కథకు కాళ్లులేవు ముంతకు చెవులు లేవు" అన్నట్లున్నది. పోనీ వా రనాగరికజాతి యనుకొం దమా, వారు గొప్ప సంస్కృతికల జాతి యనుచున్నారే! సింధులోయ నాగరికత వారిదే యనుచున్నారే! దక్షిణ దేశమునకైన చరిత్ర దొరుక వచ్చును కదా!

కొందఱు కోతులు ద్రావిడులనుచున్నారు. కోతులగా నిప్పటి కోతులు కాదు. రామాయణ కాలమునాటి వానరములు. అనగా సుగ్రీవుడు, హను మంతుడు మున్నగువారు... పొడుగు గోచీలు పెట్టుకొనుటచే వారిని ఉత్తర ప్రదేశ్‌లో కూర్చుండి రామాయణము వ్రాసిన వాల్మీకి చూడక వినిన మాటలతో తోకలున్నవని వ్రాసెననియు నిజమునకు వారు ద్రావిడులేకాని వానరులు కారనియు వారనుచున్నారు. రామాయణము నందలి పాత్రలు కవికల్పిత పురుషులని యనక చారిత్రక పురుషులని యంగీక రించుట యొక విశేషము. ఏ గ్రంథము వారు కలదని చెప్పియున్నదో ఆ గ్రంథమే వారు వానరులని చెప్పియుండగా దానిని యవసరమయినంత వఱకే ప్రమాణముగ గ్రహించుట న్యాయము కాదు. అయినను ఆ దృష్టితో చూచినను, ఆంజనేయుడు వాయునందనుడు కనుక వాయువు ద్రావిడుడు కావలసివచ్చును. సుగ్రీవుడు సూర్యసుతుడు కనుక సూర్యుడును ద్రావి డుడు కావలసివచ్చును. వాలి యింద్రసుతుడగుటచే ఆర్యుల దైవమనబడు ఇంద్రుడే ద్రావిడుడు కావలసివచ్చును. వారు ద్రావిడులని యంగీకరింప బడుట లేనప్పుడు వారి కుమారులు ద్రావిడులగుటెట్లు? తండ్రి యార్యుడై లేదా ఆర్యుల దైవమై కుమారుడు ద్రావిడుడగుట పొసగునా? రామకథ త్రేతాయుగమునకు సంబంధించినది. ద్రావిడులు సుమారు క్రీ. పూ. 2000

సంవత్సరములకు పూర్వమే వచ్చినారని కదా చారిత్రకులు చెప్పుట! లక్షల సంవత్సరముల పూర్వపు చరిత్ర క్రీస్తు పూర్వమునకెట్లు అనువగలదు? పోనీ ఆ వాలి సుగ్రీవులను క్రీస్తుపూర్వమునకే తెచ్చినచో, వారికి పూర్వమే 7000 సంవత్సరముల క్రితము మన రాజులు పాలించిరను పాశ్చాత్యుల, పై లెక్క ఎట్లు కుదురును? వాలి సుగ్రీవులు మన రాజులకంటె యర్వాచీనులై ద్రావిడుల ప్రాచీనత పోవుటలేదా!

"అహో! శాఖామృగత్వం తే వ్యక్తమేవ ప్లవంగమ లఘుచిత్తతయాత్మానం న స్థాపయసి యో మతౌ" (కిష్కింధ 2-17) అని హనుమంతుడే సుగ్రీవునితో యనుటచే వారు వానరులని స్పష్టపడుచున్నది. వారికి ఆకారాదికములు మార్చుశక్తి కూడ కలదు. "కపిరూపం పరిత్యజ్య హనుమాన్ మారుతాత్మజః, భిక్షురూపం తతో భేజే శఠబుద్ధితయా కపిః" (3-2). హనుమంతుడు వేదపండితుడుగను వ్యాకరణ పండితుడుగను స్పష్టపడుచున్నది. "నా ఋగ్వేద వినీతస్య, నా యజుర్వేద ధారిణః, నా సామవేద విదుషశ్శక్య మేవం ప్రభాషితుమ్ - నూనం వ్యాకరణం కృత్స్నమ్, మనేన బహుధా శ్రుతమ్, బహు వ్యాహరతానేన న కించి దపశబ్దితమ్" (కిష్కింధ-3-28, 29). శూద్రులే ద్రావిడులన్నచో నార్యులనబడు వేదములను వ్యాకరణశాస్త్రమును అభ్యసించువారని చెప్పుదురా? కనుక హనుమంతుడు ద్రావిడుడు కాడని తేలుచున్నది. వానరులు ద్రావిడులు కారని తేలుచున్నది. వానరులు ద్రావిడులుకారని నిర్ణయము. ఇక ద్రావిడులు చెట్లునకు మ్రొక్కువారనియు, ఆర్యులగ్నిహోత్రములను పూజించువారనియు కదా వీరి యారాధనాభేదములుగా విమర్శకులనునది చూడుడు! ద్రావిడుల రాజ్యమనబడు కిష్కింధారాజ్యము లోననే శ్రీరాముని రాకకుపూర్వమే యగ్నిహోత్రారాధన మున్నట్లున్నది. సుగ్రీవుడు సప్తజన మహామునుల ఆశ్రమమును రామునకు చూపుచు "త్రేతాగ్నయోఽపి దీప్యన్తే. ధూమో హ్యేష ప్రకాశతే, వేష్టయన్నివ వృక్షాగ్రాన్కపోతాఙ్గారుణో ఘనః" (కిష్కింధ - 13 వ సర్గము - 23 శ్లో.) అనెను. కనుక దక్షిణా పథమున అగ్నిహోత్రారాధనము లేదనుకొనుట భ్రాంతి. వారు కోతులనుట ఆంజనేయుని మాటల వలననే స్పష్టము. వారు దేవాంశ సంభూతులు కనుక సంభాషణాదికములు జరుపుటయు సంభావ్యమే. 1969వ సంవత్సరము విదేశములలో నొక పిల్లి మనుష్యభాషణముల భాషించుట

పత్రికా దృష్టాంతముగ నుండగా వాలి సుగ్రీవాదులు మాట్లాడుటలో వింత లేదు.

ద్రావిడుల వైదేశికులైన వారయినచో నార్యసంఘములో వారికి శూద్రత్వము కూడలేదు. ఆర్యసంఘమున శూద్రత్వము సామాన్యమైన విషయము కాదు. మనను పరిపాలించిన వారిని సైతము మన సంఘము శూద్రులుగా నంగీకరింపలేదు. బ్రాహ్మణులకు యజ్ఞయాగాదులచే నేఫలముకలుగునో కేవలము భక్తివలన శూద్రులకు నట్టిఫలమే కలుగును. ఆర్య సంఘమను విరాట్పురుషునకు వారు పాదములవంటివారు. వారు లేనిది సంఘమే నడువలేదు. వారు గంగ సైదోడులు. కవిశానసరస్వతికి ఛంద మెట్లో సంఘమునకు వీరట్టి ప్రాధాన్యము కలవారు. వైదేశికులకు శూద్రత్వ మంగీకరించుట కేదయిన వేదశాస్త్రాధారము లుండవలెను కదా! అట్టి వేవియు లేవు. బ్రాహ్మణులు స్త్రీ శూద్రుల కన్యాయము చేసిరని మాగొట్టిపాటి బ్రహ్మయ్యగారొక సభలో చమత్కరించిరి. వారుచెప్పిన కారణమేమనగా జందెములు వారికి వేయలేనని. ఇట్టివి చమత్కారములు. వారువేసికొన్నచో కాదనువారెవ్వరు? ఒక నియమముపై సంఘమునడచుచున్నదంతే.

శూద్రులే ద్రావిడులనినచో నుత్తరదేశముననున్న శూద్రులు మేము ద్రావిడుల మనుకొనుటలేదు. త్రైవర్ణికులకు శూద్రులకు యుద్ధమే లేదు. అది వట్టి కల్పనము. అట్టి యుద్ధములు జరిగినట్లు మన గ్రంథములు చెప్పుట లేదు. సంఖ్యాబలమున సహజముగా నధికులైన శూద్రులతో యుద్ధముతే వచ్చినచో నీ దేశములో వర్ణ వ్యవస్థ నిలబడుట కవకాశమేలేదు. అందుచేత త్రైవర్ణికులచే ఓడిపోయి బానిసలైన వారుకాదు చతుర్థవర్ణము వారు. "ఏ విధముగ చూచినను శూద్రులు బానిసలుకారు. వారు బానిసలగుటకు సాధ్యమును కాదు. భరతఖండమం దన్నిజాతులవారును స్వతంత్రులుగ నుండుటగాంచి గ్రీకులు విస్మయపడిరి" (Reverend Fr. Maris, Religion of the world). "ఆత్మార్పణము చేయగల శక్తివలన, ప్రజా సేవా నిరతివలన, ప్రతి యుగములోను బ్రాహ్మణ వర్ణములో జన్మించిన మహనీయుల ప్రతిభవలన ఆ వర్గమంతయు ప్రజల మన్ననల నందుకొన్నది." (శ్రీ నెహ్రూ—భారత దర్శనము). "As the Brahmins lived for others, and were excluded for most of the lucrative pursuits of life, it was a social and it soon became a

riligious duty, that they should be supported by the community at large" (Itsing-a Chinese traveller) బ్రాహ్మ జ్ఞానమును పొందుట కందఱకును అవకాశములున్నవి. విదురుడు బ్రాహ్మ జ్ఞానికదా! అందుచేత వర్ణ సంఘర్షణ మీ దేశమునలేదు. పైగా బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చినది బ్రాహ్మణేతర ప్రభువులేకదా !

## లేని ఆర్యద్రావిడ యుద్ధములు చరిత్రకేల ఎక్కినవి ?

ద్రావిడు లనువారు పాశ్చాత్యులు వాడిన అర్థములో భారత దేశములోనే లేరనియు నున్నవారు ఆర్యులనియు తెలిసినది. ప్రాచీన కాలమునుండి వర్ణ వ్యవస్థ భారతమున నున్నదని చరిత్రకారులు తెలియును. "విప్రా అమృత ఋతజ్ఞాః" (తైత్తిరీయ సంహిత, 1-7-3-2) "విప్రాసో రాజానో" (ఋగ్వేదము 10-6-78) "బ్రహ్మ ద్విషేత్ నృమింహేనమస్త్ర" (ఋగ్వేదము 3-3-30-17). ఆనాడు వర్ణాశ్రమ ధర్మము ననుష్ఠింపకుండుటయే కాక, యజ్ఞములను పాడుచేయుట, దోపిడ్లుసాగించుట, అమానుషకృత్యము లాచరించుటలుచేయు కొందఱుండెడివారు. అట్టి సంఘ విద్రోహకారక శక్తులను దస్యులని పిలచెడివారు. శబ్ద కల్పద్రుమమను రెండవ సంపుటమున 697 వ పుటలో—

దస్యుః : దస్యతి పరస్వాన్ నాశయతి ఇతి—దసస యోజనాతి
శుద్ధి దసిజనిభ్యః యుచ్ (ఉణాది 13-20) ఇతియుచ్
బహులక కాదనాదేశాఽభావః చోరః యథా మనుస్మృతిః
విక్రోశంత్యోయస్య రాష్ట్రాద్ధ్రి) యంతే దస్యుభిః ప్రజాః
సంపశ్య తస్స భృత్యస్య మృతస్స న తు జీవతి. (7-143)

దస్యు డనగా పరధనముల నాశనము చేయువాడును, దొంగ యనియు నర్థములు. పై శ్లోకములోనున్న అర్థ మేమనగా— ఏ రాజ్యమున రాజును మంత్రియు, తక్కిన సేవకులును చూచుచున్నను, మొఱపెట్టుచుండు జనులను దొంగలు బాధింతురో అట్టి రాజు సేవకులతోడ బ్రతికియున్నను చచ్చినవాడే యగును అని. ఈ ధర్మము ననుసరించియే యిప్పటి టోపిడీ దొంగలను రాజులు శిక్షించిరి. పూర్వోదాహృతమైన 'శతపత్ర' అను

శ్లోక సంబంధులైన పౌండ్రకులు, ఓఢ్రులు, ద్రవిడులు, కాంభోజులు, యవనులు, శకులు, పారదులు, పహ్లవులు, చీనులు, కిరాతులు దరదులు, ఖశులు- అను క్షత్రియజాతులు కర్మబాహ్యులైనవారు దస్యులు. వారు శూద్రత్వమును పొందిరి. ద్రవిడదేశ మనగా అరవదేశ మనియేకదా అర్థము. దక్షిణముననున్న అరవదేశము వారేకాక ఉత్తరమున కాంభోజాది దేశముల వారును దస్యులైరి. వీరందఱు క్షత్రియ జాతులవారు కాని శూద్రజన్మము కలవారుకారు. అట్లే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారును దస్యులైరి (మనుస్మృతి 10-45). కనుక వీరందరును ఆర్యులేయనియు, ఉత్తరదేశమువారును ఇందుకలరనియు స్పష్టమగుచున్నది. వీరితోనే ఆర్యులకు యుద్ధములు జఱిగినవి. అనగా అగ్న్యాధర్మానుష్ఠాతలైన ఆర్యులకును దస్యార్యులకును యుద్ధములు జఱిగినవన్నమాట. "As the word Dasyu, Dasa and Asura are met within the Vedas, some historians have fancied that before the advent of Aryans into Aryavarta there were some original inhabitants there, and these were conquered and driven out by the Aryans. But the fact is, the Aryans themselves were the original inhabitants of Aryavarta; there they were born bred and flowrished. The Asuras and the like were not different from the Aryans. "I have gone over the names of the Dasyus or Asuras mentioned in the Rigveda, with a view of discovering whether any of them could be regarded as Non-Aryan origin; but I have not observed any that appeared to be of this character" (Muir - in his O. S. T. Vol II page 387 Edition 1871) The Anaryas or Dasyus not only gave up Vedic rites but harassed the Aryans who performed them. "అకర్మాదస్యుః అన్యవ్రతః అమానుషః (Rigveda 10-2-22-8) (The genesis of the Human race). విధివిలాసమేమనగా ఏ దస్యార్యులను అప్పటి ప్రభువులు దేశబహిష్కారము చేసిరో వారి సంతతివారే, కాలక్రమమున దండెత్తి మనలను కొంతకాలము పాలించిరి. అయినను జాతి నిలబడి యార్షధర్మమును కాపాడుకొన్నది. కనుక చరిత్రకారులుచేసిన ఘనకార్యమేమనగా దాక్షిణాత్యులను దస్యులనుచేసి, దస్యులను ద్రావిడులుగా కల్పించి తిరిగి ద్రావిడు లెవరనగా శూద్రులనిరి. శతవిషాణప్రాయమైన ద్రావిడజాతికి అసలుకులములే లేవనియు, వారోడిపోయినపిమ్మటశూద్రులైపోవలసి

వచ్చినదనియు చెప్పిరి. ఆభ్రాంతిచే కొందరిట్లు వ్రాయుచున్నారు. "The Dravidians, originally caucasian, did not have the caste-system and did not therefore preserve the purity of their blood and they did not keep themselves exclusive and seperate from the rest of the population for a long time till the rise of Such kings as "Palyagasalai-Mudukudumi - Perwvazhudhi or the great Pandya, Mudukudumi, famous for many rituals. The reign of such kings in the south at the turn of the Christian era exposed the far south to the Aryan influences, bringing to them the caste-system, the Vedicrites and patriachical system (Sri V. c. Mouli - Indian Express): ఇట్టి వ్రాతలు ద్రావిడలనబడు వారందఱకును బాధాకరములు కదా! దాక్షిణాత్యులకు వర్ణవ్యవస్థ ఔత్తరాహులవలెనే సృష్ట్యాదినుండియు కలదుకదా! వైదేశిక చరిత్రకారుల ఊహలు పిల్లికి చెలగాటము-ఎలుకకు ప్రాణసంకటము వంటివిగా భారతీయులకైనవి. భేదతంత్రమున్నదా యనుపించునట్లున్నవి. గ్రంథములలోగాని, అనుభవములోగాని లేని ద్రావిడజాతిని సృష్టించి వినోదించిరి.

## రావణుడు ద్రావిడుడా ?

'ధాతాయథా పూర్వమకల్పయత్' అని యుగములలోని చరిత్రములు ఈ షద్వైవసమ్యముతో పునరావృత్తములగునని మనపెద్దలనిరి. ఇది శ్వేత వరాహకల్పము. పూర్వకల్పానంతర ప్రళయము జరిగిన పిదప ఈ ఏడవ మనువుకాలములో నిరువదియేడు మహాయుగముల అనంతరము జరుగు మహాయుగములోని త్రేతాయుగమువాడు శ్రీరామచంద్రుడు. ద్వాపర యుగము గడచి కలియుగము ప్రవేశించి అయిదువేలసంవత్సరముల పై చిల్లర అయిన స్థితిలో మనమున్నాము. శ్రీమాన్ యస్. గోపాలస్వామి అయ్యంగారు మన దేశపక్షమున యు. యన్. ఒ.లో మాటాడుచు ద్రావిడభాషలో (Tamil) ఒక సామెత కలదనియు, బుడ్డిచెంబులో గుమ్మడికాయ దాచుటకు సాధ్యము కాదనియు నట్లే పాకిస్థాన్ దురాక్రమణమును కప్పిపుచ్చుటకు సాధ్యముకాదనిరి. అట్లే బి. సి. 2000 సంవత్సరములనాటి చరిత్రలో త్రేతాయుగపుచరిత్ర నిరీక్షించుటకు సాధ్యముకాదు. కాని చరిత్రకారులాపని చేసిరి. శ్రీరాముడు ఆర్యధర్మమును వ్యాప్తిచేయుటకు దక్షిణాపథమునకు

వచ్చెననిరి. దానితో రావణుడు ద్రావిడుడై పోయెను. శూర్పణఖ, తాటక, ఖరుడు, దూషణుడు అందఱును ద్రావిడులై పోయిరి. వాస్తవమునకు రావణుడు పులస్త్యబ్రహ్మ మనుమడు, విశ్వావసుని పుత్త్రుడు, కనుక బ్రాహ్మణుడు. వేదమునకు పదక్రమ విభాగముచేసిన మహానుభావుడు. నిత్య శివపూజా తత్పరుడు, పాపకృత్యము నాచరించుటచే హతుడైనాడు. పరస్త్రీ సంగమముకోరి సీతను హరించిన రావణుని మావాడని బ్రాహ్మణులుగర్వింపరు. ఆతనిపేరు బిడ్డలకు పెట్టుకొనరు. దేవాలయమును కట్టింపరు. ఇతరులును నంతియే. క్షత్రియ ప్రభువైన శ్రీరామచంద్రునే దేవుడనిభావింతురు. ఇది యీదేశ సంస్కృతి. ఇట్టి రావణుని ద్రావిడుడని చరిత్రకారులనిరి. వేదవేత్తలు చారిత్రక ద్రావిడు లెట్లగుదురని వారాలోచింపలేదు. వర్ణవ్యవస్థ ద్రావిడులకు లేదనువారు బ్రాహ్మణుడైన రావణుని ద్రావిడుడుగా నెట్లు పరిగణించిరో తెలియదు. ద్రావిడులు చెట్లను మ్రొక్కువారును, ఆర్యులు అగ్నికార్యములాచరించువారనికదా చారిత్రకుల ఊహము! "అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహేగృహే" అని కనబడుచుండగా రావణు డెట్లు ద్రావిడు డయ్యెనో దురూహ్యము. రావణాసురునిది లంకాపురము. ఆ లంక నేటి సిలోన్ కాదు. భారత వర్షమునకు దక్షిణ సరిహద్దునగల నిరక్షరేఖకు దక్షిణముననుండెడిది. భూభాగములు మునిగిపోవుట ఆ స్థానమున సముద్రముండుట వలన భారతవర్ష భూగోళముమాఱినదని లోగడనే యుదాహృతమైనది. "American scientists now say they have substantial evidence to support the theory that the earth's continents were at one time part of a Super-Continent which split and drifted apart. They say the land drift is still continuing, caused by a spread of the ocean floor from its volcanic centres at an estimated rate of one to four centimetres a year. The disclosures were made at a national science foundation briefing yesterday on the result of a deep sea drilling test. (Continental drift is proved - Indian Express,' 30-10-69). భూగర్భశాస్త్రమునకు పునాదివేసిన క్యూవియరుకూడ భూగోళభౌతిక విప్లవము నిదివఱలోనే తెల్పెను. ఆ లంకాపట్టణమునకు భార్యను తెచ్చికొనుటకై రాముడేగెను. దుష్టశిక్షణము రాజధర్మముకదా! అంతియేకాని ఆర్య సంస్కృతిని ప్రచారము చేయుటకు పోలేదు. అచ్చటనున్నవారును ఆర్యులే కదా! శ్రీరామచంద్రుడు పోవుటకుపూర్వమే యచ్చట ఆర్యసంస్కృతి

యున్నది. ఋషులున్నారు. దీనికి శ్రీమద్వాల్మీకి రామాయణమే ప్రమాణము. రామాయణము ప్రపంచమున నే ప్రాచీనకావ్యము కదా! ఆకావ్యము చెప్పిననే కదా చారిత్రకులకు రాముడనునొకడుండెనని తెలిసినది. అందలి ప్రమాణమే వీరి యభిప్రాయమును ఖండించుచున్నది,

"ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్యమాత్మవాన్
దదర్శరామోదుర్ధర్ష స్తాపసాశ్రమ మణ్డలమ్
పుష్పైశ్చ నియతాహారై శ్శోభితం పరమర్షిభిః
దదృశేహ్మబ్రవనం ప్రఖ్యం బ్రహ్మఘోషనినాదితమ్
బ్రహ్మవిద్భిర్మహాభాగై ర్బ్రాహ్మణై రుపశోభితమ్
సదృష్ట్వా రాఘవ శ్శ్రీమాం స్తాపసాశ్రమ మణ్డలమ్
అభ్యాగచ్ఛన్మహాతేజా విజ్యం కృత్వా మహాధనుః
దివ్యజ్ఞానోపపన్నా స్తే రామందృష్ట్వా మహర్షయః
అభ్యగచ్ఛం స్తథాప్రీతా వైదేహీంచ యశస్వినీమ్
తేతం సోమ మివోద్యన్తం దృష్ట్వావై ధర్మచారిణః
(అరణ్యకాణ్డే ప్రథమస్సర్గః 8, 9, 10, 11)

అచ్చట నగ్నిహోత్రములు, బ్రాహ్మణులు నంతకు పూర్వమేయుండగా ఒక మతమును నవీనులు ప్రచారముచేయు మిషనరీలవలె శ్రీరాముడు వెళ్లెననుట వింతలలో వింత. రావణునకు ప్రచారమే యక్కఱలేదు. అతడు వేదవిదుడుకదా! కనుక రావణుడు ద్రావిడుడనబడువాడు కాడు. ఆర్యుడే. అయినను రాక్షసుడు. కనుకనే రాముడు చంపెను.

## ఆర్యు లాదిమవాసులను చంపిరా?

మన దేశచరిత్రను మనవారు చెప్పినదానిలో మనవారికి ప్రమాణబుద్ధి కలుగక వైదేశికులలో ప్రమాణబుద్ధి కలుగుట విచారింపదగిన విషయము. శ్రీ కె. యమ్. మున్షీగారెట్లు విచారించుచుండిరో చూడుడు. "బ్రిటిష్ చరిత్రకారులు, భారతదేశమను విశిష్టప్రాంతమేలేదని నిరూపించుటకు యత్నించిరి. మనసంస్కృతి, సభ్యత, అంతయు గ్రీసునుండియో, మఱియొక చోటునుండియో అరువు తెచ్చికొంటిమనియు, భారతీయులకు అసలు

వ్యాపారమనగా నేమియో తెలియదనియు, వీరి సభ్యత మొరటుదనియు చూపయత్నించిరి. భారతదేశ చరిత్ర నిష్పక్షపాత దృష్టితో పరిశోధించి వ్రాయవలసిన అగత్యమున్నది." (19వ చారిత్రక మహాసభలు – ఆగ్రా – 27-5-56 ఆంధ్రపత్రిక). ఈ బ్రిటిష్ వారి నాగరకత ఎచ్చటనుండివెళ్ళినది? "ఇంగ్లీషువారి చట్టములు రోమీయుల యొద్దనుండి గ్రహింపబడినవి. రోమీయులు యవనదేశమునుండి గ్రహించిరి. రోమురాజ్యము 'డిసెంవిరేటు'అను నిరంకుశ దండనాధికారము క్రింద నున్నకాలమున క్రీ. పూ. 450లో యవన చట్టములు భారతఖండమునుండి గ్రహింపబడినట్లు కన్పించును" (హిందువుల ఆధిక్యము) "మను ధర్మశాస్త్రము సోలోను ధర్మశాస్త్రము కంటెను ప్రాచీనము. విశర్గ సువ్రాసిన ధర్మశాస్త్రముకంటెను నైతము ప్రాచీనము" (సర్ విలియమ్‌జోన్సు). "The much glorified invasion or Alexander is not begining of a contact between India and the west. It was the longstanding spread of the fame of Indian Civilization in the west. Alexander's teacher, the great Aristotle speaks of the reputation of Indian Kings as being far superior to the people they ruled over in point of intellectual attainments, in his poetics Aristotle's reference to India has this historical value only that India and its civilization were known in those regions in such a foroff ancient period, though it is arrogant" (Sanskrit in foreign countries, C. Kunhan Raja-26-8-56 Bhavan's journal). సత్యమిట్లుండ బ్రిటిష్ చరిత్రకారులు భారతదేశము నేల సంకుచిత పఱుప యత్నించిరని విచారించుట అగత్యమగుచున్నది. వారిది పేలెడుదేశము. వారి యదృష్టవశమున రవి యస్తమింపనిసామ్రాజ్యమును పాలించిరి. భారత ఖండమువంటి దేశము వారికి పాడిబఱ్ఱె. అట్టి దేశచరిత్ర సత్యముగవ్రాసినచో దేశీయులైన విద్యార్థులకు ఆత్మప్రత్యయముకలుగును. ఫలితముగా వారిదేశమునుండి వెడలిపోవలసి వచ్చును. వారికి ప్రాచీనమైనచరిత్రలేదు. అందుచేత ప్రాచీన చరిత్రముగల వారి చరిత్రను క్రీస్తుపూర్వము కొద్ది కాలములోపల నిముడింప వలసివచ్చెను. మెకాలేగారి వ్యూహము కొంతవఱకు సఫలమై, వేదముఖులు ఆంగ్ల విద్యలో ప్రవేశించి దానిని అవలీలగా సాధించిరి. వారాసించినట్లు వారుని ధేయులు కాక స్వాతంత్ర్య వాంఛను వెలువరింప ప్రారంభించిరి. బాలగంగాధరతిలక్ 'స్వరాజ్యము నా జన్మహక్కు' అని యుద్ఘోషించిన మొదటివారుడు. క్రమ

ముగ వారు బ్రాహ్మణేతరులను దగ్గఱకు తీసిరి. వారు సంఖ్యలో నధికులు కనుక వారిని తృప్తి పఱచినచో తమకు భద్రమనుకొనిరి. గాంధీగారు రంగములో దిగుటలో నదియు సాగలేదు. హరిజనులను సంఘములోనుండి చీల తీసి యవర్ణులని సవర్ణులని విడదీయయత్నించిరి. గాంధీగారువారిప్రయత్నమును వమ్ముచేసి హరిజనులను కూడగట్టుకొని యుద్యమము సాగించిరి. చివఱకు మహమ్మదీయులను చీలదీయ యత్నించిరి. ఆదికొంతకాలము ఫలింపక పోయినను, పాకిస్థాన్ సృష్టికి దారితీసెను. తమ్ముడు అన్నను కొట్టినచో మిగిలినవారిని కొట్టినట్లు తమ్ముని కొట్టలేడు. ఆతడు సహ్యముగా నుండు సాకతో చాలకాలము పేచియుండును. మొన్నటి పాకిస్థాన్ యుద్ధములో మన మెక్కువ భాగ మాక్రమించినను తిరిగి వచ్చిన కారణమదే. పాకిస్థాన్ రేడియో మననుగూర్చిదుష్ప్రచారములు చేయుచున్నను, మనము హుందాగా ప్రవర్తించెడి కారణమదియే. కాని ప్రమాదభయమ్చ్చుట లేదనుకొనుట యవివేకము. వారి వెనుక నుండెడివారు ఎప్పుడును ఉందురు కదా! కనుక పై చరిత్రమునుగూర్చి గ్రహింపవలసినవిషయమేమనగా బ్రిటిష్ వారు భేదతంత్రములో నిపుణులని. అందుచేత సత్యమైన మనచరిత్రను పాని చేయవలయునన్న సంకల్పముతోపాటు, వారిరాజ్యమిక్కడ సుస్థిరముగ నుంచుకొనవలసిన స్వార్థము కూడ వారియందున్నదని యూహించుటకష్టము కాదు. దస్యులెవరో మనుస్మృతిలోస్పష్టముగనుండగా, ఆమాత్రము సంస్కృతమువారిపండితు లర్థముచేసికొనలేకపోయిరా? దస్యులను ద్రావిడులనివారు చెప్పదలచిరి. అట్లు చెప్పినచో దక్షిణదేశమందలివారు అందరు ద్రావిడులను టయు వారి యభిప్రాయముకాదు. అట్లయినచో వారిదేశమువారే మైరులో దురు. వారికిజాతీయత పెరుగగలదు. అప్పుడయినను వారికినష్టమే. అందుచేత వారును ఎక్కడనుండియో వచ్చిరనిరి. అందునను ద్రావిడులనగా శూద్రు లని దక్షిణదేశములో తిరిగి యొకవర్గమును విడదీసిరి. ఉత్తరదేశములోని శూద్రు లీవాదమును విశ్వసించినట్లు లేదు. కాని దక్షిణదేశములో బిషప్ కాల్డ్వెల్ గారు తమిళదేశమున నివసించి కృషిచేసిన ఫలితముగా నీవాదము నకు కొంత ఆధారముల వంటివేర్పడెను. ద్రావిడభాషలను వదము సొక దానిని విశ్వామిత్ర సృష్టిచేసి, ద్రావిడులను పంథ్యాగ్నిపుత్రులను సృష్టించిరి. ఈ ద్రావిడభాష నా ద్రావిడులతో ముడివేసిరి. ఇంకేమికి అటియొక చరిత్ర, ఒక శాస్త్రమువంటిదిగా ఆభాసగా కన్పించుచున్నది. తిరమరలు పెట్టు

చున్నది. ఇఱువురు స్నేహితులుండిరనుడు. వారిద్దరి తండ్రులు నదీస్నాన మునకుపోగా నొకడు ఈతకొలకులోనికిపోయి మరణించెను. కొంతకాలము పోయిన పిదప, తండ్రి చనిపోయిన వానికొకడు నీ స్నేహితునితండ్రి నీతండ్రిని నదిలోత్రోసివైచెను అని చెప్పిన మొదట నమ్మడు. అట్టివాడే మఱియొకడు, మఱియొకడు చెప్పిన నమ్మి స్నేహితునితో నాజన్మవిరోధము తెచ్చికొనును. దానిలో సత్యమున్నదా యని విచారింపడు. ఇది మానవ స్వభావము. అట్లే మీరు ద్రావిడులు వారార్యులు అని విడదీసినచో, చెప్పగా చెప్పగా 'కాబోలు'ననుకొందురు. ఇది వట్టి రజ్జుసర్పభ్రాంతివంటిది. ఆర్యు లను విజేతలుగాచెప్పిరి కాన వారికి గర్వమధికమగును. ద్రావిడులోడిపోయి రని చెప్పినచో వారికి పగపెరుగును. చివఱకు వారు చెప్పునదేమనగా నిది మిశ్రమమైనజాతి యని. వీరు 'కాబోలు'ననుకొందురు, శ్రీ నెహ్రూవంటిబుద్ధి శాలియే "ఎవ్వరార్యులో ఎవ్వరు ద్రావిడులో చెప్పుట కష్టము" అని సంతృప్తిపడిరి. ఈదేశములోని మహమ్మదీయులును, క్రైస్తవులునుఒకప్పుడు హిందువులే కదా! వారిని మతముమార్చి కొన్నను ఆ దృష్టితోనే మనవా రుగా చూచెదము కాని ద్వేషింపము. వర్ణముల విభేదము లెందుకుండును? ఇద్దఱు పరఫలాపేక్ష కలిగినపుడు దుర్బలుడైనవాడు 'వర్ణమను' ఆయు ధము నిటివల మాత్రమే ఉపయోగించుచున్నాడు. మిగిలిన సందర్భములో విభేదములేనేలేదు. అసలు వర్ణమనునది పాశ్చాత్యులుచెప్పెడి Caste కాదు. "This term 'Caste' has proved most mischievous and misleading and the less we avail ourselves of it the better. We shall be able to understand the true state of society in the ancient times of India. Caste is of course, a portugese word and was applied from about the middle of the sixteenth century by rough portugese sailors to certain divisions of Indian society which had struck their fancy (Six systems of Indian philosophy-MaxMuller). ఆర్యులనుగూర్చి చెప్పునప్పు డార్యుల స్వరూ పమేమో గ్రహించుట అవసరము. "No Indian was ever known to tell an untruth" (M. Crindle - Indian antiquity 1876). "The people of India are true in speech and eminent in justice" (Marcopolo). "I have had before me hundreds of cases in which a man's property, liberty and life was depended upon his telling a lie and he has refused to tel it." (Colonel sleeman - Commissioner for the suppression of Thugge). "Truth

was specifically an Indian virtue (Phillimore). మాక్స్ ముల్లరు మహాశయుడు భారతీయులు విదేశపండితులతో వాదించునప్పుడెంత సత్య పరాకాష్ఠచూపెడివారో వర్ణించియున్నాడు. "They have shown strength, but no rudeness; nay, I know that nothing has surprised them as much as the coarse invective to which certain Sanskrit Scholars have condescended, rudeness of speech being, according to their view of human nature, a safe sign not only of bad breeding but want of knowledge. When they were wrong they have readily admitted their mistake; when they were right they have never sneered at their European adverseries." (Indian: what can teach us). ఇటీవలి భారతీయులే యింతసత్యసంధులై యుండగా, ప్రాచీనార్యులువారిగ్రంథములలోనసత్యము వ్రాసికొని యున్నారనుకొనుట కవకాశము లేదుగదా! ప్రపంచములో నేతొలిపలుకులు ఆర్యశబ్దమును ప్రసాదించినవో, ఆవేదము ఆర్యులనుగూర్చి యేమనుచున్నదో గమనింపుడు.

"సమింనతి సహింసతి మపి ప్రాణిజాతం" (ఋగ్వేదము 7-6-15-15; 6-2-6-3) ఇది ఆర్యులస్వరూపము. వారు అన్యప్రాణిని హింసించుటెరుగరు. ఇట్టివారు పాపము! గృహములను కట్టికొనిజీవించుచున్న ఆదిమవాసులనబడువారినెచ్చటనుండియోవచ్చిజయించిరనుట ఎంతటిక్రూరమైన ఆరోపణము! అట్టి లక్షణము కలవారగుటచేతనే వారు ఆర్యులయిరి. ఇట్టివ్రాతలనుగూర్చి భారతీయ చరిత్రకారులెట్లుద్రిక్తులగుచున్నారో గమనింపుడు. "In what Veda, in what Sukta do you find that the Aryans come into India from a foreign country? Where do you get the idea that they slamghtered the wild aborigines? What do you gain by talking such nonsense? And may I ask you, Europeans, what country you have ever raised to better conditions? Whenever you have found weaker races, you have exterminated them by roots as it were. You have settled in in their lands, and they are gone for ever. What is the history of your America, your Australia and Newzealand, your Pacific islands and South Africa? where are those aboroginal races to day? They are all exterminated, you have killed them out-right as if they were wild beasts. It is only where you have not power to do so, and there only, the other

nations are still alive. But India never did that. The Aryans were kind and generous; and in their hearts which were large and unbounded as the ocean and in their brains gifted with super human genius, and these ephimeral aud apparently pleasant but virtually beastly processes never found a place'' (The genesis of the Human race).

## ఆంధ్రులు ద్రావిడులా ?

శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారి యభిప్రాయములో ఆంధ్రులు ఆర్యజాతి. వారు నాకు వ్రాసిన జాబును ఉదహరించుచున్నాను. ''మంత్ర బలమందు విశ్వాసమున్న మనము ఆర్యసంతతివారము. ఆంధ్రమని విషపూరితములైన బీజాక్షరముల నుపయోగింపరాదు. జాతిపేరు, దేశముపేరు అంధ్రము. ఆంధ్రముకాదు. మృతాక్షర సంయుక్తమైనపేరు దేశానికి జాతికి ఉండదు. ఉండలేదు. ఉండరాదు. ఆంధ్రమని వ్రాసినంతకాలము ఆంధ్రులగతి అధోగతియే. "తెలుంగు" "తెలుగు" అనుపదములుకూడ అట్టిమృతాక్షర యుతములే. "తెనుఁగు" "తెనుంగు" అని అనవలెను. 'త్రిలింగభూమి' 'త్రిలింగదేశం' అనవచ్చును కాని 'తెలింగాణం' అని అనరాదు. అదికూడ అవాచ్యమే. మన ఆంధ్రుల దురదృష్టము ఇంకా ఎంతకాలము కరిగిపోకుండా ఉండునో అంతకాలము ఆంధ్రము, తెలుగు మనలను వీడిపోదు. యథార్థమును వ్రాసినాను. మీ మనస్సు నొప్పికలిగించు ఉద్దేశముకాదునాది. సహృదయముతో వ్రాసినాను - బాధను అపుకోనజాలక -'' (శ్రీభావరాజు వేంకటకృష్ణారావు. M.A.B.L. Advocate, 42. MowbraysRoad, Teynampet P.O. Madras-18). వీరు ఆంధ్రులు ఆర్యజాతివారను వలుకే వీరి యభిప్రాయముతో నేకీభవించుచున్నాను. మంత్రశాస్త్రానుగుణ్యముగ స్వభావసిద్ధమైన జాతిపేరు మార్చుకొనబడదు కదా! మనవారు సగర్వముగ మేము ఐతరేయ బ్రాహ్మణములోనున్నవారమని చెప్పికొందురు. వారు విశ్వామిత్ర శాపదగ్ధులయినవారు. 64 బహిష్కారజాతులలోనివారు. ఆర్యాంధ్రులుకారు. బహిష్కారజాతులలో ద్రావిడులు (అరవవారు) చేర్పబడినట్లే ఆంధ్రులును చేర్పబడిరి. వారే మయిరో తెలియదు. దేశముతెలుపలగు పేరు యుండవలెను, మిగిలిన వారివలెనే. ప్రస్తుతమున్నజాతి స్వచ్ఛమైన ఆర్యజాతి. ఈ ఆంధ్రదేశమునకు పూర్వనామము ప్రాచ్యకదేశము.

దీనిని 'బలి'యనురాజుపరిపాలించెను.ఆతనికార్గురుకుమారులు. (1) అంగరాజు (2)వంగరాజు (3)కళింగరాజు (4)సుంహ్మరాజు (5)పుండ్రరాజు. (6) ఆంధ్ర రాజు. వారిపంపిణీదేశములలో వారిపేర్లతో రాజ్యములేర్పడెను.ఆంధ్రరాజు పాలించిన దాంధ్రదేశమయ్యెను. "తితిక్షునకు రుశద్రథుండును, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండును, సుతపునకు బలియుపుట్టెరి. వారు తూర్పుదేశంబులకు తమతమ నామధేయంబులిడి యేలిరి (భాగవతము నవమస్కంధము). శ్రీకురుగంటి సీతారామభట్టాచార్యులవారును ఆంధ్రు లార్యులను అభిప్రాయము కలవారే. " The Andhras of the Andhra Desa have always been a people belonging to the four varnas of the Aryan social system and observing the Vedic social and religious rites and regulations like the Aryans of any other part of 'Aryavarta'. In fact, even to this day, the Andhra Brahmins stand supreme in the study of the Vedas. There is absolutely no resemblance in them to the uncivilised tribes into whom the fifty sons of Viswamitra and their descendants must have degererated excepting the partial resemblance in the name. The western people of Europe believe and proudly proclaim their descent from bandits and pirates and barbarous invading hoarder who mixed with the original inhabitants of their lands and thus gave rise to the different modern nations of Europe who are all of mixed origin and descent. They would naturally have a predisposition to to find and believe a similar account of the origin, that they descended from barbarous tribes and gradually became civilised in course of time, that too within what they consider to be the recent historical past. Nor is there any single text which can be cited as an authority for the assumption that these barbarous people crossed the Vindhyas and established vast kingdom in the South. Moreover if all the Andhras are to be considered as the descendents of the cursed sons of Viswamitra, how are we to account for the existance in the Andhra country of Brahmins and Khsatriyas of nearly three hundred respectable Gotras of Rishis, two hundred Gotras of of Vysyas and innnmerable Gotras of Sudras? Where from did they come? Also there are among the Andhras even to this day Brahmins belonging to the Gotras of the younger sons of Viswamitra (other than those cursed by the father). How

are we to account for them? How could there be among their descendants of the different castes, other Gotras, Pravaras than those of Viswamitra or including him. It is all an absurd and fantastic theory. They were predetermined to establish four principles in their version of Indian History (1) Hindu civilisation is only 3000 years old or less (2) Hindu culture and civilisation were all derived from Greece and Mesapatamia (3) The Vedas and Sastras were all composed after 1200 B. C. (4) The Hindus now are all mixed race and not of the pure Aryan stock. The Andhras of Andhra Desa of pure Aryan descent. (Prof. K. Venkata chalam-Jurnal of Andhra Historical research Society-July, 1948 to April 1949) వాస్తవమున ఆర్యదేశమునన్ను వారందఱు నార్యులేయనిచెప్పి నప్పుడు ఆంధ్రులు విడిగా ఆర్యులని చెప్పనక్కర లేదు.

## మఱి ద్రావిడ భాషలనబడు వాని స్థితియేమి?

ఆర్యధర్మము ననుష్ఠించు వారందఱును ఆర్యులే యయినప్పుడు, ద్రావిడులు చారిత్రకులచే కల్పింప బడిన జాతియైనప్పుడు ద్రావిడభాషలన బడునవి యుండుట కవకాశమే లేదు. బ్రాహ్మణ విభాగములో ద్రావిడశబ్ద వాచ్యులైన మహారాష్ట్ర ఘూర్జరుల భాషలను ద్రావిడభాషలుగా గణించుటలేదు. (1) తెలుగు (2) కన్నడము (3) ద్రవిడము (4) మలయాళము మొదలైన భాషలనే ద్రావిడభాషలుగా భాషాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ద్రావిడజాతి ఎట్లు శశవిషాణప్రాయమో, ద్రావిడ భాషలునట్లే. అయినను ఒక విశ్వామిత్ర సృష్టిజరిగినది, సృష్టికర్త బిషప్ కాల్డ్వెల్ మహాశయుడు. ఆ విషయము వారేచెప్పినారు. " I have designated the languages now to be subjected to comparison by a common term, because of the essential and distinctive grammetical characterstics which they all possess in common and in virtue of which, joined to the possession in common a large number of roots of primary importance; they justly claim to be considered as sprining from a common origin and as forming distinct family of tongues. The word I have chosen is "Dravidian," from Dravida, the adjectival form of Dravida. This term it is true, has some times been used, and is still sometimes

used, in almost as restricted a sense that of Tamil itself, so that though on the whole it is best term I can find, I admit that it is not perfectly free from aubiguity" (R. T. Rev. Robert Caldwell D. D. LLD-A Comparative grammar of the Dravidian or South Indian family of languages). ఈ భాషలలో తెలుగు మిగిలినవానికంటె ప్రాచీనమని ఆంధ్రపత్రిక వృష సంవత్సరాది సంచికలో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిరి. బిషప్ కాల్డ్వెల్ గారు తమిళముపై మొగ్గిరి. "ద్రావిడ భాషలలో దేనిని ప్రాచీనతమమని భావింప దగదనుట సిద్ధాంతము" (డాక్టర్ లకంసాని చక్రధరరావు). ఈ ద్రావిడభాషావాదులు మూలద్రావిడభాష యొకటి యుండునని అనుమానింతురు. ఆ మూలభాష ద్రావిడమనుటకంటె ఏదియో యొక ప్రాకృతభాషలు కాని, వాని సముదాయముగాని ఏల యనుకొనరాదని కొందఱు ప్రశ్నింతురు. ఇట్టి సమానలక్షణముగల భాషలు ఉత్తరదేశమునందును కన్పించుచున్నవి. ఇవి యన్నియు ఏవియో కొన్ని ప్రాకృతములకు సంబంధించి యున్నవనుట సమంజసము. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు విజయవాడలో శ్రీ చెళ్లపిళ్లవారి ఆస్థాన కవి పట్టప్రదానోత్సవమునకు వచినప్పుడు "మీకు ద్రావిడ భాషా సిద్ధాంతముపై విశ్వాసమున్నదా?" అని ప్రశ్నించితిని. నాకు లేదు. కాల్డ్వెల్ గారు చెప్పిన దానినే యనుసరించుచున్నాను. వారు చూపిన హేతువులు నన్నాకర్షించినవి" అని వారు బదులు చెప్పిరి.

## తెలుగు ద్రావిడభాష లనబడువానిలో చేరునా ?

తెలుగు ద్రావిడభాష కాదని విశ్వసించువారున్నారు. "ఆంధ్రభాషలో రెండు రకముల భాషావేత్తలున్నారు......మొదటివారు "జనని సంస్కృతంబు సర్వభాషలకును, దేశభాషలందు తెలుగులెస్స" అన్నట్లు సర్వభాషలకు సంస్కృతభాష జనని వంటిది. ఆంధ్రమునకు సంస్కృత భాష మూలము" అనెదరు. రెండవవారు ప్రపంచములోని భాషలను కొన్ని భాషా కుటుంబములుగ విభజించిరి. ఒక కుటుంబమునకు ఆంధ్ర, తమిళ, కన్నడ, మలయాళ మొ॥ భాషలు చెందినవి. ఆదిద్రావిడ భాష వీరందఱి మొదటిభాష. ఆంధ్రభాష ఆదిద్రావిడమునకు చెందినదని డాక్టర్ కాల్డ్వెల్ నిరూపించెనందురు. కాని మన తెలుగుభాష అట్లు కాదు . . . క్రీస్తుపూర్వము

మూడవ శతాబ్దిలో బౌద్ధమత ప్రచారమునను చెందిన "ఆంధ్ర రట్టకథ" వలన నప్పటికే మనభాషకు ప్రత్యేకతయున్నది. అంతియేకాక భరతాచార్యులు నాటకములను వివరించుచు నాయా భాషలవారు నటకులుగా నుపయోగింపవలసిన భాషను వివరించినప్పుడు ఆంధ్రులు ప్రాకృతభాషను వాడవలెనని యనెనేకాని ద్రావిడమును వాడవలెనని యనలేదు. ఇందువలన నానాటికి క్రీస్తునకు రెండు మూడు శతాబ్దములకు ముందే తెలుగుభాషకొక ప్రత్యేకస్థితి యున్నది. (డాక్టర్, దివాకర్ల వేంకటావధాని - 'భారతానికి పూర్వము తెలుగు సాహిత్యము' 30-6-1957, ఆంధ్రపత్రిక). మన ప్రాచీనులు ప్రాకృతములే దేశభాషలకు మూలమందురు. ద్రావిడ భాష యనునది బిషప్‌గారి సృష్టికదా! ఆంధ్రము ప్రాకృతములకు సంబంధించినదే.

## జనని సమస్తభాషలకు సంస్కృత భాష :

సంస్కృతమే సర్వభాషలకు మూలమని మన ప్రాచీనకవులనిరి. మన కవులు వేదజ్ఞులు, శాస్త్రజ్ఞులు, పురాణజ్ఞులు. వేదములే ప్రపంచమున తొలిపలుకు లయినప్పుడును, అవి సంస్కృతభాషలో నున్నప్పుడును, వాని నుండి ప్రాకృతములు వచ్చినప్పుడును సంస్కృతభాష సమస్త భాషలకు జననికాక ఏమగును ? India is the first Peopled Country in the world" అని సర్ వాల్టర్ రాలే గారును, "No Country except India and no language except Sanskrit can boast of a possession so ancient or venerable" (Hindu Superiority) అని శారదాగారును అన్న సూక్తులు 'తల్లి సమస్తభాషలకు దైవత భాష' అను సూక్తిని బలపరచుటలేదా ? పాశ్చాత్యులు భాషా కుటుంబములుగ విభజించినవన్నియు ప్రాకృత వికారములే. భాషా శాస్త్రమును చదివి నేడు పదవులలోనున్న పెక్కురను నేను మీరు ద్రావిడభాష లనబడునవి సంస్కృత ప్రాకృతములకు భిన్నమయిన వానినుండి వచ్చినవను విశ్వాసము కలవారా? అని అంతరంగికముగ ప్రశ్నింపగా వారు 'లేదని' సమాధాన మిచ్చిరి. ఆ వాదమున కనుకూలముగ కొన్ని గ్రంథములున్నవి కనుక వానిని తప్పనిసరిగ యనుసరించుచున్నారు. వానికి భిన్నముగ గ్రంథములలో వాదము స్థాపింపబడిననాడు వారు సంతోషముతో దానిని శిరసావహింతురు. డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు రీ సందర్భమున కొంత

కృషిని చేసియుండిరి. ఆధునికులలో పెక్కురు అట్టి అభిప్రాయము కలవారే- "జనని సమస్తభాషలకు సంస్కృత భాష అనిరదా ఆరోగ్యశ్రీ ... సకల భాషలకు జననియైన సంస్కృతభాషా సముద్రము మిక్కిలి యగాధమైనది". (శ్రీ దేవులపల్లి రామానుజరావు- "మన కళా సంపద-సాహిత్యము" ఆకాశవాణి, హైదరాబాదు ఉపన్యాసము, 14-1-57 విజయవాణి). ఒక్క దాక్షిణాత్య భాషలకేకాక ప్రపంచంలోని సర్వభాషలకును సంస్కృతముతో సంబంధముండకుండ నుండుటకు వీలులేదు. నాగరిక భాషలకు మరీ యంత ఎక్కువగ నుండును. ఆరబ్ దేశములో కమిత. వాగీ, మిస్ర-(మిశ్ర) స్థానమున్నది. క్రీస్తుపూర్వము 8000 ఏండ్లక్రిందట భారతీయు లా స్థానములో స్థిరపడినారు. ద్రవిడ దేశమునుండి యచ్చటకు బ్రాహ్మణులు పోయియుండవచ్చును. 'డ్రూయిడుల' (పురోహితులు) శాపములు బ్రాహ్మణ శాపములవలె ఘోరములట! "సంస్కృతము-ఆత్మ, మిశ్రీ-ఆత్మ; సంస్కృతము-దావ-మిశ్రీ-దేవ=అగ్ని; సంస్కృతము-సేవా, మిశ్రీ-సేవ; సంస్కృతము-అపః=నీరు; మిశ్రీ-ఆబ్; 'కర్నల్ వాల్కర్' తదితర చరిత్రకారులు, మిశ్రీ అరబ్బీ జాతులవారిని నిశ్చయముగ హిందువులని భావించిరి" (శ్రీ చిరంజీవి లాల్ పరాశర్) మలయాభాషలో శుచి యను శబ్దము మారక అట్లే యున్నది. స్వామి యను శబ్దమును అట్లే, ఋషి యనునది 'రిషి' అయినది. వర్ణ, వరణ మైనది. రథము, రత మైనది. ఆంగ్లభాషలో 'పిత' వికారముచెంది 'ఫాదరు', 'మాత' వికారముచెంది 'మదర్' అయినది. ఈ విధముగ సంస్కృత ప్రాకృత ప్రభావములు ప్రపంచ భాషలలో సర్వత్ర ఉండగా, ఆర్యావర్తములోని ఏకదేశమయిన దక్షిణ ప్రదేశమున సంస్కృత సంబంధములేని ప్రత్యేక భాషలుకాని, సంస్కృతమునకు పూర్వ మున్నవనబడు భాషలు కానియుండుట కవకాశముండునని, లేక యున్నవని యనుట అవిచారిత రమణీయము.

## ద్రావిడభాష లనబడు వానినిగూర్చి దేశీయ పండితులేమందురు ?

డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు "ఆంధ్రభాషా చరిత్రము"ను రెండు సంపుటములుగ ప్రకటించిరి. వా రాంధ్రభాష ప్రాకృత వికారమైనదిగనే భావించినారు. కాని యేయొక్క పైశాచిక ప్రాకృతము నుండియో వచ్చినదని నిర్ధరించుట కష్టము. భారతవర్షములో ఉత్తర, అమె

రికావంటి ప్రాంతములు కలిసియుండెడివేమో! భూగర్భశాస్త్రజ్ఞులు చెప్పు సముద్రముల మార్పును, భూమిమార్పును త్రోసివేయుటకు వీలులేదుకదా! కల్నల్ విల్‌ఫర్డ్‌గారు సూచించియున్నట్లు ప్రాచీనమైన ఈజిప్టునకును భారతదేశమునకు సంబంధ ముండియుండును. "What is equally noteworthy is that the formation of the plural (for expressing the multitude) by repeating the same now is common to Tamil and Egyptian like the word par-palla (many)" (Sir C. P. Ramaswami Iyyar). అందుచేత ఏ ప్రాకృత ములనుండి దాక్షిణాత్యభాషల రూపములు వచ్చినవో నిర్ణయించుటకు విశేష పరిశ్రమ కావలెను. ఏ ప్రాకృతమునుండి తమిళము ప్రధానముగ వచ్చినదో ఆ ప్రాకృతమునుండి ఆంధ్రము రాకపోవుటకే ఎక్కువ అవకాశము కన్పించుచున్నది. కొన్ని ప్రాకృతములనుండి సమముగా ఆంధ్ర తమిళ ములు రూపముల గ్రహించి యుండవచ్చును. సంస్కృత ప్రాకృతములును ఆంగ్లమును అభ్యసించిన పండితులను, భారత దేశములో ప్రతిభాష నిమి త్తము కృషి చేయుటకు నియమింపబడవలెను. వారు పరిశోధనము సాగించిన పిమ్మట భారతవర్షమున నట్టి విధానముననే కృషి చేసిన పండితులతో సమా వేశములు జరుపవలెను. భారతవర్ష మననేమో నిర్వచింపబడినదికదా! ఉభయుల పరిశోధనా ఫలితములు సరిచూచికొనినగాని దక్షిణ దేశభాషల చరిత్రము సమగ్రముగ రచించుట కవకాశములు లేవు.

ఈ సందర్భమున డాక్టర్ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యభి ప్రాయము గమనింపదగినది. "ఈ కాల్డ్వెల్‌కు సంస్కృతము కాని, వైదిక భాషకాని, పాళీ ప్రాకృతములుకాని తెలియవనుట వాస్తవము. తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము, తుళు అనునవి ద్రావిడ భాషలనియు, నార్య భాషలకన్న భిన్నములనియు వాదము లేవదీసినాడు. వైదికభాష, సంహితలోను బ్రాహ్మణములలోను కలదు. ఇది కేవలము వ్యవహారదశలో నున్నభాష. కాలక్రమేణ దేశకాలభేదముల ననుసరించి ఈ భాషలో భేద ములు బయలుదేరినవి. అనేక ప్రాకృతశాఖ లనబడు భాషాభేదములు బయ లుదేరినవి. అట్టి ప్రాకృతములలో నొకదానిని సంస్కరింపగా, సంస్కృత మైనది. ద్రావిడభాషలు ఆర్య భాషలకన్న విలక్షణములగుచో ఈ వైదిక

యుగములోని ప్రాకృతములనన్న కూడ విలక్షణములా? యని ప్రశ్నింపక తప్పదు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ద్రావిడ భాషలలో ఎ, ఒ, చ, జ, ఱ, అరసున్నలు కలవనియు, నివి యాంగ్లభాషలలో లేవనియు చెలవిచ్చినారు. (శాస్త్రిగారీ వ్యాసమున ఋగ్వేదములో ఎ, ఒ, చ, జ,ఱ ప్రయోగములచూపి, శకటరేఫ, అర్ధానుస్వార విషయమున ప్రాకృత భాషాస్థితిని వివరించిరి.)

తాసామేకా మధుగ్మరైృ భుజము
లోకముద్వే ఉపజామి మీయః (ఋగ్వే—౩-౩-౫)

స్పష్టముగ భుజము ఉకారాంతము. కావున తెనుగులోని ఉకారాంతత్వము వైదిక ప్రాకృత నిష్ఠము. దీనిచే వైదిక కాలము నందలి ఆర్యభాషా శాఖలలో నొక దాని నుండి తెలుగు నిష్పన్నమైనదని నిష్కర్షగా చెప్పవీలున్నది. వ్యవహరింప దగు భాషకు స్వర మేదో రీతిగా నుండునని యొప్పికొందము. స్వర చలనము వలన "ఉకారమే" యేల రావలయును? తెనుగుకూడ ప్రాకృతమునుండి జన్మించినది కనుక వైదిక యుగములోని ప్రాకృతములనుండి దేశభాషలన్నియు నుత్పన్నములైనవి. ఈ ప్రాకృతములలో నొకటి సంస్కరింపబడి సంస్కృతమైనది. సమాన జాతీయక పదములు కొన్ని సంస్కృతమున కన్పింపక పోయినను, ఇండోయూరోపియన్ వంశభాషలలో, దొఱకుచున్నవి. తమిళములోని 'కుళిర్', తెనుగు 'చలి' యాంగ్లమందలి 'కూల్' సమాన జాతీయకములు. (ఇట్లెన్నియో పదములకు వారుదాహరణముల జూపిరి). ఈ సందర్భమున ఆంధ్రము ద్రావిడభాషా కుటుంబములోనిదా? (సర్వధారి - శ్రావణమాసము-భారతి) మిత్రులు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు కూడ ఆంధ్రము ద్రావిడభాషలకు సంబంధించినది కాదని చెప్పినట్లో, లేక ద్రావిడభాషలనబడునవి ప్రత్యేకములు కావని చెప్పినట్లో పత్రికలలో చూచిన జ్ఞప్తియున్నది. కళాప్రపూర్ణ డాక్టర్ చిలుకూరి నారాయణ రావుగారి యభిప్రాయమిట్లున్నది. "In India the two nation theory with emphasis laid on cultural and linguistic differences, sedulously fostered and propagated for a quarter of a century, has led to a state of homicidal frenzy.

This emphasis on cultural and linguistic differences, however, has been a phenomenon first brought into cxistance in our country in the middle of the last century. In 1856 was published "The comparative grammar of the Dravidian languages" by a Chaistian missionary of Tinnevelly. He brought into vogue a new term in the field of linguistic discussions, namely the word 'Dravadian'. "This was unfortumate. *Dravadian before his time was never used antagonistic to Aryan.* It was more a sort of religious term originally, Dramila meant "belonging to Dharma", the Buddhist Dharma. Buddhism over ran the whole of South India, While it decayed in the North, so that Northerners began to speak of Southerners as Charmilas, Dramilas, Tlramidas, Tamils and so on. Through Coldwell this term acquired a new signification and content and permanent disparity and distinction was postulated and propagated ever since. North India was divided from South India once for all and the effects of Coldwell's theory are begining to be felt to-day after the lapse of hundred years.

My studies on linguislics, extending over a quarter of a century, have established me in the conclusion and conviction that Coldwell's theory was based on ignorance of imperfect acquaintance with both the Northern and Southern Indian languages and served more the purpose of "Divide and Rule" policy of the foreigner, than as a sound theory in the science of language. I have tried to combat the mischief initiated and worked out in the universities and elsewhere later on, by proving the utter untenability of such asposition. My conclusions are embodied in my history of the Telugu language, in two volumes published by the Andhra University. My efforts have all along been directed to-wards proving the fundamental unity of India from the linguistic stand point" (Writers in free India - proceedings of the second All India writers conference, Benares-1947, organised by the All India centre, P.E.N.).మన దేశమునందలి విద్వద్వృందము

బిషప్‌గారి సిద్ధాంతమునకు తీవ్రమైన అసమ్మతి మొదటినుండియు తెలుపు చునే యున్నారు.

## తమిళము సంస్కృతముకంటె ప్రాచీనమా ?

ఆర్యులభాష ఆర్యభాషకదా ! తమిళము సంస్కృతమునకంటె ప్రాచీనమైనచో ద్రావిడు లనబడువా రార్యులకంటె ప్రాచీనులు కావలసి వచ్చుచున్నది. అందుచే నీ విషయ పరామర్శ అవసరమైనది. ద్రావిడభాషా భాషులు క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దములో 'తిరుక్కురళ్' వ్రాయబడి యుండవచ్చుననియు, 'తొల్కాప్పియమ్' అంతకంటె రెండు శతాబ్దములకు పూర్వమయి యుండవచ్చుననియు నూహించినారు (Studies in Tamil literature by Sri Dikshitar Page 21). ఇది కేవలం ఊహా మాత్రమే. ఆధారములు లేవు. క్రీస్తు శకారంభమున తమిళ వాఙ్మయము బయలుదేరెనని కాల్డ్వెల్‌గారి యభిప్రాయము, ద్వితీయ ప్రపంచ తమిళ సమ్మేళనోపన్యాసములో శ్రీ కె. కె. పిళ్లెగారు ఏ కాలమును నిర్దేశింపలేదు. "However, the study of history can have no Compunction in assigning the extant Sangam works to the early centuries of the Christian era" అని మూశటమ్మడిగా అని ఊరు కొనిరి. క్రీస్తునకు పూర్వము తమిళభాషా స్థితియున్నచో చాలునను సంతృప్తిని ప్రకటించుటయేకాని ఏ హేతువుచేత క్రీస్తుపూర్వము కావలసివచ్చు చున్నదో వివరణములేదు. "One of the two classical lauguages of India, Tamil has had a two thousand year continuing tradition in literature" (Sri Kana Subrahmanyam Avl-Indian express). ఇట్లనుటలో ఒకటి సంస్కృతమని వారి యభి ప్రాయము కాబోలు. రెండవ క్లాసికల్ లాంగ్వేజి తమిళమని యెవ్వ రంగీ కరించినారు? మిగిలిన భాషలకులేని ప్రామాణిక భాషాస్థితి తమిళమున కెట్లు వచ్చినది. ఈ స్వభాషాస్తోత్రము తమిళులయందు మితిమీరిపోయినది. సంస్కృతముకంటె ప్రాచీనము తమిళమని చెప్పువారి యభిప్రాయ మేమ నగా ప్రపంచమునకే ప్రాచీనభాష యని చెప్పవలెనను ఊహాయేమో! వారి

ప్రాచీనతనుగూర్చి వారు స్తోత్రము చేసికొనుట వారికే యసహ్యాకరముగ పరిణమించువఱకును పోయినది.

"But to belive that Tamil letters are older than the first ceuturies of the Christianera, to beleive that Tamil was independant of Aryan Sanskrit influence at any time during its continuation, to believe that the Tamils had a way of life different from the life of the average Indian, to believe that the "Kural" is an exposition of the Tamil way of life, to believe that religion did not shape Tamil letters as it shaped every other language and literature of that time, to believe... but the list is endless and meaningless, But it is on snch beliefs that the world of Tamil learning is sustained (Sri Kanaa Subrrhmanyam - Indian Express)

తమిళులును ఆంధ్రులును కొన్ని విషయములలో విరుద్ధ ప్రకృతి కలవారు. తమిళులు భాషా విషయకముగ తమస్థితికి శతాధికముగ ప్రచారము చేసికొందురు. ఆంధ్రులు తమస్థితిని శతాంశమైనను చెప్పికొనరు. ఏ హాల్డేన్ వంటివారో చెప్పిన "యిది కదా" యనుకొందురు. అప్పుడు వారి స్వరూపము వారికి తెలియును. బహుశా యీ ప్రకృతికి హేతువు వీరు హనుమంతుని భక్తులగుటయేమో! తమిళులు ప్రధానముగ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి భక్తులు. వారు ఔత్తరాహులకు దాక్షిణాత్యభాషలు నేర్చికొనుట యనగా తమిళము నేర్చుకొనుటయే యనుభావము కలిగించిరి. అందుచేత వారువారి విశ్వవిద్యాలయములలో తెలుగునకంటె తమిళము నేర్చుకొనుటకే ప్రాధాన్య మిచ్చుచున్నారు.

శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు గ్రియర్సన్ ననుసరించి దాక్షిణాత్య భాషలలో తెలుగు ప్రాచీనమను అభిప్రాయము కలవారు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారుతమిళముముందో తెలుగుముందోచెప్పుట కష్టమనువారు. క్రీస్తునకు పూర్వము మూడవశతాబ్దమునకు ముందే 'ఆంధ్రాట్టకథ' రచింపబడినదనియు నది యాంధ్రమే యయియుండవచ్చుననియు యభిప్రాయపడువారు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు. కాగా ఆంధ్ర విమర్శకులు తమిళమునకంటె తెలుగు ప్రాచీనమని యనిరో, లేక సరిసమానమైన కాలపుదనిరో యభిప్రాయపడువారే కాని తమిళము ప్రాచీనమని

అంగీకరించువారు కారు. ఇక వింతయక్కరము అరవములో నున్నదనియు తెలుగునకూడ కలదనియు కొందరందురు. "అడ్డుగీటులేని కట రేఫాకృతి తెలుగుభాషలో నున్నప్పుడు డకారముయొక్క మారురూపమే కాని అర వమునందలి వింతధ్వనివంటి ధ్వనిగల భిన్నాక్షరముకాదు" (శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి–భారతి–విభవ జ్యేష్ఠము). శాతవాహనులాంధ్రులని తేలి నది. వారాంధ్ర దేశమునేకాక విస్తృతమైన సామ్రాజ్యమును పాలించిరి. ప్రాకృతము బహుజనులకు తెలియుస్థితిలో నున్నది కనుక వారాంధ్రులని ఏకదేశముగ ముద్రవైచుకొనుట కిష్టములేక ఆంధ్రములో శాసనములు వ్రాయింపలేదు. గ్రంథ రచనము కూడ ప్రాకృతభాషలోనే జరిగినది. హాలుడు రచించెను లేదా సంకలనము చేసినది అని చెప్పబడు గాథాసప్త శతిలో నాంధ్రపదములాతడచ్చటచ్చట చొప్పించెను. తత్కాలస్థులకు ప్రాకృతముతో మిశితము చేసినను తెలియులక్షణము కలదగుటచేతనే చొప్పిం చినది! కనుక హాలునినాటికే ఆంధ్రము ప్రచారములోనుండి యుండుట నిర్వి వాదాంశము. హాలుని గాథాసప్తశతి కాలము క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్ది యని శ్రీ మారేమండ రామారావుగారి అభిప్రాయము(శాతవాహన సంచిక). కాని యది మనలెక్క ప్రకారము సరియైనదికాదు. క్రీస్తుపూర్వము 494–489 యని శ్రీముఖునియొద్దనుండి లెక్కించిన తెలియగలదు. శ్రీముఖుని కాలము క్రీస్తుపూర్వము 833–810. కాగా క్రీస్తుపూర్వము అయిదవ శతా బ్దము నాటికే యాంధ్రభాష ప్రచారములో నున్నది. శాతవాహనులు శాస నములలో వ్రాయింపక పోవుట ఆంధ్రభాష అస్తిత్వమును గుర్తింపకపోవుట కాదు. కాగా ఆంధ్రమే తమిళమునకంటె ప్రాచీనమని తేలుచున్నది. వేదముల కాలమును క్రీస్తుపూర్వము 3000 సంవత్సరములతో ప్రారంభించి 1500 సంవత్సరముల వఱకు పాశ్చాత్యులు పెంచుకొనిపోవు స్థితిలోనుండగా క్రీస్తుపూర్వము 7000 సంవత్సరములనాడే మనరాజ్యములున్నట్లు బుద్ధి మంతులైన పాశ్చాత్యుల గ్రంథములు సాక్ష్యములుగా నుండగా, వేదమే ప్రపంచమున తొలిపలుకని సర్వులును అంగీకరించి యుండగా, ఆ వైదిక భాష సంస్కృతభాషయని స్పష్టపడుచుండగా, క్రీస్తుపూర్వము 1, 2, శతా బ్దములతోడనో, క్రీస్తునకు సమానకాలముతోడనో యుండియున్నదనిచెప్పిన తమిళభాష సంస్కృతమునకంటె ప్రాచీనమైన దనువారికి యెట్టి సమాధా నము చెప్పగలము? సంస్కృతభాషయే ప్రపంచభాషలన్నిటికి జననియని

సర్వులు నుద్ఘోషించు సమయమున ఆర్యావర్తములో నేక దేశమున నున్న తమిళభాష సంస్కృతము కంటె ప్రాచీనమనిన మాటాడుటెట్లు?

"The study of Sanskrit must be related to the study of our ancient history, indology and archaeology and in fact all that pertains to our philosophy, civilisation, culture and life. Malayalam, Kannada and Telugu are 'double languages' of Sanskrit and even Tamil, a large number of words were drawn from the Sanskrit vocabulary... without a proper appreciation and descrimination in the use of Sanskrit we shall not be able to contribute to the building up of our new languages. (Mr. Viswanadhan, Governor, Kerala, inaugurating Akhila Kerala Sanskrit Convention - 11-11-1969-Hindu) ఈ వాక్యములు చూచినచో ద్రావిడభాషలున్నవనుకొనుట కవకాశమున్నదా? సంస్కృత పదవిరహితముగ తమిళము మాత్రమెట్లుద్భవింప గలదు? అయినను సంస్కృతముపై ఇంకను దుష్ప్రచారము జరుగుచునే యున్నది. 'Studies in proto Indian Mediteranean culture' అనుగ్రంథమును Rev. H. Heros గారు రచించి యందు సంస్కృతము 'ఎస్పరెంటో'వలె ఒక కృతకభాషయని వ్రాసిరట! "At one time Sanskrit was the one language spoken all over the world" అని ఫ్రాంజ్ బాప్‌గారు వ్రాసియుండగా, శాసనములు, వ్యవహారము అంతయు సంస్కృతమున జరిగినట్లు ప్రమాణములుండగా బిషప్ గారి మాటల నెవరు విశ్వసించెదరు? వారి యజ్ఞానమునకు జాలిపడుట తప్ప చేయునదిలేదు. 'రసనాయగం' అనువారు 'Ancient Jaffna'అను గ్రంథమును వ్రాయుచు దక్షిణ దేశములోను సింహళమునను నుండెడి ద్రావిడుల గుంపులకు 'నాగరలిపి' యనునది తెలియుననియు నగరులను ఒక జాతివారుండెడి వారనియు, వారినుండి ఆర్యులు ఈ లిపిని సంగ్రహించి 'దేవనాగర' యని పేరుపెట్టికొనిరనియు వ్రాసిరట! ఇది వింతలలో వింత. ఈ లిపులకును దేవనాగరమునకు నున్న సంబంధమేమి? విజయవాడలో 'నగరాల'ను కులమువారు కలరు. వారినుండియే దేవనాగరలిపి పుట్టినదని వ్రాసిన ఇంకను సొగసుగా నుండెడిది! "Deo Nagari (old Nagari) (ie) Sanskrit is the original source whence the alphabets of westren

Asia were derived" (Sri William Joanes, Asiatic researches Vol I page 423).

అంతకంటె విచారణీయమైన విషయమొకటి కలదు. 'టర్కీకి ఎగువను, రష్యాకు దిగువను ఉన్న 'బాహల్వా' అను ప్రదేశానికి కొంచెము పడమరగా 'ఆంధ్రాఖులు' అను జిల్లా కలదు. ఆంధ్రులా ప్రాంతమునుండి వచ్చినవారై యుందురా ?'' (శ్రీ దాసువామనరావు, మాతృసేవ–ఆంధ్రరాష్ట్ర సంచిక). దీని ప్రకారము మనము రష్యాసన్నిహిత ప్రాంతమునుండి యీ దేశము వచ్చియుండవలెను. కనుక 'ఆంధ్రాఖులు'నగాను ఆంధ్రులకును లంకెపెట్టి ఏ పాశ్చాత్యుడో గ్రంథము వ్రాసినచో తప్పక దానికిని ఒకస్థితి యేర్పడును. భాషాశాస్త్రరీత్యా చూచినను కొన్ని సమానార్థక బోధకములైన పదములు దొరుకకపోవు, దేశభాషలన్నియు ప్రాకృతవికారములే కదా!

ఇటీవల అనగా సెప్టెంబరు (1969)లో మదరాసులోని 'కురలగమ్' 3వ అంతస్థులో 'తమిళ సంస్కృతి'ని ప్రదర్శించి దాని గొప్పదనము చెప్పుకొను 'ఎగ్జిబిషను'ను ఏర్పాటుచేసి తమిళులు "Sanskrit was a borrowing language" అని అనేక ప్రదేశములలో దయ్యపుటక్షరములతో వ్రాసి తగిలించిరట! దీనినిచూచి పెక్కురుబాధపడిరి. "It is a matter of painful surprise thal Sanskrit one of the ancient languages of the earth, should have been indicated as a borrowing language in the exhibition at 'Kuralagam'— In fact it is Tamil which borrowed much from Sanskrit. For example the names of ancient Tamil Kings which were in pure Sanskrit and other words which have mingled with Tamil in such a way that they cennot be seperated now without much damage. To cite a few, "Kirupai-Preethi-Dharmam-Yudham-Bud dhi - Kulam - Samadhi Margam - and Nirmalam" Though we cannot deny the fact that Kamban whom we all regard as 'Kavi Chakravarty' used these words in his works. In fact those poets who have made real contribution to the Tamil literature like 'Kamban' 'Villiputhoorar' 'Alwars' 'Nayanaars' 'Illeagovadigal' etc did not have any such attitude towards Sanskrit and were more liberal in using more

Sanskritised words in their works. The word 'Karumam' is also purely a Sanskrit one but it finds place in Thirukkural" (S. Rangaramanujan, Cheyyur, 23-9-59, Hindu).

ఇట్టి వాతావరణ మాంధ్రమున లేనందులకు సంతసింపవలసి యున్నది. అసలు తమిళుల దృష్టిలో మన ముత్తరాదివారి క్రిందనే లెక్క. కాని కొన్ని విషయములలో ద్రావిడ వాదమునకు బలముగ మనల కలిపికొందురు. ఆంధ్రప్రదేశమున విజయనగరాధీశులు శ్రీ పి. వి. జి. రాజుగారు 180 ఎకరముల ప్రదేశమిచ్చి యింకను ఉదారముగ వ్యవహరించుటకు సిద్ధపడినందు వలన సంస్కృత విశ్వవిద్యాలయమే వచ్చుచున్నది. దీనికి మిత్రులు శ్రీ మానాప్రగడ శేషశాయిగారి పూనిక ప్రశంసింపదగినది. ఆరునెలల్లో ఏర్పడునని ఇటీవలనే దేవాదాయముల కమిషనర్ శ్రీ వాసుదేవరావుగారు వెల్లడించియున్నారు.

ఇంకను ఆశ్చర్యకరమైన విషయమేమన మన తెలుగు విమర్శకులు కొందఱు ద్రావిడభాషా శబ్దములు సంస్కృతమున చేరినవను భ్రాంతిలో నున్నారు. "పుష్కర, పుష్ప, పూజన, ఫల, మయూర" మొదలైనవి యట్టి శబ్దములట! (స్రవంతి-జూన్, 1964) ఇట్టివన్నియు పాశ్చాత్యుల ఊహలే. ద్రావిడభాషలే కల్పితభాషలు. అవియన్నియు ప్రాకృత వికారములు. సంస్కృత స్థితివలన పుష్టినందినవి. కొన్నిభాషలకు కొన్ని ప్రాకృతముల సంపర్క మెక్కువయుండును. ఒకే. ప్రాకృతమునుండి కొన్ని శబ్దములు గ్రహించినచో సాజాత్యముండును. అట్టి సాజాత్యమే మన భాషలకు మిగిలిన భాషలకు కన్పించుచున్నది. మూలద్రావిడ ముండునని యొక యూహాయేకదా! అట్టులే యొకమూల దాక్షిణాత్యప్రాకృత ముండియుండునని ఊహ యేల చేయరాదు? కాదు. ఆర్య ద్రావిడ విభాగము చేసి, లేని ద్రావిడభాషను, లేని ద్రావిడులతో, ముడిపెట్టవలెను. అప్పుడు కాని దేశము విచ్ఛిన్నముకాదు. ఇది దీని వెనుకనున్న కుతంత్రము. సంస్కృతము సర్వ ప్రాచీనభాషయు సర్వసమగ్రమునైన భాష యైనప్పుడు, దానిలో దాక్షిణాత్య పదములు చేరవలసిన యగత్య మేల కలిగినది? దాని నసమగ్రమని చెప్పుటకు, పుష్ప, ఫల శబ్దములు ద్రావిడశబ్దములనుటకంటె మొత్తము సంస్కృతమే ద్రావిడభాష యనరాదా? ద్రావిడు లార్యులకంటె ముందని చెప్పదలచుకున్న యభిప్రాయమేమో, ద్రావిడ భాషలు ఆర్య భాషలకంటె

ముందని చెప్పుటయును అదే అభిప్రాయము. మొత్తము ద్రావిడభాష లన్నియు పూర్వస్థితి కలవనిన లోకము నవ్విపోవునని దానిలో ప్రాచీనమని వారనుకొను తమిళమును విడదీసి, అదియు నాగరకపోయినచో కొన్ని సంస్కృత పదములనేరి, యవి ద్రావిడభాషా పదములన్నచో, నార్యులు కూడ ద్రావిడు లనబడు వారి భాషలనుండి కొన్ని పదములు దొంగిలించి యుందురు కనుక ఆర్యులు మిశ్రమజాతియు ఆర్యభాష మిశ్రమభాష యనియు చెప్పవచ్చును. కాని భారతదేశము సంతటనున్న ఆర్ష మతావలంబు లార్యులనియు చారిత్రకులు చెప్పు ద్రావిడజాతి లేదనియు సంస్కృతమే సర్వబీజమనియు గ్రహించుట అత్యవసరము. సంస్కృతము ప్రపంచమంతయు నేదియో యొకవిధముగ విస్తరించిన భాష. ఆ విషయము భాష్ పండితుడు చెప్పెనుకదా! కొందరు పాణినీయము చదువుకున్న విదేశీయులలో నెక్కువమంది కాతంత్ర వ్యాకరణమును చదువుకొనెదరు. "యుగోస్లోవియాలో స్థిరనివాసములేని (సంచార) జాతీయులు చాలమందియున్నారు, వారిని జిప్సీ లనెదరు. వారితాత్కాలికపు దేరాలదగ్గరకు డాక్టర్ రఘువీరగారు వెళ్ళినారు. ఆ సమయములో తండ్రి కుమారునిని కొన్ని పాణినీయ సూత్రములను చెప్పుచుండెను. వారు డాక్టర్ రఘువీరగారిని చూచి "మీరు జంబూద్వీపమునుండి వచ్చినారుకదా! మీరు ఎంతయో నుత్తములు. మాకు మార్గదర్శకులు" అని గౌరవించిరి. స్కాండినేవియా, సైబీరియా. ఇండోనీషియా, జపాను మొదలైన దేశాలలో మన సంస్కృతి చిహ్నములు నేటికిని నిలచివున్నవి. (శ్రీ కామకోటి స్వామివారి సూర్యాపేట ఉపన్యాసము - 29-4-68 జాగృతి). భారతమును వారు జంబూద్వీపమని యుందురని తెలియుచున్నది. తమిళ మెచ్చటికయిన వ్యాపించినదా? ఒకవేళ వ్యాపించిన దనుకున్నను ఆంధ్రము వ్యాపించినట్లే వ్యాపించును కాని సంస్కృతమువలె కాదు. మారిషస్, బర్మా, మలయాలలో నాంధ్రులున్నట్లే సింహళములో కొలదిగ తమిళు లుండవచ్చును. కాని భాషా ప్రాచీనత ఎట్లు వచ్చును?

"దక్షిణ ఉజ్బెక్ స్థాన్‌లో సంస్కృతలిపి ఉన్న చెట్ల బెరడులు (భూర్జ పత్రములు) కనుగొనబడినవని తాష్కెంట్ నుండి 'టాస్' ప్రకటించినది. క్రీ. పూ. 5, 6 శతాబ్దముల మధ్యకాలమునాటి అబీదాబాద్ కేపేదుర్గంవద్ద జరుగుచున్న త్రవ్వకాలలో ఈ భూర్జపత్రాలు బయలుపడినవి. రెండు మిల్లీ

మీటర్ల కంటె ఎక్కువ దళసరికాని బెరడుపై రెండువైపులను సంస్కృత లిపి వ్రాయబడియున్నది. బెరడులు చక్కగా పదను చేయబడియున్నవి. మత సంబంధముగనున్న ఈ సంస్కృత లిపిని సోవియట్ సంస్కృత పండితులు పరిశీలించుచున్నారు. (17-10-62 ఆంధ్రపత్రిక). క్రీస్తుపూర్వము 5, 6 శతాబ్దములకు సంబంధించిన త్రవ్వకములలోనే రష్యాలో భూర్జపత్రములు కనుగొనబడిన వనగా, నా భాషయు నా లిపియు భారతదేశమున నింకెంత ప్రాచీనమై యుండవలెను? తమిళము ప్రాచీన మనుటలో నర్థమేమి?

భీష్ముడు జన్మించిన కాలము 3396 B.C. వేదవ్యాసుని జన్మకాలము 3374 B.C మహాభారతయుద్ధ కాలము 3138 B.C, భగవద్గీతకాలమప్పటిదేకదా! క్రీస్తునకు సరిసమానకాలములో తమిళ సాహిత్యముండియుండునని యూహాలు చేయువారు, పై కాలములకంటె తమ భాష పూర్వమని యెట్లు చెప్పగలరు? బుద్ధుని జన్మకాలము క్రీస్తుపూర్వము 1887. అప్పుడే కదా యాతడు ప్రాకృతములకు ప్రాధాన్యమిచ్చినది! అంతవఱకును సంస్కృతమేకదా! ఆదిశంకరుల క్రమ సన్యాసకాలము క్రీస్తుపూర్వము 499వ సంవత్సరముకదా. భారతదేశములో శృంగేరి మొదలైన పీఠములన్నియు నప్పుడు స్థాపింప బడినవే కాదా! తమిళుల దేశములోనున్న శ్రీ కామకోటి పీఠముకూడ నప్పటిదేయని వారిరికార్డులే తెలుపుచున్నవికదా!(482B.C.) అప్పటికి తమిళమునకు స్థితియేమి? వారి భాషావ్యవహారములన్నియు సంస్కృతముననే జరుగును కదా! "అంతియేకాదు. మన దేశములోనే దక్షిణాది జిల్లాలలో కనబడు ద్రావిడ శిలాశాసనములలోకూడ శాసనము "స్వస్తిశ్రీ" యనిన సంస్కృతపదములతో ప్రారంభమగును. కామకోటి పీఠమునుండి జారీచేయబడు శ్రీ ముఖములు సైతము 'స్వస్తిశ్రీ' యన్న పదములతోడనే ప్రారంభమగును." (జగద్గురుబోధలు 4వ సంపుటము).సంస్కృతమునకు పూర్వమున్నదని చెప్పికొను యోగ్యత గలుగు భాషలు ప్రపంచములోనే మృగ్యమగునప్పుడు క్రీస్తునకు సరిసమానకాలములో నుండవచ్చునని యూహింపబడు తమిళమెట్లు కాగలదు? "కోల్బ్రూక్‌గారొక ప్రాచీన హిందూగ్రంథకర్త వాక్యముల నుదాహరించిరి. (Transactions of the Royal Asiatic Society Vol I page 453) పారసీకయవన రోమకబర్బరములను నీనాల్గును అనాగరకభాషల పేరులని యా గ్రంథకర్త

యనెనట. మొదటిమూడును, పారసీక, గ్రీకు, లాటినులు. నాలుగవదిచె వ్వుట కష్టమనిరి. భారత దేశములో లాటిన్ ఎట్లు తెలిసినదో-అని కోల్బ్రూక్ గారనిరి. (హిందువుల అధిక్యము) నిజముగ ప్రాచీనమైన భాషలకు సంస్కృతము ప్రాచీనమైయున్నది.

తమిళమునకు తొలివ్యాకరణమగు 'తొల్కాప్పియము'నకు పూర్వమే సంస్కృత వ్యాకరణమున్నట్లు తమిళుల వ్రాతల వలననే మనకు స్పష్టమగుచున్నది. "It is worthy of remark that the earliest existing Tamil grammar "Tolkappiam" acknowledges its debt to a Sanskrit grammar "Indra" (Dr. C. P. Ramaswami Iyyar, Bhavan's Journal 16-8-1964). తమిళము సంస్కృతమునకంటె ప్రాచీనము కాదనుట కింత కంటె ప్రమాణమేమి కావలెను?

## భారతదేశపు సంస్కృతి యొక్కటే

ఆర్యులనువారు భారతదేశీయులే. తొలిమానవుని సృష్టి భారత దేశముననే జరిగినది. "India is the first peopled country" అని సర్ వాల్టర్ రాలే వ్రాసిన వాక్యములును, "At one time sanskrit was the one language spokem all over the world" అని ఫ్రాంజ్ బాప్ గారు వ్రాసిన వాక్యములును, మార్కండేయోక్తమైన "సర్వబీజం, ద్విజోత్తమ!" యనుదానిని ఋజువు చేయుచున్నది. ఆర్ష ధర్మావలంబకులైన యందరు హిందువులును ఆర్యులే. ఈ దేశమున చారిత్రకముగ చెప్పబడు ద్రావిడజాతి లేదు. వారును ఆర్యులే. ద్రావిడదేశ మనగా అరవదేశము. ఆ జాతిమాత్రమే ద్రవిడజాతియని పిలువదగినది. పంచద్రావిడవిభాగము బ్రాహ్మణులకు సంబంధించినదే కాని యన్యులకు కాదు. దానిలో మహారాష్ట్రులు ఘూర్జరులు నుందురు కాని చరిత్రకారులు చెప్పువారుండరు. ప్రపంచభాషలన్నియు సంస్కృతభాషావికారములు. అందుచేత దాక్షిణాత్య భాషలును సంస్కృత ప్రాకృత వికారములే. ద్రావిడభాష యనునది సృష్టింపబడిన పదము. ద్రావిడులు సృష్టింపబడినజాతి, ఆర్య ద్రావిడ విభాగము భారతదేశమును చీల్చుట కుద్దేశింప బడినది. ఈ యభిప్రాయములు సత్యములు. దేశ చరిత్రయు భాషాచరిత్రయు నీ ప్రాతిపదికపై రచింపబడిననే విద్యార్థు లుత్తమపౌరులగుదురు. ప్రజాస్వామికములో విద్యార్థులకు

చెప్పబడు విద్యవిషయమున శ్రద్ధవహింపక పోయినచో దుష్ఫలితములు కలిగి భారత దేశైక్యమునకు భంగము కలుగును.

భారతీయునకు నీగ్రోకు ఆకారములో వ్యత్యాసము కన్పించ వచ్చును. కాని ప్రపంచమంతయు నార్యసంతతియైన మనము నీగ్రోనుకాద నుట కవకాశమే లేదు. ఒకానొక జీవు డొక పూర్వజన్మకర్మముచే నొక్క- దేశమున నొక్కొక్క- ఆకారముతో పుట్టుచుండును. అదిభగవన్నిర్ణయము. అట్లే భారతదేశములోకూడ నొక్కొక్క-జీవుడు ఒక్కొక్క- మాతృభాష మాట్లాడువాడుగా పుట్టుచున్నాడు, ఒక్క-రెక్క-వకాదు. మఱి యొకరు తక్కు-వకాదు. భారతీయార్యునికి నీగ్రోకును ఎట్లు పోల్చుకొనలేనియంత యంతరమున్నదో యట్లే, సంస్కృతమునకును తమిళమునకును ఒక భూభా గములోనున్నను అంతరముండుట విధినిర్ణయము. అమెరికాలోనే నీగ్రోలును, తెల్లవారును ఒక్క-చోటనే పల పుట్టవలెను ? ఒకతల్లి బిడ్డలలోకూడ వ్యత్యా సము మనము చూచుచున్నాము కదా ! కనుక దాక్షిణాత్యభాషలుసంస్కృత భాషకు సంబంధము లేనివికావు. దాక్షిణాత్యభాషయైన ఆంధ్రములోఉత్తర దక్షిణములకు తెలుగు శబ్దములు చెప్పుడని మిత్రులు శ్రీ తూమాటిదోణప్పగా రడిగిరి. "అయిన తెలుగు దిక్కు-లేనిభాష యన్నమాట" అని చమత్క-రించి యూరకొంటిని. మన జీవిత విధానము సంస్కృతముతో పెనవైచుకొని పోయినది. గంగేచయమునేచైవ యను శ్లోకములో 'గోదావరి'దక్షిణదేశపు నదికదా? ఈ స్నానశ్లోకమును భరత ఖండమందంతటను నిత్యము స్నాన సమయమున పఠింతురు."అయోధ్యామధురామాయా" అనుదానిలో 'కాంచీ పట్టణము' దాక్షిణాత్యనగరముకాదా? ఈ శ్లోకము భారతఖండమునందంత టను పఠింతురు. మనము వేరయినచో 'మోక్షపురి' దక్షిణదేశమున నెందుల కున్నది? 'సౌరాష్ట్రేసోమనాథశ్చ' అను శ్లోకములునట్టివే. శివలింగముల గూర్చి తెలుపునవి. కాశీవెళ్లి తిరిగి రామేశ్వరమునకురానిదే తీర్థయాత్ర పూర్తికాదు. అఖండ భారతోపాసన సంధ్యావందనాదులలో చేయుచున్నా ముకదా? ఇవి యన్నియు భారతదేశ జీవిత విధానమంతయు నొక్క-టే యని తెలుపుచున్నవి. అందుచేతనే **"who says that India was never united?"** అని శ్రీ రాధాకుముదముఖర్జీగా రుగ్గడించినారు. (**Bhavan's Journal 9-7-61**). ఈ విషయము లన్నియు వివరముగ

చెప్పుట కవకాశములేక ప్రసంగ వ్యాసకర్త ఆర్యద్రావిడ సంస్కృతులు భిన్నమైనవికావనిచెప్పిరి. చరిత్ర,భాషాశాస్త్రాదులు ఈభావమునకుభిన్నమైన భావములు తెలుపుటవలన దీని విషయము విస్తృతి చేయవలసి వచ్చినది.'' చింతామణిసూత్రమును తీసికొని అప్పకవి యతిప్రాసలనుగూర్చి వివరించి నట్లుగా, నీ వ్యాసమాధారముగ విషయమును గూర్చి వివరించుట కవకాశము కలిగినది.

రెండవ వ్యాసము :

సుకవితా యద్యస్తిరాజ్యేనకిమ్ అనునది. దీనిలో లౌకికరాజ్యమున కంటె కవితారాజ్య ప్రాభవముగ్గ డింపబడినది. వ్యాసవాల్మీకులు సృష్టించిన సీత, సావిత్రి, దమయంతి, చరిత్రలయొక్కముద్ర ప్రజలను దుష్పథము నుండి మఱలించుటకు సమర్థమైనదనియు, కనుక సట్టిగ్రంథములు రాజశాస నముకంటె బలవత్తరములనియు నిరూపింపబడినది. లోకములో దుఃఖము భరింపదగనిదియు, పరిహార్యమును అగుచుండగా, కవితారాజ్యమున నది రసత్వమునంది, కరుణరసమై, ఆనందస్పంది యగుచున్నది. క్షుద్రవస్తువు నందు సహితము, కవి యానందమును చూడగలడు. పచ్చగడ్డి కొనపై మంచు బిందువు మిగిలినవారికి జల బిందువుకాగా కవికి ముక్తాఫలమువలె భాసిం చును.

మూడవ వ్యాసము:

అన్నంభట్టు వైదుష్యమునకు సంబంధించినది. ''కాశీగమనమాత్రేన నాన్నంభట్టాయితేద్విజః'' అనిసూక్తి. అన్నంభట్టు కృష్ణాతీరమున 'గరికపాడు' నకు చెందినవాడనియు, కౌశికసగోత్రుడనియు, తిరుమలార్యునిపుత్రుడనియు సదాశివరాయలచే నగ్రహారాది సన్మానములందిన వాడనియు కాశీక్షేత్రము నకుపోయి, శేషవీరేశ్వరపండితునియొద్ద శాస్త్రాధ్యయనముచేసెననియు నిందు చెప్పబడినది. తర్కశాస్త్రమున నాల్గుగ్రంథములు, వ్యాకరణమున మూడుగ్రంథ ములు, పూర్వ మీమాంసయందు రెండుగ్రంథములు, వేదాంతశాస్త్రమున రెండుగ్రంథములును రచించిన దిట్ట. ఒకేశాస్త్రము నభ్యసించినచో నేకదేశ జ్ఞానమే కలిగి ఒకానొకప్పుడు దురభిమానభాజనగుమటకు నవకాశము కల్గ వచ్చును. సర్వశాస్త్రాధీతుడైనచో, పరిపూర్ణజ్ఞానయుక్తుడును, ప్రశాంత మన స్కుడును అగును, అన్నంభట్టు ఈ రెండవ కోవకు చెందినవాడు.

నాలుగవ వ్యాసము:

సభాపతి నాగేశభట్టును గూర్చినది. "అలపతంజలికృతంబైన మహాభాష్యమునకే, పరిధవిల్లునుమహాభాష్యపదము"(తిరుపతి వేంకటకవులు). భాష్యకర్త పతంజలిని శేషునియవతారమందురు. నాగేశభట్టు పతంజలి "అంశావతారము" అని ప్రసిద్ధి. 'శబ్దేందుశేఖర' 'మంజూష'లు వీరికీర్తికి పతాకలు. "శబ్దేందు శేఖరంపుత్రీం, మంజూషాంచైవ కన్యకామ్" అనిప్రీతిపాత్రముగ వీరు చెప్పికొని యాగ్రంథములను శివార్పణము చేసిరి. సాంఖ్య, యోగ, వేదాంత సూత్రగ్రంథములు రచించుటయేకాక. రసగంగాధర, కావ్యప్రకాశములకు సైతమువివరణములనురచించిన దిట్ట. షట్ఛాస్త్రపండితుడు. పాణిని పూర్వమునకువ్యాకరణములుకలవు. ఆవిషయము వారే పేర్కొనిరి. "శాస్త్రములనగా దైవదత్తమైన జ్ఞానమని యర్థము" (శ్రీనెహ్రూ). "పాణిని వ్యాకరణము కేవలము వ్యాకరణమే కాదు. మానవుని మేథ సృష్టింపగలిగిన గొప్పవిషయములలో శ్రేష్టమైనది" - అని సోవియట్ పండితుడు చర్బస్కీ వర్ణించెను. ఈనాటికిని పాణిని వ్యాకరణమునకు మించిన సంస్కృత వ్యాకరణము మఱొకటిలేదు." (భారత దర్శనము). ఈవిధముగ పాణినీయము ప్రశస్తి గడించుకొనినది. "ఏకమాత్రలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః" అనిభాష్యము. అంతగాతూచివ్రాయుట పాణినికే చెల్లినది. నాగేశభట్టు 'మంజూష'లో తిబర్థ విచారణముచేయుచు అధ్యాత్మవిద్యయే ముఖ్యము కాగా, ఇతర శాస్త్రముల అధ్యయనమేల యని ప్రశ్నించుకొని దానికి సమాధానముగ న్యాయసూత్రము నీవిధముగ నుదాహరించెను. "తత్త్వాధ్యవసాయ సంరక్షణార్థం జల్పవితండే బీజప్రరోహ సంరక్షణార్థం కంటక శాఖవతరణవత్". సస్యసంరక్షణార్థము చేనునకు వేయు ముళ్లకంచెవలె తదితరశాస్త్రములు వేదాంతశాస్త్రమునకు సంరక్షకములని తాత్పర్యము. ఇది పరమ వివేకము, ఈతని వైదుష్యమును గూర్చి యీ వ్యాసమున వివరింపబడినది.

అయిదవ వ్యాసము :

రీతివాదమును గూర్చినది. తత్త్వసాక్షాత్కారమున కుపయోగపడునది దర్శనము. సాహిత్య దర్శనములో, కావ్యతత్త్వము అనగా కావ్యములో సారభూతమగు నర్థము బహుముఖములుగా సాక్షాత్కరించినది -

అని సాహిత్యమునకు దర్శనత్వసిద్ధి కల్పింపబడినది. అలంకారములే కావ్యాత్మయని భామహుడును, గుణములే కావ్యాత్మయని దండియు, పల్కిన పిదప, వామనుడు 'రీతిరాత్మాకావ్యస్య' అని యభిప్రాయపడెను. "విశిష్ట పదరచనా రీతిః" అని యనుటలో పదరచనము శబ్దముల కూర్పుగఁ దోచినను, అర్థవిన్యాసమునుకూడ గ్రహింప వలెననియే వామనుని హృదయమని యిందావిష్కరింపబడినది.

ఆఱవ వ్యాసము:

వక్రోక్తివాదమునకు సంబంధించినది. ఆనందవర్ధనుని ధ్వనిప్రస్థానమునకు పిమ్మట, కావ్యాత్మవక్రోక్తియని, శ్రీ 'రాజానకకుంతకుడు' పలికెను. ధ్వనివాదమున వ్యంగ్యము ప్రాధాన్యము వహించి చమత్కారమును గల్గించిన చాలును. కావ్యత్వము సిద్ధించును. శబ్దార్థసాహిత్య విచారణముతో పనిలేదు-అను ఈ లోపమును సవరింపవలెనని కుంతకుని తలంపని యిందు చెప్పబడినది. కవివాణి పామరుని వాక్కువలె ఒద్దిక లేనిదికాదు, పండితుని వాక్కువలె కర్కశత్వ గూఢార్థములు కలదికాదు. కవిభారతి మాధుర్య ప్రసాదాది గుణములచే సుమనోరంజితమై ఉక్తివైచిత్రితో నుండవలెను అని వ్యక్తీకరింపబడినది. దశవిధమైన వక్రత లిందుదాహరింపబడినవి.

ఏడవ వ్యాసము:

వ్యక్తివాద సంబంధి. అనందవర్ధనునిది ధ్వని ప్రస్థానము, అభినవ గుప్తునిది రసప్రస్థానము-ఈ రెండును వ్యక్తివాదమున సంగ్రహీతములు, వ్యక్తి అనగా వ్యంజన. ద్యోతకము, స్ఫురణము - అని దానిని వివరించుకొనవచ్చును. అని యిందు వ్యక్తివాదము నిర్వచింపబడినది. ధ్వన్యభావ వాదముకూడ చెప్పబడినవి. వైయాకరణులు స్ఫోటవిషయమున వ్యంజన నంగీకరింపగా, నాలంకారికులు రసాదివిషయమున విశిష్ట రూపముతో పరిగ్రహించిరని యిందు పేర్కొనబడినది.

ఎనిమిదవ వ్యాసము :

ధ్వని ప్రస్థానమునకు సంబంధించినది. ఇందు, ధ్వని వాచ్యమునుండి పుట్టుననియు; సామాన్యముగ, ధ్వనియున్నచోట అభిధ, తాత్పర్యము, వ్యంగ్యము - అను మూడువ్యాపారములుండుననియు, లక్షణయున్నచోట వానితో నాల్గు వృత్తులగుననియు చెప్పి, అనందవర్ధనుని "భ్రమధార్మిక

విస్రబ్ధః'' అను శ్లోకమునకున్న వివిధములగు నర్థములు వివరింపబడెను. ధార్మికునికి ''తిరుగుము'' అనువిధి యున్నను నిషేధమునే చెప్పుచున్నం దున ఆ ఉదాహరణమున ధ్వని ప్రతిష్ఠాపింపబడినది, అని చెప్పబడినది. అటు లనే ''ప్రొద్దు క్రుంకినద''ను వాక్యమునకు అర్థములు భావుకుని హృదయము ననుసరించి యుండునని తెలుపబడినది.

తొమ్మిదవ వ్యాసము :

క్షేమేంద్రుని సాహిత్యసేవకు సంబంధించినది. క్షేమేంద్రుడు కాశ్మీర వాసి, ఈతడు సుమారు నలుబది గ్రంథముల రచించెను. ఇరువది మాత్రమే నేడు ఉపలబ్ధమగుచున్నవి. భారత, రామాయణ, బృహత్కథా మంజరులు సహృదయరంజకములు. ''ఔచిత్యవిచార చర్చ'' ఈతనికి ఆలంకారికులలో నొక ప్రత్యేకస్థానమును గడించిపెట్టినది. కావ్యాత్మ 'ఔచిత్య' మనునది ఈతని సిద్ధాంతము. ఉపహాసకావ్యములు రచించిన ఘనత సంస్కృతముతో నీతనికే యధికముగ దక్కినది. ఈతని సాహిత్యకృషి యిందుగ్గడింపబడినది.

పదియవ వ్యాసము :

సంస్కృత సాహిత్యములోని సాంఘికరూపకములకు సంబంధించినది. సంస్కృత సాహిత్యమున ముద్రితములు, నముద్రితములు, నాలుగువందల రూపకములవఱకు నుండియుండవచ్చుననియు, వానినిప్రధానముగ భారతాశ్రితములు, రామాయణాశ్రితములుగ విభజింపవచ్చుననియు, నందు ధర్మమే యుపదేశ నిష్యందమనియు తెలుపబడినది, సమకాలిక సంఘములో, నిత్య జీవనవిలాస విలసితములగు పాత్రలను తీసికొని, నియత సంకేతముల జోలికి పోకుండ, వాస్తవిక దృష్టితో మానవ ప్రవృత్తిని, దౌర్బల్యమును, సామాజిక సంఘటనములను, సమస్యలను, వాని పరిణామములను, ఫలితములను, ఉన్నవి ఉన్నట్లుగా చూపునదే సాంఘిక రూపకమను అధునిక లక్షణమును పట్టింప యత్నించినచో ఈ లక్షణము ప్రసిద్ధమైన సంస్కృత రూపకములకు దేనికిని పట్టదని యిందు వెల్లడించబడినది. ఏకదేశ లక్షణ ప్రకారమైన, సాంఘికరూపకములు సంస్కృతమున నున్నవనిచెప్పవచ్చునని, దరిద్రచారుదత్తాది నాటకప్రస్తావనమిందు గావింపబడినది.

పదునొకండవవ్యాము :

సంస్కృత సాహిత్యములోని యుపహాస కావ్యములకుసంబంధించినది. ఉపహాసమనగా సున్నితమైన పరిహాసమని నిర్వచింపబడినది. క్రీస్తుశక మేడవ

శతాబ్దము వఱకును ఉపహాసకావ్యములు లేవని చెప్పవచ్చుననియు, కాంచీ పురాధీశుడు, మహేంద్ర విక్రమవర్మ, మత్తవిలాసమను రూపకమునురచించె ననియు, కళావిలాసము, దేశోపదేశము, నర్మమాల-యను ఉపహాస కావ్య ములను, 11వ శతాబ్దములో రచించిన క్షేమేంద్రుడు "హాసేన లజ్జితో౽ త్యంతం, న దోషేషు ప్రవర్తతే, జనస్తదుపకారాయ, మమాయం స్వయ ముద్యమం" అని యనెననియు చెప్పబడినది. కుట్టికవి 'మహిష శతకము' నీలకంఠ దీక్షితుల 'కవి విడంబన శతకము', పండిత రాయల కొన్ని ముక్త కములు, అన్యాపదేశ ప్రక్రియతో నున్నవి గనుక, ఉపహాస కావ్యము లన దగునని చెప్పబడినది. ప్రహసనములుకాని, విదూషకుని పాత్రలు కాని, ఈ పరిధిలోనికి రావు. అగ్రామ్య చతురపరిహాసము నీతిమార్గ ప్రచోదకమగు రీతిని నెలకొనుటే ఈ కావ్యలక్షణమని చెప్పవచ్చును.

*పండ్రెండవ వ్యాసము:*

"క్షేమేంద్ర మహాకవేః సమాజ వ్యవస్థావలోకనమ్" అనునది. పై వ్యాసము మొత్తము ఉపహాస కావ్యములనుగూర్చి కాగా, ఈ గీర్వాణ వ్యాసమున, ఆనాటి సాంఘిక విషయములను గూర్చిన క్షేమేంద్రుని కావ్య ములనుగూర్చి ప్రకటింపబడినది. (1) దర్పదలనము, (2) సేవ్య సేవకోప దేశము, (3) కలా విలాసము, (4) దేశోపదేశము, (5) నర్మమాల, (6) సమయ మాతృక-క్షేమేంద్రుని కావ్యములు. ఈతడు కాశ్మీర దేశీయుడు. ఈ వ్యాసమున చమత్కృతి కలిగిన లక్ష్యము తీయబడినవి.

*పదమూడవ వ్యాసము :*

మోక్ష స్వరూపమును గూర్చినది. దుఃఖ ధ్వంసమే మోక్షమని; కణాద, గౌతమ, కపిలాదుల ఆశయము. జైమిని ఆశయము. వేదములో కర్మకాండకు ప్రాధాన్యమిచ్చిరి. బాదరాయణులు ఉపనిషత్ప్రాధాన్యముగ బ్రహ్మము సర్వజీవగమ్యము అని నిర్ధరించిరి. కైవల్యమే పరముముక్తి యెట్లయ్యెనో యీ వ్యాసమున వివరింపబడినది.

*పదునాల్గవ వ్యాసము*

బ్రహ్మ సూత్రములకు సంబంధించినది. సృష్టి స్థితి సంహారలీల నకుంఠిత జ్ఞానశక్తితో నిర్వహించు పరమేశ్వరుడు విలక్షణుడుగా ఆస్తికులచే సంగీక

రింపబడుచుండగా, ఈ విధముగ, జీవ జగదీశ్వరులకు భేదము సిద్ధించుచుం డగా నద్వైతమెట్లు ? అను శంకకుసమాధానముగ, జీవ జగదీశ్వర భేదము వ్యవహార దశలోనేకాని పరమార్థ దశలోకాదని బ్రహ్మ సూత్రములలో వివరింపబడినది. బ్రహ్మము పుట్టుక లేనిదగుట నశింపదు కనుక సత్యము. 'జగత్తు మిథ్యయనగా' శశశృంగము వంటిదనికాక, అనిర్వచనీయమని చెప్పి కొనవలెను. మృత్కార్యముగా ఘటము, మృత్తుకంటె భిన్నము కానట్లే, జగత్తు బ్రహ్మమునకంటె భిన్నముకాదు. సగుణ బ్రహ్మోపాసనముచే నర్చి రాది మార్గమున బ్రహ్మలోకము పోయెడివారికి కూడ పునరావృత్తి లేదు. ఆత్మజ్ఞానము నందినవాడు 'నిరుపాధిక శుద్ధచైతన్య బ్రహ్మ'మగునని యిందు స్పష్టీకరింపబడినది.

పదునైదవ వ్యాసము:

నాట్యశాస్త్రము-ఆంధ్రుల సేవ యనునది. 19వ శతాబ్దమున తంజా వూరి ప్రభువు 'శరభోజీ' యాస్థాన పండితులైన 'పొన్నయ్య' ప్రభృతులు తెలుగువారే కావచ్చును. కాని వారు 'సాదిర్' సంప్రదాయమునకు మూలపురుషులు. ముత్తుస్వామిదీక్షితులవారియొద్ద శుశ్రూషచేసినవారు. దేవదాసీ లొకరో యిద్దరో అభినయించుట కవకాశము కల్పించుటకై కొన్ని యంశములతో నా నృత్యమును సృష్టించిరి. ఆ'సాదిర్' నృత్యము నకే భరతనాట్యమనుపేరు కల్పించి శ్రీమతి రుక్మిణీదేవిగారు ప్రచారములో నికి తెచ్చినారు. శాస్త్రీయ నాట్యమునకు దేనికైనను 'భరతనాట్యము'ను పేరు కావలసి యుండగా, శ్రీమతి రుక్మిణీదేవి ఖండాంతర ప్రచారము వలన' 'సాదిర్'' నాట్యమునకే యాపేరు రూఢమైనది. వారి యభిప్రాయ ములో భరత నాట్యమున కుపశాఖ సంగీత నాటకము (1-8-55న ఆకాశ వాణి ఢిల్లీ కేంద్రమునుండి చేసిన ఉపన్యాసము). కాని యది వాస్తవము కాదు. భరతనాట్యమని పిలచుట కత్యంతము అర్హమైనది సంగీతనాటకము (యక్షగానము). అందే నాట్యముపరిపూర్ణమైన స్వరూపము నందును. దాని లోని ముఖ్యాంశములను సౌకర్యముకొఱకై స్వీకరించి నేడు తమిళనాడులో చేయబడునది భరతనాట్యనామవాచకమైన సాదిర్ నాట్యము. యక్షగాన ప్రదర్శనమునకు కూచిపూడి కాణాచి. సంగీతనాటకాభినయమును మహా కావ్యముతోడను, సాదిర్ (లేక భరత) నాట్యమును ఖండకావ్యముతోడను

పోల్చవచ్చును. క్షేత్రయ్య తంజావురాస్థానమునకు పోయినట్లు చారిత్రకులు చెప్పుచున్నారు. క్రీ. శ. 1560-1614 మధ్యకాలమున తంజావురమునుపాలించిన అచ్యుతప్పనాయకులవారనేక శత బ్రాహ్మణకుటుంబముల కొరకగ్రహార మిచ్చినారు. దానికి అచ్యుతాపురమని పేరువచ్చెను. అదియే నేటి 'మేలట్టూరు.' 'శూలమంగళ'మునకూడ భాగవతమేళము లేర్పడి యీ నాటి వఱకునుసంప్రదాయమునునిలబెట్టుకొనివచ్చుచున్నారు. వీరందఱును ఒకప్పుడాంధ్రులే. సిద్ధేంద్రుడు పదునేడవ శతాబ్దపు టుత్తరభాగమున నున్నవాడని శ్రీ విస్సా అప్పారావుపంతులుగారి యభిప్రాయము. ప్రొఫెసర్ యస్వీజోగారావుగారునుఇట్టి యభిప్రాయమునే కలిగియున్నారు. 16వశతాబ్దపునాటివాడని వ్యాసకర్త యభిప్రాయము. మాచుపల్లి కైఫియతు క్రీ. శ, 1502 నాటిది. క్రీ. శ. 1486-1509 మధ్యకాలమున వీరనరసింహరాయలు విజయనగరమును పాలింపగా వారి యాస్థానమున కూచిపూడి భాగవతులు విద్యాప్రదర్శనమును చేసినట్లు కలదు. కనుక సిద్ధేంద్రుడు 16వ శతాబ్దమునకు పూర్వుడగుట కవకాశములు కన్పించుచున్నవి. సిద్ధేంద్రునితోడనే కూచిపూడిలో నాట్యము ప్రారంభమయి యుండదనియు, నంతకు పూర్వమున్నదానికే యాతడు పుష్టిచేకూర్చెనని నా యభిప్రాయము. నాట్యసంఘమును కట్టడిచేయుట, సాహిత్యరచనమందించుట యాతడు చేసియుండవచ్చును. 'భామాకలాపము' సిద్ధేంద్రరచితముగనే ప్రసిద్ధము. కాని 'గొల్లకలాపము' శ్రీ భాగవతుల రామయ్యగారి రచనము. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'ఏకవీర' నవలలో 'గొల్లకలాపము' సిద్ధేంద్రునిదను అభిప్రాయము ప్రకటించుటతో మిత్రులు శ్రీ యస్వీజోగారావు ప్రభృతులును ఆ యభిప్రాయమునే స్వీకరించినారు. గొల్లకలాపములు రెండున్నవనియు నందొకటి సిద్ధేంద్రునిదనియు, నది వేదాంతపరమైనదనియు, రెండవది 'సుంకరకొండాయ' యనునాతనిదనియు శ్రీ జోగారావుగా రభిప్రాయమును ప్రకటించినారు (12-10-69 నాట్యగోష్ఠివిజయవాడ). నేను వారి యభిప్రాయముతో నేకీభవింపలేక పోవుచున్నాను. రామయ్యగారి 'గొల్లకలాపము'కాక మఱియొకగొల్లకలాపము కలదని నేను వినినదిలేదు. రామయ్యగారి గొల్లకలాపములోననే 'సుంకరకొండాయ' కల్పితపాత్ర. కొలది నిమిషములు మాత్రమే యుండును. సుంకరకొండాయ యను గ్రంథకర్తలసలులేడు. 'వల్లకాటిలో

రామరుద్రాయ' అని కృష్ణామండలమున తేనివానినిగూర్చి యనుటకలదు. అట్టులే హాస్యముగ మాట్లాడువానిని 'సుంకరకొండాయ'యని యనుటయు కలదు. బహుశః కూచిపూడివారి గొల్లభాగవతము చూచినపిదపనే ఆ పేరు ప్రచారమునకు వచ్చియుండవచ్చును. ఆంధ్రరత్నదుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని వారి తలపాగా మొదలైన వేషముచూచి కొందఱు బందరు పౌరులు 'సుంకరకొండాయ' యనినారట! దానిపై వారు పద్యమునిట్లు చెప్పినారు. "బింకాలు పలుకు బందరు, కుంకల కింకారమెల్ల గిడ్వడసేయన్, శంకరుడె మహానందిని, సుంకరకొండాయయాయె చోద్యంబేలా' (గోపాలకృష్ణుని చాటువులు).

వదునాఱవవ్యాసము:

ఆయుర్వేదాచార్యుడు సుశ్రుతునికి సంబంధించినది. ఆయుర్వేదముపవేదము."సుశ్రుతమున శస్త్రచికిత్స కుపయోగపడు అనేక పరికరములు పేర్కొనబడినవి" (శ్రీనెహ్రూ). "In medicine the Brahmins learned nothing from the Greeks, but taught them much. Arab medicine was founded on translations from Sanskrit works about 800 A. D. European medicine, down to the 17th century was based upon the Arabic." (W. W. Hunter's History of the Indian people-page 55, 56). శాయపురములో పెద్దలు చెప్పిన కథయొకటి ఈ సందర్భమున చెప్పెదను. ఒక ఉద్యోగియైన పాశ్చాత్యుడు గుఱ్ఱముపైనొక యూరిమీదుగాపోవుచుండెను, అతని నౌకరు భారతీయు డనుసరించుచుండెను. ఆ పాశ్చాత్యుడు తన ప్రయాణమును సాగించబోవుచు 'ఉమ్మి'వైచి గుఱ్ఱము నెక్కెను, అ నిష్ఠీవనము ప్రక్కనే యొక దేశీయ వైద్యుడుండెను. వెనుకనున్న భారతీయునితో నా వైద్యుడు ఆ ఉమ్మినిచూచిన వెంటనే మీ యజమానుడు రెండు గడియలలో మరణించునసెను. వైద్యమును తెలుపవలసినదిగా నౌకరు వైద్యునర్థించెను. వైద్యుడు నౌకరుతో "రెండు వీసెల నువ్వులనూనెకొని నీ గుఱ్ఱముమీదనిడికొని యనుసరింపుము. అతడు మంచినీర మడుగును. అప్పుడు నీటికి బదులు ఈ నూనెయిమ్ము. అతడు నూనె యిచ్చితివేమి యనినప్పుడు ఇచ్చుటమానివేయుము'అనిచెప్పెను.పావు శేరునకు తక్కువగానూనెయంతయు

తెల్లవానికిచ్చెను. ఆతడుమంచినీరమనుకొని త్రాగెను. చిట్టచివఱ నూనె యిచ్చితివేమనగా మానివేసి జరిగినదంతయుచెప్పెను. పాశ్చాత్యుడు బ్రదికెను. మనదేశమున వైద్యమట్టిది. తెనాలిలోని శ్రీకుప్పా శంకరశాస్త్రిగారట్టివారు. ఈ శరీర మిచ్చటి పంచభూతములతో నిర్మింపబడినది గనుక 'నాటు' మందునకు గుణమెక్కువ. ఈ పంచభూతము లిచ్చిన ఓషధులు త్వరగా పని చేయును. ముక్కుకాని చెవికాని కోయబడినచో తిరిగి నేర్పుగా ఏర్పాటు చేయు నేటి ప్లాస్టిక్ సర్జరీ వంటి చికిత్స తొలిగా సుశ్రుతుడే కనిపెట్టెనని యాతని శల్యతంత్రమును సర్ ఛార్లస్ రాజ్ యున్నగువారు ప్రశంసించిరనియు నీ వ్యాసమున చెప్పబడినది.

*పదునేడవవ్యాసము :*

సంస్కృతభాషకు ముస్లిములుచేసిన సేవను గూర్చినది. తమమతమును భాషా సాహిత్యములను భారతదేశపు నలుమూలలను ప్రతిష్ఠింపచేయవలెనను పట్టుదలయే ముస్లిము రాచరికపు ముఖ్యలక్షణమనియు, అయినను అయిదారుగురు ముస్లిమ్ ప్రభువులు సంస్కృతభాషానురాగులు కలరనియు వారిలో 'దారాషికోన్' (షాజహానుకుమారుడు) స్వయముగా నుపనిషత్తులను, భగవద్గీతమును, యోగవాశిష్ఠ రామాయణమును పర్షియన్ భాషలోని కనువదించెననియు చెప్పబడినది. షాజహాన్ దారాషికోన్ పోషణములోననే లవంగీ ప్రియుడును రసగంగాధర కర్తయునైన ఉపద్రష్ట జగన్నాథ పండితరాయలు (ముంగండ-తూర్పుగోదావరిజిల్లా) ఉండిన విషయము విదితమే.

*పదునెనిమిదవ వ్యాసము :*

భాసుని ఏకాంకములకు సంబంధించినది. భారతకథ మూలముగా కలిగిన భాసుని మధ్యమవ్యాయోగము, దూతవాక్యము, దూత ఘటోత్కచము-అను వ్యాయోగములలోని ఘట్టములను; కర్ణభారము, ఊరుభంగ మను అంకములలోని ఘట్టములను ప్రస్తావించి, భాసుడు హృదయము సార్ద్రీము చేయు సందర్భములు, క్రొత్తదనము నిందు ప్రస్తావింపబడినవి. ఏకాంకములు ప్రాచీనములైనవి. "It is wrong to believe that the one-act play originated in the twentieth century. Nearly two thousand Years ago, the great Bharata Muni enumerated five types of one-act plays in his 'Natya-Sastra'. They are

Bhana, Prahasana, Vyayoga, Veedhi, and Anka (Khande-rao Deshpande-Osmaniya University). "భాసోహాసః కవికుల గురుః కాళిదాసోవిలాసః" అని 12వ శతాబ్దము వాడయిన జయదేవుడు తన ప్రసన్నరాఘవమున కీర్తించెను. భాసుని రచనములు 1909లో మహా మహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రిగారు కన్యాకుమారికి ఇరువదిమైళ్ళ దూరములోనున్న "పద్మనాభపురము" దగ్గఱ మనలిక్కార మఠములో తాళపత్ర గ్రంథములు తిరుగవేయుచుండగా దొఱకెను. స్వప్నవాసవదత్తము, ప్రతిజ్ఞాయౌగంధరాయణము, పాంచరాత్రము, చారుదత్తము, దూతఘటోత్కచము, అవిమారకము, బాలచరితము, మధ్యమవ్యాయోగము, కర్ణభారము, ఊరుభంగము, దూతవాక్యములో కొంతభాగము, మాత్రమే వారికి దొఱకెను. ఆ తాళపత్రగ్రంథములు మలియాళలిపిలో 300 సంవత్సరములకు పూర్వము వ్రాయబడినవని 'అంచనా' వేయబడెను. 105 తాళపత్రములలో పత్రమునకు పదిపంక్తుల చొప్పున నందు వ్రాయబడినవి. శ్రీ శాస్త్రిగారి సంచారములో కేరళములోనే 'కథంతురట్టి' యొద్ద కైలాసపురములో 'శ్రీ గోవిందపిషరోటి' యని జ్యోతిష్కునియొద్ద అభిషేక నాటకము, ప్రతిమా నాటకముల వ్రాతప్రతులు దొఱకెను. పోల్చిచూచినప్పుడు ఆ ప్రతులకును, ట్రివేండ్రం పాలెస్ లైబ్రరీలోని ప్రతులకును విషయము సరిపోయెను. ఇంకను మఱికొన్నివారు సంపాదించిరి. ఇది యిట్లుండగా, మూడు సంవత్సరములకు పూర్వమే 3-1-1906న మదరాసు ప్రభుత్వపు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స లైబ్రెరీలో శ్రీ క. సంసత్కుమార చక్రవర్తి (కాపీయిస్టు). స్వప్నవాసవదత్తమును నాగరలిపిలో తయారు చేసెను. 6-2-1906 న ప్రతిజ్ఞాయౌగంధరాయణమును తయారుచేసెను. ఇవి యన్నియు కేరళ ప్రాంతమునుండి మలయాళ లిపిలో వచ్చినవే కాని, నాగరలిపిలో భారతదేశములో భాసుని కృతులింతవరకు దొఱకనేలేదు. యూరప్‌లో గాలించినను దొఱుకలేదు కారణమేమి? "As already stated, the Muslim conquerors must have destroyed all the Devanagari mansuscripts of these plays all over India except the extreme South. In Tamilnad, there was never much love for Sanskirt, and the Tamil script with its 23 letters is most unsuited for copying of these Sanskrit plays. But in strong contrast to this, Kerala, is noted for its passio-

nate love of Sanskrit among all classes, Brahmins and Non-brahmins though adjoining Tmilnad. This will also account why these plays, so interesting in content and so artistic in form, were preserved there and enacted by the Chakkiyars, the hereditary actors of Kerala. Plays enacted in Sanskrit can even now be well understood by the messes better in Kerala then any where else in India. So nobody need be surprised that Kerala was the last refuge for these plays (Sri A. S. P. Ayyar, M. A. (Oxon) I. C. S. Bar-at law; Fellow of the Royal Society of Literature of the United Kingdom). మహమ్మదీయుల దండయాత్రలో నా గ్రంథములు ధ్వస్తము లయ్యెననియు, భాసుడు వైష్ణవుడైన బ్రాహ్మణుడనియు శ్రీ ఎ. యస్. పి. అయ్యరుగారి యభిప్రాయము. అది నిజమే కావచ్చును. కాని క్రైస్తవులు కూడ గ్రంథముల నశింపచేసినవారే కాదా! ఎవరివలన నశింపబడినవో చెప్పుట కష్టము. కాళిదాసు క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్దమువాడని జ్యోతిర్విదాభరణ గ్రంథమువలన ఋజువగుచున్నప్పుడు, భాసుడంతకు చాలకాలమునకు పూర్వపువాడగుచున్నాడు. మలయాళదేశములో నాగ్రంథములు పరంపరగా వచ్చుచుండుటచే ప్రతులను వ్రాసికొని యున్నారు. కనుక దీనివలనకూడ దక్షిణదేశమున తమిళమునకంటె సంస్కృతమునకు ప్రాచీనత వెల్లడియగుచున్నది.

## పదితొమ్మిదవవ్యాసము :

కాళిదాసు తపోవనములకు సంబంధించినది. కాళిదాసునకు 'దీపశిఖ' యను ఉపనామమున్నది. "ఆసేతు రాహరిద్వారం, విద్వద్గోష్ఠీషు విశ్రుతా, కాళిదాస కవీంద్రస్య, సంజ్ఞా దీపశిఖేతియా." మేధారుద్రుడను నామాంతరముకూడ నున్నట్లు 'సర్వశబ్దసంబోధిని' యను సంస్కృత నిఘంటువువలన వెల్లడియగుచున్నది. కాళిదాసు కవిత్వములో నేభాగము తీసికొన్నను ఎంతయైనను చెప్పవచ్చును. ఎంత చెప్పినను మిగిలిపోవును. 'కాళిదాస గిరాం సారం, కాళిదాస స్సరస్వతీ, చతుర్ముఖోఽథవా సాక్షాత్, విదుర్నాన్యేతు మాదృశాః' యని వ్యాఖ్యాతృసార్వభౌముడు మల్లినాథుడేయనెను. వ్యాస వాల్మీకులు ఋషులు. కాళిదాస భవభూతులు ఋషికల్పులు. అట్టివా

రరుదుగానుందురు."అస్మిన్నతివిచిత్రకవి పరంపరా వాహినీ సంసారేద్విత్రాః పంచషావా మహాకవయఇతి గణ్యంతే" అని ధ్వన్యాలోకపంక్తి. ప్రకృత వ్యాసములో తపోవనములకును, సాహిత్యమునకు గలయనుబంధ మవిభాజ్య మను సత్యము దృష్టిలోనిడికొని వ్యాసకర్త కాళిదాసుని గ్రంథములలో తపోవన ప్రశంసా ఘట్టముల నెన్నికచేసికొని యందలి విశేషముల నెత్తి చెప్పెను. తపోధనుల దర్భాసనము భూపాలుర రత్నఖచిత హైమ సింహాసన మున కన్నను మహోన్నతమని యిందలి యాశయము. క్రీస్తునకుపూర్వము 1వ శతాబ్దమునాటివని చారిత్రకులభిప్రాయపడిన నాణెములు 1910 ప్రాంత మున వారణాసికి సమీపమున 'భితారి'యను ప్రదేశమున దొరికినవి. రథ స్థయైన రాజు జింకను తఱుముట ఒక నాణెముపై నున్నది. ఋషికుమారు లడ్డుటకూడ కలదు. రెండవనాణెమున మునికన్నెలు ముప్వురు చెట్లకు నీరు పోయుటగలదు. ఇవి శాకుంతలమునకు సంబంధించినవే కదా! శాకుంతలము ప్రాశస్త్యమానాడే యెట్లున్నదో పైవానిచే నూహింపగలము.

*ఇరువదవ వ్యాసము:*

అప్పయ్యదీక్షిత వైదుష్యమునకు సంబంధించినది. దీక్షితులవారి తొలి నామము "వినాయకసుబ్రహ్మణ్యము." అందఱు నాదరమున 'అప్పా'యని పిలచుటచే నప్పయ్యగారయినారు. వీరద్వైతమునకుకర్త. శ్రీరంగరాజదీక్షి తుల పుత్త్రులు. వక్షస్థలాచార్యదీక్షితులు వీరితాతగారు. శ్రీకృష్ణదేవరా యలు కాంచీపురవరదరాజ దర్శనముచేసిన సందర్భమున, రాయల ఆస్థాన పండితులైన పైఆచార్యదీక్షితులవారు, "వరదః సంశయాపన్నో వక్షస్థ్సల మవేక్షతే"అను శ్లోకమును చెప్పిరట. దీని భావ మేమనగా, వరదరాజస్వామి, తన కట్టెదుటనున్న రాయలభార్యను చూచి, మహాలక్ష్మి యేమో-అని అను కొనెనట. ఆభ్రాంతిచే తనవక్షస్థ్సలమునలక్ష్మియున్నదోలేదోయని సరిచూచు కొనెనట. ఈ శ్లోకభావమున కానందించి రాయలవారప్పటికప్పుడే'వక్షస్థలా చార్య' బిరుదమును దీక్షితులవారి కిచ్చిరట. ఆచార్యదీక్షితులకు రాయలు ప్రణతులొసర్చెడివాడనియు, దీక్షితులవా రష్టయజ్ఞములొనర్చినవారనియు, అష్టతటాకముల త్రవ్వించిన వారనియు, అష్టపుత్త్రిలాభమును పొందినవా రనియు, పుత్త్రులందఱును శాస్త్రపండితులనియు నలచరిత్రమున శ్రీనీలకంఠ దీక్షితులు వ్రాసియుండిరి. ఆచార్య దీక్షితులవారికి ప్రథమభార్యవలననల్గురు

పుత్త్రికలుదయించిరి. రాయలవారి ప్రభావమో, ఏమోకాని, ద్వితీయభార్య వైష్ణవకన్య.

## దీక్షితులును పండితరాయలును సమకాలీనులు కారు:

ఆమె సంతానము నలువురిలో నగ్రజుడు రంగరాజాధ్వరి. అప్పయ్య గారు ''పరిమళము''లో తమతండ్రి విశ్వజిద్యాగము చేయుట, వైకుంఠాచార్య వంశసంభవతను ప్రస్తావించిరి. తమిళనాడులోని ఉత్తరార్కాటు మండలమున పాలారునదీ తీరమున విరించి పురసమీపమున 'అడయప్పాలెం' గ్రామమున ప్రమాదీచ నామ సంవత్సర భాద్రపద కృష్ణపాడ్యమి నాడు ఉత్తరాషాఢ నక్షత్రమున అప్పయ్యదీక్షితులు జన్మించిరని యొక మతము. దీని ననుసరించి 5-9-1554 వారి జన్మదిన మగును. కన్యాలగ్నమున రవి బుధులును, ద్వితీయమున శుక్రుడును, తృతీయమున కేతువును, చతుర్థమున గురుడును, సప్తమమున చంద్రుడును, నవమమున శనిరాహులును, దశమమున కుజుడును రాశికుండలిలో నుందురు. దీని ప్రకారము ఫలితములు సరిగా నన్వయించుచున్నవని శ్రీ వి. వి. రామన్ గారి యభిప్రాయము. శ్రీ యన్. రామేశన్ గారు క్రీ.శ. 1520-1592 మధ్యకాలమున అప్పయ్య గారు జీవించిరను అభిప్రాయము గలవారు. దీనికి బలముగ శేషదీక్షితుడు సన్న్యసించిన పిదప 'శివానందయోగి'యై రచించిన ''అప్పయ్య దీక్షితేంద్ర విజయము'లోని యొక శ్లోక మాధారముగ, రాయలు మరణించిన కొలది కాలమునకు పూర్వమే ఆచార్యదీక్షితులు మరణించిరనియు, చరిత్రకారు లేకగ్రీవముగ రాయల మరణ కాలము క్రీ.శ. 1528గా నిర్ణయించుటచే, అప్పయ్యతాత గారి మరణ కాలము నదియే యగుననియు, దాని ననుసరించి అప్పయ్య గారి కాలము నిర్ణయింప వలెననియు నభిప్రాయపడిరి. అదియునుగాక చతుశ్శ్లోకి వ్యాఖ్యలో మహామహోపాధ్యాయ, మన్నారుగుడి రాజుశాస్త్రిగారు అప్పయ్యగారు విక్రమనామ సంవత్సరములో పుట్టి, విజయనామ సంవత్సరములో గతించిరనియు వ్రాసిరని చెప్పిరి. ఆవత్సరములు 1520-93లకు సరిపోవును. అదియునుగాక వెల్లూరి ప్రభువైన చిన్నబొమ్మనాయకుడు, దీక్షితుల వారికి చేసిన కనకాభిషేక ద్రవ్యమును, 'అడయప్పాలెం' లోని కాలకంఠేశ్వరాలయ నిర్మాణమునకును, 500 మంది విద్వాంసులకు శ్రీకంఠభాష్యము నధ్యయనము చేయించుట కొఱకును,

దీక్షితులుగారు వినియోగించిరనియు నాకాలము శాలివాహన శక చిత్రభానుసంవత్సరమనియు నది క్రీ.శ. 1582 అగుననియు, నట్లుచేసినట్లు కాలకంఠేశ్వరాలయముపై వ్రాతలు స్పష్టముగ తెలుపుననియు, వానిని త్రోసిపుచ్చుటకు వీలులేదనియు, నీసాక్ష్యముకూడ 1520-1592 వాదమునే బలపఱచుచున్న దనియు 'రామేశన్'గారి యభిప్రాయము. ఈ కాల నిర్ణయ ప్రయోజన మేమనగా అప్పయ్యదీక్షితుల వారిపై కసిచే జగన్నాథ పండితరాయలు 'చిత్రమీమాంస'ను తునాతునుకలుగా ఖండించెనని కథలున్నవి. లవంగిప్రియుడైన పండితరాయలు దీక్షితులవారి యింటికిరాగా, నిష్ఠాగరిష్ఠులైన దీక్షితులాతనికి పంచలో నన్నము వడ్డింప చేసెననియు, నాక్రోధముతో నాతడు అప్పయ్యగారిగ్రంథఖండనమునకు దొఱకొనెననియు ప్రవాదము. పదునేడవశతాబ్దపు టుత్తరార్థమున నున్న పండితరాయలు పై కాలము ననుసరించి సమకాలీనుడు కానేకాడు.

## అప్పయ్య, నీలకంఠుల వంశవృక్షము :

దీక్షితులవారు భారద్వాజసగోత్రులని తెలియుచున్నది. వీరికుటుంబము వారు మరకతవల్లీ సమేత మార్గసహాయేశ్వర భక్తులని తెలియుచున్నది. తాతాచార్యుల వారికిని దీక్షితులవారికిని వైరమనియు, అందుచే ఆచార్యుల వా రభిచారప్రయోగములు చేయగా దీక్షితులవారు వేద మంత్రముల చేతను, అపీతకుచాంబాష్టక స్తోత్రముచేతను నివారించుకొనిరనియును, నల్లే కొందఱు తీర్థములో విషముకలిపి యీయగా, దీక్షితుల వారి నది యేమియు చేయలేక పోయెననియు, శ్రీ వేంకటేశ్వరుని దర్శనమునకు అర్చకులు నిరోధింపగా స్వామియే శివుని యాకారము ధరింపగా, నర్చకుల యభ్యర్థనముపై దీక్షితులవారు వారిననుగ్రహించి రనియు కొన్ని కథలు ప్రచారములోనున్నవి. వారు తమగ్రామములో శ్రీమహాదేవీసమేత వరదరాజస్వామియాలయమును నిర్మించియున్నారు. తదాలయ పునర్నిర్మాణమునకై శ్రీ కామకోటిస్వామి యాశీస్సులతో కొందఱు ప్రయత్నము చేయుచున్నారు. చిదంబరములో స్వామిసన్నిధానమున స్తుతించుచు దీక్షితుల వారు పరమపదించిరి. సర్ సి. పి. రామస్వామిఅయ్యరుగారు దీక్షితుల వంశములోనివారే. నీలకంఠ దీక్షితులు అప్పయ్యగారి యన్నమనుమడు. నీలకంఠులు పెద్దవారగువఱకు ఆస్తులు విభాగముకాలేదు. వారు తమకాస్తి

లో వాటా అక్కఱలేదనియు, అప్పయ్యగారి ఆశీర్వాదమే చాలుననియు నభ్యర్థించిరి. అప్పయ్యగారు మనస్ఫూర్తిగ నాశీర్వదించిరి. నీలకంఠదీక్షితుల సంతతివారు తామ్రపర్ణినదీతీరమున తిరునల్వేలి జంక్షనుకు అయిదుమైళ్ల దూరమున 'పలమడై' గ్రామపు సివారున "నీలకంఠసముద్ర"మను గ్రామమును నిర్మించుకొనిరి. 'డివైన్ లైఫ్ సొసైటీ' స్థాపించిన స్వామిశివానంద సరస్వతి యచ్చటివారే. నీలకంఠులు దేవీమాహాత్మ్యమునుగూర్చి యుపన్యసించుచుండగా వారి వర్చస్సుచూచి, మధురాధిపతి తిరుమలనాయకుడు వారిని ప్రధానమంత్రిగను, ఆస్థానపండితులుగను నియమించెను. రాజలాంఛనములు, మేలిభోగములు ఉన్నను, నీలకంఠులు నిరాడంబరముగ జీవించుచు నైష్ఠికముగ కాలక్షేపముచేయుచు మంత్రిపదవిని సునాయాసముగను, సమర్థముగను నిర్వహించుచుండిరి. ఇంతలో 'సుందరమూర్తిఆసారి'యను శిల్పి తిరుమలనాయకునిరాణి విగ్రహమును సుందరముగ చెక్కగా, దైవికముగ విగ్రహముతొడపై పెచ్చురేగి, మచ్చవలె ఏర్పడిన నేమియుతోచక నీలకంఠునితోచెప్పగా వారు రాణిగారికి అటను మచ్చయుండియేయుండుననిరట. రాజు శిల్పిని కోపింపగా, నీలకంఠులు మచ్చయుండియుండుననిగని యాతడు తప్పించుకొనెను. సాముద్రిక శాస్త్రాధారముతో చెప్పిన నీలకంఠుల ప్రజ్ఞను గ్రహింప లేక యనుమానించి నీలకంఠుల బంధించుటకు పాండ్యరాజాజ్ఞ నిచ్చెను. బంధించుటకు వారు వచ్చిన సమయమున నీలకంఠులు దేవికి హారతి నిచ్చుచుండిరి. ఈలోపుగా రాజు కండ్లుపోయి యాతడే నీలకంఠుల వద్దకు వచ్చి క్షమార్పణమును కోరెను. మీనాక్షిదేవిపై నీలకంఠులు 108 శ్లోకము లాశువుగా చెప్పగా రాజునకు దృష్టి వచ్చెను. కాని నీలకంఠులానాడేయుద్యోగమును చాలించి, తమ సంతతివారినికూడా రాజుల కొలువుచేయకుండుటకు కట్టడిచేసెను. నీలకంఠులు రాజుగారిచ్చిన 'పలమడై' యగ్రహారముననే యుండి 32 కృతులు రచించి ఆశ్రమస్వీకారముకూడ చేసిరి. భారతదేశము స్వాతంత్ర్యమగువఱకు నీలకంఠుల సంతతివారుద్యోగము చేసినట్లుకనబడదు. చింతర్పుఉపాధ్యాయులు నీలకంఠుల పినతండ్రి. వీరికిని వీరి సంతతివారికిని రాజతాంబూలపు టాచారము వచ్చుచున్నది. ఆ సంతతిలోని వారే అయిన శ్రీ వి. చంద్రమౌళి, I.A.S. (Additional Deputy Secretary to the Government A.P.)గారు ఒకవిధముగ నప్పయ్యదీక్షితులవారి కుదురులోనివారే.

## అప్పయ్య దీక్షితుల పూర్వు లాంధ్రులు :

వారు, అప్పయ్య దీక్షితులవారి పూర్వులు విజయనగర సామ్రాజ్య పతనానంతరము, రాజవంశీయులతో ఆర్వీటి ప్రభువులున్న చోటికిని, తరువాతి పరిస్థితు లననుకూలముగ నుండుటచే 'మధుర'కును తరలివచ్చిరని వ్రాసిరి. అప్పయ్య దీక్షితులు ద్రవిడశిరోమణిగా ననగా తమిళుడుగా పండితరాయలచే పేర్కొనబడెను. వారు తమిళులు కావచ్చును. కాని వారి పూర్వు లాంధ్రు లని వారికి తెలిసియుండుటచే ఆంధ్రాభిమాన మీవిధముగ వ్యక్తముచేసిరి. "ఆంధ్రత్వమాంధ్రభాషాచ, ప్రాభాకర పరిశ్రమః, తత్రాపియాజుషీశాఖా, నాల్పస్యతపసః ఫలమ్". తమిళు లాంధ్రభాషపై నభిమానము వ్యక్తము చేయుట అపురూపమైన విషయము. "పరాశక్తియంత్రమునకు తెలుగు లిపి ఉపయోగింపబడినది. పరాశక్తి స్త్రీస్వరూపిణి. అంబికకు వామావర్తపూజ ఏర్పడి యున్నది. తక్కినవి దక్షిణావర్తమైనవి. ఆవర్తమనగా చక్రము. తెనుగు వర్తులాకారలిపి. అందునను వామావర్తము. వామావర్తపూజలందు కొను అంబికయొక్క యంత్రములోనను చక్రములోనను ఆంధ్రలిపియున్నది. అందుచే తెలుగులిపి పరాశక్తి ప్రధానమైయున్నది. తెనుగుభాష శివప్రధా నము. లిపిశక్తిస్వరూపము. భాష శివస్వరూపము. వాగర్థములు పార్వతీ పర మేశ్వరులనికదా కాళిదాసు రఘువంశములో నన్నది! ఆంధ్రభాషశివప్రధాన మైనదని గుర్తించిన అప్పయ్య దీక్షితులవారు పరమశివభక్తులు. ఆంధ్రము త్రిలింగదేశము. దేశమే లింగావర్తము (జగద్గురుబోధలు). స్వామివారు ఆధ్యాత్మికముగ అప్పయ్య దీక్షితులవారికి ఆంధ్రాభిమానకారణమేమో సెల విచ్చినారు. ఆదిశంకరులుకూడ ఆంధ్రలిపినే యంత్రములలో నుపయోగించి యుండవచ్చును.

శ్రీ వి. చంద్రమౌళిగారు "By a careful perusal of names in the genealogical table, we find that the earlier names smack of their Andhra origins. I can prove the prevalance of a larger number of Telugu words, and a currency of a number of TeluguProverbs in the family circles of 'Palamadai' The translation of the Telugu proverbs into colloquial Tamil is evident ever in the usage of certain aphorisms and figures of speech, which are even to this day, used at their houses.

The habit of worshipping 'Sri Venkateswara' as 'Kuladeva' from the far off Tirunalveli, and the convention of naming the first born, after the "Lord of the Seven Hills", cherish the memories of their Arveedu affiliations in ages long gone by" అని వ్రాయుటలో దీక్షితులవారి పూర్వు లాంధ్రులని తెలుచున్నది. "వడదేశవడమ" యనియు, 'వడవర్' అనియు వీరిని వ్యవహరించుట వలన కూడ వీ రుత్తర ప్రాంతీయులని స్పష్ట పడుచున్నదని వ్రాసిరి. తంజావూరు, తిరుచ్చిజిల్లాల కంతకు పూర్వము వచ్చినవారిని చోళదేశవడమలని విభాగము చేయుచుండెడి వారనికూడ వ్రాసిరి. "The descendants of the Appaiah family were theref re intellectual refugees of the post Vijayanagar period" అని ఆంధ్రులుగా స్పష్టపఱచిరి.

అప్పయ్య, నీలకంఠదీక్షితుల వంశమువారు శ్రీరంగప్రాంతముననున్న "పట్టమడై" "తరుడై" "అరవమంగళం" "పెరుంగలమ్" "కడయమ్" గ్రామములలోని వైష్ణవకన్యలను వివాహమాడుట ఆశ్చర్యపడవలసిన విషయము. 'పట్టమడై' కుటుంబములవారు, 'కులమడై' కుటుంబముల వారిని ఉద్రేకులుగను, తిరుగుబాటు లక్షణములు కలవారుగను; ప్రవర్తనమునందును, మేధాశక్తి యందును అసాధారణస్థితిగలవారుగను భావించుచుండెడి వారట! వైష్ణవులు వారికన్యలను వీరికిచ్చినను, పిల్లనుచూచుటకు వచ్చినప్పుడు, అల్లునియింటిలో నొకభాగములో వండుకొని, తిరవెనుకనే భుజించు చుండెడివారట. ఈ వ్యాసమున బాలశివపంచాక్షరితో సత్కరాభ్యాసము చేయు నాచారము ఆంధ్రమున నుండుటచేతనో, లేక ఆంధ్రులు వారిపూర్వు లగుటచేతనో దీక్షితులవారి కాంధ్రాభిమానమున్నదని చెప్పబడినది. అందు చేత వారి వంశవృక్షమును దానికి సంబంధించిన విషయములును, ప్రమాణములును ఈయవలసి వచ్చినది. అప్పయ్య దీక్షితుల పూర్వు లాంధ్రులనుట స్పష్టము. ఆంధ్రమున అప్పయ్య దీక్షితులవారి విషయము పండితులలో తప్ప, మిగిలిన విద్యాధికులలో ప్రచారము తక్కువ. అందుచేతను వివరము ఈయ వలసి వచ్చినది.

జనులు కొంతకాలము సగుణేశ్వరోపాసనముచేసి పరమేశ్వరుని యనుగ్రహమును సంపాదించి చిత్తపరిపాకసాధనాయత్తనిర్గుణబ్రహ్మసాక్షాత్కారముతో కృతార్థులు కావలెనని దీక్షితాశయముగ నిందు వెల్లడింపబడినది.

అప్పయ్య దీక్షితులవారి పూర్వు లాంధ్రులు, శ్రీమచ్ఛంకరభగవత్పా దులవారాంధ్రులు. కేరళదేశపురాజు మయూరశర్మఆజ్ఞచే సర్వవరమునుండి తీసికొనిపోబడిన బ్రాహ్మణ కుటుంబములలోనివారిలో 'శివగురువ'నువారి పుత్త్రిలు. శ్రీ రామానుజాచార్యుల వారియింటిపేరు ఆసూరివారు. వారును ఆంధ్రులే.మధ్వాచార్యులవారియింటిపేరు'నడిమింటి'వారు. వీరునుఆంధ్రులే. కుమారిలభట్టు, విద్యారణ్యులు, వల్లభాచార్యులు ఆంధ్రులేకదా! ప్రస్తావన ములో వీ రాంధ్రులని చెప్పవలసివచ్చినది. అట్లు చెప్పికొనుట సత్యమును చెప్పి కొనుటయేయైనను, వారు మాత్రము దేశములో పరిచ్ఛిన్నమైన ఒకభాగము నకుసంబంధించినవారుకారు. మతాచార్యులందరును దాక్షిణాత్యులే. "దాక్షి ణాత్యుడై దీక్షవహించిన, శంకరు భాష్యపు హుంకారానికి, ఉత్తరభారతమే మందిః, నిరుత్తరమై తలదాల్చింది" అని మనము సగర్వముగ చెప్పికొనినను, వారు దక్షిణభారతపువారు కనుకనే గొప్పవారుకాలేదు. వారుగొప్పవారు కనుకనే గొప్పవారుగ గుర్తింపబడినారు. న్యాయమునకు వారి గ్రంథము లును, వారును, ప్రపంచమున కంతకును సంబంధించినవారు.

లోకములో సందిగ్ధమైన అభిప్రాయ విషయములయందే విమర్శ విస్తృతము కావలసి వచ్చినది. కొన్ని వ్యాసముల సారాంశము మాత్రమే యీయబడినది. వ్యాసములలో లేని, అవసరమనుకొనిన కొన్ని విషయము లను పూరింపవలసివచ్చినది. ఆకాశవాణిలో వ్యాసకర్తలకు కాలము చాల పరిమితము కదా! సంస్కృత భాషాస్వరూపము తెలిసిననేకాని యీ వ్యాస ముల నే దృష్టితో చదువవలెనో తెలియుటకష్టము అందుచేత సంస్కృతభాష ప్రాశస్త్యమును వివరింపవలసి వచ్చినది. దేశసమైక్యము దృష్టిలోనిడుకొని భారతదేశముననున్న వారందఱును ఆర్యులేయన్న సత్యమును వెలువరింప వలసి వచ్చినది.

ఇప్పటికీ "పీఠిక" అగస్త్యుడొకయెత్తు-కమండలమొకయెత్తుగానై నది. అందుచే కొన్ని శాస్త్రీయవిషయములు స్పృశించలేదు. తగిన కాల వ్యవధినిచ్చి, ఈ గ్రంథ సంకలనమునకు, పీఠికా రచనమునకును, ప్రోత్స హించిన మా ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారికి నేను కృతజ్ఞుడను.

కవిసమ్రాట్, మహోపాధ్యాయ, శతావధాని
పైడిపాటి సుబ్బరామశాస్త్రి
మారుతీనగర్, విజయవాడ-4.

# 1. భారతీయ సంస్కృతేరేకత్వమ్

శ్రీ జటావల్లభుల పురుషోత్తము

సంస్కృతి శబ్దస్య అలంకారాపాదనార్థః. సంపరిభ్యాం కరోతే భూషణే కస్య చిద్వస్తునః వస్త్వంతర సంయోగా జ్జాయమానః పరిణామ విశేషః వికారాపాదన రూపోఽపి సంస్కారశబ్దేన వ్యవహర్తుం శక్యతే ఔపచారిక మర్యాదయా. లోకే సుసంస్కార దుష్టసంస్కారాది ప్రయోగాః ప్రసిద్ధాః.

కస్య చి ద్దేశస్య ఉపరి తత్ర సంజాతానాం మహాపురుషాణాం అన్యేషాం వా ప్రభావః, తత్ర సంజాతస్య గ్రంథజాతస్య ప్రభావః, అన్య దేశేభ్య ఆగతానాం సంప్రదాయానాం ప్రభావః అన్యే వా ప్రభావా యే ఆపతితాః బహోః కాలాత్ తేషాం సర్వేషామపి ప్రభావాణాం సమష్టి ఫలరూపా యాస్థితిర్వర్తతే సా తస్య దేశస్య సంస్కృతిరితి వక్తుం శక్యతే. భాషాయాం, సాహిత్యే, కలాసు, తాత్త్విక దృష్ట్యాం, ఆచారవ్యవహారాదిషు బహుధా ప్రవిభక్తా దృశ్యతే సంస్కృతిః. సా కృత్స్నే భారతే ఏకరూపా యద్యపి అల్పాంశేషు భేదాః పరిదృశ్యన్తే.

బహు భాషా విలసితే భారతే కథంవా సాంస్కృతికైక్యమ్? భిద్యంతాం భాషాః కేషు చిదంశేషు. కింతు సర్వ భాషాసు ప్రయుజ్యమానః సంస్కృత పదసమూహః ఏకరూపతయైవ వర్తతే. సోఽపి ప్రతిభావ సప్త శాతమితో వర్తతే, కశ్చన కేరళదేశీయః హిమాలయప్రాన్తే అటన్ భోజన నిద్రా సుఖదుఃఖ ధర్మాది సంస్కృత శబ్దాన్ ప్రత్యయరహితానపి ప్రయుంజానః స్వీయాభిప్రాయాన్ తత్రత్యేభ్యః జ్ఞాపయితుం ప్రభవతి.

తాదృశీ ఏకతా సాహిత్యేపి వర్తతే. సర్వప్రాంతీయ సాహిత్య విశేషాః సంస్కృత సాహిత్య సంప్రదాయాననుసరంతః భారతీయ సంస్కృతి పరిపోషక వ్యాపకా స్సంతః ఉద్దీపయన్తి ఆధ్యాత్మిక చింతనం, భగవద్భక్తిం మాతాపితృ భక్తిం శ్రుతిస్మృతి పురాణ దృష్టాన్ సర్వానపి

ధర్మాన్. భారతీయ సంస్కృతేః ప్రాణభూతా యా శాంతి నిరతిః సాఽపి సమ్యక్ సంపాదితా దేశభాషా సాహిత్యవిశేషైః. శాంతి ప్రమాణత్వం మాంగళ్య పరత్వంచ సర్వప్రాంతీయ సాహిత్యానాం ప్రాణభూతం.

కృత్స్నేఽపి భారతే అహింసావిషయే యాదృశః అభినివేశః వర్తతే తాదృశః న కుత్రాపి అన్యదేశేషు దృశ్యతే. అత్ర అహింసాపరత్వమేతత్. న కేవలం మనుష్య విషయకం, కింతు సర్వప్రాణివిషయకం.

శంకర రామానుజాద్యాచార్య పురుషాణాం ఆచార్యత్వాభ్యుప పత్తౌ న కదాపి తత్ర ప్రాంతీయతా ప్రసంగః సంజాతః. అయోధ్యామథురా మాయా కాశీ కాంచీ అవంతికా పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకాః ఇత్యాది క్షేత్రపరిగణనావసరేఽపి న ప్రాంతీయతా ప్రసంగః. కృత్స్నస్యాపి భారతదేశస్య ఏకత్వే నైవ పరిగ్రహణం.

సంస్కృతి ద్వయం ఆర్యద్రావిడ సంస్కృత్యాత్మకం భారతే వర్తతే ఇతి కేచన మన్యన్తే. నైతత్ప్రమాణ విలసితం. ఆర్యాః బహిః ప్రదేశాద్భారత మాగతా ఇతి యదుక్తం కైశ్చన గవేషణ పరైః, తత్ప్రత్యాఖ్యాతమిదానీం. బహుభిః పరిశోధకైః మహేంజొదారో, హరప్పాప్రాంతేషు ఉపలబ్ధేభ్యః వస్తుభ్యః ఆర్యద్రావిడ సంస్కృత్యేకత్వం బహుధా నిరూపయతి.

భారతీయ సంస్కృతేః న కేవలం ప్రాదేశికీ ఏకతా, కిన్తు కాలికీ అపి ఏకతా పరిదృశ్యతే. నకుత్రాపి అన్యస్మిన్ దేశే ప్రాచీన సంస్కృతేరేతాదృశ మవిచ్ఛిన్న పారంపర్యం. వేషభాషా భూషాహారాదయః, వివాహాది శుభకర్మ విధానరీతిః, ఔర్ధ్వదైహిక క్రియాః, కర్మ పునర్జన్మ సిద్ధాంత విశ్వాసాః, బహవః ఇతరాచారవిచారాః యే సంస్కృత్యంగభూతాః తే సర్వేఽపి లోకోత్తరశక్తిమత్తయా అగణిత సహస్రాబ్దేషు గతేష్వపి ఇదానీం పరిదృశ్యన్తే.

భారత దేశస్య వివిధప్రాంతేషు సముత్పన్నానాం కవీనాం యత్ ధర్మభక్తి జ్ఞాన ప్రబోధన పరత్వం తదపి భారతీయ సంస్కృతేః ఏకత్వమాపాదయతి. దక్షిణప్రాంతే త్యాగరాజస్య, ఉత్కలప్రాన్తే జయదేవస్య, పశ్చిమప్రాన్తే తుకారామస్య, ఉత్తరప్రాంతే కబీరస్య గీతికాః అస్మాన్ ప్రాన్తభాషాప్రయుక్తభేదాన్ విస్మారయన్తి. ఏవం నృత్యభంగిము

విశేషాః రాధాకృష్ణ నటరాజ లీలాస్ఫోరకాః సర్వత్ర సమానాః. తథైవ రామాయణ మహాభారత గ్రంథ ప్రసృతాః భావ తరంగిణీ సర్వానపి ప్రాంతాన్ సమమేవ ప్రభావయతి. ఉత్తర భారత సాహిత్యాలంకార భూతం తులసీదాస రామాయణం, తమిళ ప్రాంతావతంసాయమానం కంబరామాయణం, ఆంధ్ర భాషామండ నాయమానం కవిత్రయమహాభారతం, కర్ణాట భాషాలంకార భూతం పంపభారతంచ సుష్ఠు నిరూపయన్తి, పరిపోష యన్తిచ అస్మాకం సాంస్కృతికైక్యం.

ఇత్థం భారతీయ సంస్కృతే రేకత్వం సర్వాంశేషు ప్రస్ఫుటం విభాతి.



# 2. సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్?

శ్రీ జటావల్లభులపురుషోత్తము

రాజ్యాల్లాభో ద్వివిధః—ప్రభుతా ఉపభోగశ్చ. కవితాయా అపి ఏతద్ద్వివిధలాభస్య సత్వాత్, సత్యాం సుకవితాయాం రాజ్యస్య అనావశ్యకతా నిగదితా భర్తృహరి మహాకవినా—“సుకవితాయద్యస్తి రాజ్యేనకిం?” ఇతి.

కవితాప్రాప్య ప్రభావానందవైభవం బహుభిః బుధచంద్రైర్బహుధా వర్ణితం. సామ్రాజ్య వైభవంచ షేక్స్పియర్ మహాకవించ తోలయంతా కార్లైయిల్ మహాశయేన మహాకవేరేవ శ్రేయస్త్వం నిర్ధారితం.

నకేవలం కవీనాం కిన్తు కవితారసాస్వాదచణానామపి లోకశాసనశక్తిః, అలౌకికానందానుభూతిశ్చ దృశ్యతే.

అప్రత్యభిజ్ఞాతశాసితారః ఖలు కవీన్ద్రాః. దృశ్యతాం వాల్మీకివ్యాసయోః శాసకత్వం! రామాయణ మహాభారత గ్రంథోపవర్ణితాః సత్పురుషాః, సతీమతల్లికాశ్చ కథంవా భారతీయానాం హృదయేషు అద్యాపి ప్రాభవంప్రదర్శయంతీతి ఆశ్చర్యావహోయంవిషయః. వివిధసంప్రదాయానుసారిణాం నరేన్ద్రాణాం పాలనం భారతే ఆసీత్. తత్సర్వం బాహ్యమేవ, నతు ఆభ్యంతరం కథంవా భూపాలకానాం శాసనాని మతానిచ భవేయుః. భారతీయ నార్యః వ్యాసవాల్మీకి వర్ణిత పతివ్రతా చరిత్ర సందీపితాంతరంగాః నసంప్రదాయమతిలంఘితుముత్సహన్తే. అత్రవిషయే కవీనాంశాసనం రాజశాసనాత్ దృఢతరం వర్తతే. ప్రాచీన కవివర్ణితాః సీతా సావిత్రీ చంద్రమత్యాది సత్యః మూర్ధాభిషిక్తా ఇవ రాజ్ఞ్యః భారత నారీహృదయ సింహాసనస్థాః తాసాం భావాన్ ప్రచాలయన్తి. ప్రజాఃదుష్పథాత్ నివారయితుం ఏతాదృశగ్రన్థాః రాజశాసనాదపి అధికతరం ప్రభవన్తి.

కథంవా కవితాశక్తిః రాజశాసనమపి ఉచ్ఛింద్యాదిత్యత్ర బిల్హణ చరితం నిదర్శనం. స్వీయ పాండిత్యాదిభిః రాజసుతాం వశీకృతవతః బిల్హణస్యమరణదండనం విహితం. వధ్యస్థానం నీయమానస్య బిల్హణస్య

ముఖాన్నిర్గతయా కవితాధారయా సమ్మోహితస్య రాజ్ఞః హృదయం కరుణయా ద్రవీభూతం. క్షిప్రమేవ రాజా కవేః మరణదండనం వ్యపోహ్య తస్మై స్వీయదుహితరం ప్రాదాత్.

ప్రజాః రాజాధీనాః, రాజానస్తు కవీశ్వరాధీనాః. సరసకవితా చిత్రకవితాది సకలవిధ కవితారీతయః లోకోత్తర వశీకరణశక్తిమత్యః. కేచన రాజానో రాజ పురుషాశ్చ సరసకవి సల్లాపముగ్ధా అతేషు భక్తాః దాసాయతేస్మ. కేచనమహీపాలాః కవిగౌరవ ప్రకటనాయ తత్పల్యంకవాహా అపి ఆసన్.

స్థితస్యైవ లోకస్య పాలనం రాజ్ఞా క్రియతే, కవినా తు నూతనలోకః సృజ్యతే. దుఃఖ బహులాత్ అస్మాల్లోకాత్ అస్మానుద్ధృత్య ఆనందాత్మకం నూతనం లోకం నయతి కవివర్యః. అతః సృష్టికర్తా బ్రహ్మైవ కవిసాదృశ్యమర్హతి. నతు రాజా.

దోషదూషిత కలియుగే నివసతాం అస్మాకం పూర్వయుగ నివాస సౌభాగ్యం అనుభవగోచరం భవతి పూర్వ మహాకవి గ్రంథ పఠనావసరే. రాజా తు కాలవశస్సన్ కాలగత దోషాన్ అతిలంఘితుం నశక్నోతి.

"రాజ్యం స్వహస్త ధృతదండ మివాతపత్రం" ఇతి కాళిదాసోక్తరీత్యా రాజ్యసుఖం దుఃఖసమ్మిశ్రితం. కవితానందస్తు దుఃఖాస్పృష్టః. శోకాద్యనిష్టభావాః కావ్యగతాస్సంతః అనిష్టలక్షణం పరిత్యజ్య రసత్వం ప్రాప్నువన్తి, యథా ఆయసం వస్తు సిద్ధరస స్పర్శాత్ సువర్ణత్వం ప్రాప్నోతి. యథా దుఃఖం నిసర్గతః తమోలక్షణమపి, పరదుఃఖ దుఃఖితత్వాత్మకం దుఃఖం సత్త్వే అంతర్భవతి. ఏవమేవ శోకాదిభావాః కావ్యగతాః ఉత్తమాం రస స్థితిం ప్రాప్నువంతి. అతో హి రాజ్యానందాత్ కావ్యానందః విశిష్యతే.

అనేకే మహారాజాః మహాకవీన్ పూజయన్తః తత్సాంగత్యేన కవనశక్తిమపి ప్రపేదిరే. స్వీయరాజ్యం క్షణికం మన్వానాః తే భోజ శ్రీహర్ష కృష్ణదేవరాయాద్యాః స్వవిరచితైరేవ కావ్యైః అమరాం కీర్తిం వివ్యావః కావ్యానివ్యరచయన్. నూనం అద్యాపి తేషాం కీర్తిర్విబుధమండలే గాఢరూఢా భవతి. రాజ్యపాలన మాత్రేణ ఏతాదృశీ కీర్తిః న లప్స్యేత.

బాహ్యవస్తూప జీవినః రాజ్యానందస్య, బాహ్యవస్తు నిరపేక్షస్య కావ్యానందస్యచ మధ్యే మహాన్ వ్యత్యాసో వర్తతే. నసర్వదా బాహ్య వస్తూన్యుపలభ్యంతే. కావ్యానందస్య ఏకైకం సాధనమపేక్ష్యతే, సరస హృదయంనామ. అతః కావ్యరసానందావకాశః అనపాయీ.

చంద్రే, మేఘే, విద్యుతి, సముద్రే-సర్వత్ర సౌందర్యమేవ కవినా అనుభూయతే. సర్వోపి ప్రకృతి విలాసః తేనఅద్భుతతయా అనుభూయతే క్షుద్రేపి వస్తుని సౌందర్యాస్వాదాయ సః ప్రభవతి. ప్రాతఃకాలే శాద్వల ప్రదేశే చరన్ కవిః తృణాంకురోపరి హిమబిందూన్ దృష్ట్వా తత్రముక్తా ఫలదృష్టిం భజతి. ఏవం యే అస్మాకం జలబిందవః తే కవేః ముక్తాఫలాని భవన్తి. క్వచిత్ క్వచిత్ కతిపయ వస్తు ప్రాప్యః రాజ్యానందః క్వ? సర్వత్ర ప్రాప్యః అప్రమేయః అలౌకికః కవితానందః క్వ?

రాజ్యానందో మానుషానంద విశేషః కావ్యానందః బ్రహ్మానంద సబ్రహ్మ చారీతి అలమే తయోఃతులనేన.

# 3. అన్నంభట్టస్య వైదుష్యమ్

శ్రీ సూరి రామకోటిశాస్త్రి

అయిభోస్సుధియః !

తత్ర భవానన్నంభట్టః తర్కసంగ్రహదీపికా ప్రకరణగ్రన్థ ప్రణేతా శ్రీమదద్వైతవిచార్య శ్రీమద్రాఘవ సోమయాజికులావతంస శ్రీమత్తిరుమలార్యవర్య సూనుః కౌశికసగోత్రః కృష్ణాతీరస్థ గరికపాడుగ్రామనివాసీ శ్రీమాన్య సదాశివరాయ మహోదయేభ్యః లబ్ధాగ్రహారో విజ్ఞాయతే.

మహాభాగోయం సర్వవిద్యావాసే శ్రీ కాశీక్షేత్రే సర్వతన్త్ర స్వతన్త్రేభ్యః శ్రీ శేషవీరేశ్వర పణ్డిత ప్రవరాదిభ్యః బహూని శాస్త్రాణ్యధీత్య నిష్ణాతః తర్కవ్యాకరణ పూర్వోత్తరమీమాంసా శాస్త్రేషు పరం కౌశలం ప్రదర్శయన్ వివిధాన్ గ్రన్థాన్ రచయామాస. "యస్యదేవే పరాభక్తిః యథాదేవే తథాగురౌ, తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తేమహాత్మనః" ఇతిశ్రుతేర్వచన మథురశః పరిపాలయతోఽస్య బుద్ధిః సర్వతన్త్రేష్వకుణ్ఠితా ప్రసరతి.

విదుషాఽనేన రచితాగ్రన్థాః తర్కశాస్త్రే చత్వారః- (1) బాలవ్యుత్పాదకః తర్క సంగ్రహః (2) శిశుహితాచతర్కసంగ్రహదీపికాఇతిద్వౌ ప్రకరణ గ్రన్థౌ (3) తత్త్వ చింతామణి దీధితివ్యాఖ్య సుబుద్ధి మనోహరా (4) జయ దేవతత్త్వచిన్తామణ్యాలోకవ్యాఖ్యా సిద్ధాఞ్జనమ్ ఇతిప్రౌఢగ్రన్థద్వయమ్-వ్యాకరణశాస్త్రే చ (1) అష్టాధ్యాయీ సులభవ్యాఖ్యామితాక్షరా నామ్నివృత్తిః (2)స్వరవివేకః(3) కైయటగ్రన్థవ్యాఖ్యానరూపంమహాభాష్య ప్రదీపోద్యోతనమ్ ఇతిత్రయః. పూర్వమీమాంసాయాంతు (1) తన్త్రవార్తిక టీకా సుబోధినీ (2) భట్టసోమేశ్వరకృతన్యాయ సుధావ్యాఖ్యారాణకోజ్జీవినీతిద్వౌ, తథావేదాన్తశాస్త్రే (1) బ్రహ్మసూత్రవృత్తిః మితాక్షరా (2) తత్త్వవివేకదీపనవ్యాఖ్యాచేతిద్వౌ ఆహత్య ఏకాదశతఇమేనిబన్ధాః ముఖ్యాతిముఖ్యేషుచతుర్షు శాస్త్రేషు అస్య అనితరసాధారణం వైదుష్యం ప్రకాశయన్తి.

అతఏవ "కాశీగమనమాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజః" ఇతి ప్రశస్తిః. అభిజ్ఞజనాదృతా చకాస్తి. తదాత్వే అధ్యయనార్థం కాశీగన్తారో జనాః. తథాపి చతుశ్శాస్త్రవిపశ్చిన్మణేరస్య తులనామధిగన్తుం తత్సమకాలికః సమనన్తరకాలికో వా నకోఽపి విద్వాన్ అలమితి ప్రసిద్ధం యుజ్యతే.

శాస్త్రాణి చ పురుషార్థహేతూని భవన్తి. తత్త్వనిరూపణపరాణి యథారుచివాసనానుసారం చేష్టమానస్య సర్వస్య లోకస్య యోగక్షేమం విధాతుమిచ్ఛయా మహర్షిభిః ప్రవర్తితాని. రాగద్వేషవర్జనం ప్రశమముద్దేశ్యమేషామ్. తదుక్తం భగవతా వ్యాసేన శాన్తిపర్వణి "శమార్థం సర్వశాస్త్రాణి విహితాని మనీషిభిః" ఇతి. శాస్త్రకారా హి విద్యోపదేశేన పరమోపకారం విదధుః. శాన్తిః ప్రసాధితా స్యాత్. సర్వస్య దుఃఖస్య దేహేన్ద్రియాది విశేషకరః రాగవేగ ఏవ హేతుః, స చ మిథ్యాజ్ఞానమూలః. నిరోద్ధవ్య ఇత్యుద్బోధితమ్. తత్రాపి ప్రత్యేకస్య శాస్త్రస్య అసాధారణో విషయః వర్తతే. యథా:- తర్కస్య ప్రమాణనిరూపణమ్; అర్థవిశేషమాత్రేణ ప్రకృతిప్రత్యయస్వరవర్ణవ్యుత్పాదనం వ్యాకరణస్య; ధర్మః మీమాంసాయాః; బ్రహ్మ చ వేదాన్తానామ్. ఏకం శాస్త్రమభ్యస్యన్ ఏకదేశజ్ఞానేన కదాచిత్ దురభినివేశస్య భాజనం భవతి. విచారశీలః పురుషః సర్వశాస్త్రసారసంగ్రహణేన ప్రశాన్తమనా విలసతి. సోఽయమన్నంభట్టః ఏవంశీలః సూక్ష్మార్థవిశదీకరణాయ విషయప్రాధాన్యేన ప్రవృత్తితాని శాస్త్రాణి సమాలోచ్య స్వయంకృతార్థః తచ్ఛాస్త్రవిజ్ఞానం సులభయా మనోజ్ఞయా చ పద్ధత్యా వినేయేష్వవతారయితుం వ్యాఖ్యాప్రకరణగ్రన్థరచనాయై ప్రవృత్తః వృత్తిః, మితాక్షరా, టీకా, సుబుద్ధిమనోహరా, సఙ్గ్రహః ఇత్యాది స్వవ్యాఖ్యాగ్రన్థనామభిః అర్థవిశదీకరణం సౌలభ్యేన విషయావబోధనం చైతదుద్దేశ్యం ప్రతీయతే.

తత్ర తర్కశాస్త్రేఽస్య సంగ్రహదీపికే ఆసేతుహిమాచలం శాస్త్రవ్యుత్పత్తిమభికాఙ్క్షద్భిః సర్వైరప్యధీయతే. 'కాణాదన్యాయమతయోః బాలవ్యుత్పత్తిసిద్ధయే, అన్నంభట్టేన విదుషా రచితస్తర్కసఙ్గ్రహః' ఇతి శ్లోకేన వైశేషికన్యాయదర్శనద్వయార్థః అత్రసఙ్గృహీత ఇతి స్పష్టమేవ గ్రన్థకర్త్రా నిర్దిశ్యతే. "ధర్మవిశేషప్రసూతాద్ ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయానాం పదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వ

జ్ఞానాన్నిశ్శ్రేయస"మితి కణాదసూత్రాత్ "ప్రమాణప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాన్త సిద్ధాన్తావయవతర్కనిర్ణయవాద జల్పవితణ్డాహేత్వాభాస చ్ఛల జాతినిగ్రహస్థానానాం తత్త్వజ్ఞానాన్నిశ్శ్రేయసాధిగమః. ఇతి న్యాయసూత్రాచ్చ పదార్థతత్త్వజ్ఞానం నిశ్శ్రేయసహేతురితి ఐకరూప్యేణ ప్రతిపాదనాత్ అనయోర్దర్శనయోః ఏకశాస్త్రత్వేన పరిగణనమ్. తర్క్యన్తే ప్రతిపాద్యన్తే ఇతి తర్కాః పదార్థాః. తేషాం వ్యుత్పాదకం శాస్త్రమితి తర్కశాస్త్ర వ్యవహారాశ్చ. పరమాణుద్వయ సంయోగాద్ ద్వ్యణుకాదిక్రమేణ సృష్టిరితి ఆరమ్భవాదః. ఈశ్వరః నిమిత్తకారణమితి చ ఉభయత్ర సమ్మతః. షోడశపదార్థానాం సప్తస్వేవాన్తర్భావః. ఆత్మశరీరేన్ద్రియార్థబుద్ధిమనః ప్రవృత్తి దోషప్రేత్యభావఫలదుఃఖాపవర్గాస్తు ప్రమేయమ్. ప్రవృత్తిః ధర్మాధర్మౌ రాగద్వేషమోహా దోషాః, రాగఇచ్ఛా, ద్వేషో మన్యుః, మోహః శరీరాదావాత్మభ్రమః. ఇత్యాదినా దీపికాయాం దిశా ప్రదర్శితః. ప్రమాణనిరూపణావసరే న్యాయదర్శనోక్తం ప్రమాణ చతుష్టయం స్వీకృతమ్. యతః వైశేషికదర్శనస్య న్యాయ దర్శనమ్ పూరకమ్. పరిచ్ఛేదవిభాగః నవ్యన్యాయ ప్రవర్తక శ్రీ గఙ్గేశోపాధ్యాయ, రఘునాథశిరోమణి, గదాధర భట్టాచార్యాణామ్ పదాన్యనుగచ్ఛతి. తర్కసఙ్గ్రహదీపికయోః బాలగదాధరీ ఇత్యపి వ్యవహారః తత్రతత్ర దృశ్యతే. తయోశ్చ మూలటీకాగ్రన్థయోః బహ్వ్యః వ్యాఖ్యాః న్యాయబోధినీ నీలకణ్ఠీయాదయః. ప్రమాణశాస్త్రత్వాదస్య ప్రమాణస్వరూప వివేచనం మతభేదేన క్రియతే. ప్రత్యక్షమేకం చార్వాకాః. ప్రత్యక్షానుమానే ద్వే ప్రమాణే ఇతి కాణాదాః. ప్రత్యక్షానుమాన శబ్దాః త్రయః ప్రమాణానీతి సాంఖ్యాః, ప్రత్యక్షానుమానోపమానశబ్దాశ్చత్వారి ప్రమాణానీతి నైయాయికాః. ప్రత్యక్షానుమానోపమాన శబ్దార్థాపత్త్యనుపలబ్ధయః షట్ ప్రమాణానీతి మీమాంసకాః. సంభవైతిహ్యాభ్యాం అష్టావితి పౌరాణికాః, చేష్టయా సహ నవ ప్రమాణానీతి భరతః. పీనో దేవదత్తః దివా న భుఙ్క్తే ఇతి అర్థాపత్తేరుదాహరణమ్. దేవదత్తస్య పీనత్వం రాత్రిభోజనం గమయతి. అతః అస్య అనుమానేఽన్తర్భావః. శతే పఞ్చాశన్న్యాయేన శతజ్ఞానం పఞ్చాశజ్జ్ఞానజనకం సమ్భవ ప్రమాణమ్. అస్యాప్యనుమానేఽన్తర్భావః. ఇహ వటే యక్షః తిష్ఠతీతి అజ్ఞాతమూల వక్తృకః ప్రవాదః ఇతిహ్యమ్. కదాచిత్ప్రామాణం శబ్దేఽన్తర్భావః. గమనాఽఽగమనాది జ్ఞానజనికాః కరచరణ నయనాదిచేష్టాః శబ్దాను

మానద్వారా ప్రమాణం న సాక్షాత్. అతః ప్రత్యక్షానుమానోపమానశబ్దాః తార్యేవ ప్రమాణాని. తత్ర పీలుపాకవాదః — పీలుషు పరమాణుష్వేవ పాక ఇతివాదః కాణాదానామ్. పిఠరపాకవాదః — పిఠరేషు తేషు అవయవిని పాక ఇతివాదః నైయాయికానామ్. ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనరూప పఞ్చావయవన్యాయః, వాదజల్పవితణ్డాత్మికా కథాసరణిః హేత్వాభాసా బద్ధా; పరప్రయుక్తహేతుషు దోషోద్భావనద్వారా పరాజయస్వవిజయ తత్త్వనిర్ణయోపయోగినో హేత్వాభాస ఛలజాతినిగ్రహస్థానాని చ అత్ర వివృతాని.

వ్యాకరణశాస్త్రే మహాభాష్యప్రదీపోద్యోతనపఙ్క్తియుత వ్యాఖ్యానస్య అస్య ప్రశంసాపదమ్. వ్యాకరణాచార్యేషు మహామునిషు పాణిని కాత్యాయన పతఞ్జలిషు యథోత్తరం మునీనాం ప్రామాణ్యం. "మహాభాష్యం వా పాఠయేత్ (పఠనీయమ్) మహారాజ్యం వా పాలయేత్" ఇతి అస్య ప్రశస్తిః. గ్రన్థతోఽర్థతశ్చ మహిమాన్వితే ఇష్ట్యాది ఘటితత్వేన స్వతన్త్రే శబ్దసాధుత్వాన్వాఖ్యాన పరమప్రమాణభూతే గభీరే భాష్యేఽపి స్పష్టం. భావవిశదీకరణం మనోహరయా శైల్యా బహుముఖ ప్రజ్ఞాధురీణస్య అస్యైవ యుజ్యతే. నాగేశభట్టాత్పూర్వోఽయం. నను అథాతో ధర్మజిజ్ఞాసా, అథాతో బ్రహ్మజిజ్ఞాసా, అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః, అథ యోగానుశాసనమ్, అథ త్రివిధదుఃఖాత్యన్తనివృత్తిరత్యన్త పురుషార్థః. తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసాధిగమ ఇతి సర్వత్ర శాస్త్రాదౌ సూత్రకృతైవ ప్రయోజనముక్తమ్. అత్ర తు కథం నోక్తమితి శఙ్కాముద్భావ్య శాస్త్రేణ ప్రయోజనవతా భావ్యమ్. నతు ఆదౌ నిర్దేష్టవ్యమ్. శాస్త్రప్రవృత్తస్య ప్రయోజన జ్ఞానం తస్మాచ్చ శాస్త్రప్రవృత్తిరిత్యన్యోన్యాశ్రయాపాతాదితి సమాహితవాన్. వివక్షితమర్థం హేతువాదోపష్టమ్భేన నిస్సంకోచం గ్రథ్నాతి. 'పురాణమిత్యేవ న సాధు సర్వమ్' ఇతి కాళిదాసోక్తిం తత్ర తత్రోల్లిఖతి. బాధేఽర్థ్యధేఽన్యస్య సామర్థ్యమ్? ధృఢేఽన్యదపి బాధ్యతామ్ న్యాయం న స్ఫురయతి చ. ప్రాయః వ్యధికరణే తర్కవ్యాకరణేఽత్ర సామానాధికరణ్యం భజతః. అథాపి శాస్త్ర సమ్ప్రదాయాన్ యథావదనుపాలయతి. తర్కఏవ ప్రథమాన్తముఖ్యవిశేష్యకబోధః, శబ్దానిత్యత్వం చ వ్యాకరణే చ నిత్యస్ఫోట శబ్దాభ్యుపగమః ధాత్వర్థముఖ్య విశేష్యకబోధశ్చ స్వీకృతః. న సిద్ధాన్త సఙ్కీర్ణతా కృతా. కదాగం పాణిని

యంచసర్వశాస్త్రో పకారకమితిఉభయోఃశాస్త్రయోఃఆవశ్యకతాంవిశిష్టతాం చ ప్రత్యభ్యజానాత్. తర్కశాస్త్రం హి నిర్వచన పరిష్కార కౌశల, బుద్ధి నైశిత్య, వాదపాటవసముపార్జనాది బహుప్రయోజనకమ్. వ్యాకరణ శాస్త్రంహి ప్రకృతిప్రత్యయ వ్యుత్పాదనేన శక్తిగ్రాహకమ్, నిఖిలశాస్త్ర సంరక్షకమ్. ముఖంవ్యాకరణం స్మృతమితి వేదాఙ్గేషు అస్యప్రాముఖ్యమ్. ప్రయోజనాని చ వ్యాకరణస్య బహూని పస్పశాహ్నికే భగవతా పతఞ్జలి నోక్తాని. ఉక్తంచ అభియుక్తైః. యద్యపి బహునాధీషే తథాపిపఠపుత్రవ్యా కరణమ్, స్వజనశ్వజనోమాభూత్, సకలంశకలమ్ సకృత్శకృత్ ఇతి.

పూర్వమీమాంసాయాం తన్త్రవార్తికమ్ శ్రీశాబరభాష్య వివేచన పరం స్కన్దావతారత్వేన ప్రసిద్ధైఃకుమారిలపాదైర్విరచితమ్. తత్రసుబోధిన టీకా, భట్టసోమేశ్వరన్యాయసుధావ్యాఖ్యాచాస్య వాక్యన్యాయకోవిదత్వం ప్రకాశయతః. అన్యత్రవ్యాఖ్యానావసరే బహవఃపూర్వమీమాంసాన్యాయాః సంచాలితాః శాస్త్రాణాం విషయవ్యవస్థాచసమాదృతా. వేదాన్తశాస్త్రేషు బ్రహ్మసూత్రవృత్తిః మితాక్షరానామ్ని అన్వర్థా విపులార్థా దురధిగమం సూత్రార్థం జిజ్ఞాసమానానాం కృతేప్రవృత్తా. వివరణ భామతీ ప్రస్థానద్వ యాను రోధేన జిజ్ఞాసా సూత్రంవ్యాఖ్యాతమ్. సమన్వయసూత్రే అవిద్యా నివృత్తేః సత్త్వాఽనిర్వచనీయత్వ పఞ్చమప్రకారత్వపక్షాః వేదాన్తానాంజ్ఞాన విధిపరీత్వా భావశ్చ విశదీకృతాః. ప్రత్యధికరణం విషయసంశయ పూర్వో త్తర పక్షయుక్తిప్రకాశకైః లలితపదవిన్యాసైః హృదయఙ్గమయా చ శైల్యా అపరిసమాప్తేః బ్రహ్మసూత్రాణి వ్యాఖ్యాతాని.

అయం చ శివభక్తః శ్రీశఙ్కర భగవత్పాదీయా ద్వైతమతావ లమ్బీచ. తదిదం 'శివయోః' శాశ్వతైక్యం తనోతు శుభసన్తతమ్, నిదర్శ యితు మద్వైతం భజతామివసఙ్గతమ్' ఇతి మహాభాష్య ప్రదీపోద్ద్యోతన మఙ్గలారమ్భ శ్లోకాద్విదితుంభవతి. "సర్వాకారంనిరాకారం విశ్వాధ్యక్ష మతీన్ద్రియమ్. సదసద్రూపతాతీత మదృశ్యంమాయయావృతైః?" ఇతి కైయటమఙ్గలశ్లోకస్యసర్వాకారం=సర్వరూపమ్సర్వోపాదానమితియావత్; అనాకారం=వాస్తవాకారరహితమ్.విశ్వాధ్యక్షమ్=విశ్వసాక్షిణమ్.సత్= పృథివ్యాదిత్రయమ్. అసత్= వాయ్వాకాశౌతద్విలక్షణమ్. సర్వాకారం విశ్వాధ్యక్షమితి అభిన్న నిమిత్తోపాదనత్వం తటస్థలక్షణముక్తమ్. తేనసత్య

జ్ఞానాస్వాది రూపం స్వరూపలక్షణం సూచితమ్. జ్ఞానలోచన సంలక్ష్యమ్ తత్త్వమస్యాదివాక్య జన్యాఖణ్డ సచ్చిదానన్ద బ్రహ్మాకార వృత్తిః జ్ఞానమ్ తదేవ లోచనమ్ తేన సంలక్ష్యమిత్యాదినా అద్వైత సిద్ధాన్తానుసారేణ వాముపావ్యాఖ్యాకృతా. ఏవం చతుర్ణాం శాస్త్రాణామర్థేషు వ్యాఖ్యానేషు చ అన్నం భట్టః. భట్టః = సకల శాస్త్రజ్ఞ ఇత్యన్వర్థః. తత్వజ్ఞానోత్కర్షార్థ శాఽవాప్తయే తర్కవ్యాకరణమీమాంసావేదాన్తానాముపయోగిత్వం మనుతే. అంశతస్సమ్మతిః పరస్పరం సహకారశ్చ శాస్త్రాణాం దృష్టా. యథా:— తత్త్వజ్ఞానాన్నిశ్శ్రేయ సమిత్యత్ర వేదాన్త తర్కయోః పూర్వోత్తరమీమాంసయోశ్చ ఉపక్రమాదిభిః వాక్య తాత్పర్యనిర్ణాయకత్వే వ్యాకరణస్య పదశాస్త్రత్వేన వేదాఙ్గత్వేన చ వాక్యశాస్త్రే, అస్య న కేచనచిద్వివాదః వ్యుత్పత్తి ప్రదర్శన పరత్వాత్. యత్ర వా శాస్త్రాణాం ప్రక్రియాభేదః యథాధర్మాదనుష్ఠియ మానాత్ పురుషార్థః పూర్వమీమాంసాయాం జ్ఞానాదుత్తరమీమాంసాయాం తత్ర విషయ వ్యవస్థయా విరోధస్సుపరిహారః. క్వచిత్ కల్పభేదేన. లౌకిక వైదిక వాక్య భేదేన వ్యవస్థా. అతః ప్రథమాన్తార్థ ధాత్వర్థాఖ్యాతార్థ ప్రధానం ఖణ్డార్థబోధభేదాః న శాస్త్రాణా మప్రామాణ్యమావహన్తి. అవిరోధాంశేన సముదితానాం నానాశాస్త్ర సంస్కారాణాం తత్త్వజ్ఞానార్థత్వే ఫలే నిష్పన్నే ప్రక్రియాంశే భేదః న దోషావహో భవతి. తదేవ మన్నం భట్టస్య వైదుష్యమ్ బహుముఖం లోకస్య జ్ఞాననేత్రోన్మీలనాయ సమ్పద్యత ఇతి.

శమ్.

# 4. సభాపతి నాగేశభట్టు

శ్రీ సూరి రామకోటిశాస్త్రి

భారతీయ సంస్కృతి విజ్ఞానదీప్తుల నలుగడల ప్రసరింపఁజేసిన మహామహులలో శ్రీ నాగేశభట్టు ఒకరు. ఈ మహనీయుడు పండితవంశమున జన్మించినవాఁడు. తండ్రి శివభట్టు, తల్లి సతీదేవి. శ్రీహరి దీక్షితోపాధ్యాయులవద్ద విద్యనభ్యసించెను. వాగీశ్వరీ సముపాసనమున బహుశాస్త్రపారంగతుఁడు, మహావైయాకరణుఁడని గణుతికెక్కినవాఁడు.

వ్యాకరణశాస్త్రమునకు ప్రవర్తకులు శ్రీపాణిని కాత్యాయన పతఞ్జలి మహర్షులు. "యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్." శబ్దసాధుత్వ నిర్ణయమున పతంజలి మహాముని వచనమే తుదిమాట. పతఞ్జలి శేషావతారమని ప్రసిద్ధి. నాగేశభట్టు పతఞ్జలి మహాభాష్య గూఢాశయముల నావిష్కరించుటలో దిట్ట. ఇందువలన ఈయన పతంజలి అంశావతారమని వైయాకరణులు భావించుచున్నారు. ఇంత మన్ననకు గురియైన నాగేశభట్టు "విద్వదగ్రణి" యనుటలో నేరికిని సందేహము లేదు.

ఈ మహానుభావుఁడు పావనగంగాతీరమున వారణాసి నివాసముగాఁ జేసికొని శ్రీమదన్నపూర్ణావిశ్వేశ్వరుల సేవించుచు ప్రవచనముచే శిష్యప్రశిష్య గణమును వర్ధిల్లచేసి విద్యావంశమును విస్తరింపఁజేసిన మహోపాధ్యాయుడు. వారణాసి పుణ్యక్షేత్రమే కాక విద్యాక్షేత్రముగూడ నగుటం జేసి యచటజరుగు విద్వత్సభలలో సభాపతిపదము నధిష్ఠించివాదోపవాదములందు జయాపజయముల నిర్ధరించువాఁడు.

ఈతడు శ్రీవాచస్పతి మిశ్రునివోలె బహుముఖప్రజ్ఞాశాలి. వ్యాఖ్యానకళావిశారదుఁడు. వ్యాకరణశాస్త్రమునందేకాక సాంఖ్య, యోగ, వేదాన్త, అలంకార, ధర్మశాస్త్రములందు కూడ అనేక గ్రంథముల రచించెను. అవి యెవ్వి యనగా –

1. భాష్యప్రదీపోద్ద్యోతము.
2. బృహచ్ఛబ్దేన్దు శేఖరము,

3. లఘు శబ్దేన్దుశేఖరము.
4. పరిభాషేన్దుశేఖరము.
5. బృహన్మఞ్జూష.
6. లఘుమఞ్జూష.
7. పరమలఘుమఞ్జూష.
8. సాఙ్ఖ్యసూత్రవృత్తి.
9. యోగసూత్ర వృత్తి.
10. వేదాన్త సూత్రవృత్తి.
11. కావ్యప్రకాశ ప్రదీపోద్ద్యోతము.
12. రసగఙ్గాధర మర్మప్రకాశిక.
13. సప్తశతటీక.
14. ప్రాయశ్చిత్తేన్దుశేఖరము.
15. రసతరఙ్గిణీ టీక.
16. పరమార్థసార వివరణము మొదలగునవి.

"మనోరమా శబ్దరత్నము"నుకూడ తానే రచించి గురుపూజా మహోత్సవ సందర్భమున వారికి సమర్పించుటచే నేడు ఆ గ్రంథము శ్రీహరి దీక్షిత విరచితమని ప్రసిద్ధి గాంచినది. ఇన్ని గ్రంథములు రచించినను "శబ్దేన్దు శేఖరం పుత్రం మఞ్జూషాంచైవ కన్యకామ్, స్వమతౌ సమ్యగుత్పాద్య శివ యోరర్పితౌమయా." అని మఞ్జూషాగ్రన్థాన్తమున చెప్పుకొని యుండుటచే, శబ్దేన్దుశేఖరమఞ్జూషాగ్రంథముల విశేషప్రణిధానముతో రచించినట్లు కన్పిం చును. జీవితకాలమంతయు గ్రంథరచనలోనే గడపి పుత్రునివలన కలుగు సద్గతిని కన్యాదానఫలము ననుగ్రహించుటకై పరమేశ్వరుని యీతఁడు ప్రార్థించినాడు. ఈ రెండును వ్యాకరణశాస్త్రనిబంధన గ్రంథములగుటచే వ్యాకరణము యీయనకు అభిమానశాస్త్రము. ప్రకృతిప్రత్యయ వివేచన ముతో అర్థవిశేషము నాధారముగా లౌకిక వైదిక శబ్దసాధుతా నిర్ణాయ కము వ్యాకరణము.

పాణిని అష్టాధ్యాయి. ధాతుపాఠ గణపాఠ ఉణాదిలిఙ్గాను శాసన ముల రచించెను. అందు అష్టాధ్యాయికి శబ్దానుశాసనమని పేరు. ఈ రచన ప్రపఞ్చ మేధావులకే మిక్కిలి ఆశ్చర్యము కలిగించినది. అష్టాధ్యాయీసూత్ర

క్రమమునను సరించి కాశికావృత్తి మొదలగు గ్రంధము లసాధుశబ్ద పరిజ్ఞాన మునకై ముందు బయలుదేరినవి. ప్రక్రియాక్రమము ననుసరించి రూపావతార ప్రక్రియాకౌముది గ్రంధముల తరువాత శ్రీ భట్టోజీ దీక్షిత వైయాకరణ సిద్ధాన్తకౌముది వెలసి బహుజనాదరణ పొందినది. దీని వ్యాఖ్యానమే శబ్దేన్దుశేఖరము. ఇది గ్రంథకర్త వ్యాఖ్యానమగు మనోరమకంటె సిద్ధాన్త ప్రతిపాదనమున మిన్నగా పరిగణింపఁ బడుచున్నది. ఇది గాక ఈయనచే రచింపఁబడిన శబ్దరత్నపరిభాషేన్దుశేఖర మహాభాష్య ప్రదీపోద్ద్యోతములు వ్యాకరణశాస్త్ర పఠన-పాఠన క్రమములో నేటికి ఆసేతుహిమాచలము వ్యాప్తిలోనున్నవి.

ఇఁక మఞ్జూషాగ్రంథమునుగుఱించి విచారింతము. ఇయ్యది వైయాకరణసిద్ధాన్త రత్నపేటిక; దార్శనిక గ్రంథము. వ్యాడి విరచిత 'సఙ్గ్రహము' మొదటి వ్యాకరణ దర్శనగ్రంథము. అచ్చటచ్చట దాని యుల్లేఖములు కన్పించుచున్నవి. కాని గ్రంథముత్పన్నము. తరువాత "అనాది నిధనం బ్రహ్మశబ్దతత్త్వం యదక్షరమ్. వివర్తతేఽర్థ భావేన ప్రక్రియా జగతో యతః." అని స్ఫోట శబ్దబ్రహ్మవాదము నుపపాదించుచు భర్తృహరి "వాక్యపదీయ"మును రచించెను. దాని నాధారముగాఁ జేసికొని యీ లఘు మఞ్జూష శాబ్దికమత పరిష్కారగ్రంథముగా వెలసినది. దీనితో వైయాకరణులకు శాబ్దబోధగ్రంథము లేదను కొఱత తీరినది. వ్యుత్పత్తివాద భాట్టదీపికలు పరమతానుసారి గ్రంథములు. ప్రథమాన్తార్థ ముఖ్యవిశేష్యక బోధ తార్కికులకు, ఆఖ్యాతార్థముఖ్యవిశేష్యకబోధ మీమాంసకులకు కాగా ధాత్వర్థముఖ్య విశేష్యకబోధ వైయాకరణతన్త్రసిద్ధము. "చత్వారి వాక్పరిమితాని పదాని" అను శ్రుత్యనుసారముగా -

"పరావాక్ మూల చక్రస్థా, పశ్యన్తీ నాభిసంస్థితా।
హృదిస్థా మధ్యమాప్రోక్తా, వైఖరీకణ్ఠదేశగా॥"

అని స్థాననిర్దేశముతో పరా పశ్యన్త మధ్యమా వైఖరీ వాఙ్నిరూపణము. 'అభ్యాసార్థే ద్రుతావృత్తిః మధ్యావై చిన్తనే స్మృతా, శిష్యాణాముపదేశార్థం వృత్తిరిష్టా విలమ్బితా' అను రీతిగా వృత్తిభేద ప్రదర్శనము. నాద-బిన్దు-స్వరూప వివేచనముతో వేదాన్త సిద్ధబ్రహ్మనామరూప నరపశు సరీసృపాద్ధి వ్యాకరణముఖ్యాలె స్ఫోటశబ్ద బ్రహ్మవర్ణపదవాక్య మహావాక్య

వ్యాకరణము అని వివరించిన సమన్వయము "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిర్నహి సందేహాదలక్షణమ్" మొదలగు పరిభాషలను సర్వసంబద్ధసామాన్యధాత్వర్థ నిర్ణయము శాబ్దార్థశక్యత్వము మఞ్జూషాగ్రంథమునందలి విశేషములుగా గ్రహింపదగును.

ఇక పరిభాషేన్దుశేఖరమును గురించి ఒకమాట. అన్యగ్రంథస్థములగు పరిభాషలను విధివాక్యబోధ. దానికై పరిభాషార్థ నిష్కర్షయుపయోగము. శాస్త్ర సమగ్రదృష్టితో వ్యవస్థచేసి నాగేశుఁడు సంస్కృతశాస్త్రయోగులకు లోకమునకు మహోపకారము చేసినాడు. శాస్త్రమునకు పుష్టి చేకూర్చినాడు. ఇందు వాచనిక జ్ఞాపక న్యాయసిద్ధ పరిభాషలు వ్యాఖ్యానింపఁబడినవి.

"పాతఞ్జలే మహాభాష్యే కృతభూరి పరిశ్రమః
నత్వాఫణీశం నాగేశః కురుతేఽర్థప్రకాశకమ్."

అని శేఖరమందు తనకు వ్యాకరణశాస్త్రగ్రంథ ప్రణయనసామర్థ్యము మహాభాష్య వ్యాసఙ్గము వలన కలిగిన దని చెప్పినను "పాతఞ్జలే" అనుచోట చిత్తమాలిన్యాపనోదకమగు యోగము సూచింపఁబడుచున్నది. నాగేశుఁడు పతఞ్జలి యోగసూత్రములకు వ్యాసభాష్య వాచస్పతి టీకలు వెలువడిన పిమ్మట "వృత్తి"ని ఈ విషయప్రాముఖ్యము ననుసరించి రచించెను. ఈ గ్రంథము విశ్వవిద్యాలయ పాఠ్యభాగముగా చాలకాలమునుండి గైకొనఁబడుచున్నది. సాఙ్ఖ్యసూత్రవృత్తిని గూడ లిఖించుటంజేసి యీయనకు సేశ్వర నిరీశ్వర సాంఖ్యములు కణ్ఠములు. ఈయనచే రచింపఁబడిన ప్రాయశ్చిత్తేన్దుశేఖరము ధర్మశాస్త్రము. సప్తశతీటీక మన్త్రశాస్త్రము. వేదాన్తసూత్రవృత్తి బ్రహ్మమీమాంసయే కదా! న్యాయశాస్త్రము రామరామభట్టాచార్యులు వారి వద్ద నభ్యసించి పదార్థనిర్వచన పరిష్కార కౌశలము నలవరచుకొనినాడు. ఇట్లు షట్ఛాస్త్రములందు పాణ్డిత్యము గడించుటచే కాల వ్యాఖ్యాటీకారూపమున విజ్ఞానమును బహుముఖముగా అనేకవిశేషములతో నుగ్గడించినాడు. ఇక అలఙ్కారశాస్త్ర విషయము. ప్రాచీనాలఙ్కారశాస్త్ర గ్రంథములు ధ్వన్యాలోక కావ్యప్రకాశలు. అందు కావ్యప్రకాశమునకు ప్రదీపము గోవిన్దఠక్కురు వ్రాయగా ఉద్యోతమును పదిఉల్లాసములకు నాగేశుఁడు రచించినాడు. జగన్నాథవిరచిత రసగఙ్గాధరము

అలఙ్కారశాస్త్రమునకు మకుటాయమానము-పరిష్కార గ్రంథము. దీనికి నాగేశుని మర్మ ప్రకాశవ్యాఖ్య యవసర ముగుచోట మూలమునకు కొలది వివరణముచేయుచు 'అత్రేదంచింత్యమ్' అని బహుస్థలములలో గ్రంథ కర్తను గ్రంథమును విమర్శించును. సాహిత్యమున ప్రధానముగా పరిగణంప బడు ప్రతిభ, భావుకసాహిత్యమున ప్రధానముగా పరిగణింపబడు ప్రతిభ- భావుకతల కంటె యితర శాస్త్ర సంస్కారబలము మెండుగా నిందు కానవ చ్చుచున్నది. నాగేశుఁడు విజ్ఞాన దాయకములగు నీగ్రంథములను శృఙ్గిబేర పురాధీశ రామనృపాల పోషణముచే వ్రాయగలిగెను. ఈ విషయమును కృత జ్ఞతతో 'యాచకానాం కల్పతరో రరికక్ష హుతాశనాత్ శృఙ్గిబేర పురాధీ శాత్ రామతోలబ్ధ జీవికః'. అని ప్రతి గ్రంథమున ఉల్లేఖించు కున్నాడు.

మన మింతగా ఆయనను గుఱించి తెలిసి కొన్నను ఆయన పరిశ్రమ కానీ విజ్ఞానపు లోతుకానీ యీగ్రంథములను అధ్యయనము చేయనిది తెలిసి కొన జాలము. లక్ష్యజ్ఞానమునకు ఆవశ్యకమగు వ్యాకరణము చాలును. ఇన్ని గ్రంథము లెందుకు? సంస్కృత భాషను తక్క మఱియే యితర భాషలకైనా యింత వ్యాకరణము కలదా? అని ఆక్షేపించువారు కలరు. సంస్కృత వ్యా కరణము అన్ని భాషా వ్యాకరణముల వంటిది కాదని సమాధానము. అది యొక విద్య, దర్శనము, వేదాఙ్గము. అర్థజ్ఞ యిత సకలం భద్రమశ్నుతే". అర్థజ్ఞానము కలవాడు సమస్త శుభముల పొందును. ఆ అర్థజ్ఞానము వ్యాకర ణాధీనము.

'శక్తిగ్రహం వ్యాకరణోపమాన కోశాప్త వాక్యాద్వ్యవహారతశ్చ
వాక్యస్యశేషాద్వివృతే ర్వదన్తి సాంనిధ్యతః సిద్ధపదస్యవృద్ధాః'

అని శక్తి గ్రాహకములలో వ్యాకరణము-పేర్కొనబడినది. ధాతుపాఠము అర్థవిశేషమున ప్రత్యయ విధానమందులకే గదా! 'యద్యపి బహునాధీషే, తథాపి పఠపుత్ర వ్యాకరణం.'

'స్వజనః శ్వజనో మాభూత్ సకలం సకృత్ శకృత్' అనిపెద్దలు వాక్రు వ్వుచున్నారు. వ్యాకరణము ప్రకృతి ప్రత్యయ వ్యుత్పాదనము చేసి పదార్థ

జ్ఞానము కలిగింపగా పిమ్మట వాక్యార్థజ్ఞానము కలుగుచున్నది. పదార్థజ్ఞానమే లేనిచో వాక్యార్థజ్ఞాన మెట్లు?

"కాణాదం పాణినీయంచ సర్వశాస్త్రోపకారకమ్" ఇట్టి పాణినీయ వ్యాకరణమున విశేష పరిశ్రమ చేసి వేదశాస్త్ర పురాణేతిహాస కావ్య విజ్ఞానము నారయుటకై లోకమునకు మహోపకార మొనర్చిన—

సభాపతి నాగేశభట్టునకు
నమోవాకములు

# 5. రీతివాదము

## శ్రీ సూరి రామకోటిశాస్త్రి

సాహిత్య దర్శనము మహనీయ శ్రీ వాల్మీకి వ్యాస భారతాది మహర్షి ప్రవర్తితము. ఇది లోకయాత్రా ప్రదర్శకమగు సుకుమార దర్శనము. ఇందు కమనీయ కావ్యానుశీలనము కాననగును. 'సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం, ఏక మాపాత మధురం, అన్యదాలోచనామృతమ్ 'అను సూక్తిచే సంగీత సాహిత్యములలో సాహిత్యమునకు ఒకింత ఉన్నత స్థానమీయ బడినది. సాహిత్యము కళయా? శాస్త్రమా? దర్శనమా? అని యొక విచారముగలదు. హృదయఙ్గమమైన సాహిత్యము ఆనంద పారవశ్యమును తన్మయత్వమును, గూర్చుటం జేసి కళయగుచున్నది. అట్టిసాహిత్యములోని యసాధారణ విషయములను నియమములను పరిశీలించి నిరూపించునది సాహిత్య శాస్త్రములేదా అలఙ్కారశాస్త్రము. సంగీతము కళయైనను సంగీతశాస్త్రమున్నటుల నే సాహిత్యము కళయైనను సాహిత్య శాస్త్రమేర్పడినది. నియమ బద్ధముగా అపూర్వ విషయముల నావిష్కరించునది శాస్త్రము. తర్క శాస్త్రమునకు ప్రత్యక్షాది ప్రమాణములు వ్యాకరణ శాస్త్రమునకు సాధుశబ్దములు విషయములు. అట్లే సాహిత్య శాస్త్రమునకు రసభావగుణాలఙ్కారరీతి వృత్తిశయ్యాపాకాది సంవలితశబ్దార్థములు ప్రమేయము. ఇకదర్శనవ్యవహారము సాహిత్యమునకెట్లో పరామర్శించుదము. తత్త్వసాక్షాత్కారమున కుపయోగించునది దర్శనము. ఈ దర్శనములో కావ్య తత్త్వము-అనగా కావ్యములో సారభూతమగు నర్థము బహుముఖములుగా సాక్షాత్కరించినది. శ్రీ భామహ, దణ్డి, వామన, ఆనన్దవర్ధన, అభినవగుప్త, మహిమ భట్ట, కున్తక, క్షేమేంద్రాదులు 'గామానయ', 'పర్వతో వహ్నిమాన్ ధూమాత్', 'జబగడదశ్' మొదలుగాగల లోకశాస్త్ర శబ్దములకంటె సుందరముగా నుండు కావ్య శబ్దములందు విశేషము నారసిరి. రూపకోప మాద్యలఙ్కారముల వలన కావ్యమునకు శోభ చేకూరునని భామహుడు నుడివెను. ఇతనిది అలఙ్కార వాదము. తరువాత ఆచార్య దణ్డి నియతముగా, శోభను

చేకూర్పుటంజేసి గుణములు కావ్యతత్త్వములుగా గ్రహింపదగునని భావించెను. పలనగా అలంకారములు అనియతములు, కావ్యశోభాహేతువులు మాత్రమే. లోకమునగూడ అలంకారములకంటె గుణములకే ప్రాధాన్యము. పిమ్మట వామనాచార్యుల రీతి వాదము ప్రవర్తిల్లినది.

"రీతిరాత్మాకావ్యస్య" అని వామన సూత్రము. శైలి, రచన, సంఘటన నామములలో పలుగు ఒకవిధమగు కూర్పు కావ్యమున ప్రాధాన్యము వహించునని యీతని తలంపు. "విశిష్టా పదరచనా రీతిః" అని రీతి స్వరూప నిర్వచనము. 'పదరచనా' అని వినిపించుటచే శబ్దములకూర్పుగా పైకితోచినను అర్థవిన్యాసమునుగూడ గ్రహింపవలయును. ఇతడుసౌందర్యోపాసకుడు. కావ్యమునకు ఉపాదేయత సౌందర్యము చేతనేయని ఉపక్రమముననే నిర్ధరించెను. 'కావ్యంగ్రాహ్యమ్‌అలంకారాత్, సౌన్దర్యమలఙ్కారః'. ఇవి మొదటి రెండు సూత్రములు. దణ్డి భామహ గ్రంథములందు 'అలఙ్క్రియతే అనేన' అనుకరణ వ్యుత్పత్తిచే ఉపమారూపకాది పరముగా వాడఁబడిన 'అలఙ్కార' శబ్దము 'అలఙ్కృతిరలఙ్కారః' అని భావ వ్యుత్పత్తిచే నిట సౌందర్యపరముగా గ్రహింపబడినది. ఈ యర్థమును పురస్కరించుకొనియే కావ్యతత్త్వమును నిరూపించు వాదములు ఎన్నిబయలుదేరినను వానిలో రసధ్వని వాదములకు ప్రాధాన్యము చేకూరినను అలఙ్కారశాస్త్రనామధేయ మన్నింట యనువర్తించు చున్నది. అన్ని వాదములలోను కావ్యసౌందర్యమే లక్షింపఁబడినది గదా! వామనుడు శబ్దార్థమయ కావ్యమున రీతిని ఆత్మశబ్దముచే పేర్కొని రీతికి అనితరసాధారణ్యమును ప్రతిపాదించెను. శరీరమున ఆత్మయే గదా ప్రధానము. సారమగు తత్త్వము కావ్యమున రీతియే. ఇతడు పూర్వ వాదములందు ఎన్నినగుణాలంకారములను దోషహానముతో చేర్చి సౌందర్య హేతువులుగా పేర్కొనెను. 'సదోషగుణాలఙ్కార హానాదానాభ్యామ్, కావ్యశోభాయాః కర్తారో ధర్మాగుణాః, తదతిశయహేతవస్త్వలఙ్కారాః' దోషములు కావ్యసౌభాగ్యమును చెఱచును కావున దోషహానముకూడ ఆదరణీయము.'తదల్పమపినోపేక్ష్యం కావ్యేదుష్టంకథంచన, స్యాద్వపుస్సున్దరమపి శ్విత్రేణైకేనదుర్భగమ్'. అఙ్గనాశరీరము సున్దరమైనను బొల్లియున్నచో పరిగ్రాహ్యముగాదు. గుణాలఙ్కారములలోగూడ గుణములకు ఉత్తమ స్థానము. "యువతేరివరూపమఙ్గ కావ్యంస్వదతే శుద్ధగుణంతదప్యతీవ. విహిత

ప్రణయం నిరన్తరాభిః సదలఙ్కార వికల్ప కల్పనాభిః - యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యః వపురివ యౌవన వన్ధ్యమఙ్గనాయాః. అపిజనదయితాని దుర్భగత్వం నియతమలఙ్కరణాని సంశ్రయన్తే.'' గుణములు ముఖ్యములు. అలంకారములు లేకున్నను వీనివలన కావ్యమునకు శోభయేర్పడును. గుణములు లేనిదే కేవలము అలఙ్కారములవలన కావ్యస్వరూపమేర్పడదు. అఙ్గనకు యౌవనమున్నమీదట ఆభరణములు అందమును మఱింత గూర్చును. కాని కేవలాభరణములుగాదు గదా! 'విశేషోగుణాత్మా, ఓజః ప్రసాద సమతామాధుర్య సౌకుమార్యోదారతార్థ వ్యక్తికాన్తయో బన్ధగుణాః తయేవార్థగుణాః' బన్ధః-పదరచనా. వామనుడు ఓజః ప్రసాదమాధుర్యాది శబ్దగుణములను పదింటినిఁ బేర్కొని యూగక, ఆనామములతోనే అర్థ గుణములనుగూడ నిర్వచించి ఉదాహరణల నిచ్చుటచేత, అర్థవిన్యాసమునకు రీతిలో స్థానమియ్యఁబడినది. 'సా త్రివిధా, వైదర్భీ గౌడీయా పాఞ్చాలీచ' విదర్భాదిషు దృష్టత్వాత్ తత్సమాఖ్యా సమగ్రగుణావైదర్భీ-ఓజః కాన్తిమతీ గౌడీయా మాధుర్యా సౌకుమార్యోపపన్నా పాఞ్చాలీ,-అని రీతివిభాగ మొనరించి 'తాసాంపూర్వా గ్రాహ్యగుణసాకల్యాత్-నపునరితరేతస్తోకగుణత్వాత్' అని వామనుడు వైదర్భీరీతికి ప్రాముఖ్యమిచ్చి కావ్యాత్మను వ్యవస్థీకరించెను. వైదర్భీరీతిని ఆరోహించుటకు కవులు గౌడీయపాఞ్చాలీరీతుల నభ్యసించుటనుగూడ అఙ్గీకరింపలేదు. ''తత్తునఅతత్త్వశీలస్య తత్త్వానిష్పత్తేః. నశణసూత్ర వానాభ్యాసే, త్రసర సూత్రవానవైచిత్ర్యలాభః.'' పైగా గోతములు నేయువానికి బట్టలు నేయుట చేతనగునా యనెను.

వైదర్భీరీతికుదాహరణము:- కాళిదాసశాకున్తలము.

శ్లో॥ గాహన్తాం మహిషానిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమన్థమభ్యస్యతు
విస్రబ్ధైః క్రియతాం వరాహపతిభిః ముస్తాక్షతిః పల్వలే
విశ్రాన్తిం లభతామిదంచ శిథిలజ్యాబన్ధమస్మద్ధనుః.

గౌడీయరీతి :—

దోర్దణ్డాఞ్చిత చంద్రశేఖర ధనుర్దణ్డావభఙ్గోద్యత
ష్టఙ్కారధ్వనిరార్య బాలచరిత ప్రస్తావనా డిణ్డిమః
ద్రాక్పర్యస్తకపాల సంపుటమిలద్బ్రహ్మాణ్డభాణ్డోదర
భ్రామ్యత్పిణ్డిత చణ్డిమాకథమహో నాద్యాపివిశ్రామ్యతి.

పాఞ్చాలీరీతి :—

గ్రామేఽస్మిన్ పథికాయ పాన్థవసతిర్నైవాధునాదీయతే
రాత్రావత్రవిహారమణ్డపతలే పాన్థః ప్రసుప్తో యువా
తేనోత్థాయఖలేన గర్జతిఘనే స్మృత్వాప్రియాంతత్కృతం
యేనాద్యాపి కరఙ్కదణ్డపతనాశఙ్కీజనస్తిష్ఠతి.

ఇవిగాక మహాకవి కావ్యములనుండి యెన్నియెనియు ఉదాహరణ ముల నివ్వవచ్చును.

తన్వీమేఘ జలార్ద్రపల్లవతయా ధౌతాధరేవాశ్రుభిః
శూన్యేవాభరణైః స్వకాల విరహాద్విశ్రాన్తపుష్పోద్గమా
చిన్తామోహ మివాస్థితా మధువిహాంశబ్దైర్వినాలక్ష్యతే
చణ్డీమామవధూయ పాదపతితం జాతానుతాపేవసా.

ఊర్వశిలతాభావము నొందినపుడు పురూరవుని వచనము మఱి యొకటి :—

దృష్టైకాసన సంస్థితే ప్రియతమే పశ్చాదుపేత్యాదరాత్
ఏకస్యానయనేనిమీల్య విహితక్రీడాను బన్ధచ్ఛలః
ఈషద్వక్రితకన్ధరః సపులకః ప్రేమోల్లసన్మానసాం
అన్తర్హాసలసత్కపోలఫలకాంధూర్తోఽపరాంచుమ్బతి.

వైదర్భిరీతి ప్రశంస మఱియొకచో నిట్లు చేయబడియున్నది:

అస్పృష్టాదోషమాత్రాభిః సమగ్రగుణగుమ్ఫితా
విపఞ్చీస్వర సౌభాగ్యా వైదర్భీరీతిరిష్యతే॥

‘తస్యామర్థగుణసంపదాస్వాద్యా’. వైదర్భీరీతిలో అర్థగుణ సంపద ఆస్వాద యోగ్యముగా నుండును. ‘తదుపారోహాదర్థగుణలేశోపి’ అర్థలేశము కూడ వైదర్భీరీతినధిరోహించి సహృదయ హృదయరంజకమగును. రేఖలందు చిత్రమువలె ఈ మూడు రీతులతో కావ్యము ప్రతిష్ఠితము.

ఈరీతివాదములో మాధుర్య సౌకుమార్యాది గుణముల కాశ్రయముగా సంఘటన ప్రాధాన్యము వహించి శబ్దార్థమయ కావ్యమున వ్యాపించి యుండునని నిరూపించఁబడినది. గుణాలంకార వాదములలో కావ్యమునకు విశిష్టతను కూర్చునవి పరతన్త్రతత్వములు. గుణములు అలఙ్కారములు శబ్దార్థముల నాశ్రయించి మనగలిగినవి. రీతిఆత్మగా నిర్దేశింపబడుటచే స్వతన్త్ర తత్వము. గుణాలఙ్కార శోభితములగు కావ్యశబ్దములు, కావ్యార్థములు విలక్షణములు. మలయపవన చన్ద్రోదయకోకిల కూజితాది వర్ణనలు కావ్యత్వ సంపాదకములు అనుభావము పూర్వవాదములలో సాధారణముగ తోచునేగాని ఘటనా వైచిత్ర్యమునకు తగుస్థాన మీయఁబడలేదు. రీతివాదములో సన్నివేశసౌందర్యము లక్షితము‘అస్త్యుత్తరస్యాందిశిదేవతాత్మా’-కావ్యవాక్యము. ఉద్యానేపుష్పాణిసన్తి-లోకవాక్యమే. విలసన్తి అన్నచో రమణీయము. దోషములుగుణ విపర్యయ స్వభావము కలవైనను సౌకర్యముకొఱకు వివరింపబడినవి.గుణములు సద్రూపములేగాని శబ్ద పాఠధర్మములుగావు.’ “దీప్తరసత్వం కాన్తిః” అనికాన్తిగుణమును నిర్వచించినందువలన రసస్ఫూర్తి కాన్తిగుణ ధర్మమని యితనిభావము. ఈవిధముగారీతివాదమును ప్రవర్తింపఁజేసినవామనాచార్యుడు ప్రాసఙ్గికముగా కావ్యసమయమును శబ్ద శుద్ధిని ప్రయోగ వైచిత్రిని కూడచూపి ప్రీతికీర్తికరంబగు కావ్యమును రచింపఁబూనిన కవిలోకమునకు మార్గదర్శకుఁడాయెను, అయితే అన్నిగుణములు కలది వైదర్భిరీతియేగదా! ఓజఃకాన్తులే గల గౌడీయరీతికానీ మాధుర్య సౌకుమార్యములేగల పాఞ్చాలిరీతికానీ కావ్యాత్మయగునా? కావ్యోదాహరణములందు అన్నిగుణములు నిరూపించుట సంభవమా? ఏవియోకొన్ని గుణములున్న చాలుననుచో‘అద్రావత్రప్రజ్వలత్యగ్నిరుచ్చైః’ అనునదిగూడ కావ్యముకావలసివచ్చుటలేదా? అను విమర్శకులకవకాశమున్నది- కావ్యప్రకాశకారుడు విమర్శించి యున్నాడుకూడ. అయినను నీరీతివాదము కావ్యవిమర్శనాత్మకమైన సాహిత్య దర్శనమున వాదములలో మూడవ స్థానమలంకరించి ధ్వని,

రస, కావ్యానుమితి, వక్రోక్తి, ఔచిత్యము, అను విశేషములలో తరువాత బయలు దేరినవాదములకు అవకాశమును కల్పించుచున్నది. సంస్కృతమున ఉత్తమ సాహిత్యమును వెలయించి జ్ఞానజ్యోతిని లోకమున కందించిన శ్రీవాల్మీకి వ్యాసమహర్షులకు శ్రీకాళిదాసభవభూత్యాది మహాకవులకులాక్షణికులగు భరతాది మహామునులకును నమోవాకములు.

ప్రతిష్ఠా కావ్య బంధస్యయశసః సరణింవిదుః
అకీర్తి వర్తినీం త్వేవం కుకవిత్వ విదమ్బనామ్
కీర్తిం స్వర్గ ఫలామాహురా సంసారం విపశ్చితః
అకీర్తిం తు నిరాలోకనరకోద్దేశ దూతికామ్.
తస్మాత్కీర్తిముపాదాతు మకీర్తింతునిబర్హితుమ్
కావ్యాల ఙ్కార శాస్త్రార్థః ప్రసాద్యః కవిపుఙ్గవైః

ఇతిశమ్.

---

# 6. వక్రోక్తివాదము

శ్రీ సూరి రామకోటిశాస్త్రి

వక్రాను రంజనీముక్తిం చక్షుష్మామివ ముఖేవహన్
కున్తకః క్రీడతిసుఖం కీర్తిస్ఫటిక పఞ్జరే.

సాహిత్యదర్శనమున కవితారీతుల పరామర్శించి సౌందర్యమును లక్షించిన వాదములలో వక్రోక్తివాదమొకటి. విమర్శనాదృష్టితో కావ్యాను శీలనము గావించిన అలఙ్కార, గుణ, రీతివాదముల తరవాత శ్రీమదానంద వర్ధనాచార్య ధ్వనివాదము ప్రవర్తిల్లినది. అటుపిమ్మట ఈ వక్రోక్తి వాదముద్భవించినది, ఈ వాదమునకు ప్రవర్తకుడు శ్రీరాజానకకున్తకుడు. ఇతడు ''కావ్యస్యాఽత్మాధ్వనిః'' అనువాదము నారసియు సంతృప్తి చెందినట్లు కనిపించదు. ధ్వనివాదమున వ్యఙ్గ్యము ప్రాధాన్యము వహించి చమత్కారము గలిగించిన చాలును. కావ్యత్వము సిద్ధించును. శబ్దార్థసాహిత్యవిచారణతో అంతగా పనిలేదు. ఈ లోపము సవరింప వలయునని కున్తకుని తలంపు. అందుచే నితడు నూతన ప్రస్థానమును బయలు దేరదీసెను. శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని, బన్ధేవ్యవస్థితౌ కావ్యమ్ తద్విదాహ్లాదకారిణి'' అని తన కావ్యలక్షణమున శబ్దార్థసాహిత్య బంధములకు తగు స్థానమిచ్చి 'వక్రోక్తిరేవ వైదగ్ధ్యభఙ్గీభణితిరుచ్యతే, వక్రోక్తివైచిత్ర్యం జీవితాయతే'అని వైదగ్ధ్య భఙ్గీభణితి స్వభావముగల వక్రోక్తిని ప్రధానముచేసి కావ్య జీవితముగా పేర్కొనెను. చతురభాషణ రమ్యత, ఆకర్షణ, లోకోత్తర వైచిత్ర్యము కావ్యమునకు జీవము అని యితని సిద్ధాన్తము. ప్రతిభాశాలియగు కవి రమణీయ శబ్దార్థముల విచిత్రగుణా లఙ్కార సంపదతో నొకదానితో నొకటి స్పర్థతో నధిగమించునట్లు కూర్చ వలయును. ఇతని శబ్దములు శాకటిక శబ్దములవలె నుండరాదు. 'భణతరుణి మన్దిరమానన్దస్యన్ది సున్దరేన్దుముఖి! యదిసల్లీలోల్లాపిని! గచ్ఛసి తత్కిం త్వదీయంమే, అనుస్మరణన్మణిమేఖలమవిరత శిఞ్జానమఞ్జు మఞ్జీరం, పరిసరణ మరుణ చరణే రణరణకమకారణంకురుతే." ఇచ్చట కవి వర్ణసావర్ణ్య

సింహము ఉపసంహారముగా పలుకుటయుక్తమేగాని దీనికి జవాబుగాదిలీపుడు 'కథంచశక్యానునయోమహర్షేః విశ్రాణనాదన్యమనస్వినీనాం ఇమాం తనూజాం సురభేరవేహి రుద్రౌజసాతుప్రహృతంత్వయాస్యాం — ఇదికామధేనువు కూతురు, మఱియొకగోవునైతేప్రతివస్తు ప్రదానము చేయవచ్చునని సమ్మతించుట అనుచితము. ఇట్లే కుమారసంభవమున త్రివిష్టపాధిపతిముందుమన్మథుడు—"కామేకపత్నీవ్రతదుఃఖశీలాం, లోలంమనశ్చారుతయాప్రవిష్టాంనితమ్బినీమిచ్ఛసి ముక్తలజ్జాం, కణ్ఠేస్వయఙ్గ్రాహనిషక్తబాహుమ్" — అని అవినయానుష్ఠాననిష్ఠనువ్యక్తీకరించుట యనుచితము. అయినను దోషముసవాజనో కుమార్య ముద్రిత సూక్తిసౌందర్యమున కానరాదు. సహృదయులీ యనౌచిత్యమును గూడమెచ్చరు."అవ్యుత్పత్తికృతోదోషః శక్త్యాసంవ్రియతేకవేః! యస్త్వశక్తికృతోదోషఃఝటిత్యేవప్రతీయతే".ప్రతిభాదరిద్రులలనౌచిత్యము వెంటనే బయలుపడును. వక్రోక్తి జీవితకారునకు స్వభావోక్తి ఆదరాస్పదము గాదు."అలంకారకృతాంయేషాం స్వభావోక్తిరలఙ్కృతిః అలఙ్కార్యతయా తేషాం కిమన్యదవతిష్ఠతే, స్వభావవ్యతిరేకేణ వక్తుమేవ నయుజ్యతే, వస్తుతద్రహితంయస్మాత్ నిరుపాఖ్యంప్రసజ్యతే, శరీరంచేదలఙ్కారః కిమలఙ్కురుతే పరమ్, ఆత్మైవనాత్మనః స్కన్ధం క్వచిదప్యధిరోహతి" అనిస్వభావోక్త్యలంకారము నిరసింపఁబడినది. ఉన్నదున్నట్లు చెప్పుటలో విశేషములేదు. అన్ని వాక్యములకు కావ్యత్వమఙ్గీకరింపవలసివచ్చును.పదిచెప్పినను స్వభావోక్తియే యగుటచే కావ్యాలఙ్కారము కాజాలదు.

కావ్యశబ్దములువేరు. అర్థములువేరు. వానినిచెప్పుపద్ధతి విచిత్రము. కవికుల క్షుణ్ణము. విలక్షణము. ఈవివరణచేశబ్దవైచిత్ర్యము మాత్రమే యుట వక్రోక్తిగాదని తెలిసది. ఇదిగాక "సాదృశ్యల్లక్షణా వక్రోక్తిః వక్రోక్తిః శ్లేషకాకుభ్యామ్'అనుఅలఙ్కారవిశేషమునుగానీ "సైషా సర్వత్రవక్రోక్తిరనయార్థో విభావ్యతే" 'అను సర్వాలఙ్కార సాధారణాతిశయోక్తిరూప వక్రోక్తిని కాని కున్తకుడు గ్రహింపలేదు. మఱింత వ్యాపకమగు నర్థమున యీ శబ్దమును ప్రయోగించెను.

"సాహిత్య మనయోశ్శోభా శాలితాం ప్రతికావ్యసౌ
అన్యూనానతి రిక్తత్వ మనోహారిణ్య వస్థితిః"

సహృదయ హృదయాహ్లాది సాహిత్యమున నీ వక్రత నానాప్రకారము వర్ణ విన్యాసమునందు, ధాతుప్రాతిపదికలందు ప్రత్యయములలో, వాక్యమున, ప్రకరణమున, ప్రబంధమునకాననగును. ఉదాహరణలు దిఙ్మాత్రముగా ప్రదర్శింపఁ బడుచున్నవి.

*1.* వర్ణవిన్యాసవక్రతా:- ప్రథమమరుణచ్ఛాయస్తావస్తతః కనకప్రభః. తదను విరహోత్తామ్యత్తన్వీకపోలతల ద్యుతిః, ప్రసరతితతో ధ్వాన్తక్షోదక్షమః క్షణదాముఖే, సరసబిసినీ కన్ద చ్ఛేదచ్ఛనిర్మృగలాఞ్ఛనః.

*2.* పూర్వార్ధవక్రతా:- రామోసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధింపరామ్" ఇట రామశబ్దములోకోత్తర శౌర్యాదై రాది పరముగా ప్రయుక్తమై శోభను గూర్చుచున్నది.

*3.* పర్యాయవక్రతా:-అఙ్గరాజ! సేనాపతే! రాజవల్లభ! రక్షైనంభీమాద్దుశ్శాసనమ్. దుశ్శాసనుని రక్షించుట అసమ్భవమని పలుకుభీమసేనుని సోపహాసవచనములు.ఇట్లే "ద్వయంగతం సంప్రతిశోచనీయతాం సమాగమః ప్రార్థనయాకపాలినః" లోకపాలిపదము.

*4* ఉపచారవక్రతా:- 'నిష్కారణం నికారకణికాఽపిమనస్వినాం మానసమాయాసతి - హస్తావచేయాంయశః'' స్తోకార్థక కణికా శబ్దము నికారమున, పుష్పాదులందు సంభవించు అవచయము యశస్సునందు ఔపచారికము రమ్యము. మూర్తధర్మ మమూర్తమునందారోపించబడినది.

*5.* విశేషణవక్రతా:- 'వ్రీడాయోగా న్నతవదనయా సన్నిధానే గురూణాంబద్ధోత్కమ్ప స్తనకలశయామన్యుమన్తర్నియమ్యతిష్ఠేత్యుక్తం కిమివనతయాయత్సముత్సృజ్యబాష్పం మయ్యాసక్తశ్చకిత హరిణీ హారినేత్రి త్రభాగః!' చకితహరి ణీహారియను క్రియా విశేషణము.

*6* క్రియావైచిత్రీ:- స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛస్వచ్ఛాయాయాసితేన్దవః త్రాయన్తాంవోమధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదోనఖాః - ఆర్తిచ్ఛేదన క్రియావైచిత్ర్యము ప్రాణము.

*7.* పురుషవైచిత్రి :- "అయంజనః ప్రష్టుమనాః" అహమని చెప్పవలసియుండగా యీజనమని పలుకుట.

*8.* వాక్యవక్రతా:- ఉపస్థితాం పూర్వమపాస్య లక్ష్మీం, వనం మయా సార్థమసి ప్రపన్నః త్వామాశ్రయం ప్రాప్య తయాఽనుకోపాత్ । సోఢాస్మి నత్వద్భవనే వసన్తీ॥ సీతాసందేశః- ఇపుడు నిష్కారణముగా పరిత్యజింపబడుచుంటిని. ఇది ఉచితమా ? నీవే స్వయముగా విచారింపుము.

*9.* ప్రకరణ వక్రతా:- ఉదాత్తరాఘవమున మాయామృగము వెంట మొదట లక్ష్మణుడు వెళ్ళగా వానిని కాపాడుటకు సీత శ్రీరాముని పంపుట. రాముని కాపాడుటకు లక్ష్మణుని పంపు అనౌచిత్యము పరిహరింప బడినది. ఇట్లే ముద్రారాక్షసమున రజ్జుహస్త పురుష ప్రవేశ ప్రకరణము.

*10.* ప్రబంధ వక్రతా:- రామాయణమహాభారతము లుదాహరణములు. కరుణశాన్తములు రసములు. విరసావసానముతో వైరాగ్యమును బోధించి పరమపురుషార్థ పర్యవసానము చేయుట. ఉత్తరకథావైరస్యమును పరిహరింప నెంచి కథైకదేశము నితిహాసాదులనుండి గ్రహించి ప్రబంధమును పూర్తిచేయుట మొదలగునవి.

ఈ విధముగా వక్రతా భేదములను మృదుమధురపద విన్యాసముతో సోదాహరణముగా నిరూపించి శ్రీరాజానక కున్తకుడు వక్రోక్తి ప్రస్థానమును ప్రతిష్ఠించెను. పూర్వాలంకారికులగు దణ్డిభామహోద్భట రుద్రటాదులతో నొకప్పుడేకీభవించుచు మఱియొకప్పుడు స్వతంత్రించుచు సాహిత్యసుధాసారమగు నపూర్వ కావ్యాలంకారమును వక్రోక్తి జీవితమను పేర ప్రణయన మొనర్చెను. నేడు వక్రోక్తి వాదమునకు నిదియే ప్రమాణగ్రన్థము.

వన్దే కవీన్ద్ర వక్త్రేన్దు లాస్యరఙ్గ నర్తకీమ్।
దేవీం సూక్తిపరిస్పన్ద సుందరాభిన యోజ్జ్వలామ్॥

ఇతిశివమ్.

---

# 7. వ్యక్తివాదము

శ్రీ సూరి రామకోటిశాస్త్రి

శ్లో॥ సత్కావ్య తత్త్వ విషయం స్ఫురితప్రసుప్త
కల్పం మనస్సుపరిపక్వధియాం యదాసీత్
తద్వ్యాకరోత్ సహృదయోదయ లాభహేతోః
ఆనన్ద వర్ధన ఇతి ప్రథితాభిధానః

సాహిత్య దర్శనమున అలఙ్కార గుణరీతి వాదముల తరువాత వ్యక్తి వాదము అవతరించినది. దీనికి ప్రవర్తకులు శ్రీమదానన్ద వర్ధనాచార్యులు. వీరిగ్రంథముధ్వన్యాలోకము. ఈగ్రంథరాజమునకు శ్రీమదభినవగుప్త పాదులు లోచన మనుపేర వ్యాఖ్య రచించిరి. శ్రీపాణిని అష్టాధ్యాయికి పతఞ్జలి భాష్యము వోలె బ్రహ్మ సూత్రములకు శాంకర భాష్యము వడువున ఈ లోచన ధ్వన్యాలోకమునకు మరింత శోభగూర్చినది. నేడు కవిహృదయ లోకనమున సలోచన ధ్వన్యాలోకమే ప్రమాణగ్రన్థముగా పరిగ్రహింపబడు చున్నది.

ఆనంద వర్ధనులది ధ్వని ప్రస్థానము. అభినవగుప్తు లది రసప్రస్థానము, ఆ రెండును వ్యక్తివాదమున సఙ్గ్రహీతములు. వ్యక్తిఅనగావ్యఞ్జన, ద్యోతనము స్ఫురణము అని దానిని వివరించు కొన వచ్చును. కావ్యమందలి శబ్దములకు వర్ణితమగు అర్థమునకు మఱియొక అర్థమును స్ఫురింపజేయు శక్తి కలదని వీరిభావము. దీనిచే ప్రతీయమానమగు అర్థము వ్యఙ్గ్యము. అది చమత్కారాతిశయము కలిగించుటంజేసి వాచ్యముకంటె ప్రధానమగుచూ ధ్వనినామమున వఱగును. ఆకావ్యము ధ్వనికావ్యము. ఈ విషయమును ఆనంద వర్ధనులు-

"యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృత స్వార్థౌవ్యఙ్క్తః, కావ్య విశేషః సధ్వనిరితి సూరిభిః కథితః' అని లక్షణ వాక్యమును నుండివిరి. ధ్వని వస్తుమాత్రము, అలఙ్కారము, రసము అని మూడువిధములు. రామాయణ

మహాభారతములందు, కాళిదాసాది సత్కవుల కావ్యములందు ఉదాహరణ ములు సుప్రసిద్ధములు. ఆదికవి వాల్మీకి: రవిసఙ్క్రాన్త సౌభాగ్యః తుషారా వృతమణ్డలః నిశ్వాసాన్ధ ఇవాదర్శః చన్ద్రమాన ప్రకాశతే॥. ఇదిపఞ్చవటిలో నుండగా రాముని పలుకు. హేమన్త వర్ణనము.

మహర్షి వ్యాసుడు.— ధృతిః క్షమాదయా శౌచం కారుణ్యంవాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధః శ్రియః॥

కాళిదాసు:— సరసిజమనువిద్ధం శైవలేనాపిరమ్యం మలినమపి హిమాంశోర్లక్ష్మలక్ష్మీంతనోతి.
ఇయమధికమనోజ్ఞావల్కలేనాపితన్వీ కిమివహిమధురాణాం మణ్డనం నాకృతీనామ్.

అలంకారధ్వని:— లావణ్యకాన్తి పరిపూరిత దిఙ్ముఖేఽస్మిన్
స్మేరేఽధునాతవముఖే తరలాయతాక్షి
క్షోభం యదేతి నమనాగపితే న మన్యే
సు వ్యక్తమేవ జలరాశి రయంపయోధిః

కాన్తాముఖమున చన్ద్రరూపణము లేదా భ్రాన్తిధ్వన్యమానము.

రసధ్వని:— కృచ్ఛ్రేణోరుయుగం వ్యతీత్యసుచిరం భ్రాన్త్వానితమ్బస్థలే మధ్యేఽస్యాస్త్రివలీ తరఙ్గ విషమే నిస్పన్దతాఽమాగతా మద్దృష్టి స్తృషితేవ సమ్ప్రతి శనై రారుహ్యతుఙ్గస్తనౌ।సాకాఙ్క్షం ముహురీక్షతే జలలవప్రస్యన్దినీ లోచనే॥ చిత్రఫలకావలోకమున వత్సరాజురీతి విభావానుభావ సంయోజనావశమున చర్వణాఽఽస్పదము శృఙ్గారరసము.

రస్యతే — ఆస్వాద్యతే ఇతిరసః అనువ్యుత్పత్తినే ఆస్వాద్యమానములగు శృఙ్గార వీరాదిరసములు,హర్షాదిభావములు, రసాభాస భావాభాసలు, భావ శాన్తి భావోదయ భావసంధి భావశబలతలు రసశబ్దముచే వివక్షితములు. లేదా రసధ్వని అసంలక్ష్య క్రమధ్వనికి ఉపలక్షణము.

ఈ మూడు ధ్వనులలో కావ్యవ్యాపారైకగోచరమై చర్వణాఽఽస్పద మగు రసమునకు ప్రాధాన్యమిచ్చి అభినవ గుప్తులు రసవాది అయ్యెను. ప్రతీయమానములగు వస్త్వలంకారాదులందు వాచ్యముకంటెచారుత్వాతి

శయమును సోదాహరణముగా నిరూపించి ఆనందవర్ధనుడు ధ్వనిప్రస్థానాచార్యుడాయెను. ఈ యిరువుర యభిప్రాయములు ఒకదానితో నొకటి విరోధించునవి కావు. అనగా ప్రతీయయాన తారతమ్య వివేచనము చేసినపుడు రసమునకు ప్రాధాన్యము ఆనన్దవర్ధనసంమతమే.

వీరిచే గ్రహింపబడిన వ్యక్తి అనగా వ్యఙ్గ్య వ్యఞ్జకభావము ధ్వని నామము విద్వదుపజ్ఞము. వైయాకరణులు, భర్తృహరి మొదలగువారు మొదటి శ్రూయమాణ వర్ణములందుఁ ఘణ్టానురణన న్యాయమున చెవికి చేరిన శబ్దములందు మొదట ధ్వని వ్యవహార మొనర్చిరి. ఇదిగాక వర్ణవ్యఙ్గ్యమగు అఖణ్డస్ఫోటశబ్దము అర్థబోధకమని యఙ్గీకరించిరి. దీని ననుసరించి కావ్య తత్త్వవిదులు విభావాను భావాది సంవలనమున రసాదులు వ్యఙ్గ్యమగుననిరి. విభావాదులు వ్యఞ్జకములు. ఈ వ్యఞ్జనను స్ఫోటవిషయమున వైయాకరణులఙ్గీకరింపగా రసాది విషయమున ఆలఙ్కారికులు విశిష్టరూపముతో పరిగ్రహించిరి. నైయాయికులు మీమాంసకులు ఈ వ్యఞ్జనను అఙ్గీకరించలేదు. అయినను "గంగాతీరేఘోషః" అను ప్రయోగముకంటె "గఙ్గాయాం ఘోషః" అను వాక్యమునకు వైలక్షణ్యము సర్వానుభవ సిద్ధము. గఙ్గాగత శైత్య పావనత్వాది ప్రతీతి వ్యఞ్జనైక సాధ్యము. మీమాంసకులుకూడా అపౌరుషేయ వేదవాక్యములకు ప్రామాణ్యము సిద్ధించుటకై పౌరుషేయ వాక్యములందు వ్యఙ్గ్యవ్యఞ్జకభావము నఙ్గీకరించుటయుక్తము. శబ్దార్థ సంబంధ నిత్యత్వము పౌరుషేయాపౌరుషేయములకు సమానము కాగా కొన్ని పౌరుషేయ వాక్యములు మిథ్యార్థములగుట పురుషాభిప్రాయవ్యఞ్జకము లగుటం జేసి, పొసగుచున్నది. చంద్రకిరణము లందరికి చల్లగా నుండి తాపము తీర్చుచుండగా ప్రియా విరహదహ్యమాన మానసులకు సంతాపకరములగుట ప్రసిద్ధము కదా! ఈ వ్యఙ్గ్యకభావము వాచ్యములగు విభావాదులకు ప్రతీయమానములగు రసాదులకు ఘటప్రదీప న్యాయమున అఙ్గీకరింపబడుచున్నది. అనగా ప్రకాశనశక్తికల దీపము చీకటిలోనున్న ఘటమును ప్రకాశింపజేయు విధమున వ్యఞ్జక విభావాదులు రసప్రత్యాయకములని భావము. దీపము స్వప్రకాశము. ఘటాదులను ప్రకాశింపజేయు సమయమున తానును ప్రకాశించుచునే యుండును. స్వరూపమును కోలుపోదు. అట్లే వ్యఙ్గ్యరస చర్వణాకాలమున వ్యఞ్జక విభావా

దులు తోడుగా ప్రకాశించుచునే యుండును. రసో వాక్యార్థః సన్ విలసతి విభావాద్యాః పునరమీపదార్థాః అని అచ్చటచ్చట వర్ణించినంత మాత్రమున పదార్థ వాక్యార్థ న్యాయమే సమ్మతమని భావించరాదు. అట్లయినచో వాక్యార్థము నిష్పన్నమైన తరువాత పదార్థములు విడిగా భాసించుట మానినట్లు రసాస్వాద సమయమున విభావాదులు స్వరూపముతో భాసింపక పోవలసి వచ్చును. విభావాదులతో కలసియే రసచర్వణ సహృదయానుభవ సిద్ధము. కావున వాక్యార్థ ప్రతీతికి పదార్థ ప్రతీతిముందు ద్వారమైనటుల, రసచర్వణకు ముందు విభావాది ప్రతీతి నియతము ఆవశ్యకమని బోధించుట రసో వాక్యార్థః సన్ విలసత్ వాక్యతాత్పర్యము. దీనిచే మీమాంసక తన్త్ర సిద్ధమగు తాత్పర్య శక్తిచేతనే వాక్యార్థస్థానీయమగు రసము భాసించుటకు వీలుండగా వ్యఞ్జనతో పనియేమి? అనుశఙ్క నిరాకరింపబడినది. ఈవ్యఞ్జకత్వము వాచక శబ్దములందును అవాచక గీతాది ధ్వనులందును చేష్టలందును కాననగును. రాగాలాపము అభినయము అర్థవిశేషస్ఫోరకములు కదా! భరతముని నాట్యశాస్త్రము ఈ విషయమును చక్కగా నిరూపించుచున్నది. వ్యఞ్జకత్వాను గృహీతమగు ప్రత్యక్షానుమానోపమాన శబ్దార్థాపత్త్యనుపలబ్ధి సంభవైతిహ్యములతోపాటు ఒక ప్రమాణముగా అలంకారికులచే పరిగణింప బడుచున్నది. దీనినిబట్టి వ్యఞ్జకత్వము విలక్షణము. శబ్దవ్యాపారములగు అభిధాలక్షణములచే ఇది గతార్థము కాదని తెలినది. అయినను వానిననుసరించును. 'ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వేపితురధోముఖీ, లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ:- దేవర్షియగు అఙ్గిరస్సు మహేశ్వరునకు కన్యను వరించుటకై వచ్చితిమి, అని హిమవన్తునితో వివాహప్రస్తావనము చేయగా చెంతనున్న పార్వతి ముఖమువంచి విలాస పద్మదళముల లెక్కించెను. అని వాచ్యార్థము. తరువాత అనురాగసూచకమగు లజ్జాభావము వ్యఞ్జకత్వ ముఖమున ధ్వనించుచున్నది. ఇది సహృదయులకు చమత్కృతిని కలిగించుచున్నది.

సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః
శూరశ్చకృత విద్యశ్చ యశ్చజానాతి సేవితుమ్.

భూమి సులభ సమృద్ధి సంభార భాజనము అని లక్ష్యార్థము. దీనిని శూరుడు పణ్డితుడు సేవాభిజ్ఞుడు అను మువ్వురు సంపాదించుచున్నారు.

ప్రాశస్త్యము, వ్యఙ్గ్యము విదగ్ధపరిషత్తులలో గోష్ఠులందును రమణీయములు ఆదరాస్పదములును అగుభావములను సూచనామాత్ర సారముగా వ్యఞ్జకత్వము నాశ్రయించి వెలువరించుట చూచుచున్నారము.

ఈ వ్యఞ్జకత్వము రమణీయార్థ ప్రతిపాదనమునకై ఉపాయముగా స్వీకరింపబడినది. వస్త్వలఙ్కార రసాత్మకమగు వ్యఙ్గ్యార్థము స్వసౌందర్యముచే అహ్లాదము కలిగించుటంజేసి ప్రాధాన్యము వహించుచున్నది. వ్యాపారముకంటె విషయము ప్రధానము. మాధుర్యాది గుణములు, ఉపమాన్యలఙ్కారములును ఆత్మస్థానీయమగు ధ్వనికి శోభను కూర్చుటంచేసి లౌకిక గుణాలఙ్కారములవలె అఙ్గభావమును భజించుచున్నది. 'తమర్థమవలమ్బన్తే యేఽఙ్గినంతే గుణాః స్మృతాః అఙ్గాశ్రితాస్త్వలఙ్కారా మన్తవ్యాః కటకాదివత్' అని ధ్వనికారుడు గుణాలఙ్కారములకు కావ్యమునతగుస్థానమును నిర్ణయించెను. ఈ గుణాలఙ్కార వ్యవహారమే గుణి అలఙ్కార్యము అగు అర్థము ఒకటి యుండి తీరవలయును ఊహకు తావునిచ్చి ధ్వనిని సమర్థించుచున్నది. కటకాద్యాభరణములు శరీరముద్వారా ఆత్మకు శోభాహేతువులు. శౌర్యాదుల ఆత్మ నాశ్రయించియే యుండును. అట్లే కావ్యగుణాలఙ్కారము లఙ్గీకరించుట యుక్తము. రీతి పదరచనాశ్వరూపము. ఇది శరీరావయవ సంనివేశ సౌష్ఠవముతో పోలు గుణాలఙ్కారములకు ఆశ్రయము కాదు. అట్లుచేసి దీనికి ఆత్మస్థాన మీయరాదు. కావున కవి వ్యాపారమునకు విశ్రాన్తిధామము వ్యఙ్గ్యము రసాదికమని గ్రహింపదగును.

ముఖ్యవ్యాపార విషయాః సుకవీనాం రసాదయః<br>
తేషాం నిబద్ధనే భావ్యంతైః సదైవా ప్రమాదిభిః<br>
వాల్మీకి వ్యాసముఖ్యాశ్చ యే ప్రఖ్యాతాః కవీశ్వరాః<br>
తదభిప్రాయ బాహ్యోఽయం నాస్మాభిర్దర్శితోనయః॥ఇతి॥

ఈ వ్యక్తివాదమునకు ప్రతి పక్షములు పెండు గలవు, ఎట్లన-

తాత్పర్యశక్తిరభిదా లక్షణానుమితీ ద్విధా<br>
అర్థాపత్తిః క్వచిత్తన్త్రమ్ సమాసోక్త్యా వ్యలఙ్కృతిః<br>
రసస్యకార్యతా భోగో వ్యాపారాన్తర బాధనమ్<br>
ద్వాదశేత్థం ధ్వనేరస్య స్థితా విప్రతిపత్తయః.

వీనిలో ప్రధానములు అభావ-భాక్త-అనిర్వచనీయవాదములు. వీనిని స్పృశించి సఙ్గ్రహముగా నైనను నిరాకరించిననే కాని వ్యక్తివాదము ప్రతిష్ఠితము కాజాలదు. కావున కొలదిగా వివరింతును.

అభావవాదము-

'యస్మిన్నస్తి నవస్తుకిఞ్చన మనః ప్రహ్లాది సాలఙ్కృతి
వ్యుత్పన్నై రచితం చ నైవ వచనై ర్వక్రోక్తి శూన్యం చయత్
కావ్యం తద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యా ప్రశంసన్ జడః
నోవిద్మోఽభిదధాతి కింసుమతినా పృష్టః స్వరూపంధ్వనేః॥

॥మనోరథుడు॥

కావ్యములు పరిశీలించిన గుణములో అలంకారములో వక్రోక్తులో కానవచ్చును. ఈ ధ్వని యెచ్చటను కానరాదు. ఒకవేళ యున్నను అది శోభాకారికాదు. శోభాకారియగుచో మేము చెప్పిన గుణములలోనో అలఙ్కారములలోనో అన్తర్భవించును.

దీనికి సమాధానము-

ధ్వని సత్కావ్యములందంతట నిండియున్నది. పూర్వ లాక్షణికులు మాత్రమే గుర్తించి యుండలేదు. ఇది లలనాలావణ్యమువోలె ప్రసిద్ధావయవాతిరిక్తము. సహృదయ శ్లాఘ్యము. కవి ప్రతిభకు తార్కాణము. శుష్క వ్యాకరణమాత్ర పరిజ్ఞానముచే తెలియునదికాదు. గుణిఅలఙ్కార్యము అగుటచే గుణాలఙ్కారములలో చేరదు.

భాక్తవాదము-

భట్టోద్భట వామనాదులు గౌణశబ్దములందు రామణీయకమునుచూచి కావ్యములందు సహృదయ చమత్కారకరంబగు అర్థముకూడ గుణవృత్తి లక్షణాగోచరముగా వ్యవహరించిరి. అది యుక్తముగాదు. లావణ్యప్రవీణ అనుకూలాది శబ్దములు నిరూఢలాక్షణికములు. వ్యఙ్గ్యములేదు. శిఖరిణిక్వను నామకియచ్చిరం కిమభిధాన మసావకరోత్తపః, తరుణి యేనతవాధరపాటలం దశతి బిమ్బఫలం శుకశాబకః మొదలగు అభిధామూలధ్వన్యుదాహరణములలో ధ్వని యున్నది.

భక్తియనగా లక్షణలేదు కదా! ఇక అనిర్వచనీయవాదము. వీరు ధ్వని తత్త్వము నిర్వచింప నలవికాదు. అనుభవైకవేద్యము కుమారికా జనము భర్తృసుఖము అనుభవింతురేకాని వర్ణింపనేరరుకదా యని నా ఈ వాదము 'యత్రార్థః' అను ధ్వనిలక్షణ కరణముచే పరాహతమైనది. ధ్వని కారుడు అభిధాతాత్పర్య లక్షణావ్యాపారత్రయోత్తీర్ణమగుధ్వనిని వ్యాపారము నఙ్గీకరించి కావ్యజీవితము వ్యఙ్గ్యమని నిరూపించెను. రసాది విషయమున ఉత్పత్తి అనుమతి భక్తివాదముల మీద అభినవగుప్తుని వ్యక్తివాదము మఱింత సున్నితముగా సూక్ష్మాంశ పరిశీలనలో కూడియున్నది. సర్వథా నేడు వ్యక్తివాదమే ప్రామాణికముగా సాహిత్యదర్శనమున సర్వజనాఙ్గీకృతమై యున్నది.

వ్యఙ్గ్యే వ్యఞ్జక భావేఽస్మిన్ వివిధేసమ్భవత్యపి
రసాది మయ ఏకస్మిన్ కవిః స్యాదవధానవాన్॥

శ్లో॥ అపూర్వం యద్వస్తు ప్రథయతి వినా కారణకలాం
జగద్గ్రావప్రఖ్యం నిజరసభారాత్ సారయతి చ
క్రమాత్ప్రఖ్యోపాఖ్యాప్రసరసుభగంభాసయతితత్
సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే.

ఇతిశమ్.

---

# 8. ధ్వని ప్రస్థానము

కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఈ ధ్వని కావ్యధ్వని. ఇది మూడు విధములు. వస్తుధ్వని, అలంకార ధ్వని, రసధ్వని. ఇది అనాదినుండియు మనదేశముననున్నది. కాని దాని లక్షణము వ్రాసినవారు లేరు. అందుచేత దీనిని పలుమంది లేదనుచువచ్చిరి. మనోరథుడన్న కవి ఇట్లు వ్రాసెను—

"యస్మిన్నస్తి న వస్తుకించ న మనః ప్రహ్లాద సాలంకృతిః
వ్యుత్పన్నై రచితం చ నైవ వచనైః వక్రోక్తి శూన్యంచయత్
కావ్యం తద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యాప్రశంసన్ జడః
నోవిద్మోఽభిదధాతి కిం సుమతి నాపృష్టస్స్వరూపం ధ్వనేః."

—ధ్వని యనునది లేదు. బుద్ధిమంతు డెవడైన ధ్వని యెట్టిదో చెప్పుమని యడిగినచో నోరు వెళ్ళబెట్టవలెనని దీని తాత్పర్యము. ధ్వనిని స్థాపించవలయుననగా నది పెద్ద కష్టము. తత్పూర్వులైన యాలంకారికులు భామహుడు, ఉద్భటుడు, దండి మొదలైనవారుగూడ అలంకారములను ప్రపంచించినవారే తప్ప ధ్వని ప్రస్తావన చేసినవారు లేరు వారందరు ధ్వనియే లేదన్నారు. ఉన్నచో అభిధలోననే యుండును. లేదా 'లక్షణ'లో నుండును. అంతకు మించియుండుటకు వీలులేదు – అని వారి వాదన. దీనితోబాటు భాక్తమని యొకటున్నది. అది యించుమించుగా లక్షణవంటిదే. లక్షణయనగా గుణవృత్తి. "వాని యిల్లు యేటిలోనున్నది." ఏటిలో నిల్లుండదు. దీనిని ముఖ్యార్థబాధ యందురు. అందుచేత ఏటిప్రక్కన యున్నదని యర్థము చెప్పికొనవలయును. "వాడు పులి" యందుము. వాడు పులికాదు గదా! పులికాడు గనుక పులివలె క్రూరుడని యర్థమును చెప్పికొనవలయును. లక్షణ, భాక్తము, గౌణము యివి యన్నియు నీ జాతికి చెందినవి. ధ్వని యనునది వాచ్యమునుండి పుట్టును. సామాన్యముగాధ్వనియున్నచోట మూడు వ్యాపారములుండును. అభిద–తాత్పర్యము–వ్యంగ్యము. ఈ

మూడు వృత్తులు లక్షణలేనిచోట నుండును. లక్షణ యున్నచో నాల్గువృత్తు లగును. అక్కడ మూడవవృత్తిగాని, యిక్కడ నాల్గవ వృత్తిగాని ధ్వని యగును. ఆ ధ్వని ప్రధానముగా నాలంకారికులు లేదనిరి. అలంకారికులు మీమాంసకుల ననుసరింతురు. మీమాంసకులు రెండుతెగలు. ప్రాభాకరులని-భాట్టులని. ప్రాభాకరులకు అభిహితాన్వయవాదు లనిపేరు. భాట్టులకు అన్వితాభిధాన వాదులనిపేరు. వీరు కాక తార్కికులున్నారు. వారికి తర్కమున్నది. తర్కము సామాన్యముగా పంచావయవి. ప్రతిజ్ఞా, హేతు, ఉపనయ, నిగమనములు. ఇది అనాదితర్కము. దీనిని పంచావయవి యందురు. తరువాత దీనిని మూడవయవముల క్రిందికే తెచ్చినారు. ఈ తర్కమును త్ర్యవయవిని చేసినవారు ప్రధానముగా ప్రాభాకరులని యందురు. వీరుకాక వైయాకరణులున్నారు. మరియును స్ఫోటవాద మొకటున్నది. ఆనందవర్ధనుని ధ్వనిని స్థాపన చేయవలయునన్నచో నైదుగురు బలవంతులైన ప్రతిపక్షులయొక్క వాదనను నిరాకరించి ధ్వనిని సిద్ధాంతీకరించవలెను. ఇందులో ప్రధానులుమీమాంసకులు-అభిహితాన్వయవాదులు—అన్వితాభిధానవాదులు. ఆలంకారికులు ప్రధానముగా అన్వితాభిధానవాదుల ననుసరింతురు. ముందర ఒక శ్లోకమును చెప్పి దానిలోని ధ్వనిచెప్పి వారివారి తర్కములు తత్ఖండనమును చెప్పినచో సువ్యక్తమగును. ఆనంద వర్ధనుడే తొట్టతొలుత నొక ప్రాకృత శ్లోకమును వ్రాసెను. దానికి సంస్కృత మిది-

"భ్రమధార్మిక విస్రబ్ధః సశునకోఽద్య మారితస్తేన
గోదావరీనదీ కూలలతాగహన వాసినా దృప్తసింహేన"

దీని తాత్పర్యమిది- "ఓయి ధార్మికుడా! నమ్మకముగా తిరుగుము; గోదావరి నదియొడ్డుననున్న తీగల అడవిలో ఆ మదించిన సింహముచేత ఆ కుక్క చంపబడినది. ఇది ముక్తకము. అనగా ఒకటియే శ్లోకము. ఇట్టి శ్లోకములకు ప్రతీకలు చెప్పికొనచోగాని యర్థము కుదురదు. ఈ మాటను ఒకానొక స్త్రీ యన్నది, ఒక ధార్మికునితో- సందర్భమును బట్టి విచారించినచో నిట్లు తేలును - ఆమె గోదావరి ఒడ్డుననున్న తీగెల పొదల వెనుక తనప్రియునితో కలసికొనుచుండును. ఈ ధార్మికుడు ప్రతిదినము పువ్వులకోసమో చివురాకులకోసమో అచ్చటికి పోవుచుండును. ఒకటి-అక్కడ నితని సంచారమామె కనువుగా లేదు. మఱియు నితడు ఆ పువ్వుల తీగెలను త్రెంపు

చున్నాడు. పొదలు పలుచబడి పోవుచున్నవి. చాటు తక్కువగు చున్నది. అచ్చట నొక కుక్కయున్నది. ఆ కుక్క యున్నచో నీ ధార్మికునకు భయము కావచ్చును. ఇప్పు డామె ఏమి చెప్పుచున్నది? 'ఆ పొదలలో దాగియున్న సింహము ఆ కుక్కను చంపినది. ఇంక నీవు నమ్మకముగా నచట తిరుగుము' అని చెప్పుచున్నది. తిరుగుము అన్నది విధిరూపకము. కాని యామె యుద్దేశ్యము తిరుగుమనియా? అక్కడ సింహమున్నది. కుక్కను చంపినది. నీవు కుక్కకే భయపడెడివాడవు ఇప్పుడు సింహము 'పులిమీద పుట్ర'గా వచ్చినది, అను విషయమును చెప్పుచున్నది. చెప్పి తిరుగుమనుచున్నది. ఇందులో నింక ననేకములైన యర్థములున్నవి. ఆ ధార్మికునకు కుక్కయున్నచో భయమే లేదేమో! భయమున్నప్పటికి వానికి గురువుయొక్క యాజ్ఞచేతనో, దైవము నందధికమైన భక్తిచేతనో పువ్వులుకోయుటకు తప్పకుండ వెళ్ళునేమో! మఱియును సింహముమాట నిజమేమి? ఆ సింహము కుక్కను చంపినదో లేదో ఆమె యితనిని బెదరించుట కన్నదేమో! ఆమె కులట. నిజమే చెప్పునని నమ్మకమేమున్నది? ఇంకొక యర్థము చెప్పవచ్చును. ఈ ధార్మికుడు భయగ్రస్తుడు కాడు. అతనికి కుక్క యున్నను భయములేదు. సింహమున్నను భయములేదు. అభినవ గుప్తపాదులతనిని సహృదయుడన్నారు. అనగా అతడు మంచివాడు. దానిబాధ అది పడుచున్న దనకెందుకు? మన మక్కడకు వెళ్ళుట దాని కిష్టములేదు. దాని రహస్యప్రవర్తనకు నీవక్కడికి మాటిమాటికి పువ్వులు కోసికొనుటకు వెళ్లుట భంగకరముగా నున్నది. మనము మానివేయుదములే అనుకొనెనేమో! అర్థములెట్లున్నను 'ఓయి ధార్మికుడా! అక్కడనీవు నమ్మకముగా తిరుగుము' అన్నది కదా యిక్కడ ప్రధాన వాక్యము. తిరుగు మన్నది. విధికాని ధార్మికునకేమి ఊహ కలుగుచున్నది, తిరుగవద్దని యామె చెప్పుచున్నదన్నయూహయే కలుగును. అనగా నక్కడ విధిరూపముగా నున్నదానికి నిషేధరూపమైన భావము కలుగుచున్నది. ఇది వాక్యార్థముగాదు. తాత్పర్యముగాదు, వాని రెంటికి సంబంధములేదు. వ్యతిరేకమైన భావము కలుగుచున్నది. దీనిపేరు ధ్వని. వ్యతిరేకధ్వని.

ధ్వనులు మరొకరీతిగా మూడు విధములుగా నుండును. ఒకటి నియతవృత్తి. రెండవది అనియతవృత్తి. మూడవది సంబంధ సంబంధి. ఇది నియత సంబంధముకలది. వ్యతిరేక సంబంధముచేత ధ్వనికలుగుచున్నది. ధార్మికుడా!

భ్రమించుము. దీనిని అభిధావృత్తియందురు. అక్కడ తిరుగవచ్చును, అనునది తాత్పర్యమందుము. అభిదాతాత్పర్యములు రెండును కొంచెము దగ్గఱగానే యుండును. శాస్త్రదృష్టితో చూచినపుడు వానియందు భేదములు కన్పించును. ఈ శ్లోకములో గౌణవృత్తిలేదు. లక్షణావృత్తిలేదు. భాక్తమనుటకు వీలులేదు. ఏ శబ్దమునకును ముఖ్యార్థబాధ లేదుకదా? అందుచేత గుణవృత్తి పరిహరింపబడినది. ఉపచారమున్నచో భాక్తముండును. 'ఏమిరా ప్రొద్దుటి నుండి యన్నము తినినట్టు లేదు. నీ వాలకమే చెప్పుచున్నది.' అన్న వాక్యమున్నది. వాలకమనగా ముఖలక్షణము. ముఖము లక్షణముచే చెప్పునా? కనుక ఈ చెప్పుచున్నది యన్నది ఔపచారికమైనమాట. ఇంకొక యుదాహరణముకూడ చెప్పి మీమాంసకాదుల ఖండనమును ఆనందవర్ధనుడెంతయాశ్చర్యముగా చేసినాడో నిరూపింతును. ఇవియన్నియు చెప్పకపోయినచో ఆనంద అందవర్ధనుని ఖండనలోని రమ్యత తెలియదు. ఒక శ్లోకమున్నది. దాని యర్థమిది- "శూరుడును, కృతవిదుడును, సేవించుటయెఱిగినవాడును- యీ ముగ్గురు పురుషులు సువర్ణపుష్పమైన భూమిని పుణుకుచున్నారు. అనగా పువ్వులు కోయుచున్నారని యర్థము. సువర్ణపుష్పమనగా బంగారములను పూయునదియని అర్థము. ఇచట బంగారమును పూచుట యన్న శబ్దమునకు అర్థములేదు. దీనియర్థము తాత్పర్యశక్తిచేతనే తెలియబడవలయును. ఒక పూలచెట్టునందు పూవులెట్లు సమృద్ధిగా పూయునో ధాత్రియందు బంగారములట్లు సమృద్ధిగా నుండునని యర్థము. ఇచ్చట ముఖ్యార్థబాధ యున్నదా? అన్న ప్రశ్న. శబ్దమునకులేదు. అర్థమునందున్నది. శబ్దగతమైన ముఖ్యార్థబాధయే ప్రధానమైన గౌణవృత్తి. ఇచట గుణవృత్తి తూగుచున్నది. కాని తాత్పర్యమన్యథా సిద్ధించుచున్నది. అనేకములైన ధ్వనులు. మొట్టమొదట రెండు భేదములు. ఆ రెంటిలో మొదటిది అవివక్షితవాచ్యధ్వని. ఈ అవివక్షితవాచ్యధ్వని రెండు విధములు. మొదటిది అర్థాంతర సంక్రమితము - రెండవది అత్యంత తిరస్కృతము. ఈసువర్ణపుష్పఅన్నచోటఅర్థము అత్యంతతిరస్కృతమైపోయినది. ఇచటకొద్దిగాఅర్థాంతరసంక్రమితమునుగూడచెప్పెదను."అసభన్ కావలదన్న కీడుగదా!" ఇచట 'అసభన్' అన్నమాటలోనున్న తదర్థకమైన 'అ' అర్థాంతర సంక్రమితము.అచ్చట'అ'అన్నమాటకు అర్థములేదు. ద్రౌపదీవస్త్రాపహారణము జరిగిన దంతయు దానికర్థము. కొందఱు లోకములో 'నేనెవడను? నాపేరు

రామయ్య' అని తనయం దహంకారమును చెప్పును. ఆ 'రామయ్య' యన్న మాటకు వాడదివఱకు చేసిన కర్కోటకపు పనులన్నియు నర్థము. ఇది యర్థాంతర సంక్రమితము ఈ యవివక్షిత వాచ్యధ్వని రెండేరగములు. ఇవి రెండే. ఆ మొదట చెప్పిన ధ్వనులలో రెండవది వివక్షితాన్యపరవాచ్య ధ్వని. దానిని గుఱించి యెంతయైనను చెప్పవలయును. సుధాసాగరము అను గ్రంథము యొక్క రచయిత (సరిగాజ్ఞాపకము లేదు) అరులక్షల విధము లైన ధ్వనులున్నవని చెప్పినాడు. మమ్మటుడు ప్రధానమైన ధ్వనులనే పది వేల నాలుగు వందల యేబదియైదు కాబోలు చెప్పినాడు. అభినవగుప్తపా దుడు మొట్టమొదటిలెక్క ముప్పదియైదు చెప్పినాడు. అదియంతయు నట్లుంచి ఈ ధ్వనియనునది ఒకచోట మూడవ కక్ష్యలో మరియొక్కచోట నాల్గవ కక్ష్యలో నుండుచున్నది. దానికి వాచ్యమునకు సంబంధము లేదు. ఈ వాచ్యములేకుండ ధ్వనిపుట్టదు. ధ్వని 'గాలిలో దీపముబెట్టి దేవుడా నీ మహిమ'-యను నటువంటిదికాదు. మొదట నిది తెలిసినచో మీమాంసకాదుల వాదనలు, వానిని ఆనందవర్ధనుడు ఖండించిన పద్ధతులు తెలియును. ప్రధాన ముగా ధ్వనికారుడు ఖండించవలసినది మీమాంసకులను. చెప్పితినికదా! వారు- ప్రాభాకరులు, భాట్టులు, అభిహితాన్వయవాదులు, అన్వితాభిధాన వాదులు.

ఈ యిద్దరు యిద్దరుగానున్నను నిజానికి ఒక్కటని యే చెప్పవలయును. అభిహితాన్వయము-చెప్పబడిన అన్వయము గలవారు. ఇంచుమించుగా నొక్కటిగా కనుపించుట లేదా? అభిహితాన్వయ వాదుల ప్రకారము పద వృత్తియొక్క విషయము అసంస్పృష్టరూపార్థము. రెండవవారి ప్రకారము పరస్పరము కూడుకొనిన అనగా పరస్పరసంస్పృష్టరూపార్థము. అనగా మొదటిదానిలో నర్థము కలిసికొని యుండదు. రెండవదానిలో కలసికొని యుండును, అనియే పరమార్థము. మొదటి వారి విషయము తీసుకొన్నచో లోకమునుబట్టి అర్థసంగ్రహణము జరుగునని చెప్పవలయును. పదము అర్థ మును తానే ప్రోవు చేసికొనును. 'ఒయి! దేవదత్తుడా? ఆవును తీసుకొనిరా'' అని కుఱ్ఱవానితో చెప్పినచో ఈ మాటయొక్క అర్థమును వాడు లోకము నుండి గ్రహించును. ఇదియొక పెద్ద చర్చ. ఎంత చర్చ చేసినను అభిధాతా త్పర్యములను మించిపోదు. వీనిని వ్యాపారము అందురు. అభిధావ్యాపార మనగా ఉన్నశబ్దములకున్నట్లుగానర్థము తెలియుట. తాత్పర్యవ్యాపారమనగా

సమనయ్యేము కుదుర్చుకొనుట. అయిపోయినది. వ్యంగ్యము వీనినిదాటి పుట్టు చున్నది గదా! ఈ రెండు వ్యాపారములు తత్పూర్వమే పరిక్షయము పొందు చున్నవి. రెండవవారిదికూడ నింతే. వారింకొకటి చెప్పుదురు. అభిధావ్యాపారమునందే సర్వము నిమిడియున్నది. నీవు దేనిని వ్యంగ్యమందువో అది నైమిత్తికమైనచో-నైమిత్తికము కాకతప్పదుగదా! వానికి నిమిత్తములను కల్పించు కొనవలయును. ఈ నిమిత్తములచేత నైమిత్తికమైన యీ ధ్వని కలిగినదని కల్పించుకొనవలెను. కల్పించు కొన్నచో నీ వ్యంగ్యార్థముత్పన్నమగును. వ్యంగ్యార్థమునకు సామంజస్యము ఘటిల్లును. తార్కికులకు లింగ లింగి భావమువలె మీమాంసకులకు నిమిత్తనిమిత్తి భావముండునని చెప్ప వచ్చును. ధ్వనికట్లు కుదురదు. ధ్వని యనేక విధముల నుండును. భావుకుని యొక్క హృదయమునుబట్టి యుండును. 'ప్రొద్దు క్రుంకినది' యన్నమాట యున్నది. సూర్యుడస్తమించెనని యర్థము. కాని ప్రకరణమునుబట్టి ఎన్ని యర్థములైన రావచ్చును. ఇద్దఱు దొంగలు తమకు చోరకృత్యమునకు వేళయైన దనుకొందురు. ఉపభర్తను కలసికొనవచ్చునని యొక స్త్రీ యను కొనును. పిల్లవాడింక నింటికి రాలేదని తల్లి యనుకొనును. అపుడొక పని యున్నది మరి యెవనికో - వానికాయూహ! ఇచట నియమమెక్కడ? ఒక్కొక్క భావము నైమిత్తికముగాఁ దీసికొని ఎన్ని నిమిత్తవాక్యములను కల్పించవలయును? అది పొసగదు. కనుక ధ్వని సర్వదా అభిధయందే యిమిడియున్నదని చెప్పుటకువీలులేదు. అలంకారికులు మీమాంసకులయొక్క పద్ధతి నవలంబింతురు. ఏది పరమైన శబ్దమో నది శబ్దార్థమని. లేదా ఒక బాణమువలె ఎంతదూరమైనను పోగలదని ఎంతదూరము పోగలదు? ధ్వని యందు పదములయొక్క యర్థము విరమించుచున్నది. బాణమునకు కొంత వేగమున్నది. అవేగమైపోయినది. తార్కికులున్నారు. ఇక్కడ వ్యంగార్థము ప్రతిజ్ఞ యనుకొన్నచో హేతూదాహరణములకు కల్పనకు వీలులేదు. 'భ్రమ ధార్మిక! విస్రబ్ధః' అన్నచోట వాడు భీరువన్న శబ్దముకూడ లేదు. ఇది స్ఫోటవాదముకాదు. అనునది చర్చితమై ఉచ్చారణాభిముఖమై కంఠస్థమైన ధ్వనిస్ఫోటము. వైయాకరణుల విషయములో బుద్ధిస్థమైన ధ్వని యొకటి యున్నది. దానినిబట్టి పాణిన్యాచార్యులు తపరకరణము, సుధ్యుపాస్యము మొదలైనచోట చేసిన ప్రక్రియను కల్పించినారు. ఇవి యన్నియు పెద్ద పెద్ద

చర్చలు. తెలవు. అందుకనియే తొలుతనే నేను నాల్గువ్యాపారములనుచెప్పి తిని. లేనిచో సులభముగా గ్రహించుటకు వీలులేదు.

ఈరీతిగా నిర్ణింపబడి స్థాపింపబడిన ధ్వనిని ఆనందవర్ధనుడు ప్రపంచిం చినాడు. వివక్షితాన్యపరవాచ్యధ్వని రెండువిధములు. సంలక్ష్యక్రమము, అసంలక్ష్యక్రమము అని. సంలక్ష్యక్రమము శబ్దగతము, అర్థగతమై స్వతః సంభవి. కవిప్రౌఢోక్తి-కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి-ఇట్లుసాగుచునేయుండును. శబ్దార్థోభయశక్త్యుద్భవ ధ్వని యొకటున్నది. అది ఏకా!. ఈ ధ్వనిచోట ఆనందవర్ధనుడు 'న్యక్కారోహ్యయమేవ' యనున్న హనుమంతుని శ్లోకమును దీసికొని బ్రహ్మాండముగా వివరించినాడు. లోచనకారుడు 'తద్గేహం నతభిత్తి" అన్న శ్లోకానికి పట్టాభిషేకము చేసినాడు. మమ్మటుడు "స్నిగ్ధశ్యామలకాంతి" మొదలైన శ్లోకమును దీసికొని యధికముగా చెప్పినాడు. "పైఁబడిపోయెగాక ధృతరాష్ట్రుఁడు కన్నదియేమి?" యను తిక్కనగారి పద్యమునకు మనము పట్టాభిషేకము చేయవచ్చును.

మహాధ్వని పరిపూర్ణములైన రచనలు తెలుగు కావ్యములలో నెన్ని యోకలవు. "రంభవా తెలిసెకాంతా! నీ తావల్ చూచినన్" శబ్దశక్త్యుద్భవమైన యలంకారధ్వని. ధ్వనికి శేఖరీభూతమైనది రసధ్వని. దానివద్దకు పోయినచో దీనికి వందరెట్లు చెప్పవలయును. ఇప్పుడు చెప్పినదే వంద రెట్లలో ఒక భాగము.

ఒకమాటచెప్పి మానివేసెదను. ప్రధానమైనది రసధ్వనికాగా ధ్వని స్థాపనకొలకిది యంతయునెన్నగా కొందఱు ప్రతిపక్షులు మేము రసధ్వని నంగీకరింతుము, దీని నంగీకరింపమన్నారట. అభినవగుప్తపాదులన్నారుకదా- మునిమనుమలకు తద్దినముపెట్టెడు లక్షణము అని.

# 9. క్షేమేంద్రుని సాహిత్య సేవ

శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ

సౌందర్యానికి ప్రతీకం కాశ్మీరం. అదిఒక్క భారతమాతకే కాదు-సకల జగత్ప్రకృతిమాతకే- సుందర నందనోద్యానం, ఆమెయొక్క కేళీ విలాసమందిరం. అంతటి మధుర మంజుల మనోహరమూర్తి కనుకనే కాశ్మీర పుర సహృదయంనుండి సకల సహృదయ సంమోహనమైన రసశాస్త్రం ఉద్భవించింది, ఉజ్జ్వలీత లూగిస్తున్నది. ధ్వనిప్రస్థాన ప్రవర్తనాచార్యవర్యుడు ఆనందవర్ధనుడు కాశ్మీరపు ముద్దుబిడ్డడు. రసమూర్తి పరమ మాహేశ్వరుడు అభినవగుప్తుడు కాశ్మీరము సానపట్టిన పండిత రత్నము. మమ్మటుడు,కుంతకుడు మొదలగు అలంకారిక శిరోమణులందరును కాశ్మీరపు సాహిత్యక్షేత్రాలలో పండిన పంటలే. అందుచేతనే-

> "అస్తి స్వస్తి మాతామగ్ర్యం మండితం బుధమండలైః।
> ఖండితాఖండలావాసదర్పం కాశ్మీర మండలమ్ ॥

అని క్షేమేంద్రుడు కాశ్మీరాన్ని ప్రశంసించినాడు. బుధమండల మండితమైన కాశ్మీరం దేవేంద్రుని స్వర్గాన్నికూడా ఈసడిస్తున్నదని అతని తాత్పర్యం. అది ఆనాటి ప్రత్యక్ష సత్యం.

అయితే ఈ క్షేమేంద్రుడుమాత్రం పరాయివాడా? కాదుకాదు. కాశ్మీరములోనే పెరిగి ఫలించిన సాహిత్య కల్పవృక్షమే క్షేమేంద్రమహాకవి. అభినవగుప్త పాదాచార్యునికి సాక్షాత్తు ప్రియశిష్యుడు. నాటి మహాపండితులందరివద్ద మహాకవులందరివద్దను ఆయావిషయాలలో శుశ్రూషా పూర్వకంగా మంచి అనుభవాన్ని సంపాదించి "సర్వమనీషి శిష్యుడను" అని స్పష్టంగా తన్నుగురించి చెప్పుకున్న మహామనీషి వర్యుడు క్షేమేంద్రుడు. ఇతడాగర్భ శ్రీమంతుడు. తన తండ్రి ప్రకాశేంద్రుడు "నానార్థిసార్థ సంకల్ప పూరణ కల్పపాదపుడ"ని ఇతడు చాలచోట్ల వర్ణించినాడు. "తస్య శ్రీమద

నంతరాజ నృపతేః కాలేదిలాయం కృతః'' అని తన ప్రతిరచనయందు ఉట్టంకించడం వలన ఇతడు ''అనంతవర్మ''అనే కాశ్మీరాధిపతి సమయంలో ఉండేవాడని ఆసమయం క్రీస్తుశకం 1020 నుండి 1070 వరకు అనీ చారిత్రకులు నిర్ణయం చేసినారు.

అనగా మన తెలుగులో ఆదికవియైన నన్నయకు, క్షేమేంద్రుడు సమకాలికుడే అని స్పష్టమవుతుంది.

ఇతడు ముఖ్యంగా అలంకార శాస్త్రంలోను కవిత్వ విషయంలోను అనన్య సాధారణమైన నవీన మార్గాలను అనుసరించి విహారం చేసిన సాహిత్య వీరుడు. బహుముఖ ప్రజ్ఞాధురంధరుడు. బహువిధ సాహిత్య ప్రక్రియా నిర్మాణ చతురుడు. బహుసరస సాహిత్య పుష్పసమారాధిత సరస్వతీ చరణారవిందుడు. కావుననే—

లోభాభిమాన మలినాని ధనాని నిత్యం
కాంతాకటాక్షచటులాని చ జీవితాని ।
జ్ఞాత్వేతి చంద్రధవళాని యశాంసియేన
కావ్యైః స్థిరాణి భువనేషు నివేశితాని॥

అని తన కావ్య నిర్మాణోద్దేశ్యమును ప్రకటించుకొన్నాడు. ''ధనమ్ము మదైక హేతువు. జీవితం అతి చంచలం. కీర్తి ఒక్కటే స్థిరమైనది. అందుచే వివిధ కావ్యాలను నిర్మించి చక్కటి యశస్సును సంపాదించుకుందామని నా సంకల్పం'' అని పై శ్లోకం యొక్క భావం. క్షేమేంద్రుని సంకల్పం సిద్ధించింది. అతని సరస సుందర భావనా ఫలంగా సంస్కృతంలో—చిన్నవీ పెద్దవీ కలిపి—సుమారు నలభై గ్రంథాలు ఆవిర్భవించినాయి. మహాకావ్యాలు, ఖండ కావ్యాలు, నాటకాలు, గద్యములు, చంపువులు, నీతికావ్యాలు, ఉపహాస కావ్యాలు, తత్త్వకావ్యాలు అన్ని రకాలున్నూ వానిలో ఉన్నాయి. అతని యశస్సు సంస్కృత సాహిత్య భవనంలో భద్రపీఠాన్ని వేసుకొని సుఖాసీనమై ఉన్నది. అయితే దైవవశాన పోయినవి పోగా మిగిలిన అతని గ్రంథాలు ఇంచుమించు ఇరవైవరకు మాత్రమే ఉన్నాయి. వాని స్వరూప స్వభావాలను స్థాలీపులాక న్యాయంగా ప్రకృతం పరిశీలింపగలం :—

*1. భారతమంజరి:—* వ్యాసమహాభారతానికి సంగ్రహ ప్రధానంగా పురాణశైలిలో సంతరించబడిన పరమసారమిది. ఇందు సుమారు పదివేల శ్లోకాలున్నాయి. క్షేమేంద్రునికి వేదవ్యాసుడంటే అమితమైన భక్త్యను రాగాలు. అందుచేతనే "వ్యాసదాసుడు" అని తనకు ఒక బిరుదనామాన్ని కూడా ప్రతిష్ఠితం చేసుకున్నాడు.

*2. రామాయణ మంజరి:—* ఇది వాల్మీకిరామాయణానికి అనుసరణం. పురాణ శైలిలోనేరచనసాగింది. ఇందు సుమారు ఆరువేల పద్యాలున్నాయి. భారతజాతికి జాతిరత్నాలయిన భారత రామాయణాలను సర్వజన సౌకర్యం కొరకు సంగ్రహించడం మొట్టమొదట క్షేమేంద్రుడే చేసినట్లుకనిపిస్తుంది.

*3. బృహత్కథామంజరి:—* సకలకథా నిధానమైన గుణాఢ్యుని బృహత్కథకు సంస్కృతానుసరణమిది. బృహత్కథ పైశాచీప్రాకృతంలో వ్రాయ బడినదని అంటారు. దానిని సుమారు ఏడువేల శ్లోకాలతో క్షేమేంద్రుడు సంగ్రహించినాడు.

పై మూడుకృతులు అన్ని విధముల సహృదయ రంజకములై "మంజరిత్రయం" అనే పేరుతో వ్యవహరింప బడుతున్నాయి.

*4. బౌద్ధావదానకల్పలత:—* ఇది గౌతమబుద్ధుని జాతక కథలను మనోహరంగా చిత్రించినది. నూటఎనిమిది అధ్యాయాలలో విరాజిల్లుతున్న యీ గ్రంథంకూడ క్షేమేంద్రుని బృహద్గ్రంథాల పట్టికలో చేరుతుంది.

ఇవిగాక 'దశావతారచరితం' అనే కావ్యం ఒకటి. శ్రీమహావిష్ణువు యొక్క పది అవతారాలను ఇంచుమించు రెండువేల శ్లోకాలలో సరస సుందరంగా చిత్రిస్తూ ఉన్నది. అట్లే "నీతికల్పతరువు" అనే మరొక గ్రంథం నూట ముప్పైఎనిమిది అధ్యాయాలలో రాజనీతిని ప్రబోధిస్తున్నది. "లోక ప్రకాశం" అనే వేరొక బృహద్గ్రంథం నాటి కాశ్మీరముయొక్క, ప్రజల యొక్కయు, జీవన విధానాన్ని వర్ణిస్తున్నది. ఈ విధంగా ఏడు మహాగ్రంథాలు క్షేమేంద్రుని ప్రతిభా ప్రకాశకములై ప్రకాశిస్తున్నవి. వీని వలన క్షేమేంద్రుని శక్తియుక్తులు, అనుసంధాన చాతురి, భావవైవిధ్యం, కవితా విన్యాస విశేషాలు ప్రస్ఫుటం అవుతాయి. అందు వలననే ఈ గ్రంథాలను సామాన్యంగా స్పృశించడం జరిగింది.

ఈన "ఔచిత్య విచార చర్చ" 'కవికంఠాభరణం' 'సువృత్తతిలకం' 'చతుర్వర్గ సంగ్రహం' 'చారుచర్య' 'దర్పదలనం' 'సేవ్య సేవకోపదేశం' 'కళావిలాసం' 'దేశోపదేశం' 'నర్మమాల' 'సమయమాతృక' అనే పదకొండు లఘుకృతులు క్షేమేంద్ర సరస్వతీ కంఠాభరణములై ప్రకటింపబడియున్నవి. వీనిలో క్షేమేంద్రునికి ప్రత్యేకంగా గౌరవాన్ని సంపాదించి పెట్టినవి, అతని వ్యక్తిత్వాన్ని ఎత్తిచూపేవి కొన్ని కృతులున్నాయి. వాని విశేషాలుకొన్ని:

"కావ్యమునకు ఔచిత్యమే జీవిత" మని క్షేమేంద్రుడు "ఔచిత్య విచార చర్చ"లో చర్చించి లక్ష్యోదాహరణ పూర్వకంగా స్థాపించినాడు.

"అలంకారాస్త్వలంకారా గుణా ఏవ గుణాస్సదా।
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్॥
"ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిలయస్యయత్।
ఉచితస్యచ యోభావ స్తదౌచిత్యం ప్రచక్షతే॥

మొదలయిన వచనాలలో "ఔచిత్యమే కవిత్వానికి ప్రాణం" అని సిద్ధాంతం చేసినాడు. ఔచిత్యాన్ని ఇరవైయేడు విధాలుగా విభజించి అన్నింటికీన్ని ఉదాహరణాలను ప్రస్తరించినాడు. దీనివలన క్షేమేంద్రునికి అలంకార శాస్త్రంలో విశిష్టమైన స్థానం లభించినది. కావ్యాత్మసిద్ధాంత ప్రవర్తకాచార్యులయిన ఆనంద వర్ధనాదుల పంక్తిలో "ఔచిత్యప్రస్థాన ప్రవర్తనాచార్య" అను బిరుదుతోపాటు ఒక పీఠంకూడా సంప్రాప్తమైనది.

"కవికంఠాభరణం" "సువృత్త తిలకం" అనే రెండుకృతులు కవులకు శిక్షణ నిచ్చేవిగా ప్రకాశిస్తున్నవి. ప్రాసంగికంగా అక్కడక్కడ కవితాభ్యాసాన్ని గురించి రెండు మూడు మాటలను అనడంతప్ప అలంకార శాస్త్రంలోని గ్రంథాంతరాలు కవిశిక్షణను గురించి అధికంగా మాట్లాడవు. ఈ రహస్యాన్ని గ్రహించి క్షేమేంద్రుడు కవులకై ప్రత్యేకంగా ఈ రెండు కృతులను నిర్మించినాడు. కవిత్వమూలకారణమైన ప్రతిభ ఎట్లున్నా, తానుచెప్పిన మార్గాల ననుసరించి అభ్యాసం సాగిస్తే సర్వులకున్నూ కవిత్వం అలవడే అవకాశం ఉంటుందని క్షేమేంద్రుని విశ్వాసం.

"తత్రాద్యకవేః కవిత్వాప్తిః శిష్యప్రాప్తగిరః కవేః।
చమత్కృతి శ్చ శిక్షాప్తా, గుణదోషోద్గతి స్తతః
పశ్చాత్పరిచయ ప్రాప్తిరిత్యేతే పంచసంధయః.

... అనువచనములతో 'కవికంఠాభరణా'న్ని అయిదు సంధులుగా విభజించి కవితా సాధకులకు కవితాసిద్ధులకుకూడా ఉపయోగించే శతాధికమైన శిక్షణలను అతడు వ్యాఖ్యానించినాడు.

"ఇత్యాయరుక్షోః ప్రథమోపయుక్తం
ప్రవృత్త వాచశ్చ వివేకకారి ।
మహాకవేరప్యతి సూక్ష్మతత్త్వ
విచారహర్ష ప్రదమేతదుక్తమ్ ॥

అను వచనంతో "సువృత్తతిలకాన్ని" ఉపసంహరిస్తూ ఏ సందర్భంలో ఏయే వృత్తాలను ఉపయోగిస్తే బాగుంటుందో అందులో విచారించి అది సర్వవిధ కవులకున్ను ఉపాదేయమని చాటినాడు. ఈ విధంగా రెండు కృతులు క్షేమేంద్రునికి "కవిశిక్షకుడు" అనే అద్వితీయమైన 'కితాబు'ను సంపాదించి పెట్టినాయి.

ఇక "చతుర్వర్గ సంగ్రహము" "చారుచర్య" మొదలగు నాలుగు కావ్యాలు సుభోధమైన శైలిలో నీతిని ఉపదేశించుటకు సింసిద్ధమైనవి. తెల్లవారు జామున లేచుట మొదలుకొని రాత్రితొమ్మిదిగంటల ప్రాంతంలో పడుకునే వరకు మానవుడు చేయవలసిన ధర్మార్థ కామప్రదమైన దినచర్యను చారుచర్య చారువచనాలతో ఉపదేశించినది. ఇట్లు దినచర్యను ఒక కృతిగా నిర్మించుట మొదటిసారిగా క్షేమేంద్రునివలననే జరిగినది. అతనికిది ప్రత్యేకత. అన్నింటినీ మించి శాశ్వతమైన ప్రతిష్ఠను సంపాదించి పెట్టిన ఒక ఘట్టాన్ని కొంత విశేషంగా ముచ్చటింపక తప్పదు. అది క్షేమేంద్రుని "ఉపహాసకావ్య నిర్మాణము". సమాజంలోని దౌర్బల్యాలను సున్నితమైన హాస్యంతో ఎత్తిచూపి, దుర్వ్యసనులకు సిగ్గు కలిగించి క్రమంగా సమాజంలో అట్టి దౌర్బల్యాలు సన్నగిల్లే ఉద్దేశ్యం పెట్టుకొని, సాగించు రచనను 'ఉపహాసకావ్యమ'ని అనవచ్చు. ఆంగ్లంలో ఇట్టి రచనను 'శటైర్' అంటారు. నవనవో న్మేషం గలి పాశ్చాత్య ప్రక్రియలలో ఈ ఉపహాసకావ్య ప్రక్రియ చాలకాలంగా పుట్టి చక్కగా పెరిగియున్నది. కాని సంస్కృత ప్రక్రియలలో ఇది అంతంత మాత్రంగానే ఉన్నది. ఉన్నకొద్ది 'ఉపహాసకవితకు' 'ఆదికవి' క్షేమేంద్రుడే. అందువలననే 'సంస్కృతంలో సామాజికదృష్టిగల కవి ఎవరు' అనే ఈనాటి

తాత్పర్యంలో వేసే ప్రశ్నకుకూడా 'క్షేమేంద్రు డొక్కడే' అనేసమాధానం చెప్పుకొనక తప్పదు. సమకాల సమాజంలో అనుభూతములైన సామాన్య విశేషదోషాలను అన్నింటిని క్షేమేంద్రుడు బయటకులాగి—వాటికి ఉపహాస శస్త్రచికిత్సచేసి విడిచి పెట్టినాడు.

అతడు రచించిన ఉపహాస కావ్యాలు ముఖ్యంగా మూడున్నవి. 'కళావిలాసం' 'దేశోపదేశం' 'నర్మమాల' అనివానివ్యవహారం. ఇంచుమించు పంద్రెండు వందల శ్లోకాలతో ఈ మూడింటి నిర్మాణం జరిగింది. కామ క్రోధాదులయిన సామాన్యదోషాలు, సురాపానం, వేశ్యాగమనం, జూదమాడడం మొదలయిన విశేషదోషాలు— వివిధధూర్తులు-కాయస్థుడు, అప్పిచ్చువాడు, వంచక వైద్యుడు, చూస్తూండగానే దొంగిలించు కంసాలి, అన్యాయవాదియైన న్యాయవాది, పాపాలను పండించుకొనే న్యాయమూర్తి-ఈ మొదలయిన సమాజ దుష్టకీటకాలు-వాని యొక్క తత్త్వాలున్ను ఈ కావ్యాలలో సహజ సుందరంగా చిత్రింపబడి ఉన్నవి. అలంకారికులు పట్టుపట్టి చూచినా కావ్య సంపదకు లోటుకనిపించని కావ్యత్రయం ఇది.

హాసేన లజ్జితో౽త్యంతం న దోషేషు ప్రవర్తతే
జనస్తదుపకారాయ మమాయం స్వయముద్యమః॥

"మానవుని దోషాలను సున్నితంగా పరిహాసిస్తే అతడు సిగ్గుపడి క్రమంగా వానినుండి వైదొలగుతాడు. అందుకోరకే నేనీ రచన సాగిస్తున్నాను" అని క్షేమేంద్రుడు ప్రతిజ్ఞచేసినాడు. మచ్చుకు ఒకటిరెండు ఉపహాస వచనాలను చవిచూదాము.

'తామ్రఘటోపమశీర్షో ధూర్తోహిరసాయనీ జరాజీర్ణః
కేశోత్పాదనకథయా ఖల్వాటానేవ ముష్ణాతి.'

'బోడిరాగిచెంబు వంటి బుర్రతో ఒక మందులవాడు ఇది అమోఘమైన కేశవర్ధనీ తైలమని చాటుతూ బట్టతల వాళ్ళందరిని దోచుకుంటాడు.' అని భావం.

'హస్తస్థాధన రేఖావిపులతరా౽స్యాపతిశ్చ అచిత్తః
మృద్వాణి కులవధూనామిత్యాఖ్యాకమలకోమలం పాణిమ్.'

"తరుణ వంచక సాముద్రికు డొకడు సుమకోమలాంగి చేతిని పట్టుకొని 'నీ చేతిలో ధనరేఖ ఉన్నది. నీ భర్తమాత్రం పాపం కొంచెం చపలుడు' మొదలయిన ఫలములను చెపుతూ తనివితీరా ఆచేతిని నలిపి లోపలమణిగియున్న తన వాంఛను తీర్చుకుంటాడు" అని తాత్పర్యం.

"అధికరణాంబుధి మధ్యేజ్వలంతి బడబాగ్నయః సతతభక్షాః
జనఘనధనమనసా యేభట్టాఖ్యా న్యాయచోరాస్తే॥"

"నాయ్యస్థానం అనేది ఒక మహాసముద్రం. అందులో ఉండే న్యాయమూర్తులు న్యాయవాదులున్ను బడబాగ్నులవంటివారు. సర్వ భక్షకులు. వారి మనసులెప్పుడున్ను 'జనులధనాన్ని ఎలా అపహరించడమా' అనే విషయం మీదనే లగ్నమయి ఉంటాయి" అని భావం.

ఈ విధంగా సమాజంలో ఉండే అన్నివిధాల దౌర్బల్యాలను అనాచారాలను అన్యాయాలను క్షేమేంద్రుడు ఎత్తిచూపించి చేటలతో చెరిగివేసినాడు. అతని ఉపహాసవచనాలు సర్వసమాజ రోగ దివ్యౌషధాలనడంలో సంశయం లేదు.

పోతే "కనకజానకి" "చిత్రభారతం" మొదలయిననాటకాలు "లావణ్యవతి" "ముక్తావళి" మొదలయినకావ్యాలు 'పద్యకాదంబరి' అనేపద్యకాదంబరి సంగ్రహం.—ఈ విధంగా అక్కడక్కడ క్షేమేంద్ర గ్రంథాలలోను గ్రంథాంతరాలలోను వినిపించే పదిహేడు రచనలు కాలగర్భంలో కలిసిపోయినట్లు కనిపిస్తుంది.

పై సంగ్రహ సమీక్షవలన క్షేమేంద్ర మహాకవి బహుముఖంగా సంస్కృత సాహిత్యసేవను చేసినవాడని భావుకులు భావింపగలరు.

---

# 10. సంస్కృత సాహిత్యంలో సాంఘిక రూపకాలు

శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ

సువిశాల భారతములో సంస్కృత సాహిత్యం మహావటవృక్షంవలె శాఖోపశాఖలుగా విస్తరించి ఉంది. మహాకావ్యం, ఖండకావ్యం, చంపువు, కధ, ఆఖ్యాయిక, ముక్తకం, శతకం, మొదలగునవి ఆసాహిత్యవటవృక్ష శాఖలలో కొన్ని. వానిలో అన్నింటికన్న సర్వోత్తమంగా పెరిగి సుందరం గాను సహృదయ మనోహరంగాను వ్యాపించినశాఖ–రూపకశాఖ–లేక–సామాన్య పరిభాషలో చెప్పుకుంటే నాటకశాఖ–సంస్కృత సమాజంలో కవి యొక్క, సామాజికుని యొక్కయు ప్రతిభావ్యుత్పత్తులూ భావుకత బహు ముఖంగా పరిణతి చెందిన సందర్భములో సాహిత్యరసాల ఫలంగా రూపొందు తుందిరూపకం. అందుచేతనే "నాటకాంతంహిసాహిత్యం"అనీ "నాటకాంతం కవిత్వం" అనీ సాహిత్యవేత్తలు అంటూ ఉంటారు. అనగా సాహిత్యపాథోధిని మథించగా ఉద్భవించే అమృతమే రూపకమని తాత్పర్యం.

సాహిత్యం, సంగీతం, నాట్యం లేక అభినయం ఈమూడు ముప్పేటగా అల్లుకొని సహృదయులకు సంపూర్ణంగా రసానుభూతిని కలిగించే శక్తి లోకవృత్తాన్ని జీర్ణింపజేసే యుక్తి జీవిత పథాన్ని తీర్చిదిద్దేశక్తి ఒక్క రూపకప్రక్రియలోనే ఉంటాయిగాని వేరొక సాహిత్యప్రక్రియలో ఉండవు. కనుకనే కాళిదాసు "త్రైగుణ్యోద్భవమత్రలోక చరితం నానారసంధృశ్యతే! నాట్యంభిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధకమ్॥ అని నాట్య వైభవాన్ని ప్రశంసించినాడు. విశ్వజనీనంగా సంతృప్తిని కలిగించేసామర్థ్యం ఒక్క నాట్యానికే ఉందని అతని అభిసంధి కాబట్టే ప్రపంచ సాహిత్య సౌధంలో కూడా రూపకప్రక్రియకే భద్రపీఠంలభించింది.

ప్రాచీన సంస్కృత సాహిత్యంలో రూపకాలు ముద్రితాలు అముద్రి తాలు కలిపి లెక్కకు అరువందల వరకు ఉన్నాయని అభిజ్ఞుల అంచనా. కాల

గర్భంలో కలిసి పోయిన వానికి లెక్క లేదు. నేడుకూడా అక్కడక్కడ చెదురుగా సంస్కృతంలో రూపకరచన సాగుతునే ఉంది.

అయితే ఒకవిశేషం. ఉత్తమమైన సంస్కృత రూపకాలు మొదటనుండి కొన్ని ప్రత్యేక లక్షణాలను సంతరించుకొని, చివరి వరకు వానిలోనే పెరిగి పెద్దవై ఒకే మూసలో పోతపోసిన వానివలెనే తయారయినాయి. రామాయణ మహాభారతకథలే వానిలోని మూలవస్తువులు. "రామాయణాశ్రితాలు భారతాశ్రితాలు" అనేవి రెండే రెండు రూపకప్రధాన విభాగాలని చెప్పినాచెప్పవచ్చు. వీరశృంగారాలేవానియందలి ప్రముఖరసాలు. వేదపురాణ ప్రచోదితాలయిన ధర్మాలే వాని ఉపదేశనిష్యందాలు. భారతీయ సంస్కృతికి, తత్త్వానికి ఆర్ష సంప్రదాయానికిన్నీ విరుద్ధంగా దేనినీ వానిలో ప్రతిపాదించే అవకాశం లేదు. రసనాయకాను గుణంగా కొంచెం మార్పులు మాత్రం చేసుకోవచ్చు.

"యత్తత్రాఽనుచితం కించిత్ నాయకస్యరసస్యవా।
విరుద్ధం, తత్పరిత్యాజ్యమన్యథావా ప్రకల్పయేత్॥

అని ఆలంకారికులిచ్చిన 'కన్సెషను' తాత్పర్యం అంతవరకు మాత్రమే.

ఇట్టి సుప్రతిష్ఠిత లాక్షణిక మార్గంలో సంస్కృత సాహిత్యం పసందయిన సాంఘిక రూపకాలను ప్రపంచ భావుకులకు అందీయ లేక పోయింది. అంటే సాంఘిక రూపకాలకు మనం నేటి సమాజంలో చెప్పుకొనే సమన్వయానికి సమగ్రలక్ష్యం కాగలిగిన రూపకం ఒక్కటి కూడా సంస్కృతంలో లేదనే భావం. ఇలా అనగానే సంస్కృతాభినివిష్టులు విరుచుకు పడనక్కరలేదు. ప్రశాంతభావనా భావితులు మాత్రం కావలసి ఉంటుందని మనవి. "సమకాలిక సమాజంలో నిత్య జీవన విలాస విలసితములయిన పాత్రలను తీసుకొని, నియత సంకేతముల జోలికి పోకుండా వాస్తవికదృష్టితో మానవప్రవృత్తిని, దానిదౌర్బల్యమును, సామాజికసంఘటనలను, సమస్యలను వాని పరిణామాలను, ఫలితాలను ఉన్నదున్నట్లు చిత్రించి చూపేదే సాంఘిక రూపకం" అనిగదా నేడు చెప్పుకునే సాంఘిక రూపకలక్షణం! ఈలక్షణం ప్రసిద్ధంగా ఉన్న సంస్కృత రూపకాలలో దేనికి పూర్తిగా పట్టదు. ఏదో విధంగా అవికూడా సమాజానికే ఉద్దేశింపబడినవనీ, సమాజ శ్రేయస్సే వాటి

లక్ష్యంకూడా అనీ– ఈమొదలయిన ఛాందసవాదం ప్రారంభిస్తే మాత్రం సంస్కృతంలో ''సాంఘిక రూపకం'' కానిదంటూ ఏదీఉండదు. అవిధమైన వాదాల కోరక చిరునవ్వే పురస్కారం. తగ్గతగ్గనలేది కాదు కాదు.

ఇదిగో– ఈవిధమైన మౌలిక సత్యాలను మనసులో మనం మననం చేసుకొని ప్రస్తుత విషయాన్ని వింగడించుకోవలసి ఉంటుంది.

ఏకదేశ లక్షణాలను మాత్రమే పట్టి పరిశీలిస్తే సాంఘికచ్ఛాయలు ఉన్న సాంఘిక రూపకాలు కొన్ని సంస్కృత సాహిత్యంలో ఉన్నాయని గట్టిగానే చెప్పవచ్చును. ప్రకరణం, ప్రహసనం, భాణం, అని లాక్షణికులు పేరుపెట్టిన మూడురకాల రూపకప్రక్రియలులో సాంఘికచ్ఛాయలుఉండే అవకాశం ఎక్కువగాఉంది. నాటకమనేప్రక్రియలోకూడా కాలక్కాలిక సామాజిక స్థితిగతులను సూచించే సంఘటనలు కొద్దిగా ''అక్కడా ఇక్కడా'' గోచరిస్తూ ఉంటాయి. సాంఘికచ్ఛాయలు గల రూపకాల్లోకూడా ప్రకరణానికే ఒక మంచి ''అంతస్తు'' లాక్షణికుల చూపులో స్థిరపడింది. మిగిలిన ప్రక్రియలన్నీ వారి దృష్టిలో క్షుద్రాలు. అయినపుడు ''ఉత్తమ సాంఘికం'' అంటే మకి చిక్కుల్లో పడిపోతాం. కాబట్టి అటువంటి విశేషాల జోలికి పోకుండా ఉన్నవానిని తీసుకొని సామాన్య పరిశీలన చేయడం మాత్రమే ప్రస్తుతం సముచితం.

మొట్టమొదట ఇటువంటి సాంఘిక రూపకాన్ని రచించినవాడు అనే 'కీర్తి' మహాకవి భాసునికి దక్కింది. 'దరిద్రచారుదత్తం' – లేక – చారుదత్తం. అనే రూపకంలో భాసుడు సమకాల సమాజంలోని రెండు విశిష్ట పాత్రలను స్వీకరించి వారి ప్రేమానుబంధాన్ని చిత్రీకరించినాడు. సంపన్నుడయిన కుటుంబి– అత్యౌదార్యంతో తన ఐశ్వర్యమంతనూ దానధర్మాలకు వినియోగించి చివరకు తాను, భార్య, ఒకబిడ్డడు, ఒక ప్రాణమిత్రుడు మాత్రమే మిగిలియుండవలసిన స్థితిలో పడినాడు. రూపయౌవనశీలసౌభాగ్య సంపన్న అయిన వసంతసేన అనే వేశ్య కేవలం గుణరూప పక్షపాతంతో చారుదత్తుని ప్రేమించింది. ఈ సన్నివేశాన్ని బహుసుందరంగా మలచినాడు భాసుడు. కాని భాసుని యీ ''దరిద్రచారుదత్తం'' అనే రూపకం పూర్తిగా లభించలేదు. నాలుగంకాలు మాత్రమే మిగిలిఉంది.

భాసరూపకాన్నే ఆధారంగా చేసుకొని సమాజంలో సంభవించే మరి కొన్ని వివిధ పాత్రలతో, విచిత్ర మనస్తత్త్వాలతో సహజ సన్నివేశాలతో సర్వాంగరమణీయంగా సంకలితమయిన సాంఘికరూపకం శూద్రకుని 'మృచ్ఛకటికం'. సంస్కృతంలోని సాంఘికరూపకాలలో ఇదే సర్వోత్తమం అనిపించు కుంటుంది. విశ్వజనీనంగా రసానుభూతిని కలిగించే సామర్థ్యంకూడా మిగిలిన వానికన్నా దీనికే సమధికంగా ఉంది. అందుచేతనే ఆమధ్య అమెరికాలోను రష్యాలోను మృచ్ఛకటికాన్ని పలుసార్లు అభినయించడం, అచటి సామాజికులు ఆనందించి "ఔను" అనడం సంభవించింది. ప్రపంచంలో ప్రసిద్ధమైన పలుభాషలలోనికి ఈ రూపకాన్ని అనువదించడంకూడా జరిగింది.

ఇందు వసంతసేనా చారుదత్తుల ప్రణయం శకారుడనే రాజుగారి బావమరది చేతులలో నలిగి వాడిపోయి, దైవికమైన సంఘటనలతోడి చెలిమి వలన ఉక్కిరి బిక్కిరి అయిపోయి, చివరకు మరల ననలెత్తి నాయికానాయకుల మధుర పరిష్వంగంలో ఫలిస్తుంది. ఆయాసందర్భాలలో విటులు,జూదరులు, చోరులు, రక్షకభటులు, మొదలయిన బహువిధపాత్రల మూలంగా నాటి సంఘంలోని పరిస్థితులు, వ్యక్తుల మనస్తత్త్వాలు, దౌర్బల్యాలు దైవికమైన పరిణామాలున్ను భావుకుల కళ్ళముందు నాట్యమాడి, వారికవ్యయానందాన్ని సంపాదించి పెడతాయి. సంభాషణలలో గాని సంఘటనలలో గాని పాత్రలలో గాని-తుదకు నటనలో గాని-ఇందెక్కడను అసహజత్వం అనుభూతం కాదు. ఉదాహరణప్రాయంగా రెండు పద్యాలు-

"శూన్యైః గృహైః ఖలుసమాః పురుషా దరిద్రాః
కూపైశ్చతోయ రహితైస్తరుభిశ్చ శీర్ణైః।
యద్ దృష్టపూర్వజనసంగమ నిస్మృతానా-
మేవంభవంతి విఫలాం పరితోషకాలాః॥

"దరిద్రులు శూన్యగృహాలతో నీరు లేని నూతులతో ఎండిపోయిన చెట్లతోను సమానమవుతారు. పూర్వపుప్రాణ మిత్రులు కూడ వారిని మరచిపోతారు. కాగా దరిద్రుల సంతోష సమయం కూడా నిష్ఫలమే." చారు దత్తుని నోటి నుండి ఒక సందర్భంలో వచ్చిన మాటలివి.

"మేఘా వర్షంతు, గర్జంతు, ముంచంత్వశనిమేవవా॥
గణయంతి నశీతోష్ణం రమణాభిముఖాః స్త్రియః॥

"మేఘాలు ఉరమనీ-గట్టిగా వర్షించనీ – పిడుగులు పడనీ – ఏమి ఏమయినా సరే ప్రియుని కోరకై బయలుదేరిన స్త్రీలు శీతోష్ణాలను లక్ష్యం చేయరు". చారుదత్తుని కలియుటకై వర్షంలో బయలుదేరిన వసంతసేన మాటలివి.

వీనివలన మృచ్ఛకటికం యొక్క శైలికూడా చారుతరంగా ఉంటుందని సహృదయులు గ్రహించగలరు.

మృచ్ఛకటికం తరువాత లెక్కింపదగినది భవభూతి మహాకవి యొక్క "మాలతీ మాధవం" ఒకటి ఉన్నది గాని – అది అంత సహజంగా సంపూర్ణం కాదు. మాలతీ మాధవుల ప్రణయమే ఇందలి వస్తువయినను, సన్నివేశ సంభాషణాది నిర్వహణలో అధికంగా కృత్రిమత్వం స్ఫుటమవుతూ ఉంటుంది.
తరువాత భాణం, ప్రహసనం అనే కొంచెం చవకబారు ప్రక్రియలోకి మనం రావలసి వుంటుంది. ఇందులో పచ్చి శృంగారం, మోటుహాస్యం హెచ్చుగా ఉంటాయి. ఈ విధమయిన రూపకాలలో ప్రాచీనమయినది 'లటకమేలకం' అనే ప్రహసనం. దీనికర్త 'శంఖధరుడు'. అతి నవ్యపద్ధతులలో సంస్కృత సాహిత్యసృష్టి నేడుకూడా ఉత్తర భారతంలో విరివిగా జరుగుతూనే ఉంది. ఆధునిక భావనా భావితములైన కథలు, కథానికలు, గల్పికలు మొదలయిన వానితోపాటు సామాజిక సమస్యాగర్భితాలయిన ఇతివృత్తాలతో చిన్నచిన్న రూపకాలు ఆవిర్భవిస్తూనే ఉన్నాయి. అయితే భాషకు పట్టిన గ్రహచారంవల్ల వానికి బహుళప్రచారం కలగకుండా పోతున్నది.

ప్రహసనముల ప్రసంగంరాగానే సాంఘిక ప్రయోజనాన్నికూడా బాగా మనస్సులో ఉంచుకొని రచింపబడిన రెండు ముఖ్యమైన ప్రహసనాలను స్పృశింపక తప్పదు. అందొకటి 'మత్తవిలాసము'. కాంచీపురపు పల్లవ రాజులలో ఒకడయిన మహేంద్ర విక్రమవర్మ దీని కర్త. రెండవది 'భగవదజ్జుకము.' ఇదికూడ మహేంద్రవర్మ విరచితమే అనడానికి చాలాసాధనాలున్నాయి. కాని వ్యాఖ్యాతమాత్రం దీనిని బోధాయనకృతమనిచెప్పినాడు.

ఏది ఏమయినా యీ రెండు ప్రహసనాలున్నూ నాడు సమాజంలో చరచరా వ్యాపించి ఉన్న - వ్యాపిస్తున్న బౌద్ధధర్మాలను వానివలన సమాజంలోని వ్యక్తులకు కలిగే వెర్రివేషాలను పూర్తిగా దుయ్యబట్టి అపహాస్యం పాలుచేసి అణచివేయడాని కుద్దేశింప బడినవి. ఆస్తిక మతపారమ్య ప్రచారం వీని ప్రముఖలక్షణం. ఈ రెండిటిలోకూడా అన్నివిధాలప్రశంసింపదగినది 'భదవదజ్జుకము'. బౌద్ధధర్మములందు ప్రలోభం కలిగిన ఒకశిష్యునికి, యోగనిష్ఠుడయిన ఒక సన్యాసి అనుభవ పూర్వకంగా అన్ని సంశయాలను తీర్చి చివరకు బౌద్ధమం దనాసక్తిని యోగమందును అధ్యయనమందును ఆసక్తిని కలిగించడం ఇందలి యితివృత్తం. ప్రహసనాంతరములలో మృగ్యమైన సున్నితమైనహాస్యం, సభ్యమైన పరిహాసం ఇందులో సహృదయులకనుభూతం అవుతుంది. నాడు బౌద్ధాన్ని అరికట్టడంలో పై రెండు ప్రహసనాల ప్రభావం చాలవరకు ఉండియుండునని విమర్శకు లంగీకరించినారు.

కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగారు సంపాదించిన 'చతుర్భాణి' అనునది దురదృష్టవశమున నాకు లభ్యం కాలేదు. భాణమనే పేరుగల రూపకాలు నాలుగు అందు సంకలితమైనవి. భాణ సామాన్య లక్షణాలు మాత్రం పైన పేర్కొన్నట్లు అన్నిచోట్ల సమానమే. అవి సమాజిక రూపకాలుగా పెద్దగా చెప్పుకోతగ్గ అంశాలేమీ వానిలో ఉండవనిన్నీ మనం ఊహించుకోవచ్చు. ''ధూర్త సమాగమం'' కాళిదాసుని పేరుతో ఉన్న మరియొకప్రసిద్ధ ప్రహసనం మొదలయినవి- ఈ కోవకు చెందినవి చాలా ఉన్నాయి. ఇట్లే వామన భట్టభాణుని 'శృంగారభూషణం' వంటి భాణ ప్రక్రియా నిర్వాహ్యకథములుకూడా బహుళంగానే ఉన్నాయి.

అయితే ఈ రూపకాల్లోని సందర్భాలు అంతగా సభ్యంగా ఉండవు. వేశ్యలు వేశ్యామందిరాలున్ను వీని ఇతి వృత్తాలకు కేంద్రాలు. సమాజంలో పతిత వర్గానికి చెందిన వివిధ వ్యక్తులు, వీనిలోనిపాత్రలు. సకల వ్యసనాలకు దాసులయిన త్రాగుబోతులు,జూదరులు, రౌడీలు, వ్యభిచారులు, చోరులు - ఈ మొదలయినవారు ఒక వేశ్యయొక్క అనుగ్రహానికి అహమహమికతో ప్రయత్నించటం, పరస్పరం మోసగించుకుంటూ ఉండడం అవసరమయితే తన్నుకోవడం, తుదకు ఎవరో ఒకరికి ఆ వేశ్యా సమాగమం లభించడం అనే

పద్ధతిలో వీని కథ సామాన్యంగా సాగుతూ ఉంటుంది. త్రాగుడు, జూదం, వ్యభిచారం, దొంగతనం మొదలయిన దౌర్బల్యాలు సమాజంలో సర్వకాలాల్లోను నియతాలేనని, ఆయాసమయాలలో మాత్రం శాసనానుశీలనాది హేతువుల వలన వానికి లోనయ్యే వ్యక్తుల శాతంలో న్యూనాధికభావం ఉండవచ్చుననీ ఇట్టిరూపకాలు తెలియజేస్తూ ఉంటాయి. అంటే "సమాజ సామాన్య దౌర్బల్యాలకు ఇవి దర్పణాల వంటివి" అని తాత్పర్యం. అంతే గాని తత్కాలసమాజనియత ప్రత్యేక లక్షణాలను గాని ప్రత్యేక సమస్యలనుగాని ప్రత్యేక పరిష్కారములనుగాని ఇవి ఉద్దేశించవు.

సంస్కృత నాటకాల్లోకూడా చెదురుగా తత్కాలసమాజస్థితి గతులను సూచించే ఒకటి రెండువాక్యాలు కనిపిస్తూ ఉంటాయి. కాళిదాసు 'శాకుంతలం'లోకూడా దొంగలనుండి లంచం తీసుకొనే అలవాటున్నట్లు "కాదంబరీసాక్షికం"గా వారికి పరస్పర పరిచయం ఏర్పడుతుం దన్నట్లు సూచితమైఉంది. ఇట్లే నాటకాంతరాలలోకూడ తత్కాలసమాజం యొక్క కొన్ని ఆచారవ్యవహారాలు విశదమవుతూ ఉంటాయి.

ఇదే యించుమించు క్రీస్తుశకారంభంనుండి నేటివరకు సంస్కృత సాహిత్యంలో ఉన్న సామాజిక రూపకాలయొక్క స్థితిగతిచింతన సమీక్షా సంగ్రహం.

---

# 11. సంస్కృత సాహిత్యంలో ఉపహాస కావ్యాలు

శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ

'భాషాసు రమ్యా గైర్వాణీ
తస్యాం కావ్యం మనోహరమ్.'

అని పెద్దల ఆభాణకం. భాషలలోకెల్ల సంస్కృతం మధురమనీ, సంస్కృతంలో సంతరించిన సాహిత్యం మధురమనిన్నీ దీనిభావం. ఇది అన్ని విధముల అన్వర్థమైన వచనం. ఎందుచేతనంటే – సుమారు పది–పదిహేను వందల సంవత్సరాలపాటు భారతదేశంయొక్క ప్రతిభా ప్రవాహమంతా సంస్కృత సాహిత్య సౌందర్య సంధానమునకే వినియుక్తమయినది. తత్ఫలితంగా "సహస్రశీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్" అన్నట్లు సంస్కృత సాహిత్యం విశ్వరూప విరాజితమై ఒప్పుచున్నది. వేదసంహితలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు మొదలైన వైదిక సాహిత్య ప్రక్రియలలోనే సకలవిధ సాహిత్య బీజములున్ను చోటుచేసికొన్నవి. తదాధారంగా లౌకిక సంస్కృతసాహిత్యంలో వివిధ సారస్వత ప్రక్రియలు వెల్లివిరిసినవి. ఇతిహాసాలు, పురాణాలు, మహాకావ్యాలు, ఖండకావ్యాలు, ముక్తకాలు బహువిధరూపకాలు, శతకాలు, గేయకావ్యాలు, చంపువులు, కథలు, కథానికలు, అన్యాపదేశకావ్యాలు మొదలయిన ప్రక్రియలు దేశకాలపాత్రానురోధంగా రూపరేఖలను తీర్చిదిద్దుకొన్నవి. సంభావితమైన ప్రతియొక్కసాహిత్యప్రక్రియయు, ఇంచుమించు–సంస్కృత సాహిత్యంలో – ప్రయోగమును ప్రతిష్ఠించుకొన్నదని చెప్పవచ్చును.

అట్టి సాహిత్యప్రక్రియలలో ఒకటి ఉపహాసకావ్యప్రక్రియ. దీని స్వరూపస్వభావాదులను గురించి కొంత వివరణ అవసరం. ఉపహాస మనగా సున్నితమైన పరిహాసం. మోటుగా, కర్ణకఠోరంగా, గ్రామ్యంగాను ఉండక, మృదుమధురంగా, సర్వజనాస్వాద్యంగా, సమర్థంగాను ఉండేహాస్యాన్ని

అగ్రామ్య పరిహాసమనీ, ఉపహాసమనీన్నీ వ్యవహరించవచ్చు. ఇట్టి ఉపహాసాన్ని ప్రధానంగా సమన్వయించుకొని, ప్రస్తరింపజేసిన శబ్దార్థ విన్యాసాన్ని లేక రచనను ఉపహాసకావ్యమని అంటారు. సమాజంలోని వివిధవర్గాలలో, వివిధస్థాయిలలో పుట్టి పెరిగే దౌర్బల్యాలను, దోషాలను, కుళ్ళును సున్నితంగా పైకెత్తిచూపి, వాని విషయంలో వైముఖ్యాన్ని కలిగించి సమాజాన్ని సంస్కరించి, అభ్యుదయమార్గానుయాయిగా తీర్చిదిద్దడమే ఉపహాస కావ్యంయొక్క ప్రధాన ప్రయోజనం. ఈ అంశాన్ని ఉపహాసకవిశేఖరుడు క్షేమేంద్రుడిట్లు చెప్పియున్నాడు-

"హాసేన లజ్జితో౽త్యంతం న దోషేషు ప్రవర్తతే
జనస్తదుపకారాయ మమాయం స్వయముద్యమం,"

"మానవుడు సున్నితమైన పరిహాసంతో సిగ్గిలి, దోషపరాఙ్ముఖుడు కాగలడు. కాన మానవోపకారమునకై నే నుపహాసకావ్యాన్ని రచిస్తున్నాను." అని యీ వచనంయొక్క భావం.

అయితే ఒక విషయం. పరిహాసాన్ని ప్రధాన సరణిగా ఉంచుకొని, తన్మూలకంగా ఉపదేశాన్ని అందించే కావ్యరచనావ్యాసంగం సంస్కృతంలో అంత విరివిగా జరుగలేదు. క్రీస్తుశకం పదవశతాబ్దానికి ముందువరకు ఉపహాసకావ్యరచనే జరిగినట్లు కనబడదు. తరువాత బయలుదేరిన ఉపహాస కావ్యాలయినా "పట్టుమని పది" ఉండవు. ఈ సన్నివేశానికి కారణం లేకపోలేదు. అనూచాన సంప్రదాయ ప్రపత్తే అందుకు ముఖ్యమైన కారణం. భారతీయతకు సంప్రదాయానుసరణమే జీవాతువుగదా! భారతీయ కవులకు, అందునను సంస్కృత కవులకు సంప్రదాయాతిక్రమణమన్న మహాభయం. "వీరశృంగారయోరేకః ప్రధానం యత్ర వర్ణ్యతే, ప్రఖ్యాత నాయకోపేతమ్" మొదలయిన వచనాలతో "కావ్యమందు వీరశృంగారాలలో ఏదో ఒక రసం ప్రధానంగా ఉండవలెనని, నాయకుడు పురాణప్రసిద్ధుడు కావలెనని, దీనికి భిన్నంగా రచింపబడిన కావ్యం ఆదరణీయం కాదనిన్నీ" ఒక సంప్రదాయాన్ని అనుసరించి వీరశృంగార ప్రధానములైన కావ్యనాటకాలే వందలకు వందలు సంస్కృత సాహిత్యంలో ఆవిర్భవించినవి. ఆ రచన లన్నిటిలోను గ్రహింపబడిన వస్తువు పురాణప్రసిద్ధమే. కాగా

హాస్యానికి ప్రత్యేకంగా స్థానం, సాహిత్యశిల్పంలో లభించలేదు. 'సాహిత్య రసాలలో హాస్యం ఒకటి'' అను పరిగణనం లభించినను, తత్ప్రధానమైన రచనలుమాత్రం చాలాకాలంవరకు స్వీకరింప బడలేదు. మహాకావ్యాలలో హాస్యరసానికి అవకాశమే కల్పింపబడలేదు. ఉన్న కొద్దిపాటి హాస్యాన్ని అక్కడక్కడ, అభినయ ప్రధానమైన రూపకాలలో లేశమాత్రంగా, ఏక రూపంగాను సమన్వయించడం జరిగింది. సంస్కృతరూపకాలలో హాస్యానికి ప్రతినిధి విదూషకుడు. అతని వలన స్ఫురించే హాస్యం అతని వికృతవేషాన్ని, భోజనప్రియత్వాన్ని మాత్రమే ఊతగా తీసికొని ప్రవర్తిస్తూ ఉంటుంది. కొన్ని రూపకాలలో విదూషక ప్రసక్తికూడా కనిపించదు. ఈ విధంగా హాస్యానికి తగినంత పరిపోషణ లేకుండా పోయింది. సాహిత్య ప్రపంచంలో దానికి అంగభావమేకాని అంగిభావ మెన్నడును యీయరాదన్నభావం కవి ప్రపంచంలో ప్రతిష్ఠితమైపోయినది. ఇది సంప్రదాయం వలన ఫలించిన పర్యవసానం.

తరువాత కొంతకాలానికి హాస్యరస ప్రధానమైన రచనలను, ముఖ్యంగా రూపకాలను కొందరుకవులు చేపట్టినారు. వానికి ''ప్రహసన ములు'' అని సాంకేతికమైన వ్యవహారం. ప్రహసనాలలోని హాస్యం చాల వరకు వెర్రితలలు వేసినదని చెప్పకతప్పదు. పచ్చిశృంగారం, మోటుహాస్యం సరస్పరం పోటీపడి, సహృదయులకు జుగుప్సను కలిగించడంలో ప్రప్రథమ హేతువులుగా ప్రహసనాలు ప్రవర్ధిల్లినవి. వానిలోని దేవతా నమస్కారం కూడ పచ్చిబూతుమాటలతో ప్రారంభమవుతుంది. ఉదాహరణ ప్రాయంగా కొన్నిమాటలను ఎత్తిచూపడానికికూడ మనస్సు ఒప్పదు. ఇది విశృంఖలత వలన వచ్చిన ఫలితం. ఈ విధంగా హాస్యం అసలు లేకపోవడం కాని, ఉంటే వెర్రితలలు వేయడంగాని జరుగుతూ వచ్చినది. ఇదే సంస్కృత సాహిత్యం లోని హాస్యచరిత్ర సంగ్రహం.

అయినను ''సంస్కృత సాహిత్యంలో ఉపహాస కావ్యాలులేవు.'' అన్న అప్రతిష్ఠరాకుండా కాపాడిన మహాకవులు కొందరున్నారు. వీరు హాస్యాన్ని ఉన్నతస్థాయికి తీసుకువెళ్ళి, వ్యంగ్యమర్యాదతో సదుపదేశసాధ నంగా మలచినారు. కేవలం ''కాంతా సమ్మితం''గా ఉంటూవచ్చిన కావ్యం వీరిచేతిలో ''ప్రౌఢచండీ కాంతా సమ్మితం''గా పరిణతి చెందిన దనవచ్చును.

గ్రామ్యపరిహాసం జుగుప్సాకరమని, ఉపదేశదాయకం కాజాలదని, అగ్రామ్య చతుర పరిహాసం ఆనందదాయకమని, నీతిమార్గప్రబోధకం కాగలదనిన్నీ వీరికావ్యం ఘంటాపథంగా నిరూపిస్తుంది. సమాజంయొక్క వివిధ దౌర్బల్య రోగాలకు యిట్టి కావ్యం దివ్యౌషధంగా పనిచేస్తుంది.

సంస్కృత సాహిత్యచరిత్రలో కనుపిస్తున్న కొద్దిమంది ఉపహాస కావ్యకర్తలలో అగ్రగణ్యుడు కాశ్మీరదేశీయుడైన క్షేమేంద్ర మహాకవి. ఇతడు బహుముఖ ప్రతిభాసంపన్నుడు. బహువిధసాంగత్య ప్రక్రియాసంధాన చతురుడు. కళావిలాసం, దేశోపదేశం, నర్మమాల, అనుమూడున్ను క్షేమేంద్రుని ప్రతిభాఫలములుగా వెలువడిన ఉపహాసకావ్యాలు. సహజములు, సార్వత్రికములును అయిన సమాజదోషాలు, సమకాల కాశ్మీరసమాజ ప్రత్యేక దోషాలున్ను క్షేమేంద్రుని ఉపహాసములకు పాత్రములైనవి. ఇతని పరిహాసవచనం సున్నితంగాను, నిశితంగాను ఉండి ఆయాదోషదూషితుడు చదువుకొన్నను మొదట నవ్వుపుట్టించి పిదప తనలోతనకే సిగ్గుకలిగించి, చివరకు క్రమంగా దోషదూరునిగా చేయుటకు సమర్థంగా ఉపయోగిస్తుంది. ఉదాహరణకుగా రెండుమూడు సందర్భాలు పరిశీలింపవచ్చును.

"హృత్వాధనం జనానాం దినమఖిలం వివిధ కూటమాయాభిః
వితరతి గృహే కిరాటః కష్టేన వరాటకత్రితయమ్."

వర్తకులను ఆక్షేపించు సందర్భమిది. వివిధములైన మోసములుచేసి పగలంతా జనుల ధనమును దోచుకుని, ఇంటికి వెళ్ళినతరువాత వర్తకుడు అతికష్టముతో మూడు చిల్లిగవ్వలను దానంచేయును— అని దీనిభావం.

"తమసి వరాకశ్చౌరో హాహాకారేణ యాతి సంత్రస్తః।
గాయనచోరః ప్రకటం హాహాకృత్యైవ హరతి సర్వస్వమ్॥"

ఇది గాయకులపైన విసరిన విసురు. చీకట్లో దొంగవస్తే మనం హాహాకారం చేయగానే భయపడి పారిపోతాడు. కాని గాయకుడనే దొంగ మాత్రం పట్టపగలే కళ్ళఎదుటనే తనే హాహాకారంచేసి మన సర్వస్వం దోచుకుంటాడు— అని తాత్పర్యం.

"వివిధౌషధ పరివర్తైః యోగైః జిజ్ఞాసయా స్వవిద్యాయాః ।
హత్వా నృణాం సహస్రం పశ్చాత్ వైద్యోభవేత్ సిద్ధః॥"

వైద్యులమీద వదలిన వజ్రాయుధమిది. తన విద్యను పరీక్షించుకొన డానికి, తరచుగా మందులను మారుస్తూ కొత్త ప్రయోగాలనుచేస్తూ, ఒక వెయ్యిమందిని చంపి తరువాత వైద్యుడు సిద్ధహస్తుడవుతాడు- అని భావం. ఇటువంటి సన్నివేశాలు క్షేమేంద్రుని ఉపహాస కావ్యాలలో వేలకువేలు ఉన్నవి. ఉపహాసకవి శిరోమణియైన ఈ క్షేమేంద్రుడు కాశ్మీరదేశంలో క్రీస్తుశకం పదకొండవ శతాబ్దంలో కవితావీరవిహారం చేసినాడు.

చారిత్రకంగా చాలప్రాచీనమై ఉపహాస కావ్యాలకోవలోకి రాదగిన రూపకమొకటి ఉన్నది. దాని పేరు 'మత్తవిలాసము.' క్రీస్తుశకం ఏడవ శతాబ్దంలో కాంచీపురాన్ని పరిపాలించిన మహేంద్రవిక్రమవర్మ అనేరాజు ఈ రూపకాన్ని రచించాడు. లాక్షణికంగా యిది హాస్యరసప్రధానమైన ప్రహసనం. ఉపలబ్ధమైన ప్రహసనాలలో ఇదే మొదటిదనికూడ అంటారు. ఇందులో ఒక కపాలి, ఒక బౌద్ధభిక్షువు, ఒక ఉన్మత్తుడు, ఒక వేశ్యాంగన, ఒక పాశుపతుడు – వీరలమధ్య యితివృత్తం నడుస్తుంది. "సురతం, సురాపానం – జీవితమంటే అర్థం యీ రెండువస్తువులే సుమా!" అన్న సిద్ధాన్తం సంభాషణలద్వారా ప్రతిష్ఠింప బడుతుంది. ఈశ్వరుఁడే యీసిద్ధాంతాన్ని తాను ఆచరించి, లోకానుగ్రహం కొఱకై ఉపదేశించాడని నిరూపణ జరుగుతుంది.

పేయాసురా ప్రియతమా ముఖమీక్షితవ్యమ్
గ్రాహ్యః స్వభావలలితో వికృతశ్చ వేషః ।
యేనేద మీదృశ మదృశ్యత మోక్షవర్త్మ
దీర్ఘాయురస్తు భగవాన్ సపినాకపాణిః॥

"కల్లు త్రాగవలెను. ప్రియురాలి మోమునెప్పుడును చూస్తూకూర్చుండవలెను. తోచిన వికృతవేషమును ధరింపవలెను. ఇవియే మోక్షమార్గము లని పరమేశ్వరుడు ఆచరణపూర్వకంగా ఉపదేశించినాడు."-అని యీపద్యం యొక్క తాత్పర్యం. కాపాలిక, జైన, బౌద్ధమతములందలి అవకతవకలను సున్నితంగా కవి ఈప్రహసనంలో ఎత్తిపొడిచి విడచినాడు. "చివరకు స్త్రీ, సురావ్యసనం మంచిదికాదను" నీతియే కవియొక్క పరమలక్ష్యం.

“మత్తవిలాసము”ను పోలినదే మరొక ప్రహసనమున్నది. దాని పేరు “లటకమేళకం.” కర్త శంఖధరుడు. క్రీస్తుశకం పన్నెండవ శతాబ్దికిచెందినవాడు. ఒక వేశ్యయొక్క విందునుకోరి, ఆమె కుంటెనకత్తెయొద్దకుచేరి, ప్రగల్భములను కొట్టుచున్న దాంభిక శిరోమణుల యితివృత్తమందున్నది. ఇందు ఒక వైద్యశిఖామణి వైద్యానికి వచ్చి తన ప్రావీణ్యము నిట్లు ప్రకటించుచున్నాడు.

“వ్యాధయో మదుపచారలాలితాః
మత్ప్రయుక్తమమృతం విషంభవేత్ ।
కిం యమేన సరుజాం కి మౌషధైః
జీవహర్తరి పురః స్థితేమయి॥”

“రోగాలు నాపెంపుడు బిడ్డలు. నే నమృతం యిస్తే విషం అవుతుంది. అనాయాసమరణాన్ని కలిగించడంలో అందె వేసినచేయిని నేనుండగా ఈయముడూ గిముడూ ఎందుకండీ!” అని భావం.

ఆ వైద్యుడే చెప్పిన ఒక దివ్యౌషధ కల్పమిట్లున్నది—
“యస్య కస్య తరోర్మూలం యేన కేనాపి పేషయేత్ ।
యస్మై కస్మై ప్రదాతవ్యం యద్వా తద్వా భవిష్యతి॥”

“ఏచెట్టువేరైనా తీసుకో. దానిని నూరెయ్యి. అడిగినవానికిస్తూ వుండు. ఏదో ఒకగుణం కనిపిస్తూనే ఉంటుంది.” అనిభావం. ఈ విధంగా డంభవైద్యులను బాగుగా దుయ్యబట్టినాడు శంఖధరుడు. మరొక ప్రసంగంలో గురుశిష్యుల స్వభావం యిట్లు వర్ణించబడివుంది—

“ఉభావప్యశ్రుతౌ గ్రంథౌ, ఉభావపి జడాత్మకౌ ।
అహో మోహస్య మాహాత్మ్యం యదేకః శిష్యతాంగతః॥”

ఇరువురును గ్రంథపరిచయంలేనివారే. ఇద్దరున్నూ మందబుద్ధులే. అయినా అందొకడు శిష్యుడుగా తయారైనాడు. అది మోహవిలాసం!— అని తాత్పర్యం. నేటిగురుశిష్య సంప్రదాయాన్ని తుష్ణంగా నాడేపరిశీలించి, భవిష్యద్వాణిగా ప్రసరింపచేసిన వచనమా యిది — అని భావుకుల మనస్సు చివుక్కుమనక తప్పదు. ఇందే యింకొక సందర్భంలో వివాహదృశ్యాన్ని వర్ణిస్తూ “చతుర్వేదుడు” అనే వేదపండితుడు “జాతస్యహి ధ్రువో మృత్యుః,

ధ్రువం జన్మమృతస్యచ । తస్మాదపరిహార్యేఽర్థే, నత్వం శోచితుమర్హాసి'' అనే శ్లోకంతో ఆశీర్వాదంచేసి, అదే సముచితమైన ఆశీస్సని మురిసినట్లు ఉటంకింప బడియున్నది. ఇందలి ఔచిత్యాన్ని సహృదయులు వెంటనే గ్రహించగలరు గాన వివరణ మక్కరలేదు.

ఈ విధంగా అయాప్రహసనాలలో చక్కని ఉపహాసవచనాలు తరచు కనిపిస్తూనే ఉంటాయి. అయినా అవి పచ్చిశృంగారపు తెరమరగు నాట్యం చేస్తూండడం వలన, రంగంమీదకు వానినెవరూ తీసుకువచ్చే ప్రయత్నం చేయలేదు.

క్రీస్తుశకం పద్దెనిమిదవ శతాబ్దం ప్రారంభంలో తంజావూరురాజుల అమాత్యుడైన వాంఛేశ్వరుడను ఒకకవి 'మహిష శతక'మను పేరుతో ఒక శతకమును నిర్మించెను. ఇదికూడ అన్యాపదేశ ప్రధానమైన చక్కని ఉపహాస కావ్యమనిచెప్పదగినది. వాంఛేశ్వరునకే 'కుట్టికవి'అను నామాంతరమున్నట్లు గోచరిస్తుంది. నానాజీ, శాహజీ మొదలగు గొప్పరాజుల తరువాత నాటి తంజాపురరాజు దుష్టులకు తన ఆస్థానంలో చోటిచ్చి పాడవుతూండగా, అతనిని మేల్కొలుపుట కీశతకాన్ని రచించినట్లు కవి చెప్పుకున్నాడు. "మహిషవ్యాజతో రాజబుద్ధిం చక్రేసునిర్మలమ్" అని అతని ప్రతిజ్ఞ. "లులాయప్రభో" అన్న మకుటంతో, రాజులకన్న సర్వాత్మనా దున్నపోతే ఉన్నతమైనదన్న భావాన్ని చమత్కారాలతో శతకంలో ఇమిడ్చినాడు. ఈ విధంగా అన్యాపదేశ ప్రక్రియతో అద్వైతభావాన్ని పొందిన ఉపహాస ముక్తకాలు పండితరాయల నోటినుండికూడా శరపరంపరలుగా వచ్చినవి కొన్ని ఉన్నవి.

అప్పయ్య దీక్షితులవారి మనుమడు నీలకంఠదీక్షితులు 'కవి విడంబన' మనే శతకాన్ని రచించి, కలికాలపు వింతలను కళ్ళకుకట్టినట్లు చూపించి నాడు. వీనిని అన్నింటినీ చదివి ఆనందింప వలసినదే కాని ఉదాహరణలకు అవకాశం చాలదు.

మొత్తంపై "సంస్కృతసాహిత్యంలో ఉపహాస కావ్యాలకు కొదవ లేదు. పరిపూర్ణత, గుణదోష తారతమ్య పరిశీలనం మొదలయినవి వేరుగా విపులంగా చర్చింపదగిన అంశాలు. లాక్షణికుల దృష్టిలోమాత్రం ఈవిధమైన సాహిత్యం పరిగణనకు రాలేదు" అన్నది సారాంశము.

---

# 12. క్షేమేంద్ర మహాకవేః సమాజ వ్యవస్థాలోకనమ్

శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ

"కవిత్వం దుర్లభం లోకే శక్తిస్తత్ర సుదుర్లభా" ఇత్యాహ కశ్చన కవితామర్మవేదీ! సత్యం సహృదయానంద సందోహసంధాయినీ సమర్థా కవితా కస్యచిదనిర్వర్ణ్యస్య తపసః ఫలమేవ। అతఏవ వాస్తవకవితాభిజ్ఞం నిర్దేష్టుమశక్నువన్తః కావ్యశాస్త్ర విధాతారః సర్వేఽపి అదృష్టం పరంపరాయాం ప్రతిభామేవ తద్బీజభూతాం సంభావ్య సంతుష్టిమవాపుః। తత్రాపి కవిత్వే మహత్వప్రాప్తిః అతీవ పరిమితానామేవ సంభవతి। అతఏవ ఆనందవర్ధనాచార్యైః "అద్యాపి పంచషా ఏవ మహాకవయ ఇతి గణ్యన్తే" ఇతి మహాకవీనామత్యల్ప సంఖ్యావిషయత్వం జఘోష। న కేవలం సంస్కృత సాహిత్యే ఏవ। అపితు విశ్వసాహిత్యేషు సర్వత్రాపి ఇయమేవ స్థితిః॥

తాదృశదుర్లభ మహాకవిత్వ పట్టాభిషిక్తేషు సంస్కృత వాణీ ప్రసాద భాజనేషు అన్యతమః క్షేమేంద్ర మహాకవిః। సుందర కాశ్మీరదేశః అస్య అభిజనః। సకల కలాశాస్త్ర సముజ్జృంభణ సౌరభ సంవాసిత సమయః క్రీస్తోః పరం ఏకాదశ శతకసంమితః। వంశస్తు సంప్రదాయ వశంవదః। అభినవ గుప్తాదయః బహవః బహుళషు విద్యావిభవేషు ఆచార్యాః। ఏవం సర్వ పరికర సంపాదిత దోహదాత్ అస్మాత్ కృతి మహావృక్షాత్ చత్వారింశత్సంఖ్యాకాని సహృదయాస్వాద్యాని కావ్యఫలాని సముద్భూతాని। రచనాయాం, విషయజాతే, ప్రక్రియాయాం చ అత్ర అనుభూయమానం వైవిధ్యమతీవ ఆశ్చర్యజనకమ్। సంస్కృత సాహిత్యే అంశేఽస్మిన్ క్షేమేంద్రేణ సమకక్షామధిష్ఠాపయితుం మన్యే నాఽన్యోఽస్తీతి ప్రతిభాతి। తత్రాపి చ సమాజమపి సమ్యక్ చిత్రితవాన్ స్వరచనాసు। కవయః తత్రాపి సంస్కృతకవయః స్వనిర్మితలోకైకాంతికరమ్యోక్తి జగత్యేవ సర్వదా సర్వథాపి విహరన్తి, న తేషాం సమాజ దృష్టిరస్తి" ఇతి ప్రవాదః చిరాత్ ప్రచలతి. తస్య అపవాదో బభూవ క్షేమేంద్రః। తథా చ సమాజదోషజాలానాయ సమర్థాన్ ఉపహాస

ప్రబంధానపి (ఆంగ్ల భాషాయాం యే "Satires" ఇత్యుచ్యంతే) సంస్కృత సాహిత్యేఽయమేవ బహువిధం ప్రబబంధ। ఏవమతి విశిష్టస్య మహాకవేః తస్య సమాజదర్శనరీతిః ఉదాహరణ పూర్వకం యత్కించి ద్వివ్రియతే॥

దర్పదదనలమ్, సేవ్యసేవకోపదేశః, కలావిలాసః, దేశోపదేశః, వర్మ మాలా, సమయమాతృకా, ఇతి షట్సుకృతిషు అస్య ఉపహాసః ఉపలభ్యతే।

(1) హాసేనలజ్జితోఽత్యన్తం నదోషేషు ప్రవర్తతే।
జనస్తదుపకారాయ మమాయం స్వయముద్యమః (దేశ-1-4)

—ఇత్యనేన ఉవహా సతత్వం ప్రకటయామాసక్షేమేంద్రః.

(2) సమః శత్రౌ చ మిత్రేచ సమోమానావమానయోః।
వృత్తిచ్ఛేద కృతాఖ్యానః ఖలోనిర్వాణ దీక్షితః ॥ (దేశ-1-6)

"ఖలః సాధాత్పరమయోగి సదృశః, సః సమదర్శి వృత్తిచ్ఛేదనిపుణః" ఇత్యనేవ సోపహాసం ఖలనిందావిహితా।

(3) కోఽన్యః కదర్య సదృశో దాతాజగతి జాయతే।
నాఽశ్నాత్యదత్వాయోఽర్థి భోగ్యేగవే హస్తంగృహేఽర్గలమ్॥
(దేశ-2-12)

'కృపణః మహాదాతా।సనిత్యం యాచకేభ్యః గలహస్తందదాతి' ఇతికదర్యం వర్ణయా మాసకవిః॥

(4) వృద్ధస్య వృష్యైరాహారై ర్వాజీకరణ మిచ్ఛతః।
అతీతసారైస్సమవ న్నైః నష్టాపుష్టిస్త్రి వార్షికే॥

(5) గర్భిణీపరభీతేన వృద్ధస్యోత్సవకారిణః।
దదాత్యనుజ్ఞాంసతతం పాదసంవాహనే వధూః॥ (దేశ-21-23)

ఇత్యాదిభిః 'వృద్ధస్యతరుణీవిషమ్' అత్యంశం నిరూపయామాస।

(6) ప్రశ్నః, కథావిచిత్రా, కండూయన మంశుకాంత రాక్షేపః।
దినవేలార్కనిరీక్షణమతిహాసోమక్షికాక్షేపః।

(12) ధర్మాదేకః పరోలోభాత్ ద్వావంధౌసేవ్యసేవకౌ।
ధనోష్మచైన్య వికృతే ముఖేకః కస్యపశ్యతి॥ (సేవ్యసేవక-3)
ఇత్యాదినా సేవ్యస్యసేవకస్యచ స్వభావః ధనమూలః సముప వర్ణితః।

దిఙ్మాత్ర ముదాహృతమ్। అనయైన దిశా క్షేమేంద్రస్య ఉపహాస వచనాని బహుశత సమ్మితాని దృశ్యంతే।

అథేదం విచార్యతే:- వ్యక్తిర్వాసమాజోవా-నిఖిలే సంసారే వస్త్వంతరంవా గుణ సమగ్రం నభవతి। తథైవ దోషపరిపూర్ణమపినైవభవతి। గుణదోష సంకీర్ణా సర్వాఽపిసృష్టిః। అతఏవ "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" "నిర్దోషం నిర్గుణం వాఽపి నాఽస్తిలోకేపి కించన" ఇత్యాది ప్రకారేణ అభియుక్తానాంగిరః ప్రాయశః శ్రూయంతే। పరంతు ఆధిక్యమల్పత్వంచ గుణ్యాగుణి విభాగే ప్రముఖం భేదకం స్వీక్రియతే। గుణానామాధిక్యే సగుణత్వం తేషామల్పత్వే దోషాణాంచాధిక్యే సదోషత్వంచ ఆరోప్యతే ఇతి భావః। వ్యక్తి సమష్టిరేవఖలు లోకోనామ। అతస్తద్విషయేఽపి ఏషఏవ సమన్వయ ప్రకారః। సుచిరాత్ సమాజం పీడయంతః నిత్య సత్యరోగాః కేచన విద్యంతే। సర్వేఽపితాన్ జానంతి-తేభ్యః వేద్యంతేచ। తేచ కామ క్రోధలోభ మోహామద మాత్సర్యాః। ఏతేషాం సంతతిరపి అనంతా బహురూపాచ సందృశ్యతే। అపునరావృత్తం యథాతథా ఏతద్రోగ నిర్మూలనాని ఔషధాని అతీవదుర్లభాని। తత్కాలోపశమన జనకానితు భేషజాని సంతినామ కానిచిత్। అత ఏవతత్త ద్రోగ కృతః ప్రకోపః సమాజచరితే తదా తదావిజృంభమాణో దృశ్యతే। ఉపశామకేషు సాధనేషు ఉపదేశః, శాసనమ్, ఉపదేశశ్చేతి త్రీణిప్రధానాని। తత్ర ఉపదేశ దివ్యౌషధం మహాపురుషాః, శాసనౌషధం మహాప్రభవః, ఉపహాసౌషధం మహాకవయశ్చ సంవిధాయ సముచితం ప్రయోజయంతి। ఏషుచోత్తరోత్తరస్య ఉత్కర్షః అనుభవ సాక్షికః। అతః ఉపహాసస్యసమాజారోప నిర్వాపణే ప్రాబల్యం సిద్ధ్యతి।

ఇదముపహాస భేషజం పాక భేదేన కదాచిన్మధురం, కదాచిత్తిక్తం కదాచిచ్చ కటుకమిత్యాదిభేద సహితం విరాజతే। అథాఽపి సర్వదామృదుతయైవ శిక్షాత్మానుపశమయతీతి విలక్షణమస్యదోషనిర్మూలనసామర్థ్యమ్। ఇదంవిజ్ఞా

ర్యైవ పాశ్చాత్యసాహిత్యేషు ఉపన్యాసప్రక్రియా శాఖోపశాఖం బహుధా విస్తృతా సంఘటితా భవన్త్యః ।

సంస్కృతసాహిత్యేతు రీతిరన్యాదృశీ। సర్వస్మిన్ విషయేష్వపి ఉపదేశ ఏవ రీతిరేవ సుచిరమాదృతా । సంప్రదాయతయా ప్రవర్తితా చ । తాదృశ సంప్రదాయమతిక్రమ్య విచ్ఛిన్నపథాపేన ప్రథమం సమాజదోషేషు దృష్టిం నిధాయ, తత్ క్షాలనాయ సునిశితముపన్యాసమేవ సాధకతమం మత్వా ఉపన్యాసరచనాయాం బద్ధాదరో బభూవ మహాకవిః క్షేమేన్ద్రః। ఉపన్యాసరచనావిషయే సత్యమాదికవిరయమితి వక్తుముచితం। అస్మిన్ సమయే కాశ్మీరేషు సమాజస్థితిం, తద్దౌర్బల్యవిశేషాంశ్చ శృంగగ్రాహికయా అయం నిర్దిదేశ। సార్వకాలికదోషానపి యథావత్ వర్ణయామాస। "మధురైః సూక్తిభేషజైః" తదున్మూలనార్థమతీవ క్లేశమను బభూవ । అస్య సమాజపరిశీలన దృష్టిః శ్యేనదృష్టిరివ పటుతమా। ప్రకటాః, ప్రచ్ఛన్నాః, స్పష్టాః, అతిగూఢాః, రూపాన్తరాన్తరితాః, కింబహునా—సర్వేఽపి—సమాజదోషాః అస్య దృష్టిపథమవతీర్ణాః। వేశ్యాః, గాయకాః, వైద్యాః, జ్యోతిర్విదః, న్యాయాధీశాః, గురవః శిష్యాః, ద్యూతకరాః, జారిణ్యః, వార్ధుషికాః, సువర్ణకారాః,—కిమేతేన పఠితేన—సర్వేఽపి సోత్ప్రాసముల్లుణ్ఠితా అనేన । తత్రాఽపి తస్మిన్ సమయే సకలవ్యవహారేషు, సర్వవ్యాపారవత్ విలసితః, సామాన్య జనపీడనస్య, దివిరస్య (నియోగినః) దౌర్జన్యం, దుర్నీతిః, ధార్ష్ట్యం, వంచనాచణత్వం చ నిష్ఠురముపక్షిప్తమ్। ఉపాలంభైః శస్త్రభూతైస్తైః వరాకం దివిరమివ నాఽనన్యం సంభావయామాస మహాకవిరయమ్। మన్యే చ క్షేమేన్ద్రోపహాసకర్త్రా నాతిచిరాదేవ వేశ్యావృత్తిః కాశ్మీరేభ్యః కాందిశీకా పలాయాం చక్రే। ఏవమేవ ఇతరేఽపి దోషదూషితాః తత్కాలమువితాః కించిదివ దోషపరాఙ్ముఖా అవనతముఖాః పశ్చాత్తాపదగ్ధాశ్చ భవేయుః ।

కించ ఉపన్యాసరచయితుః కవిత్వవైభవేన సాకం నిర్భీకతా, సత్యనిష్ఠా, ధృతిః, గాంభీర్యం, సర్వాత్మనా అన్యానపేక్షత్వం చ అపేక్షితమ్। తానీమాని లక్షణాని దైవవశేన క్షేమేన్ద్రం పరిభూషయన్తిస్మ। అస్తి ఖల్వస్య విద్యాఽనవద్యా। గుణాశ్చ స్వయం ధృతా ఇవ రేజిరే। శిక్షా చ సంప్రదాయమహత్తరేభ్యః గురుభ్యః సమాసాదితా। సాధారణతః కవిగణదుర్లభం ధనాఢ్యత్వ

మపి అస్య ఆజన్మ సంపన్నమేవ। అతః వృత్త్యర్థం యాచకతా దైన్యం స్వప్నేఽపి అనేననైవాఽనుభూతం స్యాత్। కోటీశ్వరోఽయమితిహి స్పష్ట మేవాఽవగమ్యతే చరితవిభావనయా। తస్మాదేవం సర్వసమర్థాత్ క్షేమేంద్ర మహాకవిముఖాత్ సర్వసమర్థోపహాసప్రాదుర్భావః అతీవసముచితః॥

ఇదంచ సంభావ్యతే సత్యం। సమాజ దర్శనేన తన్మార్గ ప్రవర్తకత యాచ సంస్కృత కవిరత్నమాలాయాం క్షేమేంద్రస్య నాయకత్వం సంసిద్ధమ్। పునరపివా అధ్యభారతే నానాదోష సంసృష్టే సమాజే క్షేమేంద్రస్య జనిః భూయాత్। పునశ్చ సమాజం స్వోపహాసైః సంస్కుర్యాత్। సమాజశ్చ సర్వసమృద్ధజీయతామితి। అంతతశ్చ "తత్ సర్వం స్మితకారణం సహృదాయాః శృణ్వన్తుసంతఃక్షణమ్॥" ఇతి మహాకవేరస్య ప్రార్థనయైవ ఉపసంహ్రియతే.

———

# 13. మోక్ష స్వరూపము

శ్రీ సూరిరామకోటిశాస్త్రి

భారతదేశమున ఎందరో మహానుభావులు జన్మించి నిరంతరము జ్ఞానాన్వేషణలో జీవితము గడిపి దర్శనముల వెలయించిరి. దర్శనములనగా: "దృశ్యతే సాక్షాత్క్రియతే తత్త్వమేభిః" అను వ్యుత్పత్తి ననుసరించి తత్త్వసాక్షాత్కార సాధనములు. దీనిని ప్రవర్తింపజేసిన ఋషులు కాణాద గౌతమ కపిల పతఞ్జలి జైమిని బాదరాయణులు. వీరందరు బుద్ధికుశలతతో 'జీవితమునకు ధ్యేయమేమి?' యని విచారించి తగు సాధనముల నుపదేశించిరి. అందు శ్రీ జైమిని బాదరాయణమునీంద్రులు వేదమునకు ప్రాముఖ్యమిచ్చి తదనుసారముగా పూర్వోత్తర మీమాంసా దర్శనముల ప్రకాశింపజేసిరి. పరమర్షి జైమిని వేదములో కర్మకాండభాగమునకు ప్రాధాన్యమిచ్చి— అందు ప్రతిపాదితమగు ధర్మము ఇహపరసాధనము. దీనివలన కష్టముల హరించుకొనవచ్చును. సుఖమును బడయవచ్చును— అని నుడువగా బాదరాయణులు అట్లుగాక వేదములలో చివరభాగమును అనగా ఉపనిషత్తులను ప్రధానముగాచేసి విచారించి అందు ప్రతిపాద్యమగు బ్రహ్మ సర్వజీవగమ్యము అని నిర్ధరించు వేదాన్తదర్శనమును లోకమునకు ప్రసాదించిరి.

అందు మోక్షము పరమపురుషార్థముగా పేర్కొనబడినది. ధర్మము, అర్థము, కామము అను పురుషార్థము లున్నను అవి పరమములు అనగా ఉత్కృష్టములు గావు. యాగహోమ జపదాన సన్ధ్యావన్దన దేవతాపూజాదికము ధర్మము— ఆముష్మిక సుఖసాధనము. ధనధాన్యపశుభూభాండ వస్త్ర వాహనాదులు అర్థము. ఇది ఐహికసుఖసాధనము. కామము అనగా స్రక్చందనాది భోగము లేదా భోగాభిలాష. ఈ అర్థకామములు ప్రపంచమున అందరి చేతను ఆదరింపబడుచున్నవే. భారతీయులు వీనిని తలచి సారముగా ధర్మానుబంధము చేసిరి. ఆ ధర్మము స్వర్గాదిలోక సుఖమునిచ్చినను శాశ్వతముగా ఆ సుఖము నీయజాలదు. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అని న్యాయము. ఈ త్రివర్గము విజయాయురారోగ్యములను ఐశ్వర్యమును భోగభాగ్యముల

నిచ్చును. ఇన్నియున్నను, ఏదియోకొంత, కష్టములు వచ్చుచుండుట, చేజిక్కిన సుఖములు నిలిచియుండకపోవుట చూచుచున్నాము. కష్టములు రాకుండా చేసికొనుటకేమైన ఉపాయమున్నదా? లభించిన సుఖమును శాశ్వతముగా ననుభవించుటకు మనమేమి చేయవలయును? అను అన్వేషణ నిరంతరము విజ్ఞాన సంపన్నులు చేయుచునే యున్నారు. ఇదియే మోక్షజిజ్ఞాస. ఈ అన్వేషణ ఫలమే అపవర్గము, నిశ్శ్రేయసము, కైవల్యము, ముక్తి, అమృతత్వము, మోక్షము మొదలగు నామములతో దార్శనికులచే వ్యవహరింపఁబడుచున్నది. సూక్ష్మముగా విచారించిన ఈ మోక్షస్వరూపమును భావించుటలో ప్రధానముగా రెండు దృక్పథములు కానవచ్చును. దుఃఖధ్వంసమే మోక్షమని శ్రీ కణాద గౌతమ కపిలాదుల ఆశయము. భావరూప నిత్యసుఖము మోక్షమని వేదవ్యాసాదుల అభిప్రాయము. 'దుఃఖమ్మేమాభూత్' దుఃఖము నాకు రాకుండుగాక! 'సుఖంమే భూయత్' నాకెల్లప్పుడు సుఖము లభించుగాక! అనుకోరికలు స్వభావ సిద్ధముగా ప్రాణులందఱికి గలవు. కావున దుఃఖనివృత్తి వాఞ్ఛనీయమే. సుఖప్రాప్తియు ఆశంసనీయము.

అయితే నిత్యసుఖము మోక్షమనువారికికూడ ఇకమీదట దుఃఖములు రాకపోవుట వచ్చిన దుఃఖములు నశించుట ఉంటున్నది. దుఃఖధ్వంసమే మోక్షమనువారికి మోక్షమున సుఖానుభూతి యుండదు. దీనిని దార్శనిక దృష్టితో నొకింత విచారించుదము. 'దుఃఖజన్మ ప్రవృత్తి దోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదన్తరాపాయాదపవర్గః,' 'తత్త్వజ్ఞానాన్నిశ్శ్రేయసమ్.' అని న్యాయవైశేషిక సూత్రములు. ఇందుదుఃఖములకు కారణము జన్మయని పేర్కొనఁబడినది. దీనినిబట్టి జన్మ ఉన్నంతవఱకు దుఃఖముతప్పదని తెలిసినది. ఆస్థావరమనుష్యదేవాదిజన్మలకు పాపపుణ్య కర్మలు హేతువు. ఆ కర్మలకు రాగద్వేషమోహములు, వానికి భ్రాన్తి, అజ్ఞానము మూలము. సరియగుజ్ఞానము సంపాదించినచో భ్రాన్తిమూలకములగు ఈర్ష్యామత్సరాది దోషములుడుగును. జన్మరాహిత్యము సిద్ధించును. శరీర నిరింద్రియాదులతో సంబంధము వీడుటవలన ఆత్మకు ఏకవింశతి దుఃఖధ్వంసరూప మోక్షము సిద్ధించును. ఇక సాంఖ్యదర్శనమున అధ్యాత్మిక – అధిభౌతిక – అధిదైవిక దుఃఖత్రయనాశము మోక్షము, ఆధివ్యాధులు, వ్యాఘ్రతస్కరాదిభయము, పిడుగుపాటు–భూకంపము మొదలగు దుఃఖములతో ప్రాణులు సతమత

మగుచున్నారు. చికిత్సా నీతిశాస్త్రాభ్యాసాద్యుపాయములచే దుఃఖముల వారింప ప్రయత్నించినను కొన్ని సాధ్యపడకున్నవి. కాలాంతరమున కొన్ని మరల వచ్చుచున్నవి. కావున ప్రకృతి- పురుష వివేకముచే తా నుదాసీనుడ నని గుర్తించి ప్రకృతి పరిణామబుద్ధి దుఃఖచ్ఛాయ మీదగు గాకుండ చేసి కొనవలయును. ఇదియే మోక్షము. పూర్వమతమున దుఃఖము ఆత్మగుణము. ఈ మతమున బుద్ధిధర్మము. ఇందు వివేక జ్ఞానము ముఖ్యము. ఈ వివేకము నకు 'యోగము సాధనముగా ఈశ్వరుడు ఆలంబనముగా పేర్కొని పతంజలి ముని సేశ్వర సాంఖ్యము అను నామాంతరముగల యోగదర్శనమును ప్రవర్తింపజేసినాడు. యమనియమాద్యష్టాంగ యోగానుష్ఠానవశమున క్లేశములు క్షీణింపగా జ్ఞానదీప్తిచే కైవల్యము ప్రాప్తమగును. అనగా సత్త్వాది గుణములు పురుషార్థము ప్రవర్తించుట మానును. చితిశక్తి యగు ఆత్మబుద్ధితో సంబంధమువీడి కేవల స్వరూపస్థితిలో నుండును. జైమిని పూర్వమీమాంసా దర్శనమున వేదవిహిత కర్మానుష్ఠానము వలన స్వర్గమువచ్చును. స్వర్గమనగా 'యన్నదుఃఖేన సంభిన్నం నచగ్రస్తమనంతరమ్. అభిలాషోపనీతం చ తత్పదం స్వఃపదాస్పదమ్' అను నిర్వచనము ప్రకారము దుఃఖమిశ్రము కాని నిత్యసుఖము అందు కోరునట్టిది. ఇదియే మోక్షము. ఇందు 'అపామ సోమం, అమృతా అభూమ,' 'అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి' మొదలగు శ్రుతివచనముల ప్రమాణముగా ముదాహరింతురు.

కాని యీమోక్ష స్వరూపమును గురించి సమగ్రముగా విచారించి నిరూపించినవాడు బాదరాయణ మునీంద్రులు. ఈయన దర్శనము ఉత్తర మీమాంసా దర్శనము లేదా వేదాంత దర్శనము. ఇందు స్వర్గమువేరు మోక్షమువేరు. స్వర్గము వైదిక ధర్మఫలము, భోగముచే తరిగి నశించునది. "తద్య దేహ కర్మచితః లోకః క్షీయతే తథా అముత్ర పుణ్యచితః లోకం క్షీయతే." వ్యవసాయము, వ్యాపారము, ఉద్యోగము మొదలగు పనులచే ఆర్జించిన ఫలము ధనము, ధాన్యమువోలె స్వర్గాది సుఖముకూడ భోగముచే కొంతకాలమునకు నశించును. ఆ పుణ్యలోకములను వీడి జీవులు ఈలోకమునకురావలసిన వారైయున్నారు. మోక్షమట్లుకాదు. 'న స పునరావర్తతే' ఏది పొందిన తరువాత మరల ఇహలోకమునకు తిరిగిరాడో అది మోక్షము. ఇది ఐదు విధములు. సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయు

జ్యము, కైవల్యము అని వానినామములు. ఉపాస్య దేవతాలోకముల కేగుట సాలోక్యముక్తి. వైకుణ్ఠ, కైలాసాది లోకములలో దివ్య శరీరముల ధరించి భక్తులు సుఖముగా నివసింతురు. ఇక సామీప్యము - అచ్చట శివ విష్ణ్వాది దేవతా విశేషానుగ్రహంబున కొందఱికి సన్నిధాన భాగ్యమబ్బును. మఱికొందఱికి చతుర్భుజ త్రిలోచనాది రూపము దేవతా సమానాకారము వచ్చును. ఇది సారూప్యముక్తి. ఇక సాయుజ్యము. అనగా అహంగ్రహోద్యుపాసనా బలంబున దేవతాతాదాత్మ్యము. ఇందు సమాన భోగైశ్వర్యానుభవము. ఈ నాలుగు క్రమముక్తి నామముతో వ్యవహరింపబడును. ఐదవది కైవల్యము - ఇదియేముక్తి. అనగా నిజమైన మోక్షము. క్రమముక్తి దీనిసాధన దశ అయియున్నది. సాలోక్యాది చతుర్విధ ముక్తులలో పునరావృత్తి లేదు. అనగా ఇహలోకములో జన్మను పరిగ్రహించుటకురాదు. అందువలన మోక్షవ్యవహారములో ఈ క్రమముక్తి పరమముక్తులు అరుణోదయ సూర్యోదయముల వంటివి. సూర్యోదయమునుండి చేయవలసిన దినవ్యవహారము మనము అరుణోదయమునుండియే చేయుచున్నాము కదా !

ఇపుడు ఈ కైవల్యమునుగూర్చి కొంత విచారించుదము. పతఞ్జలి కైవల్యము చిత్తము లయముకాగా వికారముగా పరిణతి చెందని ప్రకృతి స్వరూపము. లేదా బుద్ధి సంబంధములేని ప్రత్యగాత్మ స్వరూపస్థితి. ఇందు ఆత్మభేదముసమసిపోదు. ప్రకృతి సత్యముగా నిలచియేయుండును. వేదాన్త దర్శనమున కైవల్యము సచ్చిదానంద నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావ ప్రత్యగభిన్నకూటస్థ బ్రహ్మస్వరూపస్థితి. ఇందు జీవాత్మ పరమాత్మభేదము గాని జీవులకు వ్యవహారదశలోని పరస్పర భేదముకాని నిలిచియుండవు. ప్రకృతి కూడ స్వతంత్ర సత్తను కోల్పోవును. జీవత్వ - ఈశ్వరత్వ భావనముండదు. సచ్చిదానన్ద లక్షణముతో ఆత్మ కేవలము శుద్ధబ్రహ్మరూపముగా ఉండు స్థితియే మోక్షము. ఇది సర్వోత్కృష్టమగు పురుషార్థము. మోక్షముమాట వినగానే బంధము గుర్తుకు వచ్చును. బంధము అనగా దుఃఖము, దేహేన్ద్రియాద్యభిమానము, రాగద్వేషములు, అహఙ్కారమమకారములు, భోగవాసనలు,అజ్ఞానముగాగ్రహింపదగును. బ్రహ్మజ్ఞానబలమున అజ్ఞానావరణాంశము నశింపగా అజ్ఞానమూలకము బంధము నివృత్తమగును. ఇదియే జీవన్ముక్తి. అజ్ఞానవిక్షేపాంశమువలన కొంతకాలము దేహేంద్రియాదులు దగ్ధ

# 14. బ్రహ్మసూత్రములు

శ్రీ సూరి రామకోటిశాస్త్రి

శ్లో॥ "ఉద్ధారార్థం ముముక్షో రరచిషత పురా బ్రహ్మ సూత్రాణి యాని
కృష్ణద్వైపాయనేన శ్రుతిపరమతినా శ్రౌతశీర్షార్థవక్త్రా
కృత్వా భాష్యం తదీయం నిఖిలబుధనుతం గూఢతత్త్వోపదేష్టా
నిర్ద్వైతానందదాయీ జగతి విజయతే శఙ్కరో దేశికేన్ద్రః॥

వేదాన్త శాస్త్రమున ప్రసిద్ధమగు ప్రస్థాన త్రయములో శ్రీకృష్ణ ద్వైపాయన ప్రణీత బ్రహ్మ సూత్రములు సూత్రప్రస్థానమునకు చెందినవి. ఇవి వేదాన్త వాక్యములలో సంశయము, వివాదము వచ్చిన తావులందు అధికరణ మర్యాదతో చర్చించి తాత్పర్య నిర్ణయము చేయును. దీనికే 'న్యాయప్రస్థానమ'ను మఱియొక పేరు. న్యాయమనగా మీమాంసక పరిభాషలో అధికరణమని యర్థము. నీయతే = ప్రాప్యతే తాత్పర్యార్థం అనేన అని న్యాయ శబ్దవ్యుత్పత్తి. 'విషయో విషయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరమ్ ప్రయోజనం సఙ్గతిశ్చ శాస్త్రేఽధికరణం విదుః' అను లక్షణము ప్రకారము— (1) చర్చింపబోవు విషయము (2) అర్థ సంశయము (3) పూర్వపక్ష వాదము (4) సిద్ధాన్తము (5) పక్షద్వయఫలము (6) పూర్వోత్తర సందర్భశుద్ధి అనునవి చేరి అధికరణమగును. విచారపూర్వక నిర్ణయస్థానము—అధికరణమని పర్యవసన్నము. ఈమార్గమున ప్రవృత్తమగు శాస్త్రము మీమాంసాశాస్త్రము. 'అథ యోగానుశాసనమ్' 'అథశబ్దానుశాసనమ్' మొదలగు శాస్త్రములు ఉపదేశ ప్రధానములు. 'అథాతో దర్శపూర్ణమాసౌ వ్యాఖ్యాస్యామః' 'అథాతస్సామయాచారికాన్ ధర్మాన్ వ్యాఖ్యాస్యామః' మొదలగునవి వ్యాఖ్యానపరములు. అట్లుగాక 'అథాతో ధర్మజిజ్ఞాసా' 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అనురీతిగా 'జిజ్ఞాసా' పదముతో చేరి ప్రారంభమగు శాస్త్రము న్యాయనిబన్ధనముచే 'మీమాంసాశాస్త్ర'మగుచున్నది. వేద పూర్వభాగ విచారాత్మకమగు పూర్వమీమాంసా శాస్త్రమునకు భవ్యమగు ధర్మము కాగా, ఉత్తరభాగ విచారాత్మకమగు నీశాస్త్ర

మునకు బ్రహ్మ ప్రతిపాద్యము. అందుచే 'బ్రహ్మమీమాంసా' అనియు 'ఉత్తర
మీమాంసా' అనియు దీనికి లోకమున వ్యవహారము. బ్రహ్మసూత్రములకు
శ్రీశఙ్కర, రామానుజ, మధ్వ, శ్రీకణ్ఠ, వల్లభ, నిమ్బార్క ప్రభృతులు
ఆచార్యపురుషులు- భాష్యముల రచించిరి. మోక్షమునకు భక్తిజ్ఞానములు
అవశ్యకములని యందఱి ఆశయము. ఈ భాష్యములలో శఙ్కర భగవత్పాద
భాష్యము మొదటిది, జ్ఞానప్రధానమైనది, నేటి విజ్ఞానశాస్త్రముయొక్క
తాకిడికి నిలబడగలది, మేధావుల నాకర్షించునదియు నగుటచే దీనిని పురస్క
రించుకొని యీ గ్రన్థముయొక్క విశిష్టత నిరూపింప బడుచున్నది.

'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అనుసూత్రముతో ప్రారంభమై 'అనావృత్తిః
శబ్దాత్' అను సూత్రముతో ముగియుచు బ్రహ్మవిద్యా ప్రతిపాదకంబైన,
యీగ్రంథము సమన్వయ-అవిరోధ-సాధన- ఫలాధ్యాయములతో నలరారు
చున్నది. ఇందు మొదట భిన్నార్థకములవలె గన్పట్టు వేదాంతవాక్యములకు,
ప్రత్యగభిన్న బ్రహ్మయందు సమన్వయము చూపబడినది. ఎట్లనగా చేతన
మగు బ్రహ్మజగత్కారణము, జడములగు పరమాణువులు కాని, సత్త్వరజ
స్తమో గుణాత్మకమగు ప్రధానముకాని జగత్తునకు ఉపాదాన కారణము
కాజాలవు. చేతనాధిష్ఠితమగునపుడే జడము కార్యకారియగును. జీవుడు
చేతనుడయినను కించిజ్ఞుడు అల్పశక్తిగల వాడునగుటచే విచిత్ర శరీర గిరినదీ
సముద్రగ్రహ నక్షత్ర తారకాది జగద్రచనయందు సమర్థుడుకాడు. బ్రహ్మ
అకుణ్ఠిత జ్ఞానశక్తి సమన్వితుడు అగుటచే, యతో వా ఇమాని భూతాని జాయన్తే,
యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసం విశన్తీతి' అని వర్ణించునటుల;
సృష్టిస్థితి లయములకు కారకుడగుచున్నాడు. ఈ బ్రహ్మ, కులాల, శిల్పి,
స్వర్ణకారాదులవలె సఙ్కల్ప శక్తిచే నిమిత్తకారణము అనగా కర్తయు,
మృత్సువర్ణాదులవలె ఉపాదానకారణమును అయియున్నాడు. సాలీడు
గూడునల్లుటలో అభిన్ననిమిత్తోపాదానముగా ప్రసిద్ధము. శఙ్కరులు అద్వైతి.
రామానుజులు విశిష్టాద్వైతి. మధ్వాచార్యులు ద్వైతి. బ్రహ్మేశ్వర జీవులు
ఏకచేతనతత్త్వమే-ప్రపఞ్చము రజ్జుసర్పమువలె అధ్యస్తము, వస్తువుకాదు
అని శఙ్కరుడనును. రామానుజులు ప్రకృతి-జీవుడు-ఈశ్వరుడు అను మూడు
తత్త్వముల నఙ్గీకరించి భక్తిప్రపత్తులచే భగవన్తుని ఆరాధించి జీవుడు
ముక్తుడగునను. మనకు శరీరమువలె భగవన్తునకు జీవులు శరీరభూతులే.

స్థూలసూక్ష్మ చిదచిద్విశిష్ట ఈశ్వరుడొక్కడే యగును. మధ్వాచార్యులు భక్తియే సాధనముగా గ్రహించియు, ఈశ్వరుడు స్వతన్త్రుడు – జీవుడు పరతన్త్రుడనును. జీవేశ్వరులకు స్వామి భృత్యభావము నంగీకరించును.

ఈ బ్రహ్మ జీవుల సుకృత దుష్కృతముల ననుసరించి భోగ్యవస్తు జాతమును సృజించి వారికి సుఖదుఃఖముల నిచ్చుచుండును. భక్తితో నారాధించిన వారియెడ ప్రసన్నుడై అనుగ్రహించును. ఈ సగుణబ్రహ్మమే ఈశ్వరుడు, భగవంతుడు, పరమాత్మ యని వ్యవహరింపబడును. శుద్ధసత్త్వ ప్రధాన మాయోపాధిచే సర్వజ్ఞనాది వ్యవహారముల నొనర్చుచుండును. య ఆత్మా అపహతపాప్మా. విజరో, విమృత్యుః, విశోకో, విజిఘత్సోఽ పిపాసః, సత్యకామః, సత్యసఙ్కల్పః అను ఎనిమిది గుణములు కలవాడు. ఈయన బ్రహ్మ విష్ణు మహేశ్వర మూర్తిత్రయ రూపమునే కాక సాధకానుగ్రహార్థము స్వేచ్ఛచే రామ కృష్ణా ద్యవతార శరీరములను ధరించును. ఇంతవరకు సోపాధిక బ్రహ్మరూపము వర్ణింపబడినది. ఇదిగాక నిరూపాధిక బ్రహ్మరూప మొకటి కలదు. అది సత్యజ్ఞానానన్ద స్వరూపము – నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము. బ్రహ్మ శబ్దవ్యుత్పత్తినిమిత్తమగు మహత్త్వము నిరతిశయముగా నిచట చూడదగును. అనృతజడదుఃఖమాలిన్య బంధములు అల్పలక్షణములు. బ్రహ్మతద్విలక్షణము. అనగా బ్రహ్మ అనృతము, అనిత్యముకాదు సత్యము; జడముకాదు చిద్రూపము; దుఃఖముకాదు అనన్దస్వరూపము; మలినముకాదు శుద్ధము; బద్ధముకాదు ముక్తము. ఇది శుద్ధ బ్రహ్మస్వరూపము. సగుణ నిర్గుణ బ్రహ్మరూపములు రెండును శాస్త్ర ప్రమాణ వేద్యములు. అందును శాఖాచన్ద్రన్యాయమున సృష్టికర్తృత్వాదులతో సగుణ బ్రహ్మరూపమును ముందు గ్రహించి 'ప్రకృష్టప్రకాశశ్చన్ద్రః' అను వాక్యముచే చన్ద్రస్వరూపమును గ్రహించు విధముగా సత్యజ్ఞానానన్ద నిర్గుణ బ్రహ్మస్వరూపము తరువాత గ్రహించుట సంప్రదాయము.

'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవా ద్వితీయమ్' 'తత్త్వమసి' 'అయమాత్మా' బ్రహ్మమొదలగు వేదాన్తవాక్యములు బ్రహ్మాత్మభావము నుపదేశించి 'శాన్తం శివమ్ అద్వైత'మని చాటుచున్నవి. శాస్త్రమునకు సగుణబ్రహ్మపారమ్యమే చెప్పినచో ఈశ్వరోపాసనచే సత్యలోకాన్తర్గత వైకుణ్ఠ కైలాసాది లోకమూర్తి సుఖము లభించునను జీవేశ్వర

భేదముతోనే మిగిలియుండవలసి వచ్చును. నిర్గుణబ్రహ్మ శాస్త్రతాత్పర్య గోచరమని యఙ్గీకరించి నందువలన 'నిత్యశుద్ధ సర్వజ్ఞ సర్వాద్యుపాధిరహిత అఖణ్డ శుద్ధచైతన్య స్వరూపావబోధచే శాన్తి సుఖరూపమగు అద్వైతము సిద్ధించుచున్నది. ఇచ్చట జీవులు పశు పక్షి మనుష్యాది దేహములందు అనుకూల ప్రతికూల శబ్దాది విషయసంయోగమున సుఖదుఃఖముల ననుభవించుచు నానారూపములుగా కనపడుచున్నారు. భోగ్యభౌతిక ప్రపఞ్చము జడముగా నున్నది. సృష్టిస్థితి సంహారముల నద్భుతజ్ఞాన శక్తితో నిర్వహించును పరమేశ్వరుడు నిత్యశుద్ధుడుగా ఆస్తికులచే అఙ్గీకరింప బడుచున్నాడు. ఈ విధముగా జీవ-జగదీశ్వరులకు భేదము సిద్ధించుచుండగా 'అద్వైతము ఎట్లు? అను శఙ్క కలుగుచున్నది. దీనికి సమాధానము 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః' అని అభియుక్తులు వచించిరి. బ్రహ్మవస్తు వొక్కటే పరమార్థము. వ్యవహారదశలోనే జీవజగదీశ్వర భేదము. పరమార్థదశలో భేదము నిలచి యుండదు. ఈ విషయము బ్రహ్మసూత్రములలో వివరింప బడినది. 'అసమ్భవ స్తుసతోఽనుపపత్తేః ప్రకృతైతావత్త్వంహి ప్రతిషేధతిభూయః' అనుసూత్రములలో బ్రహ్మ సత్యత్వము నిరూపింపబడినది. బ్రహ్మపుట్టుక లేనిదగుటచే నశింపదు కనుక సత్యము. నిషేధశేషముగాకూడ బ్రహ్మసత్యము. ఇదిపాముకాదు; జలధారయుకాదు భూఛిద్రముకాదు అని చెప్పినను వాక్యము పరిసమాప్తముకాదు. ఇదియేమి? అనిజిజ్ఞాస కలుగుచునే యుండును 'ఇదిరజ్జువు' అనిచెప్పిన తరువాత ఆకాఙ్క్ష శమించును. అట్లే 'నేతి నేతి' అనుశ్రుతిచే ఇదిపృథివికాదు ఆకాశముకాదు అని చెప్పినను ఇదియేమి? అను ప్రశ్న జనించుచునే యున్నది. నిషేధాధిష్ఠానము భావపదార్థము సత్యము ఐనపుడే నిషేధము కుదురుచున్నది. ఇట్లు నిఖిల ప్రపఞ్చ నిషేధశేషముగా సిద్ధించిన బ్రహ్మ సత్యమని ధ్రువపడుచున్నది.

ఇక 'జగన్మిథ్యా' అను అంశము కార్యకారణానన్యత్వన్యాయమున నిరూపింపబడుచున్నది. 'తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః' అను అధికరణము ఈ విషయమును ప్రతిపాదించు చున్నది. జగత్సత్యత్వవాదులే బహుజనులు. వీరికి ఏదోవిధముగ ద్వైతము తప్పదు. అద్వయబ్రహ్మము సాక్షాత్కరింపజేసి కొనవలయునన్న జగన్మిథ్యాత్వగ్రహణము అవశ్యకము. ఇక్కడ మిథ్యా పదము 'శశశృఙ్గము మిథ్య' అనుచోటవలె లేనిది అనుఅర్థముతో వాడబడ

లేదు. ఇక నేమనగా అనిర్వచనీయము అనునర్థమున వాడబడినది కనుక వ్యవహారమున కుపయోగించును. మృత్కార్యమగు ఘటము మృత్తుకంటె వేరుకాదు. ఘటములో మూల పదార్థము అగు మృత్తును బుద్ధిచే విశ్లేషించిన ఘటమునకు స్వరూపము మిగులదు. కనుక ఘటము మృత్తుమీద ఆధారపడిన సత్తగలదై జలాహరణాదివ్యవహారమునకు యోగ్యమగును. అయినను పృథక్సత్త్వముకాదు. మృద్ఘటములలో 'వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్' అను శ్రుతిప్రకారము మృత్తుసత్యము వికారమగు ఘటము నామమాత్రము అనగా మిథ్య, అనృతము. ఇట్లే 'తస్మాద్వాఏతస్మాదాత్మన ఆకాశః సమ్భూతం ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః, అద్భ్యః పృథివీ' అని సృష్టివర్ణనముండుటచే పృథివికంటెజలము జలముకంటె అగ్ని అగ్నికంటె వాయువు వాయువుకంటె ఆకాశము ఆకాశముకంటె బ్రహ్మసత్యము-దీనినిబట్టి మూలకారణమగు బ్రహ్మ ఒక్కటే పరమసత్యము. ఆకాశాదులు సాపేక్షసత్యములు వ్యవహార యోగ్యములైనను బ్రహ్మకార్యము లగుటచే మిథ్యాభూతములే. కనుక భూతభౌతిక జగత్తు పృథక్‌తత్త్వముకాదు. బ్రహ్మజగత్తునకు వివర్తకారణమని యిచట నిరూపించినందున ద్వైతజగన్మిథ్యాత్వము సిద్ధించుచున్నది. 'ఆత్మనిచైవం విచిత్రాశ్చహిమాయామాత్రంతు' అను సూత్రములందు స్వప్నసృష్టిదృష్టాన్తముచే ఈ విషయమేసముపోద్బలనము చేయబడినది. ఇక 'జీవోబ్రహ్మైవ' అను అంశము 'శాస్త్రదృష్ట్యా తూపదేశోవామదేవవత్' "అవస్థితే రితికాశకృత్స్నః" "ఆత్మేతియాపగచ్ఛన్తిగ్రాహయన్తిచ" అను సూత్రములలోస్పష్టముగా నిరూపింపబడినది. జీవుడు "తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్" అనుసూత్రమునందు చెప్పినరీతిగా ఉపాధిబుద్ధి గుణరూపకుడై జపాకుసుమ సన్నిధానమున స్వచ్ఛస్ఫటికము అరుణముగా కనుపించినట్లు సంసారివలె కనుపించినను, స్వతః శుద్ధత్వమును కోల్పోలేదు. "అనేనజీవేనాత్మానాఽనుప్రవిశ్య" అను ప్రవేశశ్రుతి ఆత్మశబ్దముచే ఆ బ్రహ్మకు స్వరూపభూతునిగా జీవుని పేర్కొనుచున్నది. సఆత్మాతత్త్వమసి అను ఉపదేశముకూడా అట్లేయున్నది. సృష్టిప్రకరణము చేతనుడగు జీవుడుసృజింపబడినట్లు పేర్కొనలేదు. కావున ఉపహితచేతనుడగు జీవుడు సృష్టికిపూర్వుడు. అప్పుడుబ్రహ్మ ఒక్కటియే యున్నది గనుక బ్రహ్మస్వరూపుడు; కార్యోపాధిరయం జీవః

కారణోపాధి రీశ్వరః। అను వచనము ప్రకారము అన్తఃకరణోపాధికుడు జీవుడు; మాయోపాధికుడు ఈశ్వరుడు. నిరుపాధిక శుద్ధచైతన్యము బ్రహ్మ. ఘటాకాశమఠాకాశ మహాకాశ న్యాయమున జీవేశ్వర బ్రహ్మలకు స్వరూపైకత్వము లేదా అవిద్యా ప్రతిబింబిత చైతన్యము జీవుడు. బింబచైతన్యము ఈశ్వరుడు. బింబత్వప్రతిబింబత్వవినిర్ముక్తమగు శుద్ధచైతన్యము బ్రహ్మ. అవిద్యోపాధివలన కలుగు సంసారము మాలిన్యములో ప్రతిబింబము మలినగా కనుపించినటుల జీవునికేగాని ఈశ్వరునికిగాదు. ఉపాధిత్రయము క్షేత్రము కాల్పనికము కనుక అద్వైతమునకు భఙ్గము రాదు. తత్త్వజ్ఞానము కలుగునంతవరకు దేహేన్ద్రియాద్యభిమానముతో గాఢద్వైతమునకు జీవులు సంసారించినను బ్రహ్మభావనయోగ్య స్వరూపమును కోలుపోలేదు. జీవులందరు వహ్నివిస్ఫులిఙ్గన్యాయమున బ్రహ్మనుండి వచ్చినవారే గనుక బ్రహ్మస్వరూపులే. కాని గృహములో నిధియున్నను అనుభవములేక దారిద్ర్యబాధలనొందిన విధమున జీవులు బ్రహ్మస్వరూపులే అయినను బ్రహ్మానుభవము లేక సంసార క్లేశములలో మగ్గి క్రిందుమీదులగుచున్నారు. వారినుద్ధరించినది శాస్త్రము. వైరాగ్యశమాదిఅన్తరఙ్గసాధనములను యజ్ఞాది బహిరఙ్గసాధనములను విధించినది. ఈసాధన సంపదతో శ్రవణ,మనన, నిధి, ధ్యాసనముల ద్వారా బ్రహ్మాత్మస్వరూప సాక్షాత్కారమునొంది జీవుడు కృతార్థుడగును. అనగా ముక్తుడగును. ముక్తుడు ఈశ్వరభావమును పొందునా? శుద్ధ చిన్మాత్ర బ్రహ్మభావము పొందునా? అని వివాదము పెట్టుకొననక్కరలేదు. 'ఏవముప్యుపన్యాసాత్పూర్వభావాద విరోధం బాదరాయణః'. ముక్తుడు శుద్ధచిన్మాత్రస్వరూపుడయ్యు బద్ధ జీవులచే ఈశ్వర ధర్మములతో వ్యవహరింపబడుచుండును. కనుక విరోధములేదని బాదరాయణుల అభిప్రాయము. ఇది సద్యోముక్తి. ఇట్లుగాక సగుణ బ్రహ్మోపాసనచే అర్చిరాది మార్గముద్వారా బ్రహ్మలోకమున చేరినవారు అక్కడ తత్త్వజ్ఞానమును బడసి క్రమముగా ముక్తినొందెదరు. వీరికిగూడ పునరావృత్తి లేదు. అనగా ఇహలోక జన్మప్రాప్తి జరామరణాది దుఃఖముల ననుభవించుట యుండదు.

---

# 15. నాట్యశాస్త్రము-ఆంధ్రులసేవ

డాక్టర్ పోతుకూచిసుబ్రహ్మణ్యశాస్త్రి

భరతనాట్య శాస్త్రానికి, కూచిపూడి భాగవత నాట్యానికి మూల గ్రంథం నందికేశ్వరుడు చెప్పిన నాట్యశాస్త్రం. భరతునకు తాండవలక్షణ మును నందికేశ్వరుఁడు చెప్పినట్లుభరతుఁడే అంగీకరించాడు. ఈ నందివ్రాసిన గ్రంథములోని ఒక భాగము ఇప్పుడు అభినయదర్పణమనే పేరుతో లభిం చేది. అభినయదర్పణం వ్రాతప్రతులన్నీ తెలుగులిపిలోనే లభించడంగమనిస్తే ఆంధ్రుల నాట్యసంప్రదాయం కొంతవఱకు యిక్కడున్నదనాలి. 1905లో నీడామంగలం రాజగోపాలాచారి చక్కటి తెలుగు అనువాదంతో దీన్ని ప్రచురించారు. దీని పునర్ముద్రణ అవసరం. ఆంగ్లంలోకి దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు అనువదించి ప్రచురించారు.

దాక్షిణాత్యులు బహునృత్తగీతవాద్య ప్రియులని, వీరు కైశికీ వృత్తి నవలంబించిన వారని, చతురమధుర లలితాంగాభినయ సంపన్నులని, భర తుడు 13వ అధ్యాయంలో అన్నాడు. నిన్నమొన్నటిదాకా దాక్షిణాత్యు లలో ఆంధ్రులే ఇతరులకు నాట్యంనేర్పినవారు. ఇంకా అనేక కారణాలవల్ల భరతునకన్న పూర్వమే ఆంధ్రదేశంలో నృత్యసంప్రదాయం ఉన్నదనాలి. దీనికి మూలగ్రంథాలురెండు. ఇవిఆంధ్రులగునందికేశ్వర కీర్తిధరులరచనలు.

ఇప్పుడు ప్రచారంలో ఉన్న భరతనాట్యానికి భరతుని గ్రంథంతో బాదరాయణ సంబంధమే కన్పిస్తుంది. నేటి భరతనాట్యంలో ఒకక్రమము, కూచిపూడినాట్యంలో వేఱొకక్రమం ఉన్నది. మన నాట్యంలో ఉన్న ఇతి వృత్తం ప్రాచీన భరతంలో ఉన్నది కాని నేటి భరతంలో లేదు. నృత్య, నాటకాలను పూర్తిగా మేళవించిన కూచిపూడి నాట్యంలో సిద్ధేంద్రాదులు చెప్పిన విధంగా భామాకలాపాన్ని పూర్తిగా ప్రదర్శించటానికి కొన్ని రోజులు పట్టుంది.

నందికేశ్వరుని గ్రంథము భరతునిశాస్త్రం కన్న విలక్షణం. ఇక్కడ తొమ్మిదే శిరోభేదాలు, ఎనిమిదే దృష్టిభేదాలు ఉన్నవి. హస్తాల లక్షణ విని

యోగాలలో వీరికి పొత్తు కన్పించదు. నాలుగు గ్రీవాభేదాలు, 23 అసంయుతహస్తాలు, 23 సంయుతహస్తాలు, 13 నృత్తహస్తాలు నందికేశ్వరుని గ్రంథంలో చెప్పబడినవి. ఈ పుస్తకమున ప్రధాన అభిప్రాయము నృత్తము కావటంచేత నృత్యానికి ఉపకరించే విధంగా ఈ లక్షణములు నిర్దేశింపబడినవి. ఆంధ్రులు ప్రాచీనకాలంనుంచీ నృత్యప్రియులే.

నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలలో 'తొల్లటుడు' కలడని తెలియవచ్చుచున్నది. తొమ్మిదవ శతాబ్దాంతమున రసము ఉత్పాద్యమని, నిష్పన్నముగునదని రససూత్రమును చక్కగా వ్యాఖ్యానించిన తొల్లటుడు తెలుగువాడనిచెప్పడానికి నేటికీఆంధ్రదేశంలో "తొల్ల"అనే యింటి పేరు వాడుకుండటం, తెలుగులో "తొల్లాయిపదాలు"అనే ప్రయోగముండటమూ ముఖ్యకారణాలు. క్షేత్రయ్య పదాలమాదిరిగే తొల్లాయిపదాలుగూడా నాట్యానికి ఒక క్రమమును దిద్దినవై ఉండాలి. నృత్యమును చక్కగాప్రయోగించడానికి పదవిన్యాసము, దానికి అనుగుణమైన గీతము అవసరము. అందుచే ఆంధ్రదేశంలో పదాలనే పేరుతో ఒక విశిష్ట సాహిత్యరూపమావిర్భవించింది. ఈ పదసాహిత్యమే వెనుకటిరోజులలో దేవదాసీల నృత్యానికి చక్కని చేయూతనిచ్చింది. పదాలకోవకు చెందినవే జావళీలు. ఈపదాలలో ప్రధానమైనది భక్తిరసము. భక్తిని శాంతరస పర్యవసాయిగా చిత్రించి, పదాలతో నాట్యాన్ని సమన్వయించిన నాట్యమును ఆంధ్రదేశంలో భాగవతనాట్యమనటంలో అతిశయోక్తి లేదు. భరత నాట్యంలో శృంగారాది రసాలేకాని, భక్తిరసానికి స్థానం కన్పించదు. నాట్యశాస్త్రం శాంతరసప్రతిపాదకమని సిద్ధాంతీకరించిన 'భట్టనాయకుడు' ఆంధ్రుడనటానికి వీలున్నది.

నృత్తసంగీతాదుల సమ్మేళనముతో ఉన్న నాట్యశాస్త్రము అనేకవిధాలుగా మార్పులు చెందుతూ వచ్చింది. మార్గనృత్య భేదాలలో విశిష్టమైనది ఆంధ్రదేశమున ప్రసిద్ధి చెందిన కూచిపూడి నాట్యము. దీనిని కూచిపూడి భాగవతమంటారు. కూచిపూడి భరతమనే పేరుగాక కూచిపూడి భాగవతమని పేరురావడంచేత పదాది విన్యాసంలో భరతముకంటె భిన్నమైనదనాలి. 1505 నాటి మాచుపల్లి కైఫీయతులో ఈ నాట్యప్రశస్తి ఉన్నది. విజయనగరరాజగు వీరనరసింహరాయల సముఖంలో సిద్ధవటంసీమను పాలించే సమ్మెట గురవరాజుచేసే దారుణాలను ఈ భాగవతులు నాట్యస్వరూపమున

ప్రదర్శించారు. దీనిని తిలకించిన విజయనగరాధీశుడు ఆదాయణాలను వెంటనే మాన్పించెనని ఆకైఫీయతులో ఉన్నది.

కూచిపూడి భాగవతులు రంగస్థలానికి రాకముందు ఈనాట్యం దేవదాసీలచేతుల్లో ఉండేది. కాలక్రమేణా దివ్యమైన ఈనాట్యం హీనదశకు వచ్చింది. అప్పుడు కూచిపూడివారు వీధినాటకాలను ప్రదర్శిస్తూ ఉండే వారు. పదహారవశతాబ్దంలో నారాయణ తీర్థులవారి శిష్యుడైన సిద్ధేంద్ర యోగి కూచిపూడి భాగవతులకు ఈ నృత్యకళను నేర్పెను. దానిని భామాకలాపం అనిఅంటారు. దేశ సంస్కృతిని, పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని నాట్యకళను భక్తిపరముగా దిద్ది, నృత్యమునకు పరాకాష్ఠగా వచ్చినది భామాకలాపము. భామ అంటే సత్యభామ. కాని మనకు గొల్ల భామకూడా ఉన్నది. కృష్ణుడు యాదవ వంశంలో జన్మించడంచేత గొల్ల భామకూడా కృష్ణుని అంతరంగిక జీవితంలో చేరింది. తద్వారా గొల్ల కలాపముగూడా బయలుదేరినది. ఉషా పరిణయం ఇంకొకటి. యక్షగానాలు మొదలైన వీధిభాగవతాలుకూడా కూచిపూడివారి కార్యక్రమాలలో ముఖ్యమైనవి. త్రిపురదాహం మొదలైన నాట్యాలను భరతుడు ప్రస్తుతించాడు. ఇవి మనకు లభించవు. కాని వీటికి బదులు కూచిపూడి భాగవతులు ఇతర నృత్యనాటకాలను సృష్టించి, భరతుని సంప్రదాయాన్ని తిరస్కరించక నాట్యానికి ఆంధ్రదేశంలో ఒక విశిష్టతను చేకూర్చారు. పురుషులు మాత్రమే వీటిలో పాల్గొంటారు. వీధి భాగవతాల రూపంలో అనేక పౌరాణికగాథలను వీరు శతాబ్దాలంలో ప్రదర్శిస్తూ ఉండేవారు. 1675లో గోల్కొండ నవాబు వీరికి కూచిపూడిని అగ్రహారంగా యిచ్చినాడు.

విజయనగరసామ్రాజ్యము చిక్కులలోపడిపోయినకాలంలో కూచిపూడి భాగవతులలో కొందఱు తంజావూరుకు వలస వెళ్ళినారు. తంజావూరుదగ్గఱ మెలట్టూరు ఉన్నది. అచ్చటి భాగవతమేళలోని నాటకాలకు కూచిపూడి వారి నాట్య నాటకాలే మార్గదర్శకాలు, మెలట్టూరు భాగవతులుకూడ బ్రాహ్మణులే. అందులో పురుషులే ఈ నాట్యాన్ని ప్రదర్శించేవారు. వీరి నాటకాలు అన్నీ తెలుగులో వ్రాయబడినవే. వీరందరకు భాగవతధర్మమే పరమ లక్ష్యంకావటంచేత వీరిని భాగవతులన్నారు. ఈ నాట్యానికి అనుగుణంగా ఉండటానికే అనేక యక్షగానాలు తమిళ దేశంలో తెలుగుభాషలో

ఆవిర్భవించినవి. వీటికి పాశ్చాత్యుల 'ఒపెరా'లకు దగ్గఱ పోలికలు చాలా ఉన్నవి. సంగీత నృత్య నాటికలలో ఆంధ్రుల నాట్యకళ పరాకాష్ఠ నందినది.

కూచిపూడినాట్యంలో సుప్రసిద్ధులగు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, బాలసరస్వతి మొదలగు ప్రఖ్యాత నాట్యకళాభిజ్ఞులను సహితం తయారుచేసి కూచిపూడి భాగవతాన్ని భరతంతో చక్కగా మేళవింప చేసినారు. ఈ మధ్య నామిత్రులు యశఃకాయులునైన శ్రీ బందా కనకలింగేశ్వరరావు తీవ్రమైన కృషిసలిపి కూచిపూడిలో నాట్యవిద్యాలయాన్ని స్థాపించగల్గినారు. సిద్ధేంద్రకళాక్షేత్రమే ఆయన స్మృతికి శాశ్వత చిహ్నము.

నేడు భరతనాట్యమని ప్రజాదరణ పొందుతున్న నాట్యము తంజావూరులో బయలుదేరినది. దీనిలో రూపకప్రదర్శన విధానము కన్పించదు. ఇది కూచిపూడివారిసొత్తు. నేటి భరతనాట్యంలో నృత్యమే కన్పిస్తుంది. భావ, రాగ, తాళములతో సంవలితమైన నృత్యప్రయోగమే తంజావూరిలో క్రిందటి శతాబ్దారంభమున భరతనాట్యమనే పేరుతో వచ్చింది. తంజావూరురాజగు శరభోజీ ఆస్థానంలో ప్రధానన ర్తకులుగా పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు, శివానందం అనేనల్గురు అన్నదమ్ములుండేవారు. వీరునాట్యంలో అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, పదము, తిల్లాన అనే క్రమాన్ని ఏర్పరచి, నాట్యమును సువ్యవస్థితం గావించిన ఆంధ్రులు. ఈ నాట్యమే నేడు భరతనాట్యమని పిలువబడేది. ఇలాంటి నాట్యంలో ఒకే ఒక నర్తకి రెండుగంటల పాటు నృత్యం చేస్తుంది.

ప్రార్థనతో గూడిన నృత్యము అలరింపు. నృత్తప్రధానమైన జతిస్వరంలో కరణముల ప్రసక్తిఉన్నది. పాటతో మేళవింపఁబడిన అభినయము కొద్దిగా మొదలిడుటను శబ్దమని అంటారు. నృత్తమును అభినయముతో సమన్వయ పరచుట వర్ణము. దీనిలో క్లిష్టమైన అంగహారాలుండగలవు. ఈ నాల్గింటిని ప్రయోగించిన తర్వాత వచ్చు పదమున ముఖ్యమైనది అభినయము. ఈ పదప్రయోగమున క్షేత్రయ్యపదములు, కీర్తనలు, అష్టపదులు, అభినయింపబడునవి. నాట్యమును ఉద్దేశించి వచ్చినవగుటచే క్షేత్రయచెప్పిన కృతులకు పదములు అనుపేరు సార్థకమైనది. సంప్రదాయ సిద్ధమైన పదప్రయోగమున కన్పించు గీతములన్నియు తెలుగుభాషలోనివే.

శరీర సౌష్ఠవమును ప్రదర్శించు స్థానకములను, చారీలను ప్రయోగించు నృత్తమును 'తిల్లాన' అందురు. ఈ రెంటితో కలిసినది నాట్యప్రదర్శన. దీనిలో క్రమము అతిముఖ్యమైనది. ఈ క్రమమున కరణ, అంగహార, చార, స్థానకాదులకు ప్రాధాన్యముండుటచేత ఈ నాట్యము రసప్రధానమైన దగుచున్నది.

కాకతీయ గణపతిదేవుని సేనాధిపతియగు జాయప, 1253లో నృత్తరత్నావళిని వ్రాసినాడు. భరతుని, అభినవుని, కీర్తిధరునిఅనుసరించి మొదటి భాగమున మార్గనృత్తమును వివరించెను. నర్తనవివేకము, అంగనిరూపణము, చారీ స్థానక మండల లక్షణము, కరణాంగహార వివేచనము అని మొదటి నాలుగు అధ్యాయములు. దీని తర్వాత మతంగుని బృహద్దేశిని అనుసరించి వేరొక నాలుగు అధ్యాయాలలో దేశినృత్తమును వివరించెను. ఇచట దేశి స్థానక-కరణ-భ్రమరీలక్షణములను చెప్పి దేశీనృత్త పద్ధతులను విపులముగా ప్రస్తుతించెను. వీటిలో, పేరణి, చర్చరి, దండరాసక, ఘటసరి, బహురూపము, చిందు, కోలాటము మొదలైనవెన్నో చెప్పబడినవి. పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథుడు అనేకదేశీనృత్తములను గూర్చిపల్కినాడు.

బందు పనులకు సెలవులేకునికి జేసి
యభ్యసించితి శైశవమాదిగాగ
దండలాసక విధమును గుండలియును
ప్రేంఖణంబు తెలుంగును ప్రేరణియును

అని విరాటపర్వములో బృహన్నల దేశినృత్తమునే నేర్చెననిచెప్పుటవిశేషమే.

నృత్త రత్నావళి వ్రాతప్రతి వంగదేశములోకూడా దొరకినది. దీనిని రాజాస్థానములో కుంభకర్ణుడు అనేరాజు మూలముగా గ్రహించి 'సంగీతరాజ'మును రచించెను. అంటే నాట్యానికి ఆంధ్రదేశపు ఆచారవ్యవహారములను ఇతర భారతీయులు ప్రామాణికముగా గ్రహించిరని తెలుచున్నది. జాయప గ్రంథమునకు మూలము 1213లో రేచర్ల రుద్రదేవుడు పాలంపేటలో కట్టించిన రుద్రేశ్వరాలయము. ఈ ఆలయశిల్పములు ఆంధ్ర నృత్య సంప్రదాయమునకు మచ్చుతునకలు. వీటిలో ఆంధ్రులు నాట్యశాస్త్రానికి గావించిన సేవ యద్వితీయమని తేలగలదు.

వసంతరాయలని పిలువబడిన రెడ్డిరాజు కుమారగిరి. ఈయన ఆస్థానంలో లకుమాదేవి అనే రాజనర్తకి ఉండేది. ఈమె నాట్యప్రయోగాలను మూలముగా గ్రహించి కుమారగిరి 'వసంతరాజీయమ'నే నాట్యశాస్త్రాన్ని రచించెను. ఈయన బావమరది శాకుంతల వ్యాఖ్యాతయైన కాటయవేముడు. తన వ్యాఖ్యాగ్రంథంలో

జయతి మహిమాలోకాతః కుమారగిరిప్రభోః
సదసిలకుమాదేవీ యస్య ప్రియాసన్న్యశ్రీప్రియా
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి జనానర్థాన్ప్రజాయ సహస్రశః

అన్నాడు. క్రొత్తక్రొత్త అభినయాలతో నాట్యార్థములను అనేకవిధాలుగా విరాజిల్ల చేసిన లకుమాదేవి నాట్యరహస్యములను పూర్తిగా గ్రహించుకొన్నది. ఈ గ్రంథం ఎప్పటికైనా దొరకలేదు.

కుమారగిరి 14వ శతాబ్దంలోనివాడు. ఆయన సమకాలికుడు వేమభూపాలుడు 'సాహిత్య చింతామణి' 'సంగీత చింతామణి' అనే గ్రంథములను వ్రాసెను. ఆదేశతాబ్దమున సింగభూపాలుడు అనే ఆంధ్రరాజు రసార్ణవసుధాకరం వ్రాసినాడు. నాట్యము పేరు, రూపకము పేరు అని ఇచట నిర్వచింపబడ్డది. మిక్కిలి నేర్పరియైన నటునికృతనాట్యము. సుఖాదులందు వేదాంతాదులకారోపమున్నపుడు రూపకాలంకారమని మనం చెప్పుచున్నట్లే నటుని యందు నాయకారోపముండటంచేత రూపకం అని పేరువచ్చిందని సింగభూపుడు– ఈశతాబ్దముననే విద్యాధరుడు ఏకావళిని, విద్యానాథుడు ప్రతాపరుద్రయశోభూషణమును రచించినారు. ఈ ఆంధ్రుల గ్రంథాలను ఆంధ్రులగు మల్లినాథుడు, ఆయన పుత్రుడగు కుమారస్వామి వ్యాఖ్యానించారు.

పదిహేనవ శతాబ్దంలో నాట్యశాస్త్రాభ్యాసము సాఫీగా ఆంధ్రదేశంలో జరిగినట్లు కన్పించదు. పదునారవ శతాబ్దమునకు చెందిన పోలూరి గోవిందకవి 'రాగతాళచింతామణి'లోను 'తాళదశప్రాణదీపిక'లోను నాట్యశాస్త్రములోని కొన్ని అధ్యాయములను ఇనిగించెను. ఇతడు నాట్యశాస్త్రము 'నిజపుత్రుండైన భరతమునికి ఉపదేశంబుగావించె' ననినాడు. ''ఆదిమహేశ్వరప్రోక్త నాట్యవేదానుగుణంబై, సకలార్థసిద్ధిప్రదంబై వెలయు నాట్యవేదము'' నకు మొదటి ప్రోక్త మహేశ్వరుడు. నృత్త, నాట్యభేదముల నీయన గమనించలేదు.

తెలుగులో మొట్టమొదట చెప్పిన నాటకలక్షణము పదహారవ శతాబ్దపు పెద్దనార్యుని లక్షణ సారసంగ్రహంలో కన్పిస్తుంది. ఈయనే 16 ఉపరూపకాల పేర్లనుకూడ చెప్పినాడు. ఇతడిచ్చిన నాటకలక్షణము దేనికీ అనువాదంకాదు. శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా నాట్యమును అభ్యసించెనని, ఆయన సభాగృహంలో నాట్యమంటపం కలదని తెలియుచున్నది. రంజకం, కుప్పాయి మొదలగురాజనర్తకీమణులు ఈసభలోఉండేవారు. ఇదే కాలంలో కూచిపూడివారినాట్యం సక్రమమైనమార్గంలో పరిపుష్టముకాసాగినది.

17వ శతాబ్దమునకు చెందిన జగన్నాథపండితరాయలు తనరసగంగాధరంలో నాట్యశాస్త్రంలో చెప్పబడిన రసనిష్పత్తి సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ రసప్రతీతిని బ్రహ్మాస్వాదముగా చెప్పి "భగ్నావరణాచిత్" అని సూత్రించి ఆంధ్రుల దృష్టిలో నాట్యమునకు గల మహోన్నత స్థానమును, ఆంధ్రుల నాట్య ప్రతీతిని విశదపరచెను.

భరతుని కాలానికే ఆంధ్రులు నాట్యసంపదలో విశిష్టస్థానం పొంది వున్నప్పటికీ, నేటిదాకా అనవచ్ఛిన్న సంప్రదాయంమనకు నాట్యంలో ఉన్నప్పటికీ మనకుసరియైననాట్యశాస్త్ర ప్రతి లేకపోవటం శోచనీయం. శ్రీజమ్మలమడకమాధవరామశర్మ, భరతుని గ్రంథములోనికొన్నిభాగాలకే అనువాదం చేశారు, పోణంగి శ్రీరామ అప్పారావుగారు మూలంలోని భావాన్ని సేకరించినా మూలగ్రంథాన్ని సమగ్రంగా ఇవ్వలేదు. నాట్యశాస్త్ర పాఠాన్ని పరిష్కరించి అభినవ భారతిని విమర్శనాత్మకంగా తెలుగులోకి అనువదించి వ్యాఖ్యానించిన నా గ్రంథం అరవ అధ్యాయంతో ఆగిపోయింది.

నాట్యశాస్త్రానికి ఆంధ్రులుచేసిన సేవ అద్వితీయం. భరత, నందికేశ్వరుల శాస్త్రాలు నేటికీ తెలుగుదేశంలోనే అభినయింప బడుతున్నవి. ఈ రెండు గ్రంథాలను నిర్దుష్టంగా పరిష్కరించి తెనుగు చేయటం మన ధర్మము. ఆ సమయ మెప్పుడువస్తుందో!

"కాలోహ్యయం నిరవధిర్విపులాచపృథ్వీ."

---

# 16. సుశ్రుతుడు

శ్రీ వెంపటి కోటీశ్వరశాస్త్రి

అధర్వణవేదమునకు ఉపవేదముగ చెప్పబడిన ఆయుర్వేదమును భరత ఖండమున బాగుగా ప్రచారము చేసిన చరక, సుశ్రుత, వాగ్భటులనే వైద్యాచార్యులలో రెండవవాడు సుశ్రుతుడు. అయినను తాను అభిమానించిన శల్యశాలాక్యతంత్రములను బాగుగా ప్రచారము చేసిన వారిలో నితడే ప్రథముడు. సుశ్రుతుడు అనగా మంచి కీర్తిగలవాడు మరియు గురువునుండి శ్రద్ధగా విషయములను వినినవాడు అని అర్థము. ఈ రెండును ఇతని యందున్నవి కనుకనే శల్యశాలాక్య తంత్రముల యందు అసదృశమగు కీర్తి ఇతనికి దక్కి పేరు సార్థకమైనది. ఈ రెండు తంత్రములను బాగుగా ప్రచారము చేసినవారు ఇతనికి పూర్వముగాని, ఇతని తరువాతగాని, యిప్పటివఱకు మరియొకరు లేరు.

ఇతని కాలమునుగురించి వివిధ చరిత్ర కారులయందున కొన్ని అభిప్రాయ భేదములు గలవు. సుశ్రుతుడు క్రీస్తుపూర్వము 1600 సంవత్సరము క్రిందట వాడని "మోడి" అను నతడును, 1000 సంవత్సరముల క్రిందటి వాడని "ముత్తు" అను నతడును, 600 సంవత్సరముల క్రిందటివాడని జి. యన్. ముఖోపాధ్యాయుడును చెప్పియుండిరి. కాత్యాయన వార్తిక వ్యాఖ్యాతకారుడు మాత్రము ఇతడు క్రీస్తు పూర్వము 400లలోని వాడని అర్థము వచ్చునట్లు వ్రాసియున్నాడు. అయినను సుశ్రుతుని కాలము క్రీస్తుకు పూర్వము 600గా పలువురు చరిత్రకారులచే నిర్ణయింపబడినది.

సుశ్రుతుడు విశ్వామిత్రుని కుమారుడుగా మహాభారతమునందు చెప్పబడినది. ఇతను కాశీరాజైన ధన్వంతరి యను మరొక పేరుగల దివోదాసుని శిష్యులలో నొకడు. ఈ సంగతి సుశ్రుత సంహితలోని మొదటి అధ్యాయము నందే చెప్పబడినది. ఇతని సహాధ్యాయులగు ఔపధేనవుడు మొదలగు వారందరు శల్యతంత్ర ప్రధానముగా ఆయుర్వేద తంత్రములను రచించిరి. కాని వాటిలో సుశ్రుత సంహితకు మాత్రమే మంచి పేరు వచ్చినది. ఇప్పుడు

దొరకుచున్నదియు గూడ నిదియే. మరియు ధన్వంతరి శిష్యులగు జాపన దేవుడు మున్నగువారందరును సుశ్రుతునే శిష్యసంఘ నాయకునిగా నెన్నుకొని ఆ సంగతి తమ గురువుగారగు ధన్వంతరికి తెలియజేసి "అతనిని ముఖ్యునిగా జేసి తాము శల్యతంత్ర ప్రధానముగ ఆయుర్వేదమును మాకు చెప్పండి, దానిని మేము ధారణచేయగలము'' అని చెప్పిరి. దీని వలన సుశ్రుతునిధీశక్తిమనకు తెలియగలదు.

ప్రాచీనకాలమున ఖండాంతరములయందుకూడ ప్రసిద్ధినిబొందిఅచ్చటి నుండియు విద్యార్థులను ఆకర్షించిన విశ్వవిద్యాలయములు భరతఖండమున 'తక్షశిల' మున్నగు పట్టణములయందు దాదాపు 13 ఉండెడివి. వాటిలో ఒక్కొక్క విశ్వవిద్యాలయము ఒక్కొక్క శాస్త్రమును ప్రధానముగా పెట్టుకొని మిగతా శాస్త్రములను దానికి సహాయకారులగునట్లు బోధించుచుండెడివి. వాటిలో తక్షశిల, కాశీ - ఈ రెండుచోట్లయందలి విశ్వవిద్యాలయములు ఆయుర్వేదమును ప్రధానముగా నుంచుకొని మిగతా శాస్త్రములను దానికి సహాయకారులుగ నుండునట్లు బోధించుచుండెడివి. ఈ విశ్వవిద్యాలయములయందు విద్యనభ్యసించుటకు చైనా మొదలు రోము వరకు నుండు దేశములనుండి విద్యార్థులు వచ్చుచుండిరి. ఈ రెండుచోట్లను ఆయుర్వేదమునందలి రెండు సంప్రదాయములు ప్రధానముగా బోధింప బడుచుండెడివి. ఆ సంప్రదాయము లేవనగా (1) ఆత్రేయ సంప్రదాయము (2) ధన్వంతరి సంప్రదాయము ననునవి. వాటిలో ఆత్రేయసంప్రదాయము కాయచికిత్సను, ధన్వంతరి సంప్రదాయము శల్య శాలాక్యచికిత్సలను ప్రధానముగా బోధించెడివి. వాటిలో తక్షశిలయందు ఆత్రేయ సంప్రదాయమునకు సంబంధించిన కాయచికిత్సయందు చరకుడును, కాశీయందు శల్యశాలాక్య చికిత్సలయందు సుశ్రుతుడును నిష్ణాతులై గ్రంథములను వ్రాసిరి. కావున కాయచికిత్సకు ఆత్రేయ సంప్రదాయమనియు, శల్యశాలాక్య చికిత్సలను ధన్వంతరి సంప్రదాయమనియు పేరువచ్చినది. నేటికివి అట్లే చెప్పబడు చున్నవి.

సుశ్రుతుడు తన సంహితను సూత్ర. నిదాన, శారీర, చికిత్స, కల్ప ఉత్తరములను ఆరుస్థానములుగవిభజించి అందు కాయచికిత్స, బాలతంత్రము, గ్రహచికిత్స, శాలాక్యతంత్రము, శల్యతంత్రము, అంగదతంత్రము, రసాయన తంత్రము, వాజీకరణతంత్రము, అను ఎనిమిది విషయములను చేర్చిరచించెను.

ఈ ఎనిమిది తంత్రములు ధన్వంతరిచే సుశ్రుతుడు మొదలగు శిష్యులకు దేశింపబడినవి. అయినను ఇతను శల్యశాలాక్య చికిత్సలనే ప్రధానముగ తీసికొని మిగతా చికిత్సలనుకూడ కలిపి తన గ్రంథమును రచించెను.

ఇతను తన సంహితను శల్యతంత్ర ప్రాధాన్యముగ రచించ నిశ్చయించియున్నందువలన అందుకు కావలసిన శారీర విజ్ఞానము సంతటిని (అనాటమీ, ఫిజియాలజీలను) తన గ్రంథమున విపులీకరించి యున్నాడు. కావుననే 'శారీరే సుశ్రుతశ్శ్రేష్ఠః' అను పేరువచ్చినది. "ఓ శిష్యా! నీవు శల్యశాలాక్య చికిత్సాపారంగతుడవు కాదలచిన యెడల అందుకు శారీర విజ్ఞానము చాలయవసరము గాన దానిని శవచ్ఛేదనముచేసి బాగుగా సంపాదింపుము" అని చెప్పి ఆ శవచ్ఛేదన పద్ధతులన్నిటిని చెప్పియున్నాడు. శల్యతంత్రమునందు శిక్షణ పొందనిచ్ఛగల విద్యార్థికి ఎటువంటి శిక్షణనివ్వవలెనో దానికి అనుసరించదగు పద్ధతులేవియో అని యన్నియు తన గ్రంథమున చెప్పియున్నాడు,

శస్త్రకర్మను ఛేదన, భేదన, లేఖన, వేధన, ఏషణ, ఆహరణ, విస్రావణ, సీవనములను భేదములచే 8 విధములుగ చెప్పి, ఈ యెనిమిది శస్త్రకర్మలకుపయోగించు యంత్రములను మొత్తము 101 రకములుగను, వాటి కర్మలను 24 రకములుగను ముందు చెప్పి తరువాత వాటిని స్వస్తికయంత్ర, సదంశయంత్ర, తాలయంత్ర, నాడీయంత్ర, శలాకాయంత్ర, ఉపయంత్రములని ఆరు విధములుగ విభజించి ఆ యంత్రములు ఎంతపొడవుగ, ఎచ్చటెచ్చట ఏవిధముగ వంపులు బంధనములు కలిగియుండవలెనో చెప్పి తరువాత వాటిని ఇరువదినాలుగు కర్మలలోను ఏయే కర్మలయందెట్లు ఉపయోగించవలెనో చెప్పియున్నాడు. అట్లే శస్త్రములనుగూడ 20 రకములుగను వాటి ప్రత్యేక నిర్మాణమును చెప్పి వాటికర్మలను ఎనిమిది విధములుగ చెప్పి, యాశస్త్రముల పదును మొదలగు వాటిని వివరించి వాటిని ఆయా కర్మలందెట్లు ఉపయోగించవలెనో చెప్పియున్నాడు. మరియు నా యంత్రముల నిలువ యుంచు కోశము లెట్లుండవలెనో, వాటిని చెడిపోకుండ నెట్లుంచవలెనో ఈ విషయముల నన్నిటిని విశదముగ చెప్పి, చివరకు మేముచెప్పిన యంత్రశస్త్రములను మేము చెప్పిన పద్ధతిలో అయాకర్మలయందే గాక, 'శల్యములు ఇన్ని-ఇట్లే యుండును.' అని సంఖ్యలో చెప్పుటకు వీలులేదు గావున సమయ

మునుబట్టి మీబుద్ధినిబట్టి, యంత్రశస్త్రములను, వాటి కర్మలను విభజించి కొని, సరియగు చికిత్సను జేసి రోగికి రోగనివృత్తిని జేయండి. ఇదియే ఈ చికిత్సాశాస్త్రమున కంతటికి ప్రయోజనము'' అని చెప్పియున్నాడు. నవీన యంత్రశాస్త్రములన్నియు సుశ్రుత సంహితనుచూచియే నిర్మించినారా యన్నట్లు ఆ యంత్రశస్త్రములను చాలవరకు పోలియే యున్నవి.

శరీరమునందు అహర్నిశలు, విరామము లేకుండ సంచరించుచు, శారీరకధాతువులకు జీవనప్రమాణాదులను నెఱపుచున్న రక్తము యొక్క విశేషలక్షణములను సుశ్రుతుడే మొదట కనిపెట్టి వర్ణించి యున్నాడు. ఇంతనూ త్రిదోషములకిచ్చిన ప్రాధాన్యమునే రక్తమునకుగూడనిచ్చి, దానికి గూడ త్రిదోషములతోపాటు, స్థాన లక్షణ, కార్య, వికార, శాంతులను గూడ చెప్పియున్నాడు. ముఖ్యముగా రక్తము వికృతిని జెందుట, అప్పుడు దానికి గలుగు రోగోత్పాదక శక్తి, హఠాత్తుగా దానికి నేర్పడు స్కందత్వ లక్షణములు (అనగా గడ్డకట్టుకొనిపోవుట), అందువలన గలుగు రోగములు, మరియు ప్రమాదములు, దానికి తక్షణము చేయవలసిన చికిత్సలు మొదట తెలిసికొని చెప్పినది సుశ్రుతుడే!

మరియొక విశేషము. పూర్వకాలమందు పరదార, పరపురుషగమనాది దుష్క్రియలకు శిక్షగా ముక్కుచెవులను కోసివేయుట గలదు. వ్యక్తుల యొక్క అందమువలననేగదా! ఇట్టి దురాలోచన గలుగుట. అందువలన ముఖమును అందవిహీనముగా జేయుట యొక శిక్షగా అమలుజరుపబడు చుండెడిది. పొరపాటునగాని, ఆఘాతాదుల వలనగాని అట్టివి జరిగినచోట్ల వారి ముక్కుచెవులను తిరిగి నేర్పుగా ఏర్పాటుచేయు చికిత్సను మొదట కనిపెట్టినవాడు సుశ్రుతుడే. ఈ చికిత్స ప్రస్తుతపు ప్లాస్టిక్ సర్జరిలోనికి వచ్చు చున్నది. ముక్కును సరిచేయుటకై ఉపయోగించు నవీన పద్ధతులు సుశ్రుతమునందు చెప్పబడిన ప్రాచీన పద్ధతులనుండియే వచ్చియున్నవి.

అస్థిభంగమును ముందు సంధిముక్తమని (కీలుతొలగుట), కాండ భగ్నమని (ఎముకవిరుగుట) రెండుగా విభజించి తరువాత వాటిలో సంధి ముక్తము ఆరు విధములుగా విభజించి, వాటిలక్షణములను చికిత్సను సంపూర్ణముగ చెప్పినాడు. తరువాత కాండభగ్నమును 12 విధములుగా

విభజించి వాటి లక్షణములను, చికిత్సను పూర్తిగ తెలిపినాడు. ఈ భగ్న విషయములో సుశ్రుతుని వర్గీకరణమునకంటె ఆధునిక వర్గీకరణమునందు విశేషమేమియు నున్నట్లు కనుపడదు. ఈ భగ్న చికిత్సలో "కపాటశయనము" అని యొక చికిత్సను చెప్పియున్నాడు. అస్థిభంగమునందు ఆధునికమైన "థామస్‌స్ప్లింట్" ఆయుర్వేదమునందు సుశ్రుతుడు ఇంతకుముందుగనే చెప్పిన కపాటశయన చికిత్సా పద్ధతుల పైననే ఆధారపడియున్నది.

వ్రణశోధను విపులీకరించుచూ దాని యొక్క ఉత్పత్తియందు గల యవస్థలను ఆరు క్రియా కాలములను సుశ్రుతుడు వర్ణించెను. ఈ క్రియా కాలముల యొక్క వర్ణన ఒక్క సుశ్రుతమునందే చెప్ప బడినది. ముందు వ్రణశోధ యేర్పడి తరువాత వ్రణము ప్రస్ఫుటమగును. వ్రణశోధ ప్రారంభ మునుండి వ్రణమేర్పడు వరకు శరీరమునందు ప్రకోపవృత్తికి జరుగు వివిధములగు మార్పులను సుశ్రుతుడు వివరముగా తన సంహితయందు వర్ణించెను.

మూఢగర్భ చికిత్సలయందును సుశ్రుతుడు చాలప్రావీణ్యమును చూపించెను. మూఢగర్భమును 8 విధములుగ చెప్పి అందులో ఆరింటిని తీయుటకు చక్కని పద్ధతులను చెప్పి రెండు మాత్రము అసాధ్యములనియు అవిశస్త్ర చికిత్స చేతనే సాధ్యములనియు చెప్పి, శస్త్ర చికిత్సద్వారా ఆ రెంటిని తీసివేయు పద్ధతులనుగూడ బాగుగ చెప్పియున్నాడు. ఈ ఆహరణ చికిత్సాపద్ధతులు ఈనాటి మూఢగర్భాపహరణ పద్ధతికి మూల సూత్రములై యున్నవి. ఇంకను యిట్టివి యెన్నియో గలవు.

మూత్రము బంధించి వస్తి ఉబ్బిపోయి బాధను కలిగించుచున్నప్పుడు అందుండి మూత్రమును వెలుపలికి తీయుపద్ధతికూడ ఈ గ్రంథము నందు విపులముగా చెప్పబడినది. ప్రస్తుతపు "సుప్రాప్యూబిక్ సిస్టాటమీ"కి ఈ సుశ్రుతోక్తియే మూలమని చెప్పినచో ఆశ్చర్యపడనవసరము లేదు.

ఇట్టి అద్భుత చికిత్సా విశేషములు గలదగుటచేతనే "బంగముల్లాల్, మీనన్" గార్లచే సంగ్రహింపబడిన "టెక్స్టు బుక్ ఆఫ్ సర్జరీ" యను గ్రంథమునకు పీఠిక వ్రాయుచు "సర్ ఛార్లెస్ బాల్, సర్ బాడ్కిన్ మొయిన్ గాట్" అనువారలు 2500 సంవత్సరముల క్రితము "హిందూదేశమున శల్య

తంత్రము ప్రాచీనగ్రీకు దేశమున ఎంత ప్రభవిల్లినదో అదేవిధముగ ప్రభవిల్లినది హిందూదేశమున శల్య తంత్రమునకు పిత యనదగిన సుశ్రుతుడు 2500 సంవత్సరముల క్రితము సుశ్రుత సంహిత యను శల్య తంత్రశాస్త్రమును 3000 సంవత్సరముల క్రిందట వ్రాయబడిన ఆయుర్వేదము యొక్క ఆధారమున వ్రాసెను. బ్రిటిషు దీవులలోని ప్రజలు వ్రాయను చదువను తెలియని రోజులలోనే శల్యతంత్రమునందు ప్రసిద్ధికెక్కిన హిందూజాతి యొక్క సంతతివారయిన వీరు ఇంగ్లీషు భాషలో ఆశల్యతంత్రముపై పుస్తకమును వ్రాయుట ఎంతశ్లాఘనీయము'' అనివ్రాసిరి.

మరియు 800 A.D.లో ''మంకా'' యనువాని చేత ''కితాబాసుశ్రుత్'' అను పేరుతో అరబిక్ భాషలోనికి, 1844 ప్రాంతమున ''హిస్లర్'' అను వానిచేత లాటిన్ భాషలోనికి, ''వల్లార్స్'' అను వానిచేత జర్మనుభాష లోనికి వళొర్నల్ అను వానిచేత 1877లోను, కె. యల్. భిషగ్రత్న అను వానిచేత 1907లోను ఇంగ్లీషు భాషలోనికి అనువదింపబడినది, మరియు మూలగ్రంథమునకు డల్హణ, చక్రపాణి, హారాణచంద్రచక్రవర్తి యను వారలు సంస్కృత భాషలో వ్యాఖ్యానములనువ్రాసిరి. వీటి వలన ఈగ్రంథ ప్రాశస్త్యము ఎంతయో మనకు బోధపడ గలదు.

---

# 17. సంస్కృతభాష: ముస్లిముల సేవ

శ్రీ అపల్ల సోమేశ్వరశర్మ

ప్రపంచంలోని ప్రాచీన భాషలలో కెల్ల అగ్రతాంబూలం అందుకునే అర్హత ఒక్క సంస్కృత భాషకే ఉందని విశ్వవిఖ్యాతి పొందిన మేధావి వర్గమంతా ఘోషిస్తూ ఉంటుంది. దానికి కారణాలు కోల్లలుగా ఉన్నాయి. ఎప్పుడు పుట్టిందో ఎవరున్నూ ఎరుగలేనంత ప్రాచీనత ఆ భాషకుంది. 'దేవం వాచమజనయంత దేవాః' అని భారతీయద్రష్టలు 'ఆభాషకు స్రష్టలు దివ్యులని' భావించి ఊరుకున్నారు. ఆ దివ్యత్వాన్ని ఉన్నించిన మునివర్గం చాలా చాలా గొప్పదై ఉంటుంది. పుట్టినది మొదలు ఆభాషాయోష దినదినప్రవర్ధమానయై సకలకలా పరిపూర్ణురాలై, త్రిదశలోక విరాజమానయై సనాతనముగ వెలుగొందుతూ ఉన్నది. కొందరో అమరవాణికి ధాతుసృష్టిని కలుగజేసినారు. మరికొందరలంకారాలను అందించినారు. ఇంకకొందరు గణితవైభవాలను నేర్పినారు. వేరొకవర్గంవారు వివిధ విలాసవైఖరుల విన్యాసమును బోధించినారు. ఈ విధంగా 'పత్రంపుష్పం ఫలంతోయం' అన్న వాక్యాన్ని అనుసరించి యథాశక్తిగ ఎవరికి వీలున్న సేవను వారు మనసారా చేస్తూ వచ్చారు. కాగా తెలియని ఆదినుండి తెలిసిన నాటివరకు కొన్ని వేలసంవత్సరాలు బహుముఖ ప్రజ్ఞాధురీణులయిన ప్రతిభావంతులు సహస్రాబ్దముగ ఒక్కభాషను గురించి కావించిన కృషికి దృష్టాంతంగా సంస్కృతభాష ప్రపంచభాషా సదస్సులో మణిమకుటాలంకృతయై ఒప్పుతూ ఉన్నది.

కృతక భేదాలను అధిగమించి అందరను ఆకర్షింపగల సౌందర్యవైభవం, మోహనసామర్థ్యమున్నూ సంస్కృతానికున్నంతగా వేరొక భాష కుండడం అసంభవం. కావుననే తన చెంతకు వచ్చినా రాకపోయినా, విశ్వమందలి వివిధవర్గాల ప్రేమాదరాలను అది సంపాదించుకొన్నది. ద్వేషించు వారిని సైతం పరవశులనుచేసి తనమిత్రకోటిలో చేర్చుకొనగలిగి "అజాతశత్రువు" అనిపించుకొన్నది. గ్రీకులు, రోమనులు, శకులు, హూణులు—వారు వీరు అన నక్కరలేదు—భారతాన్ని చదివిచూచిన వాళ్ళందరూ సంస్కృతామృతాన్ని గ్రోలి తాండవమాడినవారే. ఇట్టివారిలోవారే ముస్లిములుకూడా చెందు

తారు, ఈ విషయంలో R. C. మంజుదారు, A.L. వాత్సవ మొదలయిన చరిత్రపండితుల అభిప్రాయాలను క్రోడీకరిస్తే సారాంశం ఈ దిగువవిధంగా బయట పడుతుంది—

'గజనీమహమ్మదు మొదలు ఔరంగజేబువరకున్ను ఇంచుమించు ఏడు వందల సంవత్సరాలపాటు ముస్లిముల ప్రాభవం భారతదేశంలో నృత్యం చేసింది. దండయాత్రలతో ప్రారంభమైన సన్నివేశాలు సామ్రాజ్యస్థాపనతో సద్దుమణిగినాయి. తమమతాన్ని, భాషాసాహిత్యాలను, నాకరకతా సంస్కృతులను భారదేశం నలుమూలలా ప్రతిష్ఠింపచేయాలనే పట్టుదలయే ముస్లిం రాజరికపు ముఖ్యలక్షణం. దీనివలన దేశీయభాషలమీద దాని చూపు ఎక్కువ ప్రసరింపలేదు. ఫిరోజు, తుగ్లకు, సికందర్ లోడీ, అక్బరు, షాజహాన్, దారా షికోవ్ మొదలగువారు ఏ అయిదారుగురో సంస్కృతానురాగులుగా సంస్కృత పోషకులుగా లెక్కకు రాగలుగుతారు.

ఇట్టి చారిత్రక సత్యాలను ఆధారంగా ఉంచుకొని ఆయాసందర్భాలలో ముస్లిముల సంస్కృతానురాగ ఫలితాలు ఎట్లున్నవో రేఖామాత్రంగా ప్రతిపాదించడమే ప్రకృతం చేయదగిన పని. 'కర్తా కారయితాచైవ ప్రేరకశ్చానుమోదకః'' అన్నట్లు ప్రతియొకపనికి ''చేయువాడు, చేయించువాడు, ప్రోత్సహించువాడు, ఆమోదించువాడు''అని నాలుగు విధములైనవ్యక్తులు బాధ్యులుగా ఉంటూఉంటారు. వీరిలో కర్త, కారయిత అనువారు సాక్షాత్తు కార్యానికి సంబంధించినవారు. ప్రేరకుడు, అనుమోదకుడున్ను పరంపరగా సంబంధులు అవుతారు. ఈరీతిగా వర్గీకరించినపక్షంలో సంస్కృతపరిపోషణానికి సంబంధించినంతవరకు, ముస్లిములలో ప్రేరకానుమోదకవర్గమే అధికంగా అగపడుతుంది. కర్తృకారయితృవర్గము తక్కువ.

ముస్లిముల సంస్కృతానురాగ ఫలములుగా ముఖ్యమైన సంస్కృత గ్రంథాలు కొన్ని పర్షియను భాషలోని కనువదింపబడి ఉన్నాయి. 'ఫిరోజ్ తుగ్లకు', 'సికందర్ లోడీ' మొదలగు కొందఱు పూర్వులు కొన్ని సంస్కృత గ్రంథాలను పర్షియనులోని కనువదింపఁజేసినారు. తరువాత అక్బరుచక్రవర్తి సమయంలో రామాయణ, మహాభారతాలు పర్షియనుఅనువాదాలను పొందగలిగినాయి. అక్బరు హయాములోనే 'భాను చంద్రగణి' అను పండితుడు

'వివిక్తనామ సంగ్రహం' అనే సంస్కృత నిఘంటువును నిర్మించినాడు. 'కాదంబరి' కావ్యానికి సంస్కృత వ్యాఖ్య ఒకటి అక్బరు ఆస్థానపండితులచే సంతరించబడింది. అక్బరు చక్రవర్తి సంస్కృత పండితులను, సంస్కృత పాఠశాలలను సమరసంగా చూస్తూ సాహాయ్యాన్ని అందజేస్తూ ఉండేవాడు.

అక్బరు తరువాత సంస్కృతాన్ని అభిమానించినవారిలో 'షాజహాన్' చక్రవర్తియు అతని కుమారరత్నమైన 'దారాషికోహ్' మహాశయుడున్ను, వీరిరువురి సమయంలో సంస్కృతము, సంస్కృత పండితులున్ను రాజాదరాన్ని సమగ్రంగా సంపాదించుకొన్నారు. 'దారాషికోహ్' స్వయంగా చక్కటి పండితుడు. సంస్కృత భాషా సాహిత్యాలను క్షుణ్ణంగా అభ్యసించిన వ్యక్తి. అతడు ఉపనిషత్తులను, భగవద్గీత, యోగవాసిష్ఠ రామాయణం మొదలయిన ఉద్గ్రంథాలను పర్షియను భాషలోనికి స్వయంగా అనువదించినాడు. ఈ ఉభయుల పోషణలోనే 'జగన్నాథుడు' అనే ఆంధ్రపండితరత్నము జాజ్వల్యమానమై ప్రకాశించి, తనకు వారిచ్చిన అజరామరమైన కీర్తిని ప్రతిష్ఠించినాడు. ముస్లిముల సంస్కృత పోషణమునకును జగన్నాథుడు, అతని గ్రంథాలున్ను సర్వోత్కృష్టమైన దృష్టాంతాలుగా చరిత్రలో శాశ్వతంగా నిలిచి ఉండగలవు.

షాజహాను చక్రవర్తి జగన్నాథ పండితులకు అనన్యలభ్యమైన 'పండితరాజ' బిరుదాన్ని ప్రసాదించి, అతనిని సుతనిర్విశేషంగా పెంచిపెద్దచేసినాడు. "ఢిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" అని జగన్నాథుడు గర్వంగా చెప్పుకున్నాడు. తన యౌవనం ఢిల్లీ చక్రవర్తిచేతులలో చల్లగా గడిచిందని దాని తాత్పర్యం. అతడే యింకొక సందర్భంలో ఇలా అన్నాడు:-

ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా ।
మనోరథాన్ పూరయితుం సమర్థః ।
అన్యైః నృపాలైః కిల దీయమానం ।
శాకాయవా స్యాల్లవణాయవా స్యాత్ ॥ అని

కోరికలు తీరుస్తే పరమేశ్వరుడే తీర్చాలి. లేకపోతే ఢిల్లీశ్వరుడైనా తీర్చాలి. వారిద్దరికే అట్టి సామర్థ్యం ఉన్నది. మిగిలినరాజులు చేసినసాయం ఉప్పుకి, పప్పుకీ కూడా సరిపోదు. అని దీనిభావం.

మరొక సన్నివేశంలో జగన్నాథుడు షాజహాను చక్రవర్తిని ఇట్లు ప్రశంసించినాడు.

"మాహాత్మ్యస్య పరోఽవధిః, నిజగృహం గంభీరతాయాః పితా।
రత్నానామహమేకఏవభువనే, కోవాఽపరోమా దృశః। ఇత్యేవం పరచిన్త్య
మాస్మసహసా, గర్వాంధకారంగమః । దుగ్ధాబ్దే! భవతా నమో విజయతే
ఢిల్లీధరావల్లభః॥" అని.

'మాహాత్మ్యం, గాంభీర్యం, రత్నాకరత్వం మొదలయిన గుణాలలో ఢిల్లీశ్వరుడు సాక్షాత్తు సముద్రాలను పోలిఉన్నాడు' అని భావం. ఇంతటి ప్రశంసలను ఒక సంస్కృత పండితునినుండి - అందులోను - మతాంతరుడైన వ్యక్తినుండి పొందగలిగిన ముస్లింప్రభువు మరియొకడు కానరాడు.

షా జహాన్, దారాషికోవ్‌ల చల్లనిచూపులలోపండితరాజజగన్నాథుడెన్నో సంస్కృత గ్రంథాలను రచించినాడు. 'ఆసఫ్ విలాసం' అనేకావ్యం అసఫ్ ఖాను చరిత్రను కీర్తించింది. "జగన్నాథాభరణం" అను కావ్యం షాజహాను, దారాషికోవ్‌ల కీర్తిని గానంచేసింది. "రసగంగాధరం" అనే పండితరాజగ్రంథం అలంకారశాస్త్ర గ్రంథరాజమై ప్రకాశిస్తున్నది. కాగా షాజహాను, దారాషికోవ్ లు వాస్తవమైన సంస్కృత పోషకులని చెప్పకతప్పదు.

ముస్లింప్రభువుల ఆమోదంతో వారి సంతోషంకొరకు రచింపబడిన గ్రంథాలు అక్కడక్కడ కొన్ని కనిపిస్తాయి. కల్యాణమల్లుడనేకవి "లోడీ ఖాను" సంతోషం కొఱకు "సులైమచ్చరితం" అనే చరిత్ర గ్రంథాన్ని సంస్కృతంలో రచించినాడు. మచ్ఛాఖానుకాలంలో మధురేశుడు అను పండితుడు "శబ్దార్థరత్నావళి" అను సంస్కృత నిఘంటువును నిర్మించినాడు. "అల్లోపనిషత్తు" అనుపేరుతో అల్లా పారమ్యాన్ని ప్రతిపాదించే ఉపనిషత్తు ఒకటి సంస్కృతంలో ఉన్నది. దాని కర్తపేరు సమయమున్ను సరిగా తెలియవు. కాని అది ముస్లిముల ప్రోత్సాహంతో రచింపబడినదనుట స్పష్టము.

ఇక ఆయా సమయాలలో ముస్లించక్రవర్తులపరిపాలనలో, ప్రాంతీయ సామంతరాజుల పరిపోషణం సంస్కృతానికి విశేషంగా జరిగినమా - అది ప్రకృతాంశానికి సాక్షాత్తుగా సంబంధించదు. కాన మనకది అప్రకృతం.

అట్లే దక్షిణ భారతంలో 'బహమనీసుల్తానులు' 'నిజాంప్రభువులు' న్ను కూడ సంస్కృతపాఠశాలలకు, సంస్కృతకవిపండితులకున్ను ఉదారంగా ధనసహాయం చేసిన ఘట్టాలు చరిత్రలో కనిపిస్తాయి.

---

# 18. భాసుని ఏకాంకములు

శ్రీ ముదిగొండ శివరామకృష్ణ శాస్త్రి

మహావృక్షములను తమలో ఇముడ్చుకొన్న బీజముల వంటివి ఏకాంకములు. భాసుని 13 రూపకములలోను అయిదుమాత్రమే ఏకాంకములు. ఏకాంకములలో ఒక్కనాటి ఇతివృత్తమే సుందరంగా వర్ణింపబడుతుంది. ఈ అయిదింటిలోగూడ మధ్యమవ్యాయోగం, దూతవాక్యం, దూతఘటోత్కచం అనే మూడు వ్యాయోగములు. కర్ణభారం, ఊరుభంగం అనే రెండు అంకములు. వ్యాయోగములో ధీరోద్ధతుడు నాయకుడు, వీరరసం ప్రధానం. అంకములో ధీరోదాత్తుడు నాయకుడు, కరుణారసం ప్రధానం. ఇతివృత్తము మాత్రము రెండింటిలోను ప్రసిద్ధమే కావలయును.

ఈ అయిదింటికి మహాభారత గాథే మూలమయినా వాటిలో భాసుని కల్పనావైచిత్రి అడుగడుగునా మనకు స్పష్టంగా గోచరిస్తుంటుంది. పాండవ వనవాసస్థితికి చెందిన "మధ్యమవ్యాయోగం" భారత కథా క్రమాన్ననుసరించి వీనిలో మొదటిది. ఇందు వీరరసంప్రధానం. ధీరోద్ధతుడైన ఘటోత్కచుడే నాయకుడు. కేశవదాసుడు అనే బ్రాహ్మణునియొక్క మధ్యమపుత్రుణ్ణి ఘటోత్కచుడు తనతల్లి ఉపవాసాన్తర భోజనార్థమై తీసుకొని పోతోవుండగా మధ్యముడైన భీముడువచ్చి ఆ బ్రాహ్మణ పుత్రుణ్ణి సంరక్షించుటే ఇందులోని ప్రధాన ఇతివృత్తం. ఈ కథ భారత ప్రసిద్ధంకాదు. ఇందులోని కొన్నిపాత్రలుమాత్రం భారత ప్రసిద్ధములే. అయినా భాసుడు తన అపూర్వ కళాకౌశలంతో వాటికికూడా వినూత్నత్వాన్ని కల్పించినాడు. హిడింబా-ఘటోత్కచులలోగూడ సహజమగు రాక్షసత్వము తొలగించి, మానవత్వమే పరిపూర్ణమగునది. ఉపవాస వ్రతపరాయణురాలైన హిడింబకు అసలు మానవభక్షణం ఇష్టమే లేదు. కాని తన ప్రియుడగు భీముని సందర్శనము కొఱకై ఆమె పన్నిన పన్నాగమే యిది. అందుకే తుదకు 'బాహ్యరాక్షసీ నసముదాచారేణ' అని భీముడామెను మెచ్చుకొనినాడు.

ఇట్లే భాసుని సాటిలేని సంఘటనా చాతుర్యముకూడా ఈ రూపకములోని మఱియొక విశేషము. పూర్వార్థములో 'అకార్య మేతవ్య మయాద్య

కార్యం।మాతుర్ని యోగాదపనీయ శంకాం' అని కేవలము మాతృభక్తితోనే నిశ్శంకముగా బ్రాహ్మణ హింసకు సైతం సిద్ధపడిన ఘటోత్కచుడు ఒకవైపు, "ధన్యోస్మ్యయద్గురుప్రాణాః స్వైః ప్రాణైః పరిరక్షితాః' అని అనన్యసామాన్యమైన పితృభక్తితో కుటుంబ సంరక్షణార్థం ప్రాణపరిత్యాగానికే సిద్ధపడిన బ్రాహ్మణవటువు వేరొకవైపు. ఇల్లే ఉత్తరార్థములోగూడ భీముడు తన తండ్రియని తెలియక "శైలకూటం మయాక్షిప్తం ప్రాణానాదాయ యాస్యతి" అనుచు పర్వత శిఖరములను విసరి తండ్రిప్రాణములనే తీయుటకు సిద్ధపడిన ఘటోత్కచుడు ఒకవైపు, ఆశ్రితజన సంరక్షణార్థమై పుత్రుని అసామాన్య బలపరాక్రమములను చవిజూచుచు "భోస్సుయోధన! వర్ధతే తే శత్రుపక్షః-కృతరక్షోభవ!" అని మిక్కిలి సంతసించుచున్న తండ్రి యగు భీముడు వేఱొకవైపు. భాసుని సన్నివేశ సౌందర్యమిట్టిది. కావ్యాలలో సామాన్యంగా చిత్రింపబడే మంచి - చెడులయొక్క సంఘర్షణముగాక, మాతృవాక్య పరిపాలనం, కుటుంబ సంరక్షణం, ఆర్తజన పరిత్రాణం ఇట్టి మహత్తర ఆదర్శములకే పరస్పర సంఘర్షణను చిత్రించుట భాసుని ప్రత్యేకత.

ఈ దూతవాక్యం రెండవది. కురుకులక్షేమాన్ని, విశ్వశాంతిని గోరి శ్రీకృష్ణుడు పాండవులపక్షాన కౌరవులతో జరిపిన రాయబారమే ఇందులోని ప్రధాన ఇతివృత్తం. దూతవేషధారియైన శ్రీకృష్ణుడే ఇందు నాయకుడు. ఇదియును వీరరస ప్రధానమైన వ్యాయోగమే. ఇందులో భాసుడు కొద్దిమార్పులు చేసినా మొత్తంమీద ఇది మహాభారత కథకు సంగ్రహస్వరూపమే అని చెప్పవచ్చును. దుర్యోధనుడు తర్కయుక్తములైన తనప్రశ్నలతో పదేపదే శ్రీకృష్ణుని ఓడింపజూస్తాడు. కాని తుదకు దివ్యమైన శ్రీకృష్ణవాణితో తానే ఓడింపబడుతూ ఉంటాడు.

పాండవులకు దాయాద్యమైన రాజ్యమునిమ్మని శ్రీకృష్ణుడుచెప్పగా పరుల సంతానమైన ధర్మరాజాదులకు అసలీరాజ్యం ఎల్లావస్తుంది? అని దుర్యోధనుడు వింతగా ప్రశ్నిస్తాడు. దానికి వెంటనే శ్రీకృష్ణుడు "వ్యాసేన జాతో ధృతరాష్ట్ర ఏష కలభేతరాజ్యం జనకః కథంతే"-నీతాతవిచిత్రవీర్యుడు క్షయరోగంతో మరణింపగా వ్యాసునివలన పుట్టిన నీతండ్రి కీరాజ్యం ఎల్లా వచ్చిందో అల్లాగే వస్తుంది అని సమాధానం చెప్పి, ఇప్పటికైనా పాండ

రెండూ నాకు ఇష్టమే అనిఎంతోధీరంగా రథాన్నిముందుకునడపమంటాడు.

ఇంతలోనే మాయావిప్రుడైన మహేంద్రుడువచ్చి "భిక్షాంయాచే" అని అర్థిస్తే అనర్ఘములైన గో-గజ-అశ్వ-సువర్ణాదులనేకాక తుదకు తన శిరస్సునుకూడా ఇస్తానంటాడు. అయినా ఆ కపట బ్రాహ్మణుడు అంగీకరింపక పోతే "హతేషు దేహేషు గుణాధరన్తే" తుచ్ఛమైన ఈ దేహం పోయినా కీర్తి స్థిరంగా ఉంటుందనే పరమ విశ్వాసంతో "వద్దు" అని శల్యుడు వారిస్తూ ఉన్నా వినకుండా కర్ణుడు తన సహజ కవచకుండలాలను మాయా విప్రునకు దానంచేస్తాడు. ఇంతేకాక మహేంద్రుడు తనకు అమోఘమయిన శక్తినిస్తానన్నప్పటికీ "ధిక్ దత్తస్య న ప్రతిగృహ్ణామి" అని తిరస్కరిస్తాడు. ఆహా! దానంలో సుప్రసిద్ధుడైన కర్ణుని ఇంతటి ప్రతిఫలాపేక్ష లేనివానినిగా చిత్రించి వ్యాసునికన్నా భాసుడే మిన్న అనిపించుకొన్నాడు. ఇలాగే భారతంలో కటుభాషిగాను, ఉత్సాహ వినాశకుడుగాను మనకు కన్పించిన శల్యుడు ఈ రూపకంలో ఎంతో సంయమిగా ఉదారమనస్కుడుగా స్వామి హితాభిలాషిగా మనకు కన్పిస్తాడు. ఇలా అందమైన మార్పులతో నిర్మింపబడినది ఈ రూపకం.

ఇక అభిమన్యువధానంతరం శ్రీకృష్ణుడు ఘటోత్కచుని ద్వారా కౌరవులకు సందేశము పంపినట్లుగా వర్ణించిన 'దూతఘటోత్కచం' నాల్గవది. ఈ 'ఘటోత్కచ దౌత్యం' కేవలం భాసకల్పితమేకాని భారతప్రసిద్ధం కాదు. ఈ రూపకంలోని సంభాషణల్లో మిక్కిలి చురుకుతనం ప్రత్యేకంగా కన్పిస్తుంది. వీరరస ప్రధానమైన ఈ వ్యాయోగంలోకూడ ధీరోద్ధతుడైన ఘటోత్కచుడే నాయకుడు. ఈ వీరానికి అంగంగా ప్రారంభంలో కొంత కరుణరసం వర్ణింప బడింది. అభిమన్యువధ వినగానే ధృతరాష్ట్రుడు ఎంతో కలవర పడతాడు. గాంధారి విలపిస్తుంది. దుస్సలకూడా దుఃఖిస్తూ "ఉత్తరకు వైధవ్యాన్ని చేకూర్చినవాడెవడోగాని, తన భార్యకుకూడా వైధవ్యాన్ని ఇచ్చినవాడయినాడు." అంటుంది. ఇంతవరకు ఆ పని చేసినవాడు తనభర్తేయని పాపం ఆబేలకు తెలియదు. సైంధవుడే అభిమన్యువధకుప్రధాన కారణమని విని అంధరాజు ఆశ్చర్యచకితుడై "హన్తజయద్రథోనిహతః" అంటాడు. దీనితో దుస్సలదుఃఖం మరింత దుస్సహమైపోయింది. ఇలా ఒక్క క్షణంలోనే రసవత్తర సన్నివేశాన్ని చిత్రించటం భాసుని ప్రత్యేకత.

ఇంతలో ఆనందాతిరేకంతో దుర్యోధనాదులువచ్చి నమస్కరిస్తే "జీవిత నిరపేక్షాణాం రథమార్గః ప్రయుజ్యతే" ప్రయుక్తమైతే ఆశలేనివారికి ఆశీస్సులెందుకు? అంటాడు. "తండ్రీ! ఎందుకీలాంటి భాష?" అంటే "నాయనా! నూర్గురుకొడుకులలో నాకొక్కతే కూతురు. ఆమెయే నాకు ప్రాణం. మీదయవల్ల ఆమె నేడు వైధవ్యాన్ని పొందనున్నది గదా!" అంటాడు. ఈ ఒక్క వాక్యంలోనే అటు ధృతరాష్ట్రుని దుఃఖభారాన్ని ఇటు దుర్యోధనాదుల దుశ్చేష్టితాన్ని భాసుడు ఎంతో చక్కగా నిరూపించినాడు.

తరువాత ఘటోత్కచుడు దూతగా ప్రవేశించి శ్రీకృష్ణ సందేశాన్ని వినిపించుచుండగా మధ్యలో శకుని పరిహసిస్తే "శకునీ! ఇది జూదం కాదు. పాచికలతో పనికాదు. రాజ్యాన్ని, పరస్త్రీని అపహరించటం కాదు. ఇది యుద్ధం. ఇక్కడ బాణాలతోనే పని. ప్రాణాలతోనే పందెం జాగ్రత్త!" అంటాడు. వెంటనే దుర్యోధనుడు "ఓహో! తగ్గిపోవు రాక్షసగర్వంతో కాకోలు" అనిహసిస్తే "శాంతంపాపం! ఏ రాక్షసుడూ లక్కఇంటిలో నిద్రిస్తున్న సోదరుల్ని కాల్చి చంపలేదు. ఏ రాక్షసుడూ నిండుసభలో అన్నగారి భార్యను జుట్టుపట్టుకొని పరాభవించలేదు. యుద్ధభూమిలో నిరాయుధుడై పడియున్న కుమారుణ్ణి పదిమంది సహాయంతో ఏ రాక్షసుడూ చంపలేదు. మా రాక్షసులు ఆకారాల్లో వికారులే అయినా, ఆచారాల్లో కొంత భీకరంగానే ఉన్నా మీవలె దయాహీనులుమాత్రం కారు" అని ఎంతో తీక్ష్ణంగా సమాధానం చెప్తాడు. ఇలా ఎంతో సరళము-సరసమునైన భాషలో చిత్రింపబడినది రూపకం.

ఇక చివరిది ఊరుభంగం. ఇది హృదయాన్ని కలచివేసే ఒక మహోత్తర విషాదాంతమైన రూపకం. ఇందులోని దుర్యోధనపాత్ర సృష్టి అత్యద్భుతం. రససిద్ధుడైన భాసమహాకవి పరిణత ప్రజ్ఞకు ఇది మరియొక చక్కని ఉదాహరణం. దూత వాక్యంలోను — దూత ఘటోత్కచంలోను మనకు కన్పించిన దుర్యోధనుడు కేవల దురహంకార పూరితుడు, ధీరోద్ధతుడు, కుటిలస్వభావ దూషితుడు, బంధుజన విద్వేషి. ఇందులో మాత్రం మట్టుకాక ధీరుడు, ఉదారుడు, సుగుణశాలి. సహనశీలిగా మనకు కన్పించును.

బలరాముడు యుద్ధభూమిలో తనకు జరిగిన అన్యాయానికి ప్రతిగా పాండవుల్ని సంహరిస్తానంటేకూడా వద్దు-"శివమస్తుతే కురుకులస్య నివాప

మేఘాః" అన్నమహోదారుడతడు. అలాగే సువిశాలమైన కురుక్షేత్ర సంగ్రామ భూమిపై భగ్నోరుడై రుధిరప్రవాహపతితుడై యున్నరారాజును చూచి అశ్వత్థామ "భోః కురురాజ! కిమిదమ్?"అని అడిగితే "గురుపుత్ర! అపరితోషస్యఫలమ్"అని పశ్చాత్తప్తుడైన మనస్వి.

తన దుస్థితిజూడి దుఃఖించుచున్న తన రాణులతో 'భర్తా తేన పరాఙ్ముఖో యుధిహతః కింక్షత్రియే రోదిషి'–నీ భర్తయుద్ధంలో పరాఙ్ముఖుడై చంపబడలేదే! క్షత్రియాంగనవు. నీవేల దుఃఖించెదవు?' అని ఓదార్చినధీరుడు. గాంధారితో "నమస్కృత్య వదామిత్వాం యది పుణ్యం మయాకృతం అన్యస్యామపి జాత్యం మే త్వమేవ జననీభవ!"–అమ్మా నమస్కరించి చెప్పుచున్నాను. నేనే కొద్దిపుణ్యమైనా చేసియుంటే మళ్లీజన్మలోకూడా నీవే నాతల్లివై ఉండాలమ్మా!– అని ప్రార్థించిన మాతృభక్తితరుత్పడు.

కుమారుడైన దుర్జయునితో "అహమివ పాండవాః శుశ్రూషయితవ్యాః.... అభిమన్యోర్జననీ, ద్రౌపదీచోభేమాతృవత్పూజయితవ్యే"– నాయనా! పాండవులను నీ తండ్రులవలె సేవించుము. అభిమన్యుని తల్లియైన సుభద్రను, ద్రౌపదిని నీ తల్లులవలె పూజింపుము, అని ఉపదేశించిన అతిలోక మానవస్వభావుడు.

ఈ విధంగా మానవుల హృదయాదరాల మహత్తు నిజంగా భాసుని సొత్తు. ఇలా అయిదు ఏకాంకములను పరిశీలిస్తే దేనికదే ఒక ప్రత్యేక రస ఖండం. అయినా వీటన్నింటిలోను ఊరుభంగం ఉత్తమోత్తమం అనుటలోఎట్టి సందేహము లేదు.

---

# 19. కాళిదాసుని తపోవనములు

శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావు

అనంతశాఖా విస్తృతమగు భారతీయ విజ్ఞాన వృక్షమునకు బీజము నాటిన వారు మహర్షులు. పరమాణువు మొదలు బ్రహ్మాండము వరకు గల చరాచర జగత్తును గూర్చి వారుసల్పిన పరిశోధనమే భారతీయవిజ్ఞానము. సుఖదుఃఖాది ద్వంద్వములకు, రాగద్వేషాది వికారములకు, అతీతులైన విశ్వ ప్రేమను వెలార్చు మహర్షుల తపోవనములు విజ్ఞాననిలయములు. అవి యానాటి విశ్వవిద్యాలయములు. వైదిక సాహిత్య మచ్చటనే జన్మించినది. ధర్మ శాస్త్రములు, పురాణేతిహాసములు, తత్త్వశాస్త్రములు దర్శనములు, ఆయుర్వేద జ్యోతిశ్శాస్త్రములు మున్నగునవన్నియు నాతపోవనముల యందే ప్రాదుర్భవించినవి. ఆదికావ్యమగు రామాయణము, పంచమవేదముగా ప్రశస్తి కెక్కిన మహాభారతము తపోవనముల వికసించిన దివ్య కుసుమములు. అందువలన తపోవనములకును, సాహిత్యమునకును గల అనుబంధము అవిభాజ్యము. కావ్య నాటకాదుల యందే తపోవనముల ప్రసక్తి, ప్రకరణోచిత మగురీతిని ప్రవేశము కల్పించు కొన్నది. కాళిదాస మహాకవి తన కృతుల యందే తపోవనముల కొక విశిష్ట స్థానమును నిర్దేశించినాడు. తపోధనుల దర్భాసనము భూపాలుర రత్నఖచితమైన సింహాసనము కన్నను మహోన్నతమైనది. చక్రవర్తి తాపసులకు విధేయుడు. మహాకవి కాళిదాస రచిత రఘువంశమున ఘట్టమిది. అనపత్యుడగు దిలీప చక్రవర్తి సకళత్రముగ కులగురువగు వశిష్ఠుని యాశ్రమమునకు చనుదెంచినాడు. ఆశ్రమ ప్రశాంతికి భంగము వాటిల్లునని పరిమిత పరివారముతో నరుదెంచినాడు. తపోవనమున కుసుమ పరాగ సురభిళమగు శీతల మందమారుతము సర్వాంగ సంతర్పణమై హాయి గూర్చుచున్నది. రథచక్రధ్వని మేఘగర్జితమని భ్రమించి మయూరము లత్తైత్తి, షడ్జస్వరమున కేకలు వేయుచున్నవి. లేళ్లు బిత్తర చూపులతో రథము వంక వీక్షించుచున్నవి. సారసపక్షులు స్తంభములు లేని తోరణములు కట్టి కొలకొల కూయుచున్నవి. కొలకులలోని తామరపుష్పాది పరిమళము గుబాళించుచున్నది. ఇది యాతపోవనము వెలుపలి ప్రకృతి రామణీయకము.

రథము ఆశ్రమమును సమీపించినది. అది రమణీయ సంధ్యాసమయము. వనమున కేగిన తాపసులు కట్టెలు, దర్భలు, పండ్లు మున్నగునవి సంగ్రహించు కొని తిరిగి యాశ్రమములకు జేరుచున్నారు. అగ్నిభట్టారకు డదృశ్య రూపుడై వారికెదురేగి తోడ్కొని వచ్చుచున్నాడు. ఓహో! ఏమి, యా సంయముల యనుభావము! పెంపుడులేళ్లు కన్నబిడ్డలవలె ఋషిపత్నులను కుటీరద్వారములయందు నిలువరించుచున్నవి. మునికన్యలు మొక్కల పాదులలో నీరుపోసి పక్షులు త్రాగుట కవకాశమిచ్చుచు తాము వెంటనే యట నుండి వైదొలగుచున్నారు. ఆశ్రమ ప్రాంగణముల నెండబోసిన ధాన్యము ప్రోగు చేయబడినది. హరిణము లచ్చట హాయిగా పరుండి నెమరువేయుచున్నవి. ఆహుతి సురభిళములగు హోమధూమములు గాలికెగసి యాశ్రమోన్ముఖులగు నతిధులను పునీతుల జేయుచున్నవి. ఆశ్రమమున కల్లంత దూరమున రథమాగినది. చక్రవర్తి తన దేవేరియగు సుదక్షిణాదేవిని రథము నుండి దింపి తానును దిగినాడు. మునులా రాజదంపతులను సత్కరించినారు. సాయంతనానుష్ఠానమైనపిదప నా రాజదంపతులు పుణ్యదంపతులగు అరుంధతీ వశిష్ఠుల పాదములకు ప్రణమిల్లినారు. ఇదియంతయు తపోవనాంతర్భాగము నందలి హృదయంగమ దృశ్యము. విశ్వశాంతి యచ్చట గూడుకట్టుకొన్నది. తిర్యఙ్మానవులకు సాహచర్య మచ్చట పాదుకొన్నది.

వరతంతుమహర్షి యంతేవాసియగు కౌత్సుడు రఘుమహారాజు నొద్ద కేతెంచినాడు. విశ్వజిద్యాగమున తన యైశ్వర్యమంతయు వెచ్చించిన యా నృపాలుడు మట్టిపాత్రతో నా ఋషికుమారున కర్ఘ్యమొసగినాడు. "తమర్చయిత్వావిధివద్విధిజ్ఞః తపోధనం మానధనాగ్రయాయీ విశాంపతి ర్విష్టరభాజమారాత్ కృతాంజలిః కృత్య విదిత్యువాచ" - మానధనాగ్రణి యగు నా చక్రవర్తి యా తపోధనుని యథావిధిగా పూజించి యాసనమున గూర్చుండబెట్టి కృతాంజలియై యోరగా నిలచెనట. ఇచ్చట తపోధన మానధన శబ్దములు సాభిప్రాయములు. ఆతపోధనునియెదుట నంతటి మానధనుడు కుంచించుకొనిపోయినాడు. నీవు నాయగ్నిగృహంబున నాలుగవ యగ్నివలె రెండుమూడు దినములు వసింపుము. నీకార్యమును చక్కబెట్ట యత్నింతును. - అని యా బ్రాహ్మణు నొడబఱచి రఘుమహారాజు పుడమియందలి ధనమెల్ల నిదివఱకే గ్రహింపబడుటచే కుబేరునియొద్ద సంపాదింప నెంచెను.

వశిష్ఠుని మంత్రజల ప్రభావమున నామహేంద్రుని యరదము సముద్రాకాశ పర్వతముల యందేని యప్రతిహతమై సాగిపోవును. అట్టి స్యందనము నస్త్ర ములతో నింపుకొని తన సామంతరాజు మీదికి బోయినట్లే కుబేరునిమీదికి బోవ నిశ్చయించి యధిష్ఠించినాడు. ఇంతలో కోశాధికారు లేతెంచి యాకా సమునుండి యాకస్మికముగా ధనాగారమున సువర్ణము వర్షించినట్లు విన్న వించిరి. వజ్రభిన్నమగు సుమేరుశిఖరములోలె నా హేమరాశినంతను కౌత్సున కిచ్చి పంపెను. కౌత్సునకు పదునాల్గువిద్యల గఱపిన వరతంతుమహర్షి సర్వ శాస్త్ర విశారదుడు. విజ్ఞానకోశము. తత్తపోవన మొక విశ్వవిద్యాలయము. విద్యార్థులచట వేతనము చెల్లింప బనిలేదు. గురుశుశ్రూషయే దక్షిణ. ఈ విషయమున పొరబడిన కౌత్సుడు పదునాలుగుకోట్ల మూల్యము చెల్లింప వలసి వచ్చినది. తపోధన భూపాలుర యనుబంధము నీసన్నివేశము హృద యంగముగ చిత్రించినది.

కుమార సంభవమున గల సన్నివేశము:-

అది హిమవద్గిరి శిఖరమున మహేశ్వరుని తపోవనము. వేత్రహస్తు డగు నందీశ్వరుడు లతాగృహమునుండి పహారా యిచ్చుచున్నాడు.

నిష్కంప వృక్షం నిభృతద్విరేఫం
మూకాండజం శాంతమృగప్రచారం
తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం
చిత్రార్పితారంభ మివావతస్థే.

ఆకల్లాడదు, తుమ్మెదలు రొదపెట్టవు, పిట్ట కిచుమనదు. జంతువు మెదలదు, తపోవనమంతయు చిత్తరువున వ్రాసినట్లున్నది. ప్రకృతి సైతము తపోధను లకు విధేయమై ప్రవర్తించును. దేవదారువృక్షముక్రింద వ్యాఘ్రాజినము పరచిన వేదికపై సమాధి నిష్ఠుడగు పరమేశ్వరుడు వీరాసనోపవిష్టుడై యున్నాడు.

స్మరస్తథాభూత మయుగ్మనేత్రం
పశ్యన్నదూరాన్మనసాప్యధృష్యం
నాలక్షయ త్సాధ్వస సన్నహస్తః
స్రస్తం శరం చాప మపి స్వహస్తాత్.

అట్టి స్థితిలో ఫాలాక్షు నీక్షించిన మన్మథుడు చకితుడై చేజారిన విల్లమ్ముల నేని గమనింపడయ్యెను. ఇంతలో హరునకు పూజాద్రవ్యములు సమకూర్చు

కొని పార్వతి సమీపించినది. పుష్పాయుధుడు చెదరిన ధైర్యము నెట్లోకూడ దీసి కొని సమ్మోహనాస్త్రము వింట దొడిగినాడు,

హరస్తు కించిత్ పరిలుప్తధైర్యః
చంద్రోదయారంభ ఇవాంబురాశిః
ఉమాముఖే బింబ ఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని.

చంద్రోదయ వేళ సాగరము పరవళ్లు త్రొక్కినట్లు పరమేశ్వరుని ధైర్య మించుక సడలినది. బింబోష్ఠరమణీయమగు హైమవతి ముఖమున ముక్కంటి చూపు ప్రసరించినది. వెంటనే జితేంద్రియుడగు హరుడు ఇంద్రియ సంక్షోభ మడచి తన చిత్తవికార హేతు వరయగోరి నలుదెసల బరికించినాడు. ఒక వంక నాకర్ణాంతము తివియబడి చక్రాకృతి వహించిన ధనుస్సుతో ప్రహార ణోద్యుక్తుడై యున్న మనోభవుడు పొడసూపినాడు. తపోభంగమునకు గినిసిన విషమాక్షుని బెసిరంటి మంటలో నసమాస్త్రుడు (గాగినాడు.

స్త్రీ సాన్నిధ్యము తపస్సున కంతరాయమని యెంచి శంకరుడటనుండి వెడలి పోయినాడు. ఆతని యర్ధాంగి కాదలచిన పార్వతి యభీష్టసిద్ధికి తపస్సునే సాధనముగా నెంచుకొన్నది.

కృతాభిషేకాం హుత జాతవేదసం
త్వగుత్తరా సంగవతీ మధీతినీం
దిదృక్షవస్తాం ఋషయోభ్యుపాగమన్
నధర్మ వృద్ధేషు వయస్సమీక్ష్యతే

స్నాన మొనర్చి వల్కలములు ధరించి యగ్ని వ్రేల్చుచు మంత్రములు పఠించు నాదేవిని దర్శింప మహర్షులు సైత మరుదెంచినారు. ధర్మవృద్ధుల యెడ వయస్సుతో పని యేమి?

విరోధి సత్త్వోజ్ఝిత పూర్వమత్సరం
ద్రుమైరభీష్ట ప్రసవార్చితాతిథి
నవోటజాభ్యంతర సంభృతానలం
తపోవనం తచ్చ బభూవ పావనమ్.

మృగములు జాతివైరము విస్మరించినవి. ఇష్ట ఫలము లొసగి వృక్షము లతిథుల బూజించుచున్నవి. పర్ణశాలాభ్యంతరము అగ్నిభట్టారకున కాశ్రయ మైనది. ఆ తపోవన మంత పవిత్రమైనది. తిర్యగ్గాదులు కట్టి పడిన గ్రీనము గూర్చిన తపః ప్రభావమే పరమేశ్వరుని బట్టితెచ్చి పార్వతీవశంవదుని గావించినది. దాని కసాధ్య మేది యుండును?

**శాకుంతలమున కాళిదాసుని యఖండ ప్రతిభ:**

కణ్వమహర్షి తపోవన ప్రాంతమున దుష్యంతుడు కృష్ణసారంగము పై బాణము సంధించి వెంటాడుచున్నాడు. రథము మహావేగముతో పరుగెత్తుచున్నది. ఇంతలో "రాజా! ఇది యాశ్రమ మృగము, దీనిని కొట్టరాదు." అను మాట వినిపించినది. వెంటనే బాణ ముపసంహరింపబడినది. రథమాగినది. అది తపోవనమని ధ్రువపరచు సాక్ష్యమచ్చట గోచరించుచున్నది.

నీవారాశ్శుక గర్భకోటరముఖ భ్రష్టాస్తరూణామధః
ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీ ఫలభిదః సూచ్యంత ఏవోపలాః
విశ్వాసోపగ మాత్ అభిన్న గతయః శబ్దం సహంతే మృగాః
తోయాధార పథాశ్చ వల్కల శిఖా నిష్యంద రేఖాంకితాః

తొఱ్ఱల నుండి చిలుకలు జారవిడిచిన నీవార ధాన్యకణములు చెట్లక్రింద రాలియున్నవి. ఇంగుదీ ఫలములు పగులగొట్టుటచే నునుపెక్కిన పాషాణము లందందు కను పట్టుచున్నవి. మచ్చిక వలన రథధ్వనికి బెదరక మృగములు యథా పూర్వముగా సంచరించుచున్నవి. నీటి చెలమలకు పోవు మార్గములు ఆర్ద్రవల్కలాంచలములనుండి జారిన జలధారలచే నంకితములై యున్నవి. ఈ చిహ్నములన్నియు నచ్చట తపోవనపు టునికిని చాటుచున్నవి.

శమ ప్రధానేషు తపోధనేషు
గూఢంహి దాహాత్మక మస్తి తేజః
స్పర్శానుకూలా ఇవ సూర్యకాంతాః
తదన్యతే జోఽభి భవాద్వమన్తి.

శమప్రధానులగు తపోధనుల యందు దాహాత్మక మగు తేజస్సు నిగూఢమై స్పర్శ యోగ్యములగు సూర్యకాంతములవలె నన్యతేజః పరిభవము వలన ప్రజ్వరిల్లును.

యదుత్తిష్ఠతి వర్ణేభ్యో
నృపాణాం క్షయి తత్ఫలం
తపష్షడ్భాగ మక్షయ్యం
దదత్యారణ్యకాహినః

ప్రజ లెల్లరు తమ యాదాయము నుండి యాఱవపాలు నరపాలునకు పన్ను క్రిందచెల్లింతురు. అదియంతయు నశ్వరము. తాపసుల నుండి లభించు తపష్షడ్భాగ మక్షయ్యము.

శకుంతల యత్తవారి యింటికి పయనమగుచున్నది. ఆమె పెరిగినది తపోవనమున, ప్రవేశింప బోవునది రాజాంతః పురము. అచ్చటికి ముని కన్య వేషముతో బోవుటయెట్లు? ఆమె మహారాజ్ఞి. కాని రాణివాసపు టలంకారము లెట్లువచ్చును? కాని వచ్చినవి.

# 20. అప్పయదీక్షిత వైదుష్యము

శ్రీ సూరిరామకోటిశాస్త్రి

మహేశ్వరేవా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగదన్తరాత్మని
నవస్తు భేదప్రతి పత్తిరస్తిమే
తథాపి భక్తిస్తరుణేందు శేఖరే.

అని పలికినవారు అప్పయ్య దీక్షితులు.

ఆంధ్రత్వ మాంధ్రభాషా చ
ప్రాభాకర పరిశ్రమః
తత్రాపి యాజుషీశాఖా
నాల్పస్యతపసః ఫలమ్.

అని చెప్పినవారుకూడ అప్పయదీక్షితులవారే. వీరు పరమశివభక్తులు. దక్షిణ దేశమున విరించిపురము వీరి జన్మస్థలము. నివాసస్థానము 'అడయప్పలము' అగ్రహారము. కొందఱు అడయప్పలమే జన్మస్థానమనెదరు.

దీక్షితేంద్రులు తండ్రియగు 'రంగరాజమఖి' సన్నిధిలో సకల విద్యల నభ్యసించిరి. సర్వతంత్రములందు నిష్ణాతులైరి. ఆగమపురాణేతిహాససారము గ్రహించిరి. ధర్మనిష్ఠులై శిష్యులకు విద్యోపదేశము గావించుచు అప్రతిమ ప్రతిభాసంపత్తిచే శతాధిక గ్రంథముల రచించి దివ్యజ్ఞానసంపదను లోకమున కనుగ్రహించిరి. శ్రీశంకర విద్యారణ్యులంతోలె మహోన్నతఖ్యాతిగడించిరి.

వీరిరచనలలో బ్రహ్మసూత్ర శంకర భాష్య భామతీకల్పతరుపరిమళము, న్యాయరక్షామణి, సిద్ధాంతలేశ సంగ్రహము, శివార్కమణిదీపిక, కువలయానందము, చిత్రమీమాంస, వృత్తివార్తికము, విధిరసాయనము, మయూఖావళి, శివాద్వైత నిర్ణయము, రత్నత్రయ పరీక్ష మున్నగునవి ముఖ్యము లయిన శాస్త్రగ్రంథములు. ఇవికాక దీక్షితరచితంబులగుస్తోత్రములు, వృత్తులు, వ్యాఖ్యలు, టీకలు, విమర్శలు, కావ్యనాటకములు ప్రజ్ఞావిభవ నిదర్శనము లెన్నియోకలవు. అందు—

**1. పరిమళము :**

లోకోత్తరగ్రంథము. ఇది అద్వైతవేదాంతభామతీ ప్రస్థానాంతర్గతము. అవచ్ఛేదవాద నానాజీవవాదముల నాశ్రయించి క్రమముక్తి, సర్వముక్తి సిద్ధాంతములను సయుక్తికముగ మీమాంసా న్యాయోపష్టంభముతో నిరూపించినది. "అద్వైత స్థాపనాచార్య" అను బిరుదమును అప్పయ్య దీక్షితులకు సమకూర్చినది.

**2. న్యాయరక్షామణి :**

బ్రహ్మసూత్ర ప్రథమాధ్యాయవ్యాఖ్య. శంకరసిద్ధాంతముపై కుశంకల నిరసించుటకు బయలుదేరిన గ్రంథము. ఇందు 'ఆనందమయాధికరణము'న పుచ్ఛబ్రహ్మవాదము సుష్ఠుగా సమర్థింపబడినది.

**3. సిద్ధాంతలేశ సంగ్రహము:**

అద్వైత సంప్రదాయమున జీవేశ్వరబ్రహ్మమాయాఽవిద్యాదిస్వరూపమును గూర్చి, అవిరోధ, సాధన ఫలములం గూర్చియు మతభేదముచే నిరూపణము బ్రహ్మైక్యసిద్ధి కనుగుణముగ చేయబడినది. ఇది తత్త్వజిజ్ఞాసువులకు మిక్కిలి ఉపయోగకరము. ఈమూడును శాంకరాద్వైతానుసారి గ్రంథములు. ఇక బ్రహ్మసూత్రములకు శైవవిశిష్టాద్వైత పరముగ వెలసిన శ్రీకంఠ భాష్యమునకు వ్యాఖ్యయగు-

**4. శివార్కమణి దీపిక :**

శివపారమ్య ప్రతిపాదకము, రాజానుగ్రహమును, 'శ్రీకంఠ మత ప్రతిష్ఠాపనాచార్య' బిరుదమును దీనివలన చేకూరినవి. దీక్షితులు శైవమత వ్యాప్తికై, శివభక్తి ప్రబోధకంబులు, శివోత్కర్ష ప్రతిపాదకంబులు నగు బహుగ్రంథములరచించిరి. శివకర్ణామృతము, శివతత్త్వవివేకము, శివపూజా విధి, శివధ్యాన పద్ధతి, శివమహిమ, కాశికాస్తుతి మొదలగునవి యట్టివి. అయినను 'శివార్కమణిదీపిక' సిద్ధాంత ప్రతిపాదకంబగుటంజేసి వానికన్నింటికి ప్రమాణ గ్రంథముగా నలరారుచున్నది. "అద్వైత విశిష్టాద్వైతముల

రెంటిని సిద్ధాంతములుగా నెట్లు నిరూపించుట'' అను శంకకు సమాధాన ముగ నారంభముననే దీక్షితుల వారిట్లు సెలవిచ్చిరి.

''యద్యప్యద్వైత ఏవ శ్రుతిశిఖరగిరామాగమానాంచ నిష్ఠా
సాకం సర్వైః పురాణస్మృతినికరమహాభారతాది ప్రబంధైః।
తత్రైవ బ్రహ్మసూత్రాణ్యపిచ విమృశతాం భాన్తివిశ్రాన్తిమన్తి
ప్రత్నైరాచార్యరత్నైరపి పరిజగృహే శంకరాద్యైస్స ఏవ''

'తథాప్యనుగ్రహాదేవ తరుణేందుశిఖామణేః।
అద్వైత వాసనా పుంసామావిర్భవతి నాన్యథా.'

అనగా, శాస్త్రమునకు అద్వైతమునందే పరమ తాత్పర్యము. శ్రీ శంకర భగవత్పాదులు అట్లే పరిగ్రహించిరి. అయినను దుర్విజ్ఞేయమైనది యద్వైతము. పరమేశ్వరానుగ్రహము వలననే అద్వైతవాసన ఆవిర్భవించును. ఫలించును. మఱియొక విధముగా కాదు.

శంకరులు నిర్గుణ బ్రహ్మపాదమ్యమును బోధించి, సగుణ బ్రహ్మో పాసన ద్వారా ప్రతిపత్తి ద్వార భూతమనిరి. అవాంతర తాత్పర్య విషయమగు ఆ సగుణబ్రహ్మ శివపరముగా శ్రీ దీక్షితులు భాష్యము రచించి అందు-

సర్వజ్ఞతా తృప్తి రనాదిబోధః।
స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః।
అచిన్త్యశక్తిశ్చ....అనుపదంగములు-
జ్ఞానం విరాగతైశ్వర్యం
తపస్సత్యం క్షమా ధృతిః।
స్రష్టృత్వ మాత్మసంబోధః।

అధిష్ఠాతృత్వ మ్మనుదశావ్యయములు- నీలకంఠ త్రిలోచన చంద్ర శేఖర సాంబమూర్తి కాలకూటనిగరణ భక్తానుగ్రహాదిలీలలు-ఉపాసనార్థము వివరించిరి. జనులు కొంతకాలము సగుణేశ్వరోపాసనముచేసి పరమేశ్వరాను గ్రహము సంపాదించి చిత్తపరిపాక సాధనాయత్త నిర్గుణబ్రహ్మసాక్షాత్కా రముతో కృతార్థులు కావలెనని దీక్షితాశయము. అనంతరవారిలో నీ విష

యమునే చర్చించి సగుణోపాసన నిర్విశేష బ్రహ్మప్రతిపత్తికి ఉపాయమగుటంజేసి శైవవిశిష్టాద్వైతమునకు శాంకరాద్వైతముతో విరోధములేదని వాక్రుచ్చిరి. రామానుజ విశిష్టాద్వైతమునకు సగుణబ్రహ్మోపాసనకు నిర్గుణ బ్రహ్మ ప్రతిపత్తి సోపానత్వ మంగీకరింపదు. వారి మతమందు నిర్గుణ బ్రహ్మము సమ్మతముకాదు.

5. కువలయానందము:

'జయదేవ' విరచిత చంద్రాలోకాలంకార ప్రకరణ వ్యాఖ్యాగ్రంథము. ఉపమాద్యలంకారములకు తానుక్రొత్త ఉదాహరణముల నిచ్చుచు సవిశేషముగ వ్యాఖ్య నొనరించెను.

గుణ దోషౌబుధోగృహ్ణన్
నిన్దుక్ష్వేడా వివేశ్వరః
శిరసాశ్లాఘతేపూర్వం
పరం కణ్ఠే నియచ్ఛతి.

గుణ దోషములను గ్రహించి, గుణమును శ్లాఘింపవలయునే కాని, దోషోద్ఘాటనము చేయరాదు – అనుటకు ఈశ్వరోపమానము చంద్ర విషప్రతిబింబ నిర్దేశముతో చక్కగా నీయబడినది. మూలములోని నూఱులంకారములకు మఱి పదునైదలంకారములను (రసవదాదులను) చేర్చెను. ఈగ్రంథము పఠనపాఠనములందు ప్రసిద్ధివహించినది.

6. చిత్రమీమాంస :

ధ్వని, గుణీభూత వ్యంగ్య, చిత్రకావ్యభేదముల నిరూపించి అర్థాలంకార ప్రధాన చిత్రకావ్య విచారమిందు చేయబడినది. విమర్శగ్రంథము. విచారసరణి నవీనులకు మార్గదర్శకము. ఉపమ, ఉపమేయోపమ, అనన్వయము, స్మరణము, రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతి, ఉల్లేఖము, అపహ్నుతి, ఉత్ప్రేక్ష, విచారింపబడినవి. అతిశయోక్తి సగమువఱకే గ్రంథ ముపలబ్ధము.

**7. వృత్తి వార్త్తికము:**

అభిధాలక్షణా నిర్ణయము వఱకు గ్రంథము లభించుచున్నది. వృత్తి నిరూపణము కానరాదు. ఈపై మూడు గ్రంథములు అలంకారశాస్త్రమునకు చెందినవి. తరువాత జగన్నాథాదులచే ఖండింపబడినను, తగుస్థాన మిప్పటికిని నిలచియే యున్నది.

**8. విధిరసాయనము:**

అపూర్వ, నియమ, పరిసంఖ్యా, విధిత్రయ విచార మిందు చేయబడినది.

**9. మయూఖావళి:**

పార్థసారథి మిశ్ర విరచిత శాస్త్ర దీపికా వ్యాఖ్య. ఇవికాక, చిత్రపటము, వాదనక్షత్రమాల, మున్నగు మీమాంసా గ్రంథములను రచించుటచే మీమాంసకమూర్ధన్యుడని ప్రశంసల నందుకొనినాడు.

**10. శివాద్వైతనిర్ణయము:**

శివోత్కర్ష ప్రతిపాదనము. ఇందు తొందరపాటుచే పూర్వపక్షసాధనముల నుపేక్షచేసి, ఉత్తమ భూమిక నధిరోహింప దలచిన వారికి పూర్వానుష్ఠాన సిద్ధికై అనభిమతమగు నుత్తమ సాధన దూషణము నిషేధము. ఈ కర్మానుష్ఠానాధికారికి సంన్యాసనిషిద్ధ.

**11. రత్నత్రయ పరీక్ష:**

అమధ్య దుగ్ధాబ్ధే రాప్తం రత్నత్రయంతతః
శమ్భుర్గౌరీ హరిశ్చేతి తత్ప్రసన్య త్పరీక్షితమ్.

అని ఉపసంహారము చేయుటచే శైవ, శాక్తేయ వైష్ణవ మతముల దేవతా స్వరూపములను ధర్మధర్మి కల్పనచే సోపనిషద బ్రహ్మపరముగ నిరూపించెను. ఉపాసనా దశలో కాల్పనిక భేదమున్నను శివశక్తి విష్ణువులు బ్రహ్మకోటికి చెందిన వారని సమన్వయము చేసెను.

(C. Kunhan Raja) [illegible]

[illegible]

[illegible]

[illegible]

([illegible])

[illegible]

[illegible]

([illegible])

[illegible]

"They are without doubt, the oldest works composed in Sanskrit. Even the most ancient Sanskrit writings allow the Vedas as already existing" అని [illegible].

"There is no monument of Greece or Rome more precious than the Rigveda" అని [illegible]. "The Yasurveda was the most precious gift for which the West had been ever indebted to the East" అని [illegible]. "... In the history of the world, the Vedas fill a gap which no literary work in any other language could fill" అని [illegible]. "Nor can Science ever solve the problem of the origin of man if it rejects the evidence of the oldest records in the world" అని [illegible]. "The Vedic literature opens to us a chapter in what has been called the education of the human race, to which we can find no parallel any where else. I maintain that to

everybody who cares for himself, for his ancestors, *for his history*, for his intellectual development, a study of Vedic literature is indispensable. I believe it had a hidden purpose, and man intended to teach us some kind of lesson that is worth learning, and that certainly we could learn nowhere else. It carries us back to times of which we have no records anywhere and gives the very words of a generation of men whom otherwise we could form but the vague estimate by means of conjectures and inferences. As long as man continues to take an interest in the history of his race, and as long as we collect in libraries and museums the relics of former ages, *the first place* in the long row of books which contain the records of the Aryan branch of the man-kind, will belong *to the Rigveda*. The Vedic religion was the only one the development of which took place without any extraneous influences and could be watched through a longer series of centuries than any other relgion. In India alone, and more *particularly in Vedic India*, we see a plant entirely nutured by native air. For this reason, because the religion of the Veda was so completely guarded *from all strange infections*, it is full of lessons which the student of religion could learn nowhere else. The europeans are still on the mere *surface* of Vedic literature and ***must not reject it as useless*** if they do not find in it corrobaration of their pre-concieved theories of anthropology and sociogy.

[illegible]

"[illegible]

ఇదికాక చతుర్మత సారము, నయమణిమాల, నయమంజరి, న్యాయ ముక్తావళి, నయమయూఖమాలిక అను చతుర్మతానుసారిబ్రహ్మసూత్ర వృత్తులను రచించెను. ఆయామతములలోని గుణములకు ప్రాధాన్యమిచ్చి సమన్వయ మార్గమును చూపిన వారప్పయ దీక్షితులు. వీరు "మధ్వతంత్ర ముఖ మర్దనము," "రామానుజ శృంగభంగము" అను గ్రంథములను వ్రాయక పోలేదు. అందులకు కారణము విష్ణువు నందు ద్వేషముకాదు, చూడుడు:

విష్ణుర్వా శంకరోవా శ్రుతి శిఖర గిరామస్తుతాత్పర్య భూమిః
నాస్మాకం తత్రవాదః ప్రసరతి కిమపి స్పష్ట మద్వైతభాజామ్
కిన్త్వీశద్వేష గాఢానలకలిత హృదాం దుర్మతీనాం దురుక్తేః
భఙ్క్తుం యత్నోమమాయం నహిభవతు తతో విష్ణు విద్వేష శఙ్కా.

దీనిని బట్టి శివుని ద్వేషించుచు చులకనగ మాట్లాడు వారికి సమధాన ముగ ఆయా గ్రంథములు వ్రాయబడి యుండును. శివోత్కర్ష ప్రతి పాదన సందర్భమున "నహినిన్దా నిన్దితు ముత్సహాతే అపితుస్తుత్యం స్తోతుమ్" అను న్యాయమున సమాధానము చెప్పవలయును. కార్య వశమున ఔపాధి కముగా నుత్కర్షాపకర్ష భావము స్వీకరించినను శివకేశవులు ఏకేశ్వర స్వరూపులగుటం జేసి దోషము లేదు. శైవులు విష్ణుని కాని, వైష్ణవులు శివుని కాని నిందించరాదు. ద్వేషింపరాదు. శివోపాసనచే శైవులును విష్ణూపాసనచే వైష్ణవులును తరింపవచ్చును. ఉపాసనకు లోకముక్తి లేదా క్రమముక్తి ఫలము. ఉపాసకులు కైలాస వైకుంఠలోకాదుల కేగి యచట తత్త్వజ్ఞానముంబడసి కృతార్థులగుదురు. యావత్సర్వముక్తి ఈశ్వరభావా సక్తి సిద్ధాంత సంగ్రహమున ప్రతిపాదితము.

వరదరాజస్తవము, ఆత్మార్పణస్తుతి, హరిహరస్తుతి, యాదవాభ్యుదయ పాదుకాసహస్రవ్యాఖ్యలు, శ్రీవిద్యా తత్త్వ వివరణము, రామాయణ భారత తాత్పర్య సంగ్రహములు, భక్తిశతకము, వసుమతీ చిత్ర సేన విలాస నాటకము, తాంత్రిక మిమాంస, సిద్ధాంత రత్నాకరము గంగాధరాష్టకము మున్నగునవి మఱికొన్ని రచనములు దీక్షితుల వారి